

‘బుల్లితమ్ముడు’
కర్నల్ తంగిరాల కృష్ణమూర్తి



**కీ.శే. టి.వి.కె. సోమయాజులుగారు**

**(తంగిరాల వేంకటకృష్ణ సోమయాజులుగారు)**

**1930–2021**

సాహిత్యసాగరంలో

# ఏఱినముత్యాలు

(ప్రాస్తావిక పద్యాలు - సభారంజన శ్లోకాలు)

సేకరణ-వ్యాఖ్యానం

'భాషాప్రవీణ' **టి.వి.కె. సోమయాజులు,** ఎం.ఏ.

నన్నయ భట్టారక పీఠము

తణుకు - 534211

పశ్చిమ గోదావరిజిల్లా

సంపాదకుడు

**ఆచార్య తంగిరాల వెంకట సుబ్బారావు**

ప్రచురణ

**అజో-విభొ-కందాళం ఫౌండేషన్**

**హైదరాబాద్**

**2023**

**EERINA MUTYAALU**, a Collection of limericks in Telugu and Sanskrit Collected, Compiled with commentary by Late T. V. K. Somayajulu, Nannaya Bhattaraka Peetham, TANUKU-534211, West Godavari District A.P. and Published by Ajo-Vibho-Kandalam Foundation, Hyderabad.

pp. : xxiv + 316

Price :

First Edition : 2nd October 2006 (వ్యయ విజయదశమి)

Second Edition : 2016

Third Edition : 15th January 2023 (సంక్రాంతి)



ముఖచిత్రం : లీలాశుకుని శ్రీకృష్ణకర్ణామృతములోని "ఉర్వ్యాం కోఽసి మహీధరో లఘుతరో ..". (2–106) అనే శ్లోకానికి శ్రీ వి.ఏ.కె.రంగారావుగారి కోరికపై ప్రముఖ చిత్రకారులు "కళాప్రపూర్ణ' శ్రీ 'బాపు'గారు వేసిన చిత్రం. (చూ.శృంగార శ్లోకములు, సంఖ్య–41)

అక్షరాలు–

అట్టవెనుక చిత్రం : "కళాప్రపూర్ణ' శ్రీ 'బాపు'గారు, చెన్నై, (చూ.శృంగార శ్లోకములు, సంఖ్య–32, "తిష్ఠన్తీ జానుదఘ్నే పయసి...")

Copies available at : Well Known Bookshops in Andhra Pradesh and Telangana

Published by : Appajosyula Vishnubhotla Kandalam Foundation
3-3-24/1/A, First Floor, Ekbote House
Opp. Vysya Hostel, Kachiguda Cross Roads
Hyderabad - 500 027
Phones: 040-64512224; 040-40179673
email:avkfbooks@gmail.com
websites: www.avkf.org; www.avkf.org/books

DTP : Nagasri Graphics, H.No.1-18, Brindavan Colony,
Gundlasagaram Village, Gudupalli Mandal,
Chittoor Dist. A.P. Phone: 08570-517825

Printing :

## అంకితం

మా

'బుల్లితమ్ముడు' – చిరంజీవి

**కర్నల్ టి.కె.మూర్తికి ...**

(కర్నల్ తంగిరాల కృష్ణమూర్తికి ... )

ఆయురారోగ్యసంపత్పరంపరాభివృద్ధిని

ఆకాంక్షిస్తూ...

అనేక ఆశీస్సులతో ...

**– అన్నలు**

**సోమయాజులు**

**సుబ్బారావు**

**భాస్కరరావు**



‘బుల్లితమ్ముడు’

కర్నల్ తంగిరాల కృష్ణమూర్తి

# ముత్యాల సరము

ప్రథమముద్రణ పీఠిక :-

# మా అన్నయ్య

ఇది ఒక అపూర్వ కవితల సంకలనం. ఇందులో ఆణిముత్యాలవంటి తెలుగు పద్యాలు సుమారు 250 ఉన్నాయి; 300కి పైగా శ్లోకాలూ ఉన్నాయి. తన బాల్యంనుండి ఈనాటి వరకూ ఎంతో కష్టపడి ఇటువంటి ప్రాస్తావిక పద్యాలను, సభారంజన శ్లోకాలను సేకరించిన మహనీయుడు మా అన్నయ్య – శ్రీ టి.వి.కె. సోమయాజులు. పూర్తిపేరు : శ్రీ తంగిరాల వేంకట కృష్ణ సోమయాజులు. పశ్చిమ గోదావరి జిల్లాలోని తణుకులో నివసిస్తున్నారు. వయస్సు 75 సంవత్సరాలు.

మా అన్నయ్య సంఘజీవి, బుద్ధిజీవి, నియమబద్ధజీవి, గాంధీయవాది, వ్యాయామ ప్రియుడు, చతురసంభాషణా నిపుణుడు, ఉభయభాషా ప్రవీణుడు, ఉత్తమకవి, అఖండ పండితుడు, అద్భుత వక్త, విశ్రాంత ఆంధ్రోపన్యాసకుడు, మా మొట్టమొదటి సాహిత్య గురువు; తన పెద్దతమ్ముడు రచించిన 'కాటమరాజుకథలు' కృతిస్వీకర్త, సాహిత్య రసజ్ఞ శేఖరుడు! సమాజాన్ని దానిలోని వ్యక్తుల స్వభావాల్ని కాచి వడపోసిన ధీరుడు! ఆయనతో మాటలాడటమే ఒక ఎడ్యుకేషన్‌గా ఉంటుంది. ప్రతివారికి, తణుకులో రామకృష్ణ సేవాసమితి భవనంలో నిత్యమూ రామాయణ, భారత, భాగవతాలను, భగవద్గీతను ప్రవచనం చేస్తూ, నన్నయ భట్టారక పీఠం ఉపాధ్యక్షులుగా సాహిత్య సేవలందిస్తూ, తణుకు పురజనులందరిచేత పూజింపబడుతూ ఉన్న పుణ్య శ్లోకుడు మా అన్నయ్య!

మేం వెలనాటి వైదికులం. మా యింటి పేరు తంగిరాలవారు. మాది శ్రీవత్సగోత్రం. మా స్వగ్రామం పశ్చిమ గోదావరి జిల్లాలోని తణుకు తాలూకాలో ఉన్న 'కాకులు ఇల్లిందల పఱ్ఱు'. ఇప్పుడు ఆ గ్రామంలో తంగిరాలవారు ఎవ్వరూ లేరు. మా చదువుల నిమిత్తం 1948లోనే మా తల్లిదండ్రులు తణుకు వచ్చి స్థిరపడ్డారు. అప్పటినుండి మా స్వగ్రామం 'తణుకు' అనే చెప్పుకుంటున్నాం.

మా తండ్రిగారు, మా తాత ముత్తాతలు అందరూ వేదపండితులే. పశ్చిమ గోదావరిజిల్లాలో మా మూలపురుషుడు మాకు ఏడు తరాలకు ముందున్న తంగిరాల జగన్నాథశాస్త్రిగారు. ఈయన కాలంలో (క్రీ.శ. 1700 ప్రాంతంలో) మా పూర్వులు గుంటూరుజిల్లాలో వినుకొండ సమీపంలో ఉన్న "తంగిరాల" అనే గ్రామంనుండి పశ్చిమ గోదావరి జిల్లాకు వలస వచ్చారు. (పలనాడు – వెలనాడు అనే ప్రాంతాలు

గుంటూరు జిల్లాలో ఉన్నాయి). ఇక్కడి జమిందారులెవరో (బహుశః నూజివీడు జమీందారులై ఉంటారు) మా పూర్వులకు "రేలంగి" – "ఇరగవరం" అనే గ్రామాలలో ఈనాము భూములిచ్చారు. తంగిరాలవారంతా ఈ రెండు గ్రామాలలోను స్థిరపడ్డారు. మా తాతగారి తాత అయిన వేంకట కృష్ణ సోమయాజులుగారికి ఐదుగురు కొడుకులు. వీరిలో అయిదవవారు "అయ్యవారు శాస్త్రిగారు". ఈయనకు ఇద్దరు కొడుకులు: "ఎగ్గెన్నశాస్త్రి", "జగ్గన్నశాస్త్రి". జగ్గన్నశాస్త్రిగారికి ఒకే కొడుకు: "వేంకట సుబ్బావధానులు". ఈయనకు మేం నలుగురు కొడుకులం: "వేంకట కృష్ణ సోమయాజులు" (టి.వి.కె. సోమయాజులు), "వేంకట సుబ్బారావు", "భాస్కరరావు", "కృష్ణమూర్తి". మా నలుగురికీ కొడుకులు, కూతుళ్ళు, మనుమలు మనుమరాండ్రు ఉన్నారు. ప్రస్తుతం (2006 నాటికి) మేం నలుగురుం వరుసగా 75, 71, 69, 66 సంవత్సరాల వయసులో ఉన్నాం.

మా తాతగారైన జగ్గన్నశాస్త్రిగారు స్వగ్రామమైన 'రేలంగి' నుండి అత్తవారి ఊరైన 'కాకుల ఇల్లిందలపఱ్ఱు'కు ఇల్లరికం వెళ్ళారు. అందువల్ల మా ఊరు మారింది. మా తాతగారికి 30 ఎకరాల మాగాణిపొలం ఉండేది. ఆయనకు మా నాన్నగారు ఒక్కడే కొడుకు; ముగ్గురు కూతుళ్ళు. (మా నాన్నగారికి 'అబ్బిగాడు' అనే ఒక తమ్ముడు ఉండేవాడు. కాని ఆయన బాల్యంలోనే చనిపోయాడు. అలాగే అమాయకురాలైన నాల్గవ చెల్లెలు కూడా ఒకామె ఉండేది. ఆమె కూడా బాల్యంలోనే పోయింది). మా తాతగారి ఆస్తి అంతా మా నాన్నగారికి రావలసింది. కాని మా తాతగారు అమాయకుడైన మా నాన్నగారిని మోసం చేసి, తన ఆస్తినంతా కూతుళ్లు ముగ్గురికీ ధారాదత్తం చేసివేశాడు. ఎకరంనేలలో ఉన్న రెండు పెద్ద పెద్ద పెంకుటిళ్ళు కూడా మా మేనత్తలకే ఇచ్చివేశాడు. కొడుకునీ కోడల్నీ ఇంట్లోంచి గెంటివేశాడు. దానితో బాల్యంలో మేము ఎంతో దారిద్ర్యాన్ని అనుభవించాల్సి వచ్చింది. మా అమ్మగారు సీతామహాలక్ష్మిగారు అమాయకుడైన భర్తతో, చంటీ వెంటా సంతానంతో, ఊరికి దూరంగా పొలాల మధ్యన ఉన్న 'గోపాలపురం' అనే కుగ్రామానికి చేరి, అక్కడ మమ్మల్ని పెంచి పెద్ద చేయటానికి ఎన్ని అవస్థలు పడిందో మేము మాటల్లో చెప్పలేం. తనకు తన తండ్రి భళ్ళమూడి కృష్ణమూర్తిగారు ఆప్యాయంగా ఇచ్చిన మూడెకరాల పొలం అమ్మివేసి మా చదువుల కోసం ఖర్చు చేసింది. తన వడ్డాణాన్ని అమ్మివేసి తణుకులో 618 గజాల ఇంటిస్థలం కొంది. అందులో ఒక తాటాకు ఇల్లు కట్టుకొని కాలక్షేపం చేసేవాళ్ళం. మా నాన్నగారు

ఎప్పుడూ వేదం చదువుకుంటూ సంసార విషయాలేమీ పట్టించుకోకుండా తామరాకు మీది నీటిబొట్టులా ఉండేవారు. అటువంటి సమయంలో మా అమ్మగారికి తోడుగా మా అన్నయ్యగారు చేతికి ఎదిగి వచ్చి, మా సంసారాన్ని చక్కదిద్దారు. తమ్ముళ్ళు ముగ్గురినీ ఉత్తమపథంలో నడిపించారు. కాఫీలు, టీలు త్రాగడం, సిగరెట్లు కాల్చడం, పేకాట ఆడటం – ఇత్యాది దుర్గుణాలకు బాల్యంలోనే మమ్మల్ని దూరంగా ఉంచారు. యోగాసనాలు వేయించి, వ్యాయామం నేర్పించి, శరీరాన్ని ఎలా రక్షించుకోవాలో తెలియజేశారు. మేం బాగా చదువుకోవడానికీ, ఉన్నత పదవులు పొందడానికీ మా అన్నయ్యగారి నియమబద్ధ శిక్షణయే ముఖ్యకారణం.

బాల్యంలో దారిద్ర్యంవల్ల ఇంగ్లీషు చదువులు చదవలేకపోయారు మా అన్నయ్య. స్వగ్రామంలో 5వ తరగతి ప్యాసయిన తరువాత మా తాతగారి దగ్గర కొంతకాలం పంచకావ్యాలు చదివారు. తొమ్మిదేళ్ళ వయస్సులోనే ఉండ్రాజవరం అనే గ్రామంలో ఇంటింటా వారాలు చెప్పుకొని సంస్కృతం చదువుకున్నారు. తరువాత కొవ్వూరులోని ఆంధ్రగీర్వాణ విద్యాపీఠంలో భాషాప్రవీణ చదివారు. 1951లో 20 సంవత్సరాల వయసులో భీమవరంలో తెలుగు పండిట్ ఉద్యోగంలో చేరి మా కుటుంబాన్ని ఆదుకున్నారు. ముగ్గురు తమ్ముళ్ళకీ ఇంగ్లీషు చదువులు చెప్పించారు. ఇద్దర్ని ఇంజనీర్లు చేశారు. ఒకరిని యూనివర్శిటీ ప్రొఫెసర్‌గా చేశారు.

జటావల్లభుల పురుషోత్తంగారు, కేశిరాజు వేంకట నృసింహ అప్పారావుగారు, వేదుల రామశాస్త్రిగారు, చిలుకూరి రామమూర్తిశాస్త్రిగారు మొదలైన గొప్ప గొప్ప గురువుల దగ్గర మా అన్నయ్యగారు సంస్కృతాంధ్రాలు చదువుకున్నారు. చిన్నతనంలోనే ఈయనకు కవితాశక్తి అబ్బింది. గొప్ప రసజ్ఞత అలవడింది. చిత్ర విచిత్రమైన పద్యాలను శ్లోకాలను కంఠస్థం చేసేవారు. వాటిలో నీతులు, చమత్కారం, శృంగారం, హాస్యం తొణికిస లాడుతూ ఉంటాయి. ఇటువంటి పద్యాలనూ, శ్లోకాలనూ ఉదాహరిస్తూ తన ఉపన్యాసాలతో సభాసదుల్ని ఆకట్టుకుంటూ ఉంటారు. ఎంతో సృజనాత్మక శక్తి కలిగి కూడా ఆయన సొంతంగా పెద్ద పెద్ద కావ్యాలు వ్రాయలేదు. వీరి "కీరకోకిలము"అనే చిన్ని కావ్యము, "కాఫీఆరాధన" అనే హాస్యశతకము మాత్రము చాలా ఏండ్ల క్రిందట (1975లో) ముద్రింపబడ్డాయి. విడిగా ఎన్నోపద్యాలు వ్రాశారు. అవి అముద్రితాలు. "పూర్వకవుల మహాకావ్యాలను చదువుకుంటే చాలు. మళ్ళీ మనం సృష్టించేదేమిటి? ఎంత వ్రాసినా మనం

పూర్వకవుల స్థాయికి చేరుకోగలమా? అసలు పూర్వమహాకవుల కావ్యాలు చదవడానికే మన జీవితకాలం సరిపోదు కదా!"అంటూ ఉంటారు మా అన్నయ్య.

మా అన్నయ్యగారు 30-12-1930 లో మా స్వగ్రామమైన కాకుల ఇల్లిందల పల్లెలో జన్మించారు. 30-12-2005 నాటికి ఆయనకు 75 సం.లు. నిండాయి. తాను జీవితమంతా కష్టపడి సేకరించిన అద్భుతమైన పద్యాలను, శ్లోకాలను తరువాతి. తరాలవారికి అందించాలనే తపన ఇటీవల ఆయనలో అభివృద్ధి చెందసాగింది. తన ధారణలో ఉన్న ఆ పద్యాలనూ, శ్లోకాలనూ, కష్టపడి లిఖితరూపంగా భద్రపరిచారు. (చాలా ఏండ్లు కావటం వల్ల ధారణాశక్తి కొంత తగ్గి, కొన్ని పద్యాలలో కొన్ని పాదాలు లోపించాయి). 18-8-2005 నాడు మా నాన్నగారి ఆబ్దికానికి మేం నలుగురు అన్నదమ్ములం తణుకులో కలిసినప్పుడు, తాను ఎంతో ఓపికతో వ్రాసిన ఆ శుద్ధ ప్రతిని మా చేతిలో పెట్టి, తన అభిప్రాయాన్ని చెప్పారు. ముగ్గురు తమ్ముళ్ళం కలిసి, మా అన్నయ్యగారు సాహిత్య సాగరాన్ని మథించి "ఏఱిన ముత్యాలు" ముద్రించి రసజ్ఞశేఖరులైన కవులకు, పండితులకు, సాహిత్యవేత్తలకు అందిస్తున్నాం. సహృదయంతో స్వీకరింప ప్రార్థన.

శిష్టసాహిత్యంలో కూడా కొన్ని శాఖలు జానపద సాహిత్యంలాగే మౌఖిక సంప్రదాయం (Oral Tradition)లో ఒక తరాన్నుండి మరో తరానికి వ్యాపిస్తాయి- ముఖ్యంగా శృంగార రసానికి సంబంధించిన పద్యాలు, శ్లోకాలు. చమత్కారమైన చాటుపద్యాలు, శ్లోకాలు కూడా ఇటువంటివే. (వేటూరి ప్రభాకరశాస్త్రిగారి 'చాటుపద్య మణిమంజరి' - దీపాల పిచ్చయ్యశాస్త్రిగారి 'చాటుపద్య రత్నాకరము' ఇట స్మరింపదగినవి). మహాకవి శ్రీశ్రీగారు ఇటువంటి రహస్య పద్యాలు, శ్లోకాలు చెపుతుంటే నేను (సుబ్బారావు) విన్నాను. 1978-79 సంవత్సరంలో శ్రీశ్రీగారిని బెంగుళూరు విశ్వవిద్యాలయంలో ప్రసంగించడానికి ఆహ్వానించాము నేనూ - (సుబ్బారావు), ఆర్వీయస్ సుందరం కలిసి. అప్పుడు ఆయన కృష్ణశాస్త్రిగారు అల్లిన ఎన్నో బూతుపద్యాలను మాకు రహస్యంగా గదిలో వినిపించారు. విజయవాడ ఆకాశవాణిలో కృష్ణశాస్త్రిగారు పనిచేస్తున్నప్పుడు, అక్కడ అధికారిగా ఉన్న ప్రముఖ రంగస్థల నటుడు శ్రీబందా కనకలింగేశ్వరరావుగారు. కృష్ణశాస్త్రిగారిని కించపరుస్తూ మాట్లాడారట. అప్పుడు కృష్ణశాస్త్రిగారు కోపించి ఆ బందావారిని గురించి "హేమ మేఢ్ర ప్రభూ!" అనే మకుటంతో ఎన్నో బూతుపద్యాలు ఆశువుగా చెప్పారట. అవన్నీ శ్రీశ్రీగారి ధారణలో ఉండేవి. నేను (సుబ్బారావు) తిరుపతిలో పరిశోధన

చేసే రోజులలో (1963–68) శ్రీ వేంకటేశ్వర ప్రాచ్యకళాశాలలో శ్రీ ఆకెళ్ళ అచ్చన్నశాస్త్రిగారు అనే గొప్ప పండితుడు ఉండేవారు. ఆయన ధారణలో పరంపరగా వస్తున్న శృంగారశ్లోకాలు పద్యాలు ఎన్నో ఉండేవి. అవన్నీ సేకరించాలనే కోరిక నాలో (సుబ్బారావు) బలంగా ఉండేది. చేయలేకపోయాను. ఇప్పుడు చింతిస్తే ఏమి లాభం?

విశ్వవిద్యాలయాల మరుగుదొడ్లలో గోడల మీద విద్యార్థులు వ్రాసే బూతుకూతల్లో కూడా పద్యాలు, శ్లోకాలు ఉంటాయి. "Latrinalia" అనే పేరుగల ఈ లిఖిత జానపద సాహిత్యాన్ని గురించి ప్రొ॥ ఆర్వీయస్ సుందరం కొంత కృషి చేశారు. ఆధునిక నాగరకతలో మౌఖికసంప్రదాయం నశించిపోతోంది కనుక ఇటువంటి ప్రాస్తావిక పద్యాలను, సభారంజన శ్లోకాలను గ్రంథస్థంచేసి తరువాతి తరాలవారికి అందించవలసిన బాధ్యత మా అన్నగారి వంటి పండితులందరిపైనా ఉంది. పాండిత్యం అంతరించి పోతున్న ఈ రోజుల్లో ఈ పని మరింత అవసరంగా కనిపిస్తోంది.

ఈ గ్రంథం చివర మా అన్నయ్యగారు రచించిన రెండు లఘువ్యాసాలు అనుబంధాలుగా చేర్చాము. మొదటిది 'మాతృదేవో భవ'. ఇది మా అమ్మగారైన కీ.శే. తంగిరాల సీతామహాలక్ష్మి (1907–1990) గారి వ్యక్తిత్వాన్ని చిత్రించే చిన్న వ్యాసం. రెండవ అనుబంధం 'పితృదేవో భవ!'. ఇది మా నాన్నగారైన కీ.శే. తంగిరాల వేంకట సుబ్బావధానులు (1904–1968) గారి వ్యక్తి చిత్రణ. ఈ రెండు వ్యాసాలూ కూడా మా అన్నయ్యగారు తన తమ్ముళ్ళు ముగ్గురికీ ఆత్మీయంగా చెపుతున్న శైలిలో సాగటం విశేషం. వ్యక్తులనూ, వ్యక్తుల చుట్టూ ఉన్న సమాజాన్నీ కాచి వడబోసిన ధీశాలి మా అన్నయ్యగారు అనే విషయం ఈ పరిచయ వ్యాసాలు చదివన ప్రతి పాఠకునికీ సులభంగా అర్థమవుతుంది! (ఈ రెండు వ్యాసాలను మా అన్నయ్యగారిని గురించి 2021లో ప్రచురించిన "అశ్రుతర్పణం"అనే పుస్తకంలో తిరిగి ముద్రించాను; అందువల్ల ఈ తృతీయముద్రణలో వాటిని తీసివేశాను.)

బెంగుళూరు, ఇట్లు
2–10–2006 **సోమయాజులుగారి తమ్ముళ్ళు**
(విజయదశమి) **సుబ్బారావు–భాస్కరరావు–కృష్ణమూర్తి**

# తృతీయముద్రణ పీఠిక

ఈ గ్రంథం ప్రథమముద్రణ 2006లో జరిగింది. అది దేశంలోని కవి పండితుల మన్నన పొందింది. వెయ్యికాపీలు వేస్తే అన్నీ త్వరలోనే అయిపోయాయి. మా అన్నయ్యగారి ఇతర పుస్తకాలు – "జ్ఞానరత్నాలు" – "శ్రీగురుభ్యోనమః" – "జ్ఞానతరంగాలు" – "భగవద్గీతాప్రబోధము" – ముద్రించే పనిలో మునిగిపోయి "ఏటినముత్యాలు" ద్వితీయముద్రణ చేపట్టలేకపోయాము. కాని 2016లో మా అన్నయ్యగారి వీరాభిమాని శ్రీ పాదేటి జన్సన్ కవిగారు (వీరు ఇటీవలనే గతించారు) "ఏటినముత్యాలు" తిరిగి ముద్రించి, కవి పండితులందరికీ ఉచితంగా పంచిపెట్టారు. వారికి నా ధన్యవాదాలు. ఇప్పుడు మాన్యమిత్రులు శ్రీ అప్పాజోస్యుల సత్యనారాయణగారు తమ ప్రసిద్ధ సాహిత్యసంస్థ "అజో–విభొ–కందాళం ఫౌండేషన్" ద్వారా దీని తృతీయముద్రణ తీసికొని వస్తున్నారు. వారికి సోమయాజులుగారి తమ్ముళ్ళం మేము ముగ్గురం మనఃపూర్వక కృతజ్ఞతలు తెలియజేస్తున్నాము.

ఈ గ్రంథాన్ని మా అన్నయ్యగారు శ్రీనాథుని చాటువులతో ప్రారంభించారు. అంటే క్రీ.శ. 15వ శతాబ్దినుండి గల చాటుపద్యాలు దీనిలో ఉన్నాయి. శ్రీనాథునికన్న 300 ఏండ్లకు పూర్వమే వేములవాడు భీమకవి చాటుపద్యాలు చాలా ఉన్నాయి (11–12 శతాబ్దాలు). అలాగే వీరాగ్రేసరుడైన ఖడ్గతిక్కన గురించిన చాటువులు (క్రీ.శ. 13వ శతాబ్దంనాటివి) ఎన్నో ఉన్నాయి. అలాగే 14వ శతాబ్దానికి చెందిన వినుకొండనేలిన రాయని భాస్కరుని దాతృత్వాన్ని తెలియజేసే చాటువులు అనేకం ఉన్నాయి. ప్రౌఢదేవరాయల కాలంనాటి "పెమ్మయ సింగరాజు" రచించిన "పెమ్మయి సింగధీమణీ!" అనే మకుటంతో వ్రాసిన శతకం పూర్తిగా లభించకపోయినా 15పద్యాలు మాత్రం లభిస్తున్నాయి. మా అన్నయ్యగారు మూడు పద్యాలు మాత్రమే ఇచ్చారు. ఈ విధంగా వేములవాడ భీమకవి చాటువులు, ఖడ్గతిక్కనపై చాటువులు, పెమ్మయ సింగధీమణి పద్యాలు, రాయని భాస్కరుని

గురించిన చాటువులు, శ్రీకృష్ణదేవరాయలకాలమునాటి చాటువులు ఈ గ్రంథానికి అనుబంధాలుగా ఇచ్చాను.

తమ "ఏటినముత్యాలు" అనే పద్య-శ్లోక సంకలనాన్ని మా అన్నగారు శ్రీనాథుని చాటువులతో ప్రారంభించారని ఇంతకుముందు తెలియజేశాను. వారు ఈ గ్రంథంలో శ్రీనాథుని చాటువులు 31 వరకు సేకరించి ఇచ్చారు. నేను మిత్రులు డా॥ కోడూరు ప్రభాకరరెడ్డిగారి "చాటుకవి సార్వభౌమ శ్రీనాథుని చాటువులు" అనే గ్రంథంలో ఉన్న 210 చాటువులనుండి 81 చాటువులను ఎంపిక చేసి, ఈ గ్రంథానికి అనుబంధంగా ఇచ్చాను (చూ.అనుబంధం-4). వీటిని వేటూరి ప్రభాకరశాస్త్రిగారి "చాటుపద్యమణిమంజరి" - "క్రీడాభిరామము" అనే గ్రంథాలలోని చాటువులతో పోల్చి చూసుకున్నాను. మా అన్నయ్యగారు 31 చాటువులు సేకరించగా, వాటికి నేను 81 చాటువులు చేర్చడంతో మొత్తం 112 చాటువులయ్యాయి. వీటిలో 95% శృంగార చాటువులే! శృంగార రసాధిదేవతలైన రతీమన్మథులకు ఈ 112 చాటువులు శ్రీనాథుడు సమర్పించిన పూజాపుష్పాలుగా భావించవచ్చును.

ఈ గ్రంథం మొదటిముద్రణనాటికి (2006 నాటికి) మా నలుగురు అన్నదమ్ములం: 75-71-69-66 సంవత్సరాల వయస్సులో ఉన్నాం. మా అన్నయ్య శ్రీ టి.వి.కె.సోమయాజులుగారు (శ్రీ తంగిరాల వెంకట కృష్ణ సోమయాజులుగారు) 28-07-2021నాడు హైదరాబాదులో స్వర్గస్థులయ్యారు. అప్పటి వారి వయస్సు 90 సం.లు నుండి 91వ సం. జరుగుతోంది. ఇప్పుడు వారి తమ్ముళ్ళమైన మా ముగ్గురి వయస్సులు - 87-85-82 సం.గా ఉన్నాయి.

ప్రథమ, ద్వితీయ ముద్రణలవలనే ఈ తృతీయముద్రణ కూడా కవిపండితుల ఆదరాభిమానాలు చూరగొంటుందని మేము విశ్వసిస్తున్నాము.

అందరికీ నమస్సులు...

ఇట్లు

బెంగుళూరు — **ఆచార్య తంగిరాల వెంకట సుబ్బారావు**

05-10-2022

(శుభకృత్ విజయదశమి)

# మా అన్నయ్య

(1976లో ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీవారు నేను రచించిన 'కాటమరాజు కథలు, – ప్రచురించారు. నేను ఆ గ్రంథాన్ని మా అన్నయ్య శ్రీ టి.వి.కె. సోమయాజులు గారికి అంకితం చేశాను. అప్పుడు మా అన్నయ్యను గురించి ఒక వచనకవిత వ్రాశాను. దానిని ఈ దిగువ ఇస్తున్నాను....)

**అన్నెమూ పున్నెమూ ఎరుగని అచ్చం దేవుడులాంటి అమాయకుడు**
**సంసారం పట్టని తామరాకు మీది నీటిబొట్టు**
**సర్వసంగ పరిత్యాగి నాన్న 'సుబ్బన్న' –**
**(లోకులందరికీ మాత్రం "వెఱ్ఱిసుబ్బన్న")**
**అత్తమామల ఆరళ్ళ అడకత్తెరలో చిక్కుకున్న పలుచని పోకచెక్క**
**నరకయాతనలను తాల్మితో సహిస్తున్న సాధ్వీమతల్లి అమ్మ 'సీతమ్మ' –**
**అత్తింటికి వెళ్ళవలసిన ఇద్దరు అక్కలు**
**అంతలు ఇంతలు నలుగురు తమ్ములు –**
**ధృతరాష్ట్రుడు 'జగ్గన్న తాత', దుర్యోధనాదులు మేనత్తలు –**
**కోరలు చాచిన క్రూర సమాజం**
**చుట్టాలూ పక్కాలూ నక్కలూ తోడేళ్ళూ –**
**గోతులూ గొప్పులూ గుచ్చుకునే సూదిరాళ్ళు**
**చిల్లుల గొడుగులా కురుస్తున్న తాటాకు ఇల్లు**
**పితామహ క్రౌర్య కీకారణ్యంలో చిమ్మచీకట్ల తుమ్మముళ్ళు –**
**కీచురాళ్ళ ఈతరుప్పలు**
**బెక బెకల బోదురు కప్పలు –**
**పామరత్వం ప్రవహించే పంటకాలువ పొంత**
**బ్రహ్మజెముడు డొంకల పుంత –**

మా అన్నయ్య

అష్ట దరిద్రులు పన్నిన ఆకలి మావుల్లో చిక్కి
చచ్చిన బాపన చేపల కంపు –
'గోపాలరాజు – తాతరాజు' ల గూండాయిజం
దిక్కూమొక్కూలేని దీనులపై దౌర్జన్యం –
సుడిగుండాల నడిగోదాట్లో చిక్కిన
చుక్కాని విరిగిన కుటుంబపు తొట్టిపడవ–
ఈ దారుణ పరిస్థితులన్నిటినీ ధైర్యంగా ఎదిరించి
చెల్లాచెదరైన సేనకు నాయకత్వాన్ని వహించి
తన లేతనెత్తుటి కాగడా కొసను ప్రజ్ఞను రగిలించి,
ప్రతిభను వెలిగించి, పౌరుషాన్ని మండించి,
చీకట్లో తడుముకుంటున్న తమ్ముళ్ళకు వెలుగుబాటలు చూపించి,
ప్రగతిపథంలో ముందడుగు వేయించి,
తన నియమబద్ధ గాంధీయ జీవితాన్ని చుక్కానిగా చేసి
అనునిత్యం త్యాగంతో తెడ్డువేసి
"నావ దరిచేర్చిన మొనగాడు!"
కష్టాల మత్స్యయంత్రాన్ని కూల్చిన విలుకాడు!
అనుజన్ముల అభ్యుదయాన్ని చూచి
అనుక్షణం పొంగిపోయే అభినవ ధర్మరాజు!
శ్రీతంగిరాల వేంకట కృష్ణసోమయాజి
మా అన్నయ్య!
మా పాలిటి కన్నయ్య!!

– తంగిరాల వెంకట సుబ్బారావు (1976)

## పెదబావగారు

సీ॥ అరవింద సన్నిభంబైన మోమున శాంత
రసమొల్కు బ్రహ్మవర్చస్సువాఁడు,
సరస సాహిత్య భాసుర భావగంధమ్ము
పరమళించెడి వచస్సరణివాఁడు,
అమృతమ్ము చిందు పద్యము పఠించినయంతఁ
బరవశించెడి స్వభావమ్మువాఁడు,
ఏఁటేఁట నొక పద్యకృతికి సత్కారమ్ము
వేయారులిచ్చి గావించువాఁడు,

తే॥ తణుకు నందున్న "శబ్ద శాసనుని పీఠ
ము" న కుపాధ్యక్షుఁడై పేరుగనినవాఁడు,
'తంగిరాల' కులాబ్ధి సారంగధరుఁడు,
సూరివరుఁడు, వేంకట కృష్ణ సోమయాజి!

ఆ॥ ఉభయ భాషలందు నుద్దండ పాండిత్య
మున్నవాఁడు, యశము గొన్నవాఁడు,
కవనమల్లు శక్తి గలవాఁడు, గర్వమ్ము
లేనివాఁడు, సాటిలేనివాఁడు!

చ॥ తణుకున రామకృష్ణమఠ ధామమునందుఁ గథాప్రసంగముల్
పొనరుచుచుండు భాగవతమో రఘురాము చరిత్రమో, వియ
ద్ధునియగు వాని వాగ్లహరితో సరిపోలఁగ లేక గోస్తనీ
ధుని దిగులొంది తుంపురులు తుంపురులై చిఱుగాలి పాలగున్!

పెదబావగారు

**చ॥ నిరుపమ సాహితీ సవన నిర్వహణమ్మున సోమయాజులై**
**వరలుట సార్థకాఖ్యుఁడన వచ్చును 'టీ.వి.కె. సోమయాజు', లె**
**వ్వరు సరివత్తురయ్య! రసవత్కవితా వ్యవహార ధోరణిన్,**
**సురుచిర వాగ్విలాసియగు సూరికి, మా పెదబావగారికిన్?**

(ఉభయ భాషాప్రవీణ శ్రీ తంగిరాల వేంకట కృష్ణ సోమయాజులు బావగారు లెక్కల్లోని విద్వాంసుడు. ఉత్తమకవి; మంచివక్త; సజీవకవిత్వానికి స్పందించి ఆయన వ్రాసే లేఖలు ముఖప్రీతికి వ్రాసే ఉత్తరాలు కావు; కవిత్వం నాడిని పట్టియిచ్చే చక్కని సమీక్షలు, ఉత్తరాలే కాదు. ముఖాముఖి ప్రసంగాలూ అంతే. ఇవి స్వానుభవం మీద చెప్పే మాటలు. ఆ అనుభవంతో వ్రాసినవే పై పద్యాలు – 1998)

**–దుగ్గిరాల రామారావు**
('సుమనోభిరామము' అనే కవితాసంపుటి నుండి)

# రసప్రవక్త

**ఉ॥ ఏ విషయంబు నిచ్చిన సరే, శిఖరాలకుఁ బ్రాకి, క్రొత్త నె**
**త్తావులఁ గ్రుమ్మరించి, సరదాపరదాలను దీసి, శ్రోతృ క**
**ర్ణావయవాలు రంజిలఁగ నామెత లిచ్చు రసప్రవక్త, మా**
**టీ.వి.కె. సోమయాజులు గడించిన కీర్తికి నంజలించెదన్!**

**– రసరాజు (2006)**

# విజ్ఞప్తి

**"కంఠస్థా యాభవేత్ విద్యా – సాప్రకాశ్యా సదా బుధైః**
**పుస్తకే పరహస్తే చ – న సా విద్యా న తద్ధనమ్!"**

(కంఠస్థమైన విద్యను ప్రకటింపగలము. పుస్తకము నందున్న విద్య – పరహస్తము నందున్న ధనము అక్కరకు రావు. అవి లేనట్లే!) అను శ్లోకమును మా గురువర్యులు వేదుల రామశాస్త్రిగారు చెప్పి వివరించినారు. అప్పటినుండియును నేను విన్నట్టి – లభించినట్టి – మంచి శ్లోక – పద్యములను కంఠస్థము చేసెడివాడను. జ్ఞాపకము ఉండవేమో అని గ్రంథస్థము చేసితిని. కొన్ని పద్యములెక్కడివో తెలియదు. అట్టి పద్యము లెక్కువ! బాల్యవశమున గ్రంథకర్తల పేర్లు వ్యత్యస్తములైనవి. పెద్దవాడనైన తరువాత కొన్ని దిద్దుకొన్నాను. కొన్ని అట్లేయున్నవి. క్షంతవ్యుడను. పాఠకులు సరిదిద్దుకొందురుగాక!

నీతి–చమత్కార–శృంగార–హాస్యములుగా పద్య–శ్లోకములు విభజించుకొంటిని. శృంగారములో "పచ్చి శృంగార" పద్యములున్నవి. వానిని కూడా గ్రంథస్థము చేయవలయునా? పరిహరించుటయా? ఈ ప్రశ్నకు సమాధానము రాలేదు! అవి నేను ఈ సంకలనములో చేర్చనిచో "బూతు కవిత్వ వైఖరుల పోడిమి"కి ద్రోహము చేసినవాడ నగుదునేమో? నేను మరణించిన తరువాత ఇట్టి అనుశ్రుత శ్లోకములు పద్యములు చెప్పగల నా వంటి అసభ్యులుండరేమో! అదియునుగాక, ఇంతటి కవితాపాటవమున్న అందమైన (బూతు) పద్యములను అందించిన పెద్దలకు–మిత్రులకు ద్రోహము చేసినవాడనగుదునేమో! అను భయవశమున – ముదురు శృంగారమును "ఏకాంత శృంగార పద్యములు" అను చివరి శీర్షిక క్రింద వ్రాయుచున్నాను. అవి చదివి నన్ను తిట్టవద్దు! బూతుకవిత్వ సభలలో కదలకుండ విని, పరోక్షములో మమ్ములను చాలమంది నిందించుట వారి సభ్యతను నిలబెట్టుకొనుటగా భావించినారు. అట్టి సభ్యశిఖామణులు ఏకాంత శృంగార పద్యములను చదువవద్దని నా మనవి!

పద్యములకు శ్లోకములకు వివరణములు వ్రాసినచో గ్రంథము విస్తరించును. ముద్రణ భారమగును. అందుచేత అవసరమైన చోట్ల గచ్ఛద్వ్యాఖ్యగా వివరించితిని.

"అందరకును తెలిసిన పద్య–శ్లోకములు వ్రాసినాడేమి?" అని గ్రంథమును నిర్లక్ష్యము చేయవద్దు! నా కృషిని ఈసడింపవద్దు! ఇందలి పద్య–శ్లోకములలో వారి వారి కృషిని బట్టి చాలావరకు తెలిసినవే! ఒక్క శ్లోకమైనను, ఒక్క పద్యమైనను వారికి తెలియనది లభించినచో నా యీ కృషి సార్థకమైనట్లే! సాగరములోని ముత్యములు –రత్నములు నా చేతికందిన మేరకు–నేను మునిగిన పరిధిలోనివి అందించుచున్నాను.....

బూతు కవిత్వము తెరవెనుకనే యున్నది. దానిని ఎంత నిందించిన, అంత సభ్యత యనుకొనుచున్నారే కాని, అందు చక్కని కవిత్వమున్నదని గ్రహించుట లేదు! కవియైనవాడు ఏ కవితా లక్షణములను కవితలో నిక్షేపించునో, అట్టి లక్షణములీ కవితలో కోకొల్లలు! అయినను వయస్సుతోపాటు జ్ఞానమును పొందినవారు ఈ కవిత్వ వియషమున మాధ్యస్థ మవలంబింతురు. కాదనరాని కవితాలక్షణములు – ధారాశుద్ధి కల్గిన యీ కవిత్వమును కూడ రసజ్ఞులు గ్రహింతురు. ఈ కవిత్వము. "లోకుల రసనలె ఆకులుగావ్రాసి" పరిరక్షింపబడినది. రసనల నిల్చిన కవిత్వమే కవిత్వమని తజ్ఞులందురు కదా!

కృష్ణపరమైన శృంగారమును దైవప్రసాదముగా స్వీకరించుచున్నారు. కూచిమంచి జగ్గకవి–ముద్దుపళని–కవిచౌడప్ప–శేషము వేంకటకవి – బిల్హణకవి మొదలగు కవులు వ్రేళ్ళపై లెక్కింపదగినంతమంది మాత్రమేయున్నారు. వారి తాళపత్ర గ్రంథములను భయపడుచునే ముద్రించినారు. బ్రహ్మానందము, శృంగార పంచకము – వంటి గ్రంథములకు చిరునామాలు లేవు!

కావ్యరూపముగాక అనుశ్రుతములైన పచ్చి శృంగార పద్యములు రసనల నిల్చి ఆ వ్యక్తులతో లోకమునకు అందించకుండ అంతరించుట రసజ్ఞసోదరులకు ద్రోహమేమో అను భీతి నన్ను వెంటాడుటచే నడుము నొప్పిగా నున్నను వ్రాయుచున్నాను....

ఇందలి పద్య–శ్లోకములు తెలిసినవైనచో విసుగుకొనవద్దు! తెలియని వేవియైన యున్నవో, పరిశీలింపుడు! పచ్చి శృంగారము చదువవద్దు! చదివి నిందింపవద్దు! అని మరొక్కమారు విజ్ఞప్తి.

విజ్ఞప్తి

**యే నామ కేచి దిహ నః ప్రథయన్త్యవజ్ఞాం**
**జానస్తు తే కిమపి తాన్‌ప్రతి నైష యత్నః**
**ఉత్పత్స్యతే మమతు కోపి సమాన ధర్మా**
**కాలో హ్యయం నిరవధి ద్విపులాచ పృథ్వీ!** (–భవభూతి)

నన్ను నిర్లక్ష్యము చేయువారికొఱకు ఈకృషి కాదని యెఱుంగుడు! నావంటి వారు నాతో సమానలక్షణములున్నవారు తప్పకయుందురు! కాలము అనంతము! దేశము విశాలము! – అన్నాడు కదా భవభూతి!

తణుకు
19–8–2005
(శ్రావణ పూర్ణిమ)

ఇట్లు
**– టి.వి.కె. సోమయాజులు**
నన్నయ భట్టారక పీఠము

# ఒక జ్ఞాపిక

మౌఖిక సంప్రదాయంలో వ్యాపిస్తున్న ఏకాంత శృంగార పద్యాలను (ముదురు శృంగార పద్యాలను) స్వాతంత్ర్యానికి పూర్వం కొందరు కవిపండితులు గ్రంథస్థం చేసి ముద్రించారు. అప్పట్లో బ్రిటిషు ప్రభుత్వం వీటిని నిషేధించింది. అందువల్ల ఆనాడు ఫ్రెంచిరాజ్యంగా ఉన్న 'పుదుచ్చేరి'లో "కామగ్రంథమాల" పేరుతో వాటిని ముద్రించి, "Confidential Subscribers Edition" అనే హెచ్చరికతో రహస్యంగా పంచేవారు. ఈ విధంగా 1924లో ప్రకటింపబడిన "బ్రహ్మానందము" అనే గ్రంథంలో ఈ క్రింది ఐదు విభాగాలున్నాయి:

1. బ్రహ్మానంద శతకము – రచన: గోపినాథ వేంకటకవి.
2. రామావధూటి తారావళి– మాడభూషి వేంకటాచార్యులు.
3. గణపతీయము – ప్రాచీనకవి
4. శష్పవిజయము – తెనాలి రామకృష్ణుడు.
5. శృంగార శతకము – తోట విజయరాఘవ నాయుడు

అలాగే – 'కామగ్రంథమాల' ప్రచురణలో నాల్గవ గ్రంథం పేరు "శృంగార పంచకము". ఇది కూడా 'పుదుచ్చేరి' నుంచే 10–12–1922 నాడు శ్రీ ఎన్. చిన్నయ్యచే ప్రచురింపబడింది. అంటే ఇది 'బ్రహ్మానందము' కన్నా రెండేళ్ళు ముందుగానే వెలువడింది. దీంట్లో ప్రసిద్ధకవి శ్రీ సెట్టి లక్ష్మీనరసింహం (విశాఖపట్టణం) గారి రచనలతోపాటు శ్రీనాథాది ప్రాచీనకవుల రచనలూ ఉన్నాయి:

1. జాబులు – సెట్టి లక్ష్మీనరసింహం
2. సరసోక్తియుక్త కృష్ణశతకము – సెట్టి లక్ష్మీనరసింహం
3. రసికాభిలాషము – కవిసార్వభౌమ శ్రీనాథుడు
4. సరస చాటువులు – సెట్టి లక్ష్మీనరసింహం
5. పూర్వకవుల చాటువులు – పూర్వకవులు

## ఒక జ్ఞాపిక

ఈ ఏకాంత శృంగార గ్రంథాలలో శ్రీనాథుడు, తెనాలి రామకృష్ణుడు, ఇతర పూర్వకవులు ఉన్నారు కాబట్టి ఇవి తాళపత్ర గ్రంథరూపంలోకూడా భద్రపరుపబడి ఉండాలి అని నేను భావిస్తున్నాను. కాని, "రసికాభిలాషము"ను శ్రీనాథుడు, "శష్పవిజయము"ను తెనాలి రామకృష్ణుడు వ్రాయలేదనీ, సెట్టి లక్ష్మీనరసింహంగారి వంటి ఆధునికులే వ్రాసి వారిపేర్లు పెట్టారని మిత్రులు ఆచార్య కొర్లపాటి శ్రీరామమూర్తిగారు భావిస్తున్నారు. (పై రెండు గ్రంథాలను నా ప్రియమిత్రులు శ్రీ మంతెన పుల్లంరాజుగారు పశ్చిమ గోదావరిజిల్లాలోని భీమవరంనుండి ఇటీవల నాకు పంపించారు. వారికి మిక్కిలి కృతజ్ఞుడను).

బెంగుళూరు — **తంగిరాల వెంకట సుబ్బారావు**

02-10-2006

(విజయదశమి)

## భర్తృహరి సూక్తి

**శో॥ వ్యాఘ్రీవ తిష్ఠతి జరా పరితర్జయన్తీ,**
**రోగాశ్చ శత్రవ ఇవ ప్రహరంతి దేహమ్ ।**
**ఆయుః పరిస్రవతి భిన్న ఘటాదివాంభః,**
**లోకస్తథాపి అహిత మాచరతీతి చిత్రమ్ ॥**

లోకంలో చిత్రమైన విషయం ఏమిటి? అనే ప్రశ్నకు మహాకవి భర్తృహరి ఇచ్చిన సమాధానం. "ముసలితనం ఆడపులిలా ఎదురుగా నిలబడి "మీదపడతా! మీదపడతా!" అని బెదిరిస్తోంది. రకరకాల రోగాలు శత్రువులవలె శరీరాన్ని చితక కొడుతున్నాయి. ఆయుర్దాయం బీటలు తీసిన కుండలోని నీళ్ళులాగ ప్రతిదినమూ బొట్లుబొట్లుగా కారిపోతోంది. తన పరిస్థితి ఇన్ని లోపాలతో కూడి వున్నా సరే, మానవుడు ఇతరులకు అపకారం చేస్తూనే ఉన్నాడు. ఇది చాలా చిత్రంగా ఉంది సుమా!

# తెలుగుకవిత్వము

## (ప్రాస్తావికపద్యములు)

### ఆదికవి నన్నయభట్టు

**ఉ॥ నన్నయభట్టుగారు యజనంబొనరించిన చోట జమ్మిచె**
**ట్టున్నది తణ్కు తూర్పున, సమున్నతమైనది, దాని నీడ నే**
**నున్నతతిన్ శిశుత్వమున నున్నతరీతి వరంబొసంగియున్**
**నన్నుఁ గృతార్థుఁజేసితిరి ఆ యుమ నీవును భీమనాయకా!**

– పట్టమట్ట సరస్వతీ సోమయాజి (పృథుచరిత్రము)

రాజరాజనరేంద్రుని మరణానంతరము నన్నయభట్టు తణుకులో తన చరమదశను గడపెను. అతడు తణుకులో యజ్ఞము చేసినట్లును, ఆ ప్రదేశములో ఒక జమ్మిచెట్టు ఉండెననియు ఆనాటి జనశ్రుతిని పట్టమట్ట సరస్వతీ సోమయాజి కవి గ్రంథస్థము చేసియున్నాడు. నా చిన్నతనములో (1948లో) తణుకు పాతపూరులో ఊరి బయట శ్మశానము దగ్గర, సిద్ధేశ్వరస్వామి గుడి సమీపములో పెద్ద జమ్మిచెట్టు ఉండెడిది. తణుకు పట్టణము ఈనాడు దానివరకును వ్యాపించిపోయినది. అక్కడ "జమ్మిచెట్టు వీథి" వెలసినది. ఆ చెట్టు అవశేషములు ఈనాటికిని మనము ఆ వీథిలో చూడవచ్చును. తణుకులో ఇప్పటికి 75 సంవత్సరములకు పూర్వమే "నన్నయ భట్టారక పీఠము" వెలసినది. అది 'గోస్తనీనదీ' ప్రవాహమువలె ఈనాటికిని అభ్యుదయ పరంపరాభివృద్ధిగా కవిత్వ సేవలందించుచున్నది. ఇటీవల తణుకులో నన్నయ విగ్రహము కూడ వెలసినది.

* * * * *

**శా॥ కాలంబెంత గతించిపోయినను ఆ కల్పాంత సంస్థాయిగా**
**నేలన్ నిల్వగఁజాలు వ్యాసకవితా నిర్మాణమున్ బాసలో**
**నాలాపింపఁగ పంచమశ్రుతి గరీయస్వాదుసన్మాధురీ**
**శ్రీలన్ నన్నయకోకిలంబు సవరించెన్ గంటపున్కంతమున్!**

– మధునాపంతుల సత్యనారాయణశాస్త్రి

కాలమెంత గడచినను కల్పాంతమువఱకు నిలుచు వ్యాసభారతమును ఆంధ్రభాషలో ఆలాపించుటకు నన్నయకోయిల గొంతు సవరించుకొన్నది.

# 1.1 చమత్కారపద్యములు

**1**

సీ॥ దీనారటంకాలఁ దీర్థమాడించితి
దక్షిణాధీశు ముత్యాలశాల,
పలుకుఁదోడై తాంధ్రభాషా మహాకావ్య
నైషధగ్రంథ సందర్భమునను,
పగులఁ గొట్టించి తుద్భటవివాదప్రౌఢి
గౌడడిండిమభట్టు కంచుఢక్క,
చంద్రభూష క్రియాశక్తి రాయల యొద్దఁ
బాదుకొల్పితి సార్వభౌమ బిరుద,
తే॥ మెటుల మెప్పించెదో నన్ను నింక మీఁద
రావుసింగ మహీపాలు ధీవిశాలు
నిండుకొలువున నెలకొనియుండి నీవు
సరసనద్గుణనికురుంబ! శారదాంబ!

(నికురుంబము/నికురంబము = సమూహము)

**2**

శా॥ అక్షయ్యంబుగ సాంపరాయని తెనుంగాధీశ! కస్తూరికా
భిక్షాదానము సేయురా సుకవిరాడ్బృందారకశ్రేణికిన్,
దాక్షారామ చళుక్య భీమవర గంధర్వాప్సరోభామినీ
వక్షోజద్వయకుంభికుంభములపై వాసించుఁ దద్వాసనల్!

(శ్రీనాథుడు తెనుంగాధీశుని కస్తూరిభిక్షను అర్థించు సందర్భము)

**3**

సీ॥ కవిరాజు కంఠంబు కౌఁగిలించెనుగదా
పురవీథి నెదురెండ పొగడదండ!
ఆంధ్రనైషధకర్త అంఘ్రియుగ్మంబునఁ
దగిలియుండెనుగదా నిగళయుగము!

**వీరభద్రారెడ్డి విద్వాంసు ముంజేత**
**వియ్యమందెనుగదా వెదురుగొడియ!**
**సార్వభౌముని భుజాస్తంభ మెక్కెనుగదా**
**నగరివాకిటనుండు నల్లగుండు!**
**తే॥ కృష్ణవేణమ్మ గొనిపోయె నింత ఫలము**
**బిలబిలాక్షులు తినిపోయెఁ దిలలు పెసలు**
**బొడ్డుపల్లెను గొడ్డేటి మోసపోతి**
**నెట్టు చెల్లింతుఁ దంకంబు లేదునూర్లు?**

శ్రీనాథుడు చివరిదశలో పోషకులు లేక వ్యవసాయము చేసి పన్నుగా 700 బంగారు నాణెములు చెల్లింపలేక శిక్షలనుభవించినట్లు తెలియజేయు పద్యమిది.

**4**

ప్రాణావసాన దశలో శ్రీనాథుడు చెప్పిన మరొక పద్యము:-

**సీ॥ కాశికావిశ్వేశుఁ గలిసె వీరారెడ్డి**
**రత్నాంబరంబు లేరాయఁ డిచ్చు?**
**రంభఁ గూడెఁ దెనుంగు రాయరాహుత్తుండు**
**కస్తూరి కేరాజుఁ బ్రస్తుతింతు?**
**స్వర్గస్థుఁడయ్యె విస్సనమంత్రి మఱి హేమ**
**పాత్రాన్న మెవ్వని పంక్తిఁ గలదు?**
**కైలాసగిరిఁ బండె మైలారవిభుఁడేగి**
**దినవెచ్చ మేరాజు తీర్పఁగలఁడు?**
**తే॥ భాస్కరుఁడు మున్నె దేవునిపాలి కరిగెఁ**
**గలియుగంబున నిఁక నుండఁ గష్టమనుచు**
**దివిజకవివరు గుండియల్ దిగ్గురనఁగ**
**నరుగుచున్నాఁడు శ్రీనాథుఁ డమరపురికి!**

పై రెండు సీసపద్య చాటువులను (3 మరియు 4) సి.పి. బ్రౌనుదొరగారు. సేకరించినారు.

5

ఉ॥ స్వైర విహార ధీరలగు సారసలోచన లున్నచోటికిన్
బోరస లాతివారు చొరబూనినచో రసభంగమంచు నే
చేరక పూవుతీవియల చెంతనె నిల్చి, లతాంగి రూపు క
న్నారగ చూచి వచ్చితి నవాంబురుహాంబక నీకు తెల్పగన్

"సారస లోచనలు" ఉన్న చోటునకు హఠాత్తుగా ఇతరులు వచ్చినచో "రస" "సారస లోచనలు" అను పదములో "రస" తొలగించిన "సాలోచనలు" (వీరెవ్వరా? యని ఆలోచనలో పడినవారు) అగుదురు. (వసుచరిత్రము)

6

ఒక కొంటె పురుషుడు – జాణయగు స్త్రీ – మధ్య జరిగిన సంభాషణము:

సీ॥ (1) (పు) సతులు 'మాయాధుర్య చతుర' లౌదురు గదే!
(స్త్రీ) ఔర 'యా' మాట మేలగునటోయి!
(2) జవరాండ్రు 'కుటిలప్రచారల్' గదే! – ఔర!
నడిమి 'టి' మాట మానవుగదోయి!
(3) జవ్వనుల్ 'శోకభాజనలు' గదే! – ఔర!
'క' లగించి పల్క మేల్ కాదటోయి?

. . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . .

తే॥ (4) నన్ను 'నీ వాని' పల్కుట న్యాయమటవె?
మేలు 'వా–ద' గ జేసి నన్నేలు సామి!

(1) అతడు, స్త్రీలు "మాయాధుర్య చతురలు" అన్నాడు. ఆమె "యా" తీసివేయుమన్నది. "మాధుర్య చతురలు" అగుదురు. (2) అతడు, స్త్రీలు "కుటిల ప్రచారులు" అన్నాడు. ఆమె "టి" తొలగించమన్నది. "కులప్రచారులు" అగుదురు. (3) అతడు, స్త్రీలు "శోకభాజనలు" అన్నాడు. ఆమె "క" తొలగించుమన్నది. "శోభాజనలు" అగుదురు. (4) నన్ను "నీవాని" అని పురుషుడన్నాడు. "నా" ను "ద"గ చేసి ఏలుమనుచున్నది. "నీదాని" చేసికొనుమన్నది!

(సీసపద్యంలో 4వ పాదము, ఎత్తుగీతిలో 1,2 పాదాలు మా అన్నయ్య స్మృతిపథంనుండి జారిపోయాయి – సంపాదకుడు)

**7**

**శా॥ నానా సూన వితాన వాసనల నానందించు సారంగ మే**
**లా సన్నొల్లదటంచు గంధఫలి బల్కాకం దపంబొంది యో**
**షా నాసాకృతి దాల్చి సర్వ సుమన స్సౌరభ్య సంవాసమై**
**పూనెం బ్రేక్షణ మాలికా మధుకరీ పుంజంబు నిర్వంకలన్!**

ఈ పద్యమును "నంది తిమ్మన" వ్రాసినాడట! దీనిని అమ్మి వేయగా వసుచరిత్రకారుడు కొని తన కావ్యనాయిక వర్ణనలో చేర్చుకొన్నట్లు జనశ్రుతి. అన్ని పుష్పములపైనను వ్రాలు తుమ్మెద తనపై వ్రాలుట లేదని సంపెంగ తపస్సు చేసి. నాయిక నాసికగా మారినదట! అప్పుడు ముక్కునకు ఇరువైపులను చూపులనెడి తుమ్మెదబారులను (సేవకులనుగా) నిలుపుకొన్నది!

**8**

**చ॥ గరళపు ముద్ద లోహ! మవగాఢ మహాశని పోట్లు సమ్మెటల్!**
**హరు నయనాగ్ని కొల్మి! యురగాధిపు కోరలు పట్టుకార్లు! ది**
**క్కరటి శిరమ్ము దాయి! లయకాలుడు కమ్మరి! వైరివీర సం**
**హరణ గుణాభిరాముడగు మైలము భీమన ఖడ్గసృష్టికిన్!**

మైలము భీమన ఖడ్గము చేయబడిన విధానమును కవి వర్ణించుచున్నాడు. గరళపు ముద్దను లోహముగా తీసుకొన్నాడు ప్రళయకాల రుద్రుడు! పిడుగులే సమ్మెటలు! హరుని నేత్రాగ్నిని కొలిమిగా చేసికొని, దిగ్గజము శిరస్సు దాయిగా – కాల్చుచు సాగగొట్టిన ఖడ్గము భీమన్నది! అది యెంత భయంకరమో మనమూహించు కొనవచ్చును.

**9**

**చ॥ మిరియములేని కూరయును–మెచ్చు నెఱుంగనివాని యీవియున్–**
**గరగరకాని భోజనము – కన్నుల పండువుగాని రూపమున్–**
**మురిపెములేని యౌవనము – మోహములేని లతాంగి కూటమున్–**
**సరసుల కింపుగావు సుగుణాకర పెమ్మయ సింగధీమణీ!**

కవిత్వము నర్థము చేసికొని మెచ్చి యిచ్చినది యొక వక్కైనను చాలును అన్నారు కవివర్యులు. మెచ్చుట తెలియని వాడిచ్చు ధనమును పొంది కవులు

సంతసింపజాలరని చెప్పుటకు ఐదు విషయములు కలిపి చెప్పుచున్నాడు చాటుకవి! గరగరకాని భోజనము = పరిశుభ్రతలేని భోజనము.(ఈ పెమ్మయ సింగధీమణి చాటువులు మరో రెండు ఈ పుస్తకంలోనే హాస్య పద్యాలలో ఇచ్చాడు మా అన్నయ్య (చూ. 8, 9 పద్యాలు). కాని ఇవి మొత్తం 15 పద్యాలు లభించాయి (చూ. అనుబంధం –8)

## 10

తిమ్మజగపతి అను పెద్దాపురసంస్థానాధిపతి లోభి. అందరును తనను లోభి అనుచున్నారని తిమ్మజగపతికి తెలియును. ఇట్టి లోభినుండి పారితోషికము అందుకొన్న కవి పద్యము:

**ఉ॥ 'ఇవ్వడు ఇవ్వడంచు' జను లెప్పుడు తప్పక చెప్పుచుందు, రే**
**మివ్వడు? అన్యకాంత కురమివ్వడు! సంగర రంగమందు వె**
**న్నివ్వడు! శత్రులన్ ప్రబలనివ్వడు! బెబ్బులినైన పట్టి పో**
**నివ్వ, దసత్యవాక్య మెపుడివ్వడు తిమ్మజగత్పతీంద్రుడే!**

తిమ్మ జగపతిని "ఇవ్వడు! ఇవ్వడు!!" అనుచుందురు. అది వాస్తవమే! అనుచు శీల – పరాక్రమములను – కవిత్వములో ప్రతిష్ఠించినాడు! అహో! కవి గంటమును ఎటునుండి వ్రాసినను కవిత్వమే!

## 11

ధర్మ అప్పారావుగారు దానవ్యసనుడు! అతనిని వార్ధక్యములో కుటుంబ సభ్యులు గృహనిర్బంధము చేసి అతని దగ్గరకెవ్వరిని (కవులను) పోనిచ్చెడివారు కారు! అతనిని మేనాలో వాహ్యాళికి గొనిపోవు వేళ చెట్టుపై నెక్కి ఒక కవి చెప్పిన పద్యము:

**చ॥ వెలమ కులమ్మునందు ఇలు వెళ్ళరు కాంత లనంగ విందు, న**
**ప్పలుకు లబద్ధమాయె! జనపాల శిఖామణి 'అప్పరాయ' రాట్**
**కలభపు 'కీర్తికాంత'–'జయకాంత' – మహిం 'గృతికాంత' – ముప్పురున్**
**కల జగమెల్లయుం దిరుగగా కనుగొంటిమి, చిత్రమిద్ధరన్ !**

ధర్మ అప్పారావుగారి కీర్తి–జయము–కావ్య స్వీకారము–జగత్ప్రసిద్ధమైనవిగా పేర్కొనబడినవి.

**12**

**కు॥ ఏ వ్రాలైనను వ్రాయును,**
**'నా' వ్రాయడు, వ్రాసెనేని నవ్వులకైనన్**
**'స్తి' వ్రాసి 'తా' వడివ్వడు,**
**భావజ్ఞుడు రాయనార్య భాస్కరు డెలమిన్!**

రాయని భాస్కరుని దాతృత్వమును ప్రకటించు పద్యమిది. అక్షరాభ్యాస వేళనుండియును "నా" అక్షరము వ్రాసెడివాడు కాడట! ఒకవేళ వ్రాసినను "స్తి" అసలే వ్రాసెడి వాడు కాడు! దాతృత్వము పుట్టుకతో వచ్చినది. "నాస్తి" అనుటకాని, వ్రాయుట కాని, ఆ దాతకు చేతకాదు!

**శ్లో॥ దాతృత్వం - ప్రియ వక్తృత్వం - ధీరత్వం - ఉచితజ్ఞతా!**
**అభ్యాసేన నలభ్యన్తే చత్వారః సహజా గుణాః ॥**

ఈ నాల్గును పుట్టుకతోనే వచ్చునవి. (చూ. నీతిశ్లోకములు-103)

**13**

ద్వాదశ (12) ఆదిత్యులు - ఇప్పుడు బేసి (11) గా ఎందుకున్నారు? అని నారదుడు తండ్రిని ప్రశ్నించినాడు. తండ్రి సమాధానముగా "అందొక సూర్యుడు రాయని భాస్కరుడుగా జన్మించె" నన్నాడు. "అతనికి సహస్ర కరములు లేవేమి"? అని ప్రశ్న. "దానవేళ - యుద్ధవేళ - వ్రాయువేళ అతనికి వేయి చేతులుండును" అని సమాధానము.

**మ॥ సరి బేసై రిపుడేల భాస్కరులు భాషానాథ? పుత్రా! వసుం**
**ధరపై నొక్కఁడు మంత్రియయ్యె! వినుకొండన్ రామయామాత్య భా**
**స్కరుఁడో? ఔ! నయినన్ సహస్రకరశాఖల్లే? వవే యున్నవే!**
**తిరమై దానముసేయుచో-రిపుల హేతిన్వ్రేయుచో-వ్రాయుచోన్!**

(-రావిపాటి త్రిపురాంతకుడు-14వ శతాబ్ది)

**14**

ఈ రాయని భాస్కరుని దాతృత్వమును వర్ణించు పద్యము మరొక్కటి కలదు. రాయని భాస్కరుడు బాల్యములో అక్షరములనుండి గుణితముల లోనికి వచ్చినాడట.

అతనికి "లే" అను అక్షరము–"దు"అను అక్షరము వ్రాయుట చేతకాలేదు? "లేదు" అనలేని పుట్టుదాత రాయని భాస్కరుడు!

**క॥ చేకొని రాయని బాచఁడు**
**కాకాలు గుణించు పిదపకాలము నాఁడే**
**'లా' కేత్వ మియ్యనేరఁడు,**
**'దా'కును గొమ్మియ్యఁ డిట్టి ధన్యులు గలరే?**

**15**

శ్రీకృష్ణదేవరాయల శత్రువులకు చచ్చినను భీతి పోవుటలేదు. రాయలు నారాయణాంశతో జన్మించినవాడు అను విషయమును తెనాలి రామకృష్ణకవి భ్రాంతి మదలంకారముతో చెప్పినాడు:

**మ॥ కలనం దావక ఖడ్గఖండిత రిపుక్ష్మాభర్త మార్తాండ మం**
**డల భేదం బొనరించి యేగునెడ తన్మధ్యంబునన్ హార కుం**
**డల కేయూర కిరీట భూషితుని శ్రీనారాయణుంగాంచి లో**
**కలగం బారుచు నేగె నీవయను శంకన్ కృష్ణరాయాధిపా!**

**తా॥** "ఓ శ్రీకృష్ణదేవరాయా! యుద్ధంలో నీ కత్తిచేత నరుకబడిన శత్రువు, సూర్యమండలాన్ని ఛేదించుకొని వీరస్వర్గానికి వెళ్ళే సమయంలో, ఆ సూర్యమండలం మధ్యలో హారములు, కుండలములు, దండకడియములు (బాహుపురులు), కిరీటము ధరించిన శ్రీమన్నారాయణమూర్తిని చూచి, నీవే అని భ్రాంతిచెంది, మనసులో భయపడుతూ పారిపోతున్నాడు!"

**16**

"గౌళపతి"యనువాడు కృష్ణరాయలతో యుద్ధమునకు పోవుచు, తనను పేరుతో పిలచు చిలుకను పంజరమునుండి విడచినాడు. యుద్ధములో ఓడి ఒక పొదలో దాగినాడు. ఆ పెంపుడు చిలుక ఆ పొదపై వ్రాలి "గౌళపతీ!" అని అరచుచు అతనిని బయటపెట్టుచున్నది. అప్పుడా గౌళపతి చిలుకతో:–

**ఉ॥ ఆలములోన కృష్ణవసుధాధిపు దాడికి నోర్వలేక యీ**
**కేల పసిండి పంజరము కీలెడలించిన పోక – ఇక్కడా?**
**'గౌళపతీ!' యటంచు చిలుకా! నను పిల్చెదు? పెంచినందు కా**
**మూలను నున్నవాని నిట ముంగిట పెట్టుట నీకు న్యాయమా?**

**17**

నారయ్యప్పారావు గారికి పన్నులు చెల్లించి వెళ్ళుటకు ఒక కరణము వచ్చినాడట. కందాలో భుజించుచు ఉండవలసి వచ్చినట! అతడు తన బాధను నారయభూపునకు నివేదించు సన్నివేశము:–

**కII శీతజల స్నానంబును,**
**భూతల శయనంబు, నొంటిపూటశనంబున్,**
**నాతిగల బ్రహ్మచర్యము,**
**నా తరమా పూట గడుప? నారయ భూపా!**

**18**

పొడుపుకథలవంటి పద్యములలో నిదియొక్కటి:–

**కII ఎంచగ చతుర్థ జాతుడు**
**పంచమ మార్గమున నేగి, ప్రథమ తనూజన్**
**కాంచి, తృతీయం బచ్చట**
**నుంచి, ద్వితీయంబు దాటి యొప్పుగ వచ్చెన్!**

(1) పృథివి (2) ఆపః (3) తేజో (4) వాయుః (5) ఆకాశములు గుర్తునకు రావలెను. చతుర్థ జాతుడు=వాయుపుత్రుడు, పంచమ మార్గము = ఆకాశ మార్గము, ప్రథమ తనూజ=భూపుత్రి, తృతీయము=అగ్ని, ద్వితీయ=జలము. హనుమంతుడు ఆకాశమార్గములో వెళ్ళి, సీతనుచూచి, లంకనుకాల్చి, సముద్రమును దాటి వచ్చెను.

**19**

**సీII [1]రాము దెవ్వానితో రావణు మర్దించె?**
**[2]వర వాసుదేవుని పట్నమేది?**
**[3]రాజమన్నారుచే రంజిల్లు శరమేది?**
**[4]వెలయ నిమ్మఫలము విత్తునేది?**
**[5]అల రంభకొప్పులో అలరు పూదండేది?**
**[6]సభవారి నవ్వించు జాణ యెవడు?**
**[7]సీత పెండ్లికి ఓలి చేసిన విల్లేది?**
**[8]శ్రీ కృష్ణు దేయింట చెలగుచుండు?**

**అన్నిటను జూడ నైదేసి యక్షరములు,**
**ఈవ లావల జూచిన నేక విధము,**
**చదువు నాతడు 'భావజ్ఞ చక్రవర్తి'**
**లక్షణోపేంద్ర ప్రౌఢరాయ క్షితీంద్ర!**

పై సీసపద్యములో 8 ప్రశ్నలున్నవి? వానికి సమాధానములు ఐదేసి. యక్షరములలో నుండవలెను. వెనుకనుండి చదివినను సరిపోవలెను. సమాధానించిన వానికి "భావజ్ఞచక్రవర్తి" బిరుదమిచ్చెదను.

(1) తోకమూకతో (2) రంగనగరం (3) లకోల కోల (4) జంబీర బీజం (5) మందార దామం (6) వికట కవి (7) పంచాస్య చాపం (8) నంద సదనం.

**20**

పొడుపు పద్యము:-

**క॥ పండగ నెండిన దొక్కటి,**
**పండక మరి పచ్చిదొకటి, వడి కాలినదిన్,**
**తిండికి రుచియై యుండును,**
**మండలమున జనులకెల్ల మహిలో వినుమా!**

సమాధానం: వక్క - ఆకులు - సున్నము.

**21**

బాధలు పేదవారికే! చక్కని గృహములో భార్యా పరిష్వంగములో నున్న ధనికులను చలి ఏమియును చేయజాలదు - అను భావముతో చలి నుద్దేశించి కవి చెప్పిన పద్యము:-

**మ॥ చలి! మమ్మీగతి బాధపెట్టెదవు, నీ సామర్థ్యముల్ పట్టి బీ**
**దలపైగాక - ధగద్ధగాయిత మణిస్తంభోన్నతాంతఃపుర**
**స్థల సంవాసిత కామినీ దృఢ పరిష్వంగానుసంయుక్తి ని**
**శ్చలులౌ భోగులమీద లేశమును నీ జంజాటముల్ సాగునే?**

**22**

అసత్యమాడిన వానిని గాడిద కూడా కొడుకుగా స్వీకరించదు! అయినను గాడిద "నా కొడుకునకు మాటలే రావుకదా! ఈ నింద యేమియో?" అని యేడ్చినదట!

**కII ఆడిన మాటలు తప్పిన**
**గాడిద కొడుకంచు తిట్టగా విని, అయ్యో!**
**వీడా నాకొక కొడుకని**
**గాడిద యేడ్చెంగదన్న ఘన సంపన్నా!**

**23**

దత్తపదిగా గోలకొండ– ...ముండ – పూలదండ – కొత్తకుండ అను పదములు స్వార్థమున కాకుండ – భారతార్థముగా పద్యము చెప్పుమనగా ఒక మహాకవి చెప్పిన పద్యము:–

**తేII ఓయి కురురాజ! నీ కొడుకుత్తగోల,**
**కొండవలెనుండు, క్షణమాలముండదికను,**
**భండనంబున గెల్తురు పాండుసుతులు,**
**ఉదరమున పూలదండ రేకొత్తకుండ!**

ఓ కురురాజ! నీ కొడుకు తెలియనివాడు! కొండవలె పడబోవు యుద్ధ మాగదు! పాండవులు పూలరేకొత్తుపాటి శ్రమలేక (అతి సులభముగా) గెల్తురు.

**24**

ఒక లజ్జావతి తన భర్తపేరును ఎంత తెలివిగా పదమధ్యలో నిక్షేపించినదో చూడుడు:–

**చII సరసిజనేత్ర! నీ విభుని చక్కని పేరు వచింపుమన్న, ఆ**
**పరమ పతివ్రతామణియు భావమునం ఘనమైన సిగ్గునన్,**
**కరియును–రక్కసుండు–హరుకార్ముకమున్–శర–మద్దమున్–శుకం–**
**బరయగ వీనిలోని నడిమక్కరముల్ గణుతింప పేరగున్!**

ద్విరదద–అఘుడు–పినాక–సాయక– ముకుర–చిలుక = "రఘునాయకులు"

**25**

**కII నక్షత్రంబను చిన్నది,**
**నక్షత్రము చేతబట్టి నక్షత్ర విభున్,**
**నక్షత్రమునకు రమ్మని,**
**నక్షత్రము పైనవైచి, నవ్వుచు పిలిచెన్!**

"తార"యను చిన్నది – "భరణి" చేతబట్టి–నక్షత్రపతిని (చంద్రుని)– "ఆశ్లేషము"నకు రమ్మని – "హస్తము" పైనవైచి–నవ్వుచు పిలచెను. (ఉత్తర– అభిమన్యుని పిలచినట్లు కొందరు అర్థము చెప్పుదురు. అదియును సరిపోవును. అభిమన్యుడు చంద్రుని అంశతో పుట్టినవాడు).

**26**

**ఆ॥ కొండనుండు నెమలి కోరిన పాలిచ్చు**
**పశువు శిశువుతోడ పలుకనేర్చు**
**వనిత వేదములను వల్లించుచుండును**
**బ్రాహ్మణుండు కాకిపలలము దిను!**

ఈ పద్యము విరోధము. సరియైన చోట్లలో ఆపి చదివితే విరోధం పోతుంది. కొండనుండు నెమలి! కోరిన పాలిచ్చు పశువు! శిశువుతోడ పలుకనేర్చు వనిత! వేదములను వల్లించుచుండును బ్రాహ్మణుండు! కాకి పలలము దిను!

**27**

ఇట్టిదే మరొక్కటి!

**ఆ॥ వంగతోట నుండు, పరిమళ్ళలో నుండు,**
**జొన్నచేల నుండు, జోదుక్రింద[1]**
**తలుపుమూల నుండు, తలమీద నుండును,**
**దీని భావమేమి తెలియుడయ్య!**

వంగ, తోటనుండును – వరి, మళ్ళలోనుండును – జొన్న, చేలనుండును – (చెప్పుల) జోడు, క్రింద నుండును–తలుపు, మూలనుండును – తల, అన్ని భాగముల కంటె పైన నుండును. (1) "చోద్యముగను" పాఠాంతరం.

**28**

చేమకూర వేంకటకవి రచించిన సారంగధర చరిత్రములో చిత్రాంగి తన మేడకు వచ్చిన సారంగధరునకు కామవశమున – అధికముగా ఉపచారములు చేయుట – సారంగుని ప్రశ్న – ఆమె సమాధానము:–

**చ॥ జనవరసూను దందులకు చాలప్రియంబు తొలంక, అన్నెలం**
**తను గని 'నీ, కుమారుడ' గదా యిటు తక్కిన వారికిం బలెన్**
**జననిరొ! నాకు నింత యుపచారము సేయగ నేటికమ్మ నే**
**దనవుడు–'నాకు, మారుడవె యౌటను' చేయుదు నంచు పల్కుచున్.**

ప్రశ్న: అమ్మా! నీ కుమారుడను కదా! నాకింత ఉపచారము లెందుకమ్మా?
సమాధానము: నాకు, మారుడవు (నాకు మన్మథుడవు అగుటచే చేయుచున్నాను).

**29**

**ఆ॥ దేహమెల్ల కనులు – దేవేంద్రుడును గాడు!**
**నరుని నెక్కకుండ నడచిపోడు!**
**తనకు నుసురులేదు – తగిలి జీవుల జంపు**
**దీని భావమేమి తిరుమలేశ?**

– తనకు ప్రాణములేదు, అయినను తగులుకొని జీవులను చంపును = వల

**30**

కొందరు కవులకు వాక్శుద్ధి యున్నట్లుగా వేములవాడ భీమకవి మొదలుగా కొందర నందురు–అందు కొందరు:–

**మేధావి భట్టు:**–"సాళువ పెదతిమ్మ మహీపాలునకు పద్యము వ్రాసియీవలెను. నా దగ్గర అలేఖ్యములు లేవు" అనుచు తాళవృక్షముతో:–

**క॥ సాళువ పెదతిమ్మమహీ**
**పాలవరుడు వీడెవచ్చె, పద్యము వ్రాయన్**
**కేలను లే దాకొకటియు**
**తాళమ! ముత్తునియ లగుచు ధరపై బడుమా!**

**31**

"బడబానల భట్టారకుడు" అనుకవి శ్రీశైలము పోవుచు దారిలో సరస్సున సూర్యునకు అర్ఘ్యమిచ్చువేళ ఉంగరము చెఱువులో పడినది. అప్పుడాకవి తటాకముతో:–

**కII బడబాసల భట్టారకు**
**కుడిచేయుంగరము రవికి గొబ్బున నర్ఘ్యం**
**బిడువేళ నూడి నీలో**
**బడియె తటాకంబ! నీటిఁబాయుము వేగన్ !**

**32**

సాహిణి మారుడు దానఘనుడనుచు ఒక కవి అతనిని గూర్చి చెప్పిన పద్యము:–

**కII అప్పులిడు నతడు ఘనుడా?**
**అప్పుడొసగి మరల చెందునాతడు రాజా?**
**చెప్పగవలె సాహిణి మా**
**రప్పను దానమున ఘనుడు రాజు నటంచున్!**

అప్పులు = అప్పిచ్చుట (జలమునిచ్చుట). అప్పుఇచ్చువాడు ఘనుడా? = మేఘుని నింద! రాజు = చంద్రుడు. చంద్రుడు తన కళలనిచ్చి మరల స్వీకరించును. చంద్ర నింద! సాహిణి మారప్ప మేఘుని – రాజును మించిన మహాదాత!

**33**

రామాయణార్థముగా నగరు – తగరు – తొగరు – వగరు: దత్తపది. పెద్దన చెప్పినాడట–

**చII "నగరు పగాయె, నింక విపినంబుల కేగుఁడు, రాజ్యకాంక్షకున్**
**దగరు కుమారులార!" యని తల్లి వగల్మిగులంగ దోఁపగాఁ,**
**దొగరున రక్షకట్టి, మదిదోఁచక గద్గద ఖిన్న కంఠియై**
**వగరుపుచున్నఁ జూచి రఘువంశవరేణ్యుఁడు తల్లి కిట్లనున్.**

**34**

పెద్దన శ్రీ కృష్ణదేవరాయలను వర్ణించుచు చెప్పిన పద్యము:–

**మII శరసంధాన బల క్షమాది వివిధైశ్వర్యంబులుం గల్గి, దు**
**ర్భర షండత్వ – బిలప్రవేశ – చలన – బ్రహ్మఘ్నతల్ మానిసన్**
**నర–సింహ–క్షితిమండలేశ్వరుల నెన్నన్ వచ్చు నీ సాటిగా**
**నర–సింహ క్షితిమండలేశ్వరుని కృష్ణా! రాజకంఠీరవా!**

నరుడు శరసంధానములోను, సింహము బలములోను, భూమి ఓర్పులోను, ఈశ్వరుడు ఐశ్వర్యములోను గొప్పవారే! ఐనను పై నలుగురిలో నాల్గు దోషములున్నవి: నపుంసకత్వము – గుహలో దాగియుండుట – భూకంపము (భూమి చలించుట) – బ్రహ్మహత్య (బ్రహ్మదేవుని తలను నఱకుట) – అను దోషములు క్రమముగా నుండుటవలన నర + సింహ + క్షితిమండల + ఈశ్వరులు, నీతో సరిపోల్చదగరు. (నరసింహరాయల కుమారుడవైన కృష్ణదేవరాయా! రాజశ్రేష్ఠా! అని సంబోధనము). ఈ పద్యం విన్న తెనాలి రామకృష్ణుడు పెద్దనను ఆక్షేపిస్తూ: "తాతా! బిలంలో దూరిన సింహాన్ని మళ్ళీ తోకపట్టుకొని బయటకు లాగావే?" అన్నాడు. సింహం – రాయలతో పోల్చడానికి తగదని ముందు చెప్పి, చివర్లో "కృష్ణా! రాజకంఠీరవా!" అని తిరిగి సింహంతోనే పోల్చడం బాగా లేదన్నాడు. "అయితే నువ్వు చెప్పు ఒక పద్యం!" అన్నాడు పెద్దన. అప్పుడు రామకృష్ణుడు "కలనన్ దాచక ఖడ్గఖండిత రిపుక్ష్మాభర్త..." అనే పద్యం చెప్పి మెప్పుపొందాడు (చూ. 15వ పద్యం)

**35**

"రమణీయార్థ ప్రతిపాదకః శబ్దః కావ్యం" = అందమైన అర్థమునిచ్చెడి శబ్దమే కవిత్వము, భాషలో శబ్దములుండును; శబ్దములకు అర్థములుండును. శబ్దమునుండి సాధారణమైన అర్థము వచ్చినచో అది గద్యమగును (Prose). శబ్దమునుండి అందమైన అర్థము వచ్చినచో అది కవిత్వమగును (Poetry). "ఈశ్వరుడు భక్తులయందు మిక్కిలి ప్రేమ కలవాడు. తిన్నడు పెట్టిన ఎంగిలి మాంసమును గూడ తినెను" అనినచో అది కవిత్వము కాదు; వచనము. ఈ విషయమునే మహాకవి ధూర్జటి రమణీయమగు అర్థము వచ్చునట్లుగా ఇట్లు చెప్పినాడు:–

**నీకున్ మాంసము వాంఛయేని కఱవా? నీ చేత లేడుండగా,**
**జోకైనట్టి కుఠారముండ, అనలజ్యోతుండ, నీరుండగా,**
**పాకంబొప్ప ఘటించి, చేతిపునుకన్ భక్షింప కాబోయచే**
**చేకొంటెంగిలిమాంస, మిట్లు తగునా? శ్రీ కాళహస్తీశ్వరా!**

తా॥ “ఓ ఈశ్వరా! నీకు మాంసం తినాలని అంతగా కోరిక వుంటే, నీకేమి లోటు వచ్చిందయ్యా! ఒక చేతిలో లేడి ఉంది; మరొక చేతిలో పదునైన గొడ్డలి ఉంది; నుదుటిమీద నిప్పు ఉంది; నెత్తిమీద నీళ్ళున్నాయి. గొడ్డలితో లేడిని చంపివేసి, రుచిగా వండుకొని, చేతిలో ఉన్న కపాలంలో పెట్టుకొని హాయిగా తినవచ్చును కదా! ఆ బోయవాడు (తిన్నడు) పెట్టిన ఎంగిలి మాంసాన్ని తీసుకున్నావు. ఈ పని ఏమైనా బాగుందా? చెప్పు?”

## 36

**క॥ విధుకృత కదనము వదనము,**
**మధుకర నికరములఁ గేరు మగువ చికురముల్,**
**విధు - మధుకర లీలాజయ**
**మధురోక్తులు పిక్కలౌర! మధురాధరకున్.**

ముఖము చంద్రుని గెల్చినది. ముంగురులు తుమ్మెదలను మించినవి. “విధు” లోని “ధు” అను అక్షరమును “మధుకర” శబ్దమునుండి తొలగించినచో “మకర” మిగులును. అట్లే “మధుకరి” శబ్దమునుండి “క” అను అక్షరమును తొలగించినచో “మధుర” మిగులును. ఆమె కాలిపిక్కలు మకరములను, మాటలు మాధుర్యమును జయించినవి – అని భావం!

## 37

“అంబుధరంబు” అను పదములో “బుధ” “ధరంబు” అను శబ్దములున్నవి. అంబుధరంబు అనగా మేఘము. ఈ మేఘము నాయిక కొప్పుతో సరికాలేక రెండుగా చీలిపోయినది. దానిని చూచి జాలిపడి “బుధు”లు మధ్య నివసించినారు. అంబు = బాణము; ధరము = పర్వతము. ఈ రెంటిని క్రమముగా నాయిక చూపు – కుచములతో పోల్చినారు:–

**ఉ॥ ఆ నలినాక్షి వేనలికి ‘అంబుధరంబు’ సమంబుగామిచే**
**తా నిరువ్రయ్యలై చనిన, తద్దశ జూచి దయార్ద్రులై బుధుల్,**
**దాని పదాంతరంబునను దారు వసించినవారు, కావునన్**
**బూని తదంశమున్ సమతఁ బోల్చిరి తత్సతి దృక్కుచంబులన్!**

## 38

**ఉ॥ కన్యకు నైదు జంఘలును, కన్యకు నాఱు కుచంబు లెన్నగా,**
**కన్యకు నాల్గు కన్బొమలు, కన్యకు ఏడు విశాల నేత్రముల్,**
**కన్యకు ద్వాదశంబు నులి కౌనును గల్గు, సులక్షణాఢ్య కా**
**కన్యకు నీకు నింక పదికావలె కస్తురి రంగనాయకా!**

రాసులు: 1. మేషం; 2. వృషభం; 3 మిథునం; 4. కర్కాటకం; 5. సింహం; 6. కన్య; 7. తుల; 8. వృశ్చికం; 9. ధనుస్సు; 10. మకరం; 11. కుంభం; 12.మీనం. (కన్యరాశినుండి లెక్కించిన) కన్యనుండి ఐదు మకరం – ఆమె జంఘలు (పిక్కలు) మకరములవలెనున్నవి. కన్యనుండి ఆరు కుంభము–ఆమె కుచములు కుంభములవలెనున్నవి. కన్యనుండి నాలుగు ధనుస్సు–ఆమె కనుబొమలు ధనుస్సువలె నున్నవి. కన్యనుండి ఏడు మీనము–ఆమె వెడల్పయిన కన్నులు చేపలవలె నున్నవి. కన్యనుండి పన్నెండు సింహము – ఆమె సన్నని నడుము సింహమునడుమువలె నున్నది. ఇట్టి మంచిలక్షణములు కలిగిన ఆ కన్యకును నీకును పది కావలెను. కన్యారాశినుండి 10వది మిథునం. కాబట్టి మీరిద్దరును మిథునము (దంపతులు) కావలెనని భావము. నులి=అల్పము, సన్నని.

## 39

**క॥ అరువదిరెండు కుచంబులు,**
**శిరమొక్కడు రెండువేలు చెవులున్ తానున్,**
**ఇరువైరెండు భుజంబులు,**
**తరుణీ! ఏయూరు నీది దాచక చెపుమా?**

ఓ అరువ స్త్రీ! రెండు కుచములతో – ఒక శిరముతో – రెండు వ్రేలాడు చెవులతో, తగినట్టి రెండు భుజములతో ఉన్నావు. ఏయూరు నీది? పదచ్ఛేదములో గారడి! (అరువది–రెండు కుచంబులు–రెండు వేలు–చెవులున్; ఇరువై–రెండు భుజంబులు. ఇరువై = ఇరువగు = ఒప్పిదమైనట్టి).

## 40

అడిదము సూరకవిని చూచి ఒక కవివర్యుడు కవివలె నున్నాడని గ్రహించి, “ఊరెయ్యది?” కందపద్యములో నాల్గక్షరములతో ప్రశ్నించినాడు. కందమందు కొన్నాడు సూరకవి!

**కII ఊరెయ్యది? - చీపురుపలి!**
**పేరో? - సూరకవి! యింటి పేరు? - అడిదమువార్!**
**మీ రాజు? విజయరామ మ**
**హారాజు! - అతఁడేమి సరసుఁడా? - భోజుఁడయా!**

## 41

పూసపాటి విజయరామరాజుగారిపై కవి చెప్పిన పద్యమిది! రాజు (చంద్రుడు) –రతిరాజు (మన్మథుడు)– అంబికారాజు (శివుడు)–మృగరాజు ఈ రాజులు రాజులు కారు! (సభలోని రాజుల చూపగా గొడవైనదట). విజయరామరాజే రాజు!

**ఉII రాజు కళంకమూర్తి! రతిరాజు శరీరవిహీను, దంబికా**
**రాజు దిగంబరుండు! మృగరాజు గుహాంతరసీమవర్తి! వి**
**భ్రాజిత పూసపాడ్విజయరామనృపాలుడె రాజుగాక, యీ**
**రాజులు రాజులే? పెను తరాజులు గాక ధరాతలంబునన్ !**

చంద్రునిలో మచ్చ – రతిరాజుకు శరీరము లేదు – శివుడు దిగంబరుడు – మృగరాజు గుహానివాసి. పెనుతరాజులు = పెద్ద తక్కెడలు! తక్కెడ గొప్పవస్తువును క్రిందకు, తక్కువదానిని పైకి పెట్టును! ఐనవారిని క్రిందను, కానివారిని పైన పెట్టువారు!

## 42

ఈ పద్యము రాజలింగకవి కూర్మపురాణము మూడవ ఆశ్వాసములోనిది. ఈ పద్యములో ప్రతి పాదమునకు రెండుచోట్ల “భంబుగదే!” అనుట వచ్చినది. మొత్తము 8 చోట్ల వచ్చినది. నాయికా వర్ణనము (భంబు = నక్షత్రము, ఆకాశము, కిరణము)

**ఉII భంబుగదే నఖావళి! నభంబుగదే నడుమున్! మదద్విరే**
**భంబుగదే కచంబు! దిగిభంబుగదే నడతీరు! హేమ కుం**
**భంబుగదే కుచంబు! కరభంబుగదే తొడ! పూర్ణచంద్రికా**
**భంబుగదే స్మితం, బురు శుభంబుగదే వచనంబు బోటికిన్!**

కరభంబు = "మణి బంధాదా కనిష్ఠం కరస్య కరభో బహిః = చేతి మణికట్టునుండి చిటికెన వ్రేలు వఱకు ఉన్న భాగమునకు "కరభ" మనిపేరు. భంబు = నక్షత్రము; నభంబు = ఆకాశము; ద్విరభంబు = తుమ్మెద; దిగిభంబు (దిక్+ఇభంబు)=దిక్కున ఉన్న ఏనుగు (దిక్కరి); హేమకుంభము = బంగారుకుండ; పూర్ణచంద్రిక + అభము= పున్నమివెన్నెలతో సమానము; స్మితము = నవ్వు; ఉరుశుభంబు = మిక్కిలి శుభప్రదము.

**43**

ఆంధ్రభాషా పరిజ్ఞానము – కవిత్వధోరణి, కల్గిన యువతీయువకుల మధ్య జరిగిన సంభాషణలోని దూరాన్వయ పద్యములు పరిహాసాత్మకములు. యువకుడు (బావగారు): –

"దరిద్రదేవతా! సున్నము తెమ్ము" అనుటకు: –

**తే॥ పర్వతశ్రేష్ఠపుత్రిక పతి విరోధి**
**అన్న పెండ్లాము అత్తను గన్నతండ్రి**
**ప్రేమ తోడుత వానికి పెద్దబిడ్డ!**
**సున్న మిప్పుడు తేగదే సన్నుతాంగి!**

పర్వత శ్రేష్ఠపుత్రిక = పార్వతి, పతి = శివుడు, విరోధి = మన్మథుడు, అతని అన్న = బ్రహ్మ, ఆయన పెండ్లాము = వాణి, వాణియొక్క అత్త = లక్ష్మి, ఆమెను కన్నతండ్రి = సముద్రుడు, వాని పెద్దబిడ్డ = పెద్దమ్మవారు – (ధరిద్రదేవత).

**44**

ఈ పై పద్యమునకు యువతి (మరదలు) సమాధానముగా: –

**క॥ శత పత్రంబుల మిత్రుని**
**సుతు జంపినవాని బావ సూనుని మామన్**
**సతతము తలదాల్చిన శివ**
**సుతు వాహన వైరి వైరి సున్నం బిదిగో!**

శతపత్రంబుల మిత్రుడు = సూర్యుడు, సుతుడు = కర్ణుడు, చంపినవాడు = అర్జునుడు, వానిబావ = కృష్ణుడు, అతని సూనుడు = ప్రద్యుమ్నుడు, అతనిమామ

= చంద్రుడు, సతతము తలదాల్చినవాడు = శివుడు, అతని సుతుడు = వినాయకుడు, అతని వాహనము = ఎలుక, దానివైరి = పిల్లి, దానికి వైరి = కుక్క, కాబట్టి "కుక్కా! సున్నమిదిగో!" అన్నది మరదలు!

**45**

44వ పద్యమునకు పాఠాంతరము:–

**కII నగపగతు పగతు పగతుకు**
**పగతుండౌ మగధరాజు పరిమార్చిన యా**
**జగజెట్టి అన్న తండ్రికి**
**తగు వాహనమైనయట్టి ధన్యుడవు భళా!**

నగపగతు = ఇంద్రునకు, పగతు = నరకాసురుడు, పగతు = కృష్ణ, పగతుండౌ మగధరాజు = జరాసంధుని, పరిమార్చిన యా జగజెట్టి = భీముడు, అన్న = ధర్మరాజు, తండ్రికి = యమునకు, తగు = తగిన, వాహనమైనట్టి = దున్నపోతు అయినవాడా! "ఓ దున్నపోతా! సున్నమిదిగో!" అన్నది మరదలు.

**46**

సమస్యా పూరణములో ప్రశ్నలు– సమాధానములుగా పూరించుట ఒక పద్ధతి. సమస్య:– "రాధేయుడు నందినెక్కి రావణు గెలిచెన్!"

**కII యోధెవ్వడు కురుబలముకు?**
**మాధవసఖు డేమి యెక్కి మరి తిరుగాడున్?**
**సాధించె రాముడెవ్వని?**
**రాధేయుడు – నందినెక్కి – రావణుగెలిచెన్ !**

**47**

తురగా రామకవికి వార్షికము ఇవ్వలేదని పెద్దాపురము రాజాను శపించినట్లున్న పద్యము:–

**కII అద్దిర శ్రీ భూ నీళలు**
**ముద్దియలా భూమిపతికి ముగురమ్మలలో**
**పెద్దమ్మ నాట్యమాడెను**
**దిద్దిమ్మని వత్సవాయి తిమ్మని యింటన్!**

–వత్సవాయి తిమ్మని యింటిలో ఇనుపగజ్జెలతల్లి (దరిద్రదేవత) నాట్యమాడుగాక!

**48**

**ఆ॥ జలజ–కనక–కటక–నళిన భద్రేభముల్**
**సఖియ కంఠ–కాంతి–జఘన–చరణ–**
**గమనములకు సాటిగానక తన వృత్తి**
**ఎదిరి పూర్వరూప పదమునందె!**

జలజ–కనక–కటక–నళిన భద్రేభములు – క్రమముగా నాయిక కంఠ – కాంతి – జఘన–చరణ–గమనముల సాటిరాలేక తలక్రిందుగా పోరాడికూడ పూర్వపదము (స్థానము)లోనే ఉన్నవి! పై పదములు వెనుకనుండి చదివినను – ముందునుండి చదివినను ఒక్కటే! సౌందర్య పరాకాష్ఠ తెలుపుట!

**49**

చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రిగారి ముత్తాత నరసన్నగారు చెప్పిన పద్యమని వింటిని:–

**చ॥ ఘనకబరీ స్తనాకృతులు కంధరమై ధరమై రమైక్యమై**
**చను; మది కంఠ వక్త్రములు సాదరమౌ దరమౌ రమౌకమౌ**
**దినుసగు; వాక్ స్మితాంగములు తేనెలతో నెలతో లతోక్తితో**
**నెనయగు; నాభి జంఘ గతి హేమకరిన్ మకరిన్ కరి న్నగున్!**

కేశపాశము – కుచములు – ఆకృతి – కంధరములోను, ధరముతోను, రమతోను (అనగా కేశపాశము మేఘముతోను, కుచములు పర్వతములతోను, ఆకృతి లక్ష్మితోడను) పోలియున్నవి. "కంధరము" "ధరము" "రమ" ఒక పదములో ఒక్కొక్క అక్షరముగా విడచుచు మూడుపదములు చెప్పిపోల్చుట!

మది–కంఠ–వక్త్రములు–మది (మనస్సు) – సాదరమౌ = ఆదరమైనది. కంఠము – దరమౌ = శంఖమగును. వక్త్రము – రమౌకమౌ = లక్ష్మీస్థానమగును.

వాక్–స్మిత + అంగములు: వాక్ – తేనెలతో, స్మితము – చంద్రునితో, అంగము – లతోక్తితో (తీగయనుటతో) పోలియున్నవి.

నాభి - జంఘు-గతి: నాభి-హేమకరిన్ = ఉమ్మెత్తపూవును, జంఘులు (పిక్కలు)- మకరిన్ = మొసలిని, గతి = గమనము - కరిన్ = ఏనుగును, నగున్=పరిహసించును.

**50**

ప్రశ్నయును సమాధానమును ఒక్కటే యగునట్లు వ్రాసిన పద్యమిది:-

**కII ఎద్దీశునకశ్వంబగు?**
**గ్రద్దన నేదడవి తిరుగు ఖరకంటకియై?**
**హద్దుగ నేవాడు ఘనుడు?**
**పద్దుగ నుత్తరము లిందె పదయంగానౌ!**

ప్రశ్న : ఎద్దీశునకు (ఎద్ది+ఈశునకు) అశ్వంబగు?
సమా: ఎద్దు ఈశునకు అశ్వమగును.
ప్రశ్న : ఏదడవిలో (ఏది+అడవిలో) ముండ్లతో తిరుగును?
సమా: ఏదు (పంది) అడవిలో ముండ్లతో తిరుగును.
ప్రశ్న : హద్దుగా ఎవ్వడు గొప్పవాడు?
సమా: (హద్దున్-కనేవాడు) (తన) హద్దు నెరిగినవాడు ఘనుడు! గ్రద్దన = శీఘ్రముగా, ఖర = వాడియైన, ఏదు = ఏదుపంది.

**51**

**సీII నక్షత్రవీథికి నాయకుండెవ్వాడు?**
**రంగైన గుడిలోని లింగమెద్ది?**
**వాహనంబుల మీది వన్నెకు మొదలేది?**
**కల్పాంతమున చేటుకానిదెద్ది?**
**సెగజొచ్చి నమ్మికల్ చేసిన సతి యెద్ది?**
**గురున కిల్లాలైన తరుణి యెద్ది?**
**తరుణుల కతుల పాతక కారణంబెద్ది?**
**వసుధ ద్రోణుని గన్న వస్తువెద్ది?**

పై ఎనిమిది ప్రశ్నలకును సమాధానములు ముక్తపదగ్రస్తముగా నుండవలెను:– **శశి–శిల–లక్క–కాశి–సీత–తార–రంకు–కుండ.**

(ఎత్తుగీతి మా అన్నయ్యకు లభింపలేదు)

**52**

**"శిరహీనుడు చూచి నవ్వె చిత్రముగాగన్"** ఇది సమస్య. కంద పద్యము. కప్పను పాము పట్టుకొన్నది. ఈ దృశ్యము చూచి పీత నవ్వినది.

**క॥ కరచరణంబులు గల్గియు**
**కరచరణ విహీనుచేత కరమరుదుగ తా**
**జలచరుడు పట్టుపడెనని**
**శిరహీనుడు చూచి నవ్వె చిత్రముగాగన్!**

కరచరణములున్నవాడు కప్ప! కరచరణములు లేనివాడు – పాము! శిరహీనుడు అనగా ఎండ్రకాయ (పీత).

**53**

**తే॥ తగిన మగవాని కౌగిట తగిలినట్టి**
**అలిచికుర యౌవనంబది యౌవనంబు!**
**తగని మగవాని కౌగిట తగిలినట్టి**
**అలిచికుర యౌవనంబది యౌ,వనంబు!!**

ఇందలి 1, 2 పాదములును 3, 4 పాదములును ఒకే రీతిగా నున్నవి. "తగిన" అని పూర్వార్థ ఆరంభము. "తగని" అని ఉత్తరార్థారంభము! కాఠిన్యము లేదు. విరోధాభాసము. తగిన మగవాని పొందిన దాని యౌవనమే యౌవనము! తగని మగవాని పొందిన దాని యౌవనమే యౌ, వనము! ఆ యౌవనము అరణ్యముతో సమానము. అనగా కంటకప్రాయము – బాధాకరము – అని భావము.

**54**

**ఉ॥ మానిసి కేడు జానల ప్రమాణము దేహము, యాచనార్థమై**
**పూనిన ఆఱు జానలగు, పోయి ధనాఢ్యుని యిల్లు చేరగా**
**జానలు నాలుగౌ, నతని చల్లగ 'దేహి' యటన్న రెండగున్,**
**పైన నతండు 'నాస్తి' యనినన్ వినినంతన శూన్యమయ్యెడిన్!**

మనుష్యుని దేహము 7 జానల పొడవుండును. యాచించుటకు సిద్ధపడగానే 6 జానలగును. ధనవంతుని యిల్లు చేరగానే 4 జానలగును. అతనిని "దేహి!" అని అర్థింపగానే 2 జానలగును. ధనాఢ్యుడు "నాస్తి"యన్నచో ఆర్థించిన వ్యక్తి (అభిమానవంతుడు) శూన్యమై పోవును. ఈ పద్యములో యాచించుటలోని దైన్యము చక్కగా చిత్రింపబడినది.

### 55

అనంతామాత్యుని "భోజరాజీయము" అను కావ్యములో పూర్ణిమనాటి అర్ధరాత్రిని వర్ణించు మధుర సన్నివేశము. ప్రపంచమంతయును పాలకుండవలె వెన్నెలతో నిండియున్నది. నడినెత్తినున్న చంద్రుడు మీగడతరకవలె నున్నాడు.

**చ॥ జలజభవాండ మొప్పె కలశంబు విధంబున, నందులోన ను**
**జ్జ్వలమగు చంద్రికాపటలి సన్నుతికెక్కె పయఃప్రపూర్ణమై,**
**లలిత కలా కలాప సదలంకృత చారు సుధా మరీచి యిం**
**పుల గనియై తనర్చె పటు పొంపిరి గట్టిన మీగడో యనన్!**

బ్రహ్మాండము పాలకుండ! అందు నిండిన వెన్నెలయే పాలు! నడునెత్తినున్న చంద్రుడు పైన దళసరిగా కట్టిన మీగడ తరక! పొంపిరి = సాంద్రముగా (దళసరిగా).

### 56

ఎన్ని బాధలైనను సహింపవచ్చును గాని, విలువలేని వారితో మనలను సరిచేసినప్పుడు, విలువైన వ్యక్తి బాధపడును. బంగారమును వరిగింజతోను గురుగింజతోను తూచెదరు!

**క॥ కరిగిన – నరకిన నొరసిన**
**పొరయదు దుఃఖంబు మేలిపుత్తడి తన్నున్**
**గురుగింజకు, వరిగింజకు**
**సరిగా తులతూతురను విషాదము దక్కన్!**

**57**

మద్దులపల్లి సుబ్రహ్మణ్యశాస్త్రిగారు:-

**మ॥ అకలంకంబగు నారికేళఫల పుణ్యంబేమొ, పైబడ్డ సా**
**ధక సామగ్రిని వీడి, ఆత్మ భగవద్దత్తంబు గావించి, సా**
**ర్థకతా లబ్ధికి ఫక్కునన్ సెలవివారన్ నవ్వుచున్నంతలో,**
**సిక సన్న్యస్తముగా త్రినేత్రత భజించెన్ భక్త సంసేవ్యతన్!**

కొబ్బరికాయ భక్తుల నాశ్రయించింది. బాహ్య ఆవరణమును వీడినది. ఆత్మ (లోపలికాయ)ను భగవదర్పణము చేసికొన్నది. తన జన్మ ధన్యమైనదని సెలవివార నవ్వుచున్నది (తెల్లని తెలుపు). అంతలో సిగను (శిఖను) తొలగించి నివేదనము చేయుదురు. (సన్న్యాసములో సిగను తీసివేయుదురు). అప్పుడది త్రినేత్రత (శివ సాయుజ్యము)ను పొందినది. కొబ్బరికాయకు పై భాగమున మూడు కన్నులుండును. అది శివసామ్యము.

**58**

ఆశీర్వచన పద్యము:-

**చ॥ సలిల విహారు లిద్దరును - సంతత కాననచారు లిద్దరున్ -**
**వెలయగ విప్రులిద్దరును - వీర పరాక్రమశాలు రిద్దరున్**
**పాలతుల డాయువాడొకడు - భూమిని పుట్టెడువాడు నొక్కడున్**
**చెలువుగ మీ కభీష్ట ఫలసిద్ధి ఘటింతు రనంత కాలమున్ !**

దశావతారములలో మత్స్యకూర్మములు - వరాహ నృసింహులు - పరశు రామ, వామనులు - రామ, బలరాములు - శ్రీకృష్ణుడును - కల్కి యొక్కడు: ఈ పదిమందియును మీకు అభీష్టము లిత్తురుగాక!

**59**

క్షేత్రయ్యకవి రఘునాథరాయల దాతృత్వమును కొనియాడు పద్యము:-

**క॥ తము తామె వత్తు రర్థులు**
**క్రమమెఱిగిన దాతకడకు! రమ్మన్నారా**
**కమలంబులున్న కొలనికి**
**భ్రమరంబుల? అచ్యుతేంద్ర రఘునాథనృపా!**

దాత, యాచకులను ఆహ్వానింప నవసరములేదు. పద్మములు, భ్రమరములను పిలువ నవసరము లేదు!

**60**

మైలము భీమన అను మహనీయుడు మరణించెను. అతడు నేర్పులో – తేజస్సులో – ఆకారములో – ఐశ్వర్యములో – గాంభీర్యములో – ఔన్నత్యములో – గొప్పవాడు. అన్నియును అందర నాశ్రయించినవి! కీర్తికి నెవరి నాశ్రయింపవలెనో తెలియలేదట! ప్రపంచమంతటను తిరుగాడుచున్నది. కీర్తి ప్రపంచ వ్యాప్తము. దానికి మైలతు భీమునివంటి మహోన్నతుడు లభింపలేదని భావము.

**ఉ॥ నేరుపు బ్రహ్మఁజేరె – నిజ నిర్మల తేజము సూర్యుఁజేరె – ఆ**
**కారము మారుఁజేరె – అధికంబగు లక్ష్మి యనంతుఁజేరె – గం**
**భీరత వార్ధిఁజేరె – గల పెంపు కులాద్రులఁజేరె – కీర్తి తా**
**నూరట లేక త్రిమ్మరుచునున్నది! మైలమ భీము డీల్గినన్!**

**61**

"బంగారు లేడి" లోకములో ఉండునా? అను విమర్శన లేకుండ రాముడు దానిని వెంబడించినాడు. (విధికి దైవమైనను వశుడు కావలసినదే!) వేమన పరిహాసము:-

**ఆ॥ కనక మృగము భువిని కలదు లే దనకుండ**
**తరుణి విడిచి పోయె దాశరథియు,**
**తెలివిలేనివాడు దేవుడెట్లాయెరా?**
**విశ్వదాభిరామ వినురవేమ!**

**62**

ఈ పద్యములో అక్షరాభ్యాసము చేసి పుస్తకము పట్టిన బాలుని ఊహ! పిల్లవాడు బొంగరమును జాలీనుండి విడిచినాడు. అది ఇసుకపొరపైనున్న భూమిలో స్వైరవిహారముగా తిరుగుచున్నది. అది భూమిపై ఏమియో వ్రాయుచున్నట్లున్నది! స్వభావోక్తి చిత్రణము.

**తే॥ రింగురింగున తిరుగు నా బొంగరంబు**
**ఏమియో వ్రాయుచున్న దీ యిసుకలోన -**
**బడికి పోలేదు, పొత్తంబు పట్టలేదు**
**ఎట్లు వచ్చినదో దీని కింత చదువు!**

– బడికి పోవలె–పుస్తకము పట్టవలె – అప్పుడు వ్రాయు శక్తి వచ్చుట నైజము!

**63**

**తే॥ అతివ కచ - నాభి - జఘన - దేహాననము 'త**
**మీనదరసాలతారాజపా' నిరాక**
**రణ మనంత మనాది నేత్ర - గళ - భుజ - న**
**ఖోష్ఠ - కుచ - వచో - దంతంబు లుభయ గతుల!**

నాయిక యొక్క కచ–నాభి–జఘన–దేహ–ఆననము: వీనికి ఉపమానములు – తమీ–నద–రసా–లతా–రాజ (కేశపాశము చీకటితో – నాభి సుడితో – జఘనము భూమితో – దేహము లతతో – ఆననము చంద్రునితో పోలియున్నవి). ఇది అనంతగతి! అనగా అంత్యాక్షరమైన "పా" విడువబడినది. "తమీనదరసా లతారాజపా" అను అక్షరజాలములో అనాదిగతి–అనగా ఆద్యక్షరము విడచుట. అట్లు చేసిన మీన–దర–సాల–తారా–జపా మిగులును. అప్పుడు నేత్ర–గళ – భుజ–నఖ–ఓష్ఠములు సరిపోలును. "కుచ – వచో – దంతంబు లుభయ గతుల" –ఇది సమన్వయ మగుటలేదు. "తమీనదరసాలతారాజపా – ఇందులో ఉభయ నిరాకరణము అనగా–"ఆది" – "అంత్య" అక్షరములు రెండును తొలగించవలెను – అని తోచుచున్నది. అప్పుడు అన్వయము కుదురుట లేదు. కుచ–వచో – దంతముల కుపమానములు సరిపడుట లేదు. పోనీ! మొదటి రెండు అక్షరములు – చివరి రెండక్షరములును తొలగించినచో "నద–రసాల–తార" మిగులును. 2,3 పదములు వచోదంతములకు సరిపడుచున్నవి "కుచ" అనుదానికి ఉపమానము నా బుద్ధి కందుటలేదు! బుధులు కన్గొందురు గాక!

### 64

63వ పద్యము వంటిదే మరొక్క పద్యము:-

**తే॥ అధర ముఖవర్ణ శూన్యంబు లతివ కుచము**
**లాననాకార రహిత మబ్జాక్షి మేను**
**అజ జఘన మండలము లంచయాన కురులు**
**చరమ బాధిత కరములు చారు తొడలు!**

"అధర" పదములో ఆద్యక్షరములేని-అనగా "ధర"(పర్వతము)వలె కుచములున్నవి. "ఆనన" పదములో "ఆ"కార రహితము అనగా "నన" (పూవు) వలె ఆమె శరీర మున్నదట. "అజ"=జకారము లేని "జఘన మండలము"= అనగా "ఘన (మేఘ) మండలము" వలె ఆమె కురులున్నవి. చరమ బాధిత "కరములు"=అనగా చివరి అక్షరము"లు" లేని "కరము" (ఏనుగు తొండము)తో తొడల పోలిక.

### 65

మంత్రశక్తి వలెనే, కవిత్వమునకు కూడా మహాశక్తి యున్నట్లుగా కవుల చరిత్రలు సాక్ష్యములు! అందరి కంటే తాను దిట్టనని వేములవాడ భీమకవి ఇట్లనుచున్నాడు:-

**సీ॥ గడియ లోపల తాడి కడగి ముత్తునియగా**
**తిట్టిన 'మేధావి భట్టు' కంటె,**
**రెండు గడెల బ్రహ్మదండి ముండ్లన్నియు**
**దుల్ల తిట్టిన 'కవిమల్లు' కంటె,**
**మూడు గడెలకు దా మొనసి అత్తినగండి**
**పగుల దిట్టిన 'కవిభాను' కంటె,**
**అరజాము లోపల చెఱువు నీళ్ళింకంగ**
**దిట్టిన 'బడబాగ్ని భట్టు' కంటె,**

**ఆ॥ ఉగ్రకోపి నేను, ఓపుదు శపియింప**
**క్రమ్మరింప శక్తి కలదు నాకు!**
**వట్టి మ్రాన చిగురు పుట్టింప గిట్టింప**
**బిరుదు వేములాడ భీమకవిని!**

**66**

సమస్య: **"చెలువుగ రామలక్ష్మణులు సీతకు తమ్ములు శంభు దన్నయున్".**

ఈ సమస్యను పూరించుటకు ప్రశ్నలు కల్పించినారు:-

**చ॥ అలరు గణింప పంక్తిరథు నాత్మజు లెవ్వరు? మైథిలుండు నే**
**లలనకు తండ్రి? మన్మథుని లావు శరంబులునెవ్వి? కాళికా**
**చెలువుని నామమెద్ది? మఱి సీరియు శౌరికి నేమి కావలెన్?**
**చెలువుగ రామలక్ష్మణులు - సీతకు - తమ్ములు - శంభు - దన్నయున్!**

పై సమస్యను ఐదుగా విభజించి, ఐదు ప్రశ్నలను చంపకమాలలో కవి నిక్షేపించి పూరించినాడు.

**67**

సమస్య: **"దారము లేని హారము నుదారత నీ కెవరిచ్చి రమ్మరో?"**

**ఉ॥ సారసనేత్ర యొక్కతె నిశాసమయంబున మంచిముత్యముల్**
**కూరిచి తా ధరించి తను కూడెడి నాథు కవుంగిలింప - చే**
**కూరెను ముద్ర, లవ్విగని కోమలు లిట్లని రెల్ల నెచ్చులుల్**
**"దారము లేని హారము నుదారత నీ కెవరిచ్చి రమ్మరో!"**

ఒక సుకుమారి ముత్యముల హారమును ధరించి భర్తను బిగిగా కౌగలించుకొన్నది. మెత్తని శరీరముపై హారముద్రలు ఎఱ్ఱగా కన్పించుచున్నవి. ఆమెను పరిహసించుచు ఆమె స్నేహితురాండ్రు ప్రశ్నించు సన్నివేశము!

**68**

మత్తేభము–చంపకము - కందము - మత్తకోకిల - ఉత్పలము - విద్యున్మాల –అంబురుహము: ఇది కొన్ని తెలుగు పద్యముల పేర్లు. ఈ పద్యముల పేర్లతో స్త్రీ వర్ణనము:-

మ॥ గతి 'మత్తేభము'-నాస'చంపక' - మొగిన్ కైశ్యంబు 'కందంబు'-సం
గత వాక్యంబులు 'మత్తకోకిల'లు! - దృగ్వ్యాపారమ 'యుత్పల'
ద్యుతి - మో'మంబురుహంబు' - దేహరుచి 'విద్యున్మాల' ఈ మానినీ
తత వృత్తస్థితులెన్నగాదరమె తద్వాగ్జానికైనన్ ధరన్?
వృత్త స్థితులు - అనగా ప్రవర్తనము - ఛందోవృత్తస్థితులు.

**69**

ఒక కవి, రాసులతో స్త్రీని వర్ణించినాడు (చూ. 38వ పద్యము). ఇక్కడ మరొక కవి నక్షత్రములతో స్త్రీని వర్ణించుచున్నాడు. (ఒడయనంబీ విలాసము: 1-106).

సీ॥ భరణీ విలాసమై పాలిండ్లు చెలువారె,
కడు పునర్వసు రూఢిగాంచె మేను!
కన దపూర్వాషాఢ ఘనత గాంచె కచంబు,
చిత్త సత్కళలచే చెలగె మోము!
ధరణి జ్యేష్ఠాకృతి దాల్చెను కటిసీమ,
శ్రవణ సంగతిని నేత్రములు ప్రబలె!
అమృతార్ద్ర విఖ్యాతి అలరెను కెమ్మోవి,
భాషితాశ్లేషయై భాష మెరసె!

తే॥ . . . . . . . . . . . . . . . . . . . .
. . . . . . . . . . . . . . . . . . . .
అనుచు సిద్ధాన్తవేత్తలు వినుతి చేయ
చెలగె శుభనామ పరమనారీలలామ!
(ఎత్తుగీతిలో 1,2 పాదాలు లభించలేదు)

**70**

సమస్య: "కాంతామణి కంటిమీద కాకర మొలిచెన్!" (ఒకడు గోడపై కాంతామణిని చిత్రింపగా ఆ చిత్రము కన్ను పై కాకర మొలిచెను)

క॥ 'చింతామణి' యను బాపడు
పంతంబున గోడమీద పటమును వ్రాసెన్
అంతట వర్షము గురిసెను
కాంతామణి కంటిమీద కాకర మొలిచెన్!

**71**

41వ పద్యములో "భంబుగదే" ఎనిమిదిచోట్ల వచ్చినది. ఈ పద్యములో "లింగని" అను పదము అట్లే ఎనిమిది చోట్ల వచ్చినది. తెనాలి రామకృష్ణునిపై ఎవరో సమర్థకవి వ్రాసిన పద్యమిది.

**ఉ॥ లింగనిషిద్ధ కల్వల చెలింగని, మేచక కంధరున్ త్రిశూ**
**లింగని, సంగతాళి లవలింగని, కర్దమ దూషితన్ మృణా**
**లింగని, కృష్ణచేలుని హలింగని, నీలకచన్ విధాతృనా**
**లింగని, రామలింగకవిలింగని కీర్తి హసించు దిక్కులన్!**

"రామలింగ కవిలింగని కీర్తికి ఏ కొంచెమును మాలిన్యము లేదు" అని చెప్పుచు కవి ఉపమానములనెట్లు త్రోసి రాజనుచున్నాడో పరికింపుడు! చంద్రునిలో మచ్చ - శివుని కంఠమున నలుపు - లవలీ పుష్పము తెలుపైనను దానిపై తుమ్మెదలు - తెల్లకలువకు బురద - బలరామునకు నీలాంబరము - సరస్వతికి నల్లని కబరి - వీనిని చూచి (మచ్చలేని తన గొప్పతనమును తలచుకొని) రామలింగని కీర్తి నవ్వుచున్నది!

**72**

**ఉ॥ తేజము - సాధువృత్తమును - తేకువ గల్గిన వీరుడెప్పుడున్**
**ఆజికి నిట్లనున్, పరుని యాలికి నిట్లను, అర్థికిట్లనున్,**
**తేజము - సాధువృత్తమును - తేకువ లేని బికారి యెప్పుడున్**
**ఆజికి నిట్లనున్, పరునియాలికి నిట్లను, అర్థికిట్లనున్**

పరాక్రమము - సత్ప్రవర్తనము - ధైర్యము ఉన్నవాడు: యుద్ధమునకు (మీసము దువ్వును); పరభార్యకు (నమస్కరించును); యాచకునకు ఆదరముతో రమ్మని సైగ చేయును. పరాక్రమము - సత్ప్రవర్తనము - ధైర్యము లేనివాడు యుద్ధమునకు (చేతులు జోడించుచు నమస్కరించును); పరునియాలికి (రమ్మని చేతులతో సైగచేయును); యాచకునికి (పొమ్మని చేతితో సైగ చేయును). ఈ పద్యములో ఆరు "ఇట్లను"లున్నవి. వీనిని సైగలుగా గ్రహింపవలయును.

పై పద్యాన్ని కొంచెం మార్చి ఒక కవి రాయని భాస్కరుని పరంగా చెప్పాడు:-

**ఉ॥ రాజిత కీర్తిశాలియగు రాయనిభాస్కరు వేఁడఁబోవఁగా-**

**నాజికి నిట్లనున్, బరుని యాలికి నిట్లను, నర్థికిట్లనున్;**
**దేజము పెంపులేని యతిదీనుని హీనుని వేఁడఁబోవఁగా-**
**నాజికి నిట్లనున్, బరుని యాలికి నిట్లను, నర్థికిట్లనున్!**

(-చాటుపద్యమణిమంజరి, ద్వితీయభాగము, పుట-264)

**73**

అష్టదిగ్గజములలో ఒకరి పద్యము (పారిజాతాపహరణములోనిదని జ్ఞాపకము):-

**చ॥ పెనిమిటి చేయు పుణ్యజన పీడనవృత్తియు, తండ్రి భంగమున్**
**తనయు ననంగ భావమును - తమ్ముని కార్శ్యము చూచి రోసి, స**
**జ్జన పరిరక్షు, శౌర్యనిధి, చారుశరీరు, కళాప్రపూర్ణు న**
**వ్వననిధికన్య చేరె జితవైరినికాయుని కృష్ణరాయనిన్!**

లక్ష్మి - తన భర్త పుణ్యజన (రాక్షస) పీడనము - తండ్రి సముద్రుని భంగపాటు - తనయునకు శరీరము లేకుండుట - తమ్ముడు (చంద్రుడు) కృశించుట-చూచినది. ఈ లోపములు లేని శ్రీకృష్ణరాయల నాశ్రయించినది.

**74**

దేవలూరి కేశవరెడ్డి ఒక కవిని "కపీశ్వరా!" యని సంబోధించెనట! అప్పుడా కవి ఆశువుగా జుగుప్సాకరముగా చెప్పిన పద్యము:-

**క॥ 'పీ' పట్టినట్టి నోటను**
**'వీ' పట్ట దదేమి నీకు? 'వీ' 'పీ' లందున్**
**'పీ' పయి రుచి పుట్టెనొ నీ**
**కీ పట్టున దేవలూరి కేశవరెడ్డీ!**

"పీ" పట్టినట్టి నోటను = అశుద్ధము తిను నోరు ("పీ" అక్షరముచ్చరింపగల నోరు) "వీ" "పీ" లందు నీకు "పీ" పయి = అశుద్ధముపై రుచిపుట్టెనా? రెడ్డీ! (పీపయి = "పీ" యను అక్షరముపై).

**75**

ఆరవ అక్షరము "త" ఇచ్ఛాపూర్వకముగా పెట్టి వ్రాసినచో మరణము అనుటకుదాహరణము (పుర-అస్త్ర- రస-గిరి-రుద్రేషు-అకచటతపా మాతృకా నింద్యాః):-

**చ॥ హయమది సీత, పోతవసుధాధిపుడారయ రావణుండు, ని**
**శ్చయముగ నేను రాఘవుడ, సహ్యజ వారిధి, మారు దంజనా**
**ప్రియతనయుండు, లచ్చన విభీషణు, దా గుడిమెట్ట లంక, నా**
**జయమును, పోతరక్కసుని చావును, ఏడవనాడు చూడుడీ!**

వేములవాడ భీమకవియొక్క గుఱ్ఱమును పోతరాజు బంధించినాడు. కవి "మారుడు" అనువానిని దూతగా పంపినాడు. లచ్చన అనువాడు కవి తురగమును విడువుమన్నాడు. ఒక నదియొక్క దీవిలో గుఱ్ఱమును పోతరాజు బంధించినాడు. గుఱ్ఱమును సీతగా – తనను రాఘువునిగా – మారుని హనుమగా – పోతరాజును రావణునిగా – లచ్చనను విభీషణునిగా పోల్చుచు శాపముగా చెప్పిన పద్యము ఇది. లేటవరపు పోతరాజునింటికి కవి వెళ్ళగా లేదని చెప్పించినాడు. అప్పుడు "కాటికి కట్టెలు" అను పద్యము చెప్పెనట. చివరకు జాలిపడి "నాటి రఘురాము తమ్ముడు" అను పద్యములో ఆశీర్వదించెను.

**క॥ కాటికి కట్టెలు చేరెను,**
**ఏటావల నక్కగుంపు లేదుపసాగెన్!**
**కూటికి కాకులు చేరెను,**
**లేటవరపు పోతరాజు లేడా? లేడా?**

అను పద్యము చదువగా పోతరాజు మరణించెను. అప్పుడు జాలిపడి –

**క॥ నాటి రఘురాము తమ్ముడు**
**పాటిగ సంజీవిచేత బ్రతికిన భంగిన్**
**కాటికిపో నీ కేటికి?**
**లేటవరపు పోతరాజ లెమ్మా! లెమ్మా!!**

**76**

నవ్వును గూర్చి జాషువా చెప్పిన పద్యము:–

**ఉ॥ నవ్వవు జంతువుల్, నరుడు నవ్వును, నవ్వులు చిత్తవృత్తికిన్**
**దివ్వెలు, కొన్ని నవ్వులెటుతేలవు, కొన్ని విషప్రయుక్తముల్,**
**పువ్వులువోలె ప్రేమరసమున్ వెలిగ్రక్కు విశుద్ధమైనవే**
**నవ్వులు, సర్వ దుఃఖ శమనంబులు, వ్యాధులకున్ మహౌషధుల్!**

**77**

"ప్రపంచములో ఎక్కడ నివసించవలయునో తెలియుట లేదు" అనుచు జాషువా, మోసప్రపంచమును నిరసించుచు చెప్పిన పద్యము:-

**మ॥ పయిపై నవ్వులు పల్కరింపులు మృషా బాంధవ్యముల్ జూపి, ఆ**
**పయి శత్రుత్వముసేయు నాగరకతాభ్రష్ట స్వభావాధముల్**
**సయితానుల్ చరియింపనట్టి ధర గోష్పాదంబు కన్పట్టినన్**
**దయతో నా కెఱిగింపుమమ్మ! అచటన్ నా యిల్లు కట్టించెదన్.**

**78**

కట్నము అను దురాచారము పోవు దినములు రావా? అని బాధపడుచు జాషువా:-

**శా॥ పప్పన్నాలని, లాంఛనంబులనియున్, బంధుల్ కులస్వాములున్,**
**తిప్పల్ వెట్టి, ఋణాలు పైపులిమి, ఆస్తింబాస్తు లమ్మించుచున్,**
**చిప్పల్ చేతికొసంగి పోయెదరు పేచీలెన్నియో పెట్టి, యీ**
**ముప్పుంగూర్చెడు పెండ్లిపేరటపు డాబుల్ పోవు టేనాటికో!**

**79**

ఎంత నాగరకత పెరిగినను ఐకమత్యభావము పెరుగలేదని బాధపడుచు జాషువా చెప్పినది:-

**మ॥ అరయన్ రోదసిలో మనుష్యుడు సునాయాసంబుగా జొచ్చి, దు**
**స్తర వేధోండరహస్యముల్ తెలియు ప్రజ్ఞాశాలియయ్యెన్, పర**
**స్పర విద్వేష విషాద చండ శిఖి నార్పంజాల, డింకెన్నడీ**
**ధరణీ సుందరి మోము శాంతిదళ పద్మంబై వికాసించునో!**

**80**

జాషువా అమృతాంజనముపై వ్రాసిన పద్యము. ప్రథమ బహుమతిగా 116 రూపాయలు ఆ కాలములో పొందినది:-

**ఉ॥ వాలి ఖగేశ్వరుం డమృతభాండము భూమికిఁ దెచ్చువేళ జే**
**జేల రణంబులో తొణికి చిందిన బిందువు లేవిధాన సీ**
**సాలకు బట్టిరో తెలియజాలము! నేడమృతాంజనాఖ్యతో**
**చాల గడించె పేరు! గుణసంపద నొప్పుల త్రోసిరాజనన్!**

## 81

జాషువా సాత్వికాహంకారముతో హుంకరించిన పద్యము:-

**ఉ॥ గవ్వకు సాటిరాని పలుగాకుల మూక అసూయచేత తా**
**మెవ్విధి దూరినన్ నను వరించిన శారద లేచిపోవునే?**
**ఇవ్వసుధాస్థలిన్ పొదమరే రసలుబ్ధులు? గంటమూనెదన్**
**రవ్వలు రాల్చెదన్ గరగరల్ పచరించెద నాంధ్రవాణికిన్!**

## 82

తమకు సత్కవిత్వము పట్టుబడకపోయినను, కవిత్వమనరాని పద్యములు వ్రాయుచు, పైగా తమ కవిత్వమును పుస్తకములుగా వెలువరించుటను సమర్థించుచు చెళ్ళపిళ్ళవారు చెప్పిన పద్యము:-

**చ॥ పలువురు సత్కవిత్వమది పాల్పడకున్నను కొన్ని పుస్తక**
**మ్ములు రచియించి, సిగ్గిలక, మోదము నందుట తప్పుకాదు! పు**
**త్రులు తమ కుద్భవించిన కురూపులు కాగలరంచు భార్యతో**
**కలియుట మానునే? సుతులఁ గాంచక పోవునె రూపహీనుడున్?**

## 83

**మహాత్మాగాంధీ నిర్యాణము- వివిధ కవుల స్పందనలు:-**

గాంధీగారు అస్తమించినప్పుడు కవికోకిలలు నినదించిన పంచమ స్వరాలు కొన్ని నేను కంఠస్థము చేసినాను! "అహింసాజ్యోతి" పేరుతో సంకలనము చేసినారు. అందుండి కొన్ని పద్యములు:-

జంధ్యాల పాపయ్యశాస్త్రి:

**తే॥ అతడొక పవిత్ర ధర్మ దేవాలయమ్ము!**
**అతడొక విచిత్ర విశ్వవిద్యాలయమ్ము!**
**ఆ మహాశక్తి అంతయింతంచు తూచ**
**జాల, మతడొక పెద్ద హిమాలయమ్ము!!**

84

శా॥ ఏమయ్యా! మిహికాచలేశ్వరుడ! నీ వెన్నాళ్ళనోయుండి యీ
సీమాంతమ్మున చూచి నిల్తువుగదా శీర్షమ్ము పైకెత్తి! క్షో
ణీ మధ్యమ్మున నెన్నడేని యెపుడేనిన్ బాపుజీవంటి ని
ష్కామప్రేమతపస్వి పుట్టెనె అహింసా దివ్యతేజస్వియై?

85

శా॥ లాఠీ పోటులు పూలచెండ్లు! చెఱసాలల్ పెండ్లివారిండ్లు! ఏ
కాఠిన్యంబయినన్ సుఖానుభవమే గాంధీకళాశాలలో
పాఠంబుల్ పఠియించు శిష్యులకు, తద్బ్రహ్మాస్త్ర సంధానమే
పీఠంబుల్ కదలించి సీమలకు పంపెన్ శ్వేతసమ్రాట్టులన్!

86

అమ్మాజీ: –

తే॥ శాంతి బోధించు క్రీస్తును చంపినారు
నడి బజారున శిలువపైనను బిగించి!
విషముచే సోక్రటీసు చంపించినారు
నీతి లేదేమొ మానవజాతి కసలు!

87

జాషువా: –

చ॥ వడికిన నూలుపోగున ప్రపంచపుటేన్గును గట్టి యాజ్ఞలో
నడపు మహానుభావు, దశనంబును మాని విరోధిగుండెలో
పిడుగులు గుప్పువా, డమృత బిందువులన్ తన బోసినోట చి
మ్మెడు ప్రతిలేని వక్త, ప్రణమిల్లుము గాంధి పదాల దాపునన్!

**88**

మరొక్కటి:–

చ॥ అది తలపోయరాని హృదయ ప్రవిదారి విషాద వార్త కా
స్పదమయి పంచఖండములు బావురుమన్న పిశాచివేళ! ము
ప్పదియగు కోట్ల భారత తపస్సముదాయము భస్మరాశియై
చిదికిన ఘోర దుర్దిన మిసీ! వచియింపగ జిహ్వలాడునే?

**89**

వారణాశి వెంకటేశ్వర్లు:–

ఉ॥ భారత యుద్ధమున్ విజయవంతము చేసి, కిరీటికిన్ మహో
దార యశంబొసంగి, యవతారము వీడిన కృష్ణమూర్తికై,
ఆరని ప్రేమమగ్నుడగు అర్జునువోలె కృశించుచుండె మా
భారతవీర జహ్వరుడు భారతభాగ్యవిధాతకోసమై!

**90**

మద్దులపల్లి వెంకట సుబ్రహ్మణ్యశాస్త్రి:–

మ॥ అరరే! యెంతటి మూర్ఖలోకమొ కదా! అస్పృశ్యులంజేర్చి – సం
కరముంగూర్చి – పవిత్రమౌ గుడుల మాంగల్యంబు కల్పింప త
ద్దురితారిష్టము కొట్టి చచ్చెను మహాత్ముండందు రయ్యయ్యో! ఎ
వ్వరి నోర్మూయుదు? మెంత పాపపు కలి ప్రాబల్యమో చూడుదా!

**91**

ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రి:–

క॥ మన సారథి, మన సచివుడు,
మన నెయ్యము, మన సఖుండు, మన బాంధవుడున్,
మన గురుడు, మనల దేవర,
మనలను విడనాడి చనియె మనుజాధీశా!

మ॥ అను పద్యమ్ములు గుండెలో కదలి, దుఃఖావేగ బాష్పోష్ణ వాః
కణముల్ చెక్కుల చారచారలయి రాగా, కృష్ణనిర్యాణపున్
ఘననిర్వేదకథావిధమ్ము కనులంగట్టన్, కిరాతాస్త్రమే
మన బాపూజిని కూడ మ్రింగెనట! ఏమా దైవసంకల్పముల్!

**92**

బోయి భీమన్న: –

తే॥ వేకువగుదాక పోరాడి విజయమంది
మేలుకొల్పులు పాడి వైతాలికుండు
సుప్రభాతంబు పూర్తిగా చూడకుండ
కదలి తానును చీకట్లఁ గలసిపోయె!

**93**

సన్నిధిరాజు సుబ్రహ్మణ్యం: –

మ॥ ప్రతి యైదేండ్లకు వచ్చు ఎన్నికల పర్వంబందు, నీ వీరభా
రత సోదర్యులు, వోట్ల బేరమును సారాబుడ్లతో నోట్లతో
దుత సాగించి, నిషాఖుషీల కదునాటోపమ్ము చూపించుటల్,
ఋతశీలీ! కనుగొంచు ఖేదపడుచుంటే నీవు స్వర్వీథిలో!

**94**

రసరాజు: –

చ॥ సమత ప్రధానసూత్రమని చాటి, ప్రజాళిని శాంతినింపి, ఖ
డ్గములకు అగ్గిగుండ్లకు విడాకులొసంగి, పరాయివారి స్వా
ర్థము పెకలించి, దేశము మరమ్మతు చేసి, స్వయంప్రకాశ దీ
పము వెలిగించినావు కద బాపు! ఋణమ్మెటు తీర్చుకొందుమో!

**95**

పుట్టపర్తి నారాయణాచార్యులు –“గాంధి చచ్చిన నేలపై అందరును చచ్చిరి”! అనుచు –

తే॥ అతడు చచ్చిన యీ వ్యర్థ కుతలముందు
ఇంక బ్రతికిన దెవ్వరో యేడ్చుకొఱకు?

**96**

పువ్వాడ శేషగిరిరావు:–

తే॥ భారతీయ స్వరాజ్య సంపాదనమున
ముప్పు తెలియక స్వోన్మూలమునకె పెనగు
కదలికా భూరుహమవైతి గాంధి నేడు!
ఎంత బలిగోరె స్వాతంత్ర్యకాంత దేవ!

**97**

కొండారెడ్డి:–

తే॥ గాంధి దేవుని మరణ సంఘటన మనెడి
బాంబు వ్రేటున చుక్కాని బ్రద్దలయ్యె!
నట్టనడియేట భారతనౌకకిపుడు
దారి చూపించు దిక్సూచి జారిపోయె!

**98**

పళ్ళె పూర్ణప్రజ్ఞాచార్యులు:–

తే॥ కాలుచుం దాను చందన కాష్ఠములను
గుండెలో దాగిన తుపాకి గుండు గాచె,
భద్రమగుచోట నుంచె మై బాయునపుడు,
ఆశ్రితులఁ బాయలేరు మహాత్ము లెపుడు!

**99**

వావిలాల నరసింహారావు:–

ఆ॥ కనుల నీరు తొణకు కలవరపాటుతో,
సగము వంచు బిక్కమొగము తోడ –
బరువు గుండెతోడ బావురుమననట్టి
భారతీయుడేడి బాపు మృతికి?

**100**

వేమూరి వెంకటరామనాథం:–

**తే॥ గాంధిదేవుని నిర్యాణగాథ పిదప**
**మానవుడు సల్పలేని దుర్మార్గమేది?**
**పశుతక్రమ్మిన యెదదలోపలి పిశాచ**
**నటన కాబోలు మనుజుని నడత నేడు!**

**101**

జంధ్యాల పాపయ్యశాస్త్రి:–

**ఉ॥ క్రొత్త వెలుంగు బాట నెటకో గొనివచ్చి, స్వతంత్ర భారతో**
**దాత్త నిదర్శనంబగు ప్రదర్శనమంచు, మహా భయంకరో**
**న్మత్త పిశాచినీ వికట నాట్యము చూపితివేమి? యీ కథా**
**వృత్తము చూడలేము, తెరవేయుము! దీపములార్పుమో ప్రభూ!**

**102**

**ఇతర కవుల పద్యములు:–**

జన్నయమంత్రి దేవకీనందన శతకము వ్రాయుచు ఒకే కూర వంటనుబట్టి రుచి మారును అనుచున్నాడు:–

**శా॥ కొండల్వంటి కవీశ్వరుల్ శతకముల్ కూర్పంగ కోటానకో**
**ట్లుండన్, నీవును చెప్పబూనితి వదేమో యంటివా? వింటివా?**
**వండే నేర్పుల పెక్కు రీతుల రుచుల్ వర్తింపవే శాకముల్?**
**దండి న్నామన వాలకింపుమిదె కృష్ణా! దేవకీనందనా!**

**103**

**"నిను నిను నిన్ను నిన్ను మరి నిన్నును నిన్నును నన్ను నిన్ననున్"** – ఈ సమస్యను రామాయణార్థములో ఎంత అందముగా పూరించిరో అనాటి అవధానులు!

**చ॥ అనిలజ! జాంబవంత! కమలాప్తతనూభవ! వాయుపుత్ర! ఓ**
**పనస! సుషేణ! నీల! నల! భానుకులుండగు రాఘవేంద్రు డ**
**ద్దనుజ పురంబు వే గెలువ దైత్యులఁజంపగ వేగ రమ్మనెన్**
**నిను నిను నిన్ను నిన్ను! మరి నిన్నును నిన్నును నన్ను నిన్నునున్!**

## 104

తిరుపతి వేంకటకవులు కొప్పరపుకవులతో ఆశుధారాకవిత్వపు పోటీకి అవ్వారి సుబ్రహ్మణ్యశాస్త్రిగారిని వేమవరాగ్రహారమునకు పంపించిరి. వీరి వేగమునకు కొప్పరపు కవులు తగ్గిరి. అప్పుడు వేంకటశాస్త్రిగారు శిష్యుని మెచ్చుకొనుచు:–

**శా॥ అన్నం బెక్కడనో భుజించితివి, విద్యన్నాకన్నేర్చి, తెం**
**దున్నీయందు లవంబు గాననుజుమీ దోషంబు! దుశ్శాత్రవుల్**
**నన్నున్ మార్కొన, వారి యాశువుల చందంబెల్ల అవ్వారి సు**
**బ్బన్నా! గెల్చి ఋణంబు తీర్చితివిసుమ్మా! శిష్యచూడామణీ!**

## 105

"సుగ్రీవుని యెదమకాలు శునకము కొఱికెన్" – ఈ సమస్య తోలుబొమ్మలాట పరముగా పూరించిన కవిప్రజ్ఞ ప్రశంసనీయము! ప్రాసకూడ దుష్కరమనదగును.

**క॥ అగ్రారపు నడివీథిని**
**నిగ్రహమున బొమ్మలాట నేర్పున నాడన్,**
**విగ్రహము లెత్తమరచిన,**
**సుగ్రీవుని యెదమకాలు శునకము కొఱికెన్!**

తోలుబొమ్మలాట పూర్తియైన పిమ్మట ఆయా బొమ్మలు పెట్టెలలో పెట్టుట మరచినాడు. తోలు కదా! శునకము కొఱికినది!

## 106

కష్టములన్నియును కవి, గుదికూర్చి చెప్పిన పద్యము! ఈ "కృష్ణ భూపరు"డెవ్వడో తెలియదు.

**చ॥ గురువుల రాక, దాసి మృతి, గుల్లపు దాడియు, నల్లు నల్కయున్,**
**పొరుగున నప్పుబాధ, చెవిపోటును, వీథిని దొమ్మరాటయున్,**
**వరసతి గర్భవేదన, వివాహము, విత్తులుచల్లు కార్తెయున్,**
**కఱవు, దరిద్ర, మాబ్దికము కల్గె నొకప్పుడు కృష్ణభూవరా!**

## 107

కవులు కానివారు కవివేషధారులై గర్వముగా తిరుగుట సహింపలేక ఉమ్మెత్త పూవుపై పెట్టి కుకవిని నిందించుట – ఇట్టి కుకవులను కూడ తలపై పెట్టుకొను పెద్దలుందురు.

**ఉ॥ వారక యీశ్వరుండు తలపై ధరియించిన యంతమాత్రనన్**
**వారిజవైరితోడ సరివత్తువె యుమ్మెతపూవ? నీ పసన్**
**వారిధులుబ్బునో? దెసలు వన్నెలు దేరునొ? చంద్రకాంతముల్**
**నీరగునో? చకోరముల నెవ్వగ తీరునొ? తాపమారునో?**

## 108

చిలకమర్తి లక్ష్మీనరసింహముగారు చెప్పిన పద్యమిది! పెద్దక్షరాలతో కృష్ణా బ్యారేజి మీద దేశభక్తులు వ్రాసిన పద్యమిది! బహుళ ప్రసిద్ధము!

**తే॥ భరతఖండంబు చక్కని పాడియావు,**
**హిందువులు లేగదూడలై యేడ్చుచుండ –**
**తెల్లవారను గడుసరి గొల్లవారు**
**పిదుకుచున్నారు మూతులు బిగియగట్టి!**

ఆంధ్రభాష నేర్చిన ఆంగ్లేయులు "ఇది ఆంగ్లేయుల నింద కాదా?" అని ప్రశ్నింప, "తెల్లవారను" = "తెల్లవారగా", – అని గడుసుగా సమాధానమిచ్చినాడట చిలకమర్తి!! (ఇటీవలి పరిశోధన వలన, ఈ పద్యము వ్రాసినకవి "చన్నాప్రగడ భానుమూర్తిగారు" అనియు, చిలకమర్తివారు కారనియు తెలియవచ్చినది – తంగిరాల)

## 109

ముద్రణములేని కాలములో తాళప్రత గ్రంథములకు ప్రతులు వ్రాయుట పరిపాటి. ఒకడు చాల కష్టపడి ఆంధ్ర మహాభారతమునకు ప్రతిని ఆరుమాసములలో పూర్తి చేసినాడట! చివరలో పాఠకులకు అప్పగింతలు పెట్టుచున్నాడు:–

**క॥ వ్రాలా తప్పులు సెబ్రలు**
**చాలంగల, వేను శబ్దసంగతు లెఱుగన్,**
**గేలింబెట్టక తిట్టక,**

**పోలంగా దిద్దరయ్య బుధజనులారా!**

వ్రాయుటలో చాల తప్పులు దొర్లినవి. నాకు వ్యాకరణ జ్ఞానము లేదు. పరిహసింపక – తిట్టక – తప్పులు దిద్ద గోరుచున్నాను.

**ఆ॥ వ్రాతతప్పువలన వాచకు లలుగక**
**తప్పు గల్గెనేని తగిన యెడల**
**వలయు నక్షరములు వర్ణించి నిలుపుడీ!**
**సుకవులైనవారు సురుచిరముగ.**

వ్రాతలో దొర్లిన తప్పులను చూచి చదువుకొనువారు కోపింపవద్దు. నేను మరచిన ఒత్తులను అక్షరములను కావలసినచోట నిలుపుడు. వ్యాకరణము – ఛందస్సు తెలిసిన సుకవులారా! నా తప్పులు సవరించుకొనుడు. (తాళపత్ర గ్రంథములకు ప్రతి వ్రాయుట మహాపుణ్యమని ఆనాటి ప్రజల విశ్వాసము!)



**ఐదు భాషలలో ఒకే వాక్యం :** ఒకడు తన బావమఱదితో "ఆవు ఈనింది!" అన్నాడట. బావమఱది వెంటనే **"ఏ ఆవ్‌రా బావా?"** అని అడిగాడట. జాగ్రత్తగా గమనిస్తే ఈ ప్రశ్నలో ఐదు భాషలున్నాయి.

**(1) "ఏ" (మరాఠీ) = రమ్ము!**

**(2) "ఆవ్ < ఆవో" (హిందీ) = రమ్ము!**

**(3) "రా" (తెలుగు) = రమ్ము!**

**(4) "బా" (కన్నడం) = రమ్ము!**

**(5) "వా" (తమిళం) = రమ్ము!**

# 1.2 శృంగారపద్యములు

**1**

అన్యాపదేశముగా చెప్పిన పద్యమిది. పరస్త్రీ దగ్గర విటుడున్నాడు. ఈ లోపుగా భర్త వచ్చినాడు. అప్పుడు చెలికత్తె విటుని దాగియుండుమని భ్రమరముపై పెట్టి చెప్పుచున్నది. భృంగమా! నీవు పద్మాసక్తితో ఒళ్ళుమరచి యున్నావు. చంద్రుడుదయించి నాడు. (ఇది శ్రీనాథుని "భృంగపంచకము"లోని ఒక పద్యము. మొత్తం ఐదు పద్యములకు చూ. అనుబంధము–5) పద్మము ముకుళించుచున్నది. నీవు కదలకుండా అందే యుండుము.

**ఉ॥ మాయురె భృంగమా! వికచమల్లికలన్ విడనాడి తమ్మిలో**
**నీయెడఁ బూవుతేనియల నింపు జనింపఁగఁ గ్రోలి సొక్కియున్**
**బోయెదనన్న భ్రాంతి నినుబొందదు – రాజుదయించె – నిప్పుడీ**
**తోయజపత్రముల్ వరుసతో ముకుళించె – చలింపకుండుమా!**

**2**

చెలికత్తెను నాయకుని దగ్గరకు నాయిక పంపినది. చెలికత్తె నాయకునితో కలిసినది. చెలికత్తె నాయకునిపై ఫిర్యాదు చేయుచున్నది. చెలికత్తెకును, నాయికకును జరిగిన సంభాషణము:–

**ఉ॥ అక్కరొ! నీదు వల్లభు దహంకృతి చేసిన చేష్టవింటివా?–**
**ఎక్కడ ఎక్కడే? మరియు నెవ్వరి? నెవ్వరి? – నన్నె నన్నె!! – నీ**
**వక్కడికేల పోవలయు? – అంపవ? – అంపితి, కూడుమంటినా?–**
**మ్రొక్కితి, వేడుకొంటి, నను ముట్టకుమంటి, నికేమి చేయుదున్!**

**3**

ఒక ముగ్ధ తన మొదటి రాత్రి అనుభవమును చెలికత్తెతో చెప్పుచున్నది:–

**శా॥ బాలా! రేయి విభుండు నాకు రతిసంపర్కంబెఱింగింప రా**
**ఆలాగౌట నెఱుంగనమ్మ! అదయుం డచ్చీర కొంగూడ్చినన్**
**ఆలో చంచల మంది దివ్వెకు చెఱంగడ్డంబు గావింప – హా**
**రాలే దివ్వెలుగాగ నేనతని నేత్రద్వంద్వమున్ మూసితిన్.**

**4**

తనయుని, భర్త ముద్దాడుచుండగా – జారస్త్రీ, తనయునకు కారణము తానని భ్రమించు భర్తను చూచి నిరసనగా నవ్వుచున్నది!

**కః అనిబారిన విధి నవ్వును,**
**ధనసంపద నవ్వు నుచిత దానవిహీనున్,**
**తనయుని ముద్దాడంగా**
**పెనిమిటిగని జారనవ్వు! పిచ్చెయ రేచా!**

**5**

సారంగధర చరిత్రములో సారంగధరుడు చిత్రాంగి మేడలోనికి వెళ్ళినాడు. చిత్రాంగి ఆనందముతో అతనిని కామోద్రిక్తుని చేయుటకు పడకటింటి శృంగార చిత్రములు చూపుచున్నది. అందు మేనకావిశ్వామిత్రుల చిత్రపటము చూపుచు (చేమకూర వేంకటకవి).

**ఉః 'అల్లన గాధిరాజసుతు దర్మిలి మేనక ముద్దొనర్ప రా**
**గిల్లి కుచంబులాన తమకించుట కంటివె? రాకుమార!' 'ఔ**
**నల్ల నగాధిరాజసుతు దర్మిలి మేనక ముద్దొనర్ప రా**
**గిల్లి కుచంబులాన తమకించుట బాల్యముగాదె మానినీ!'**

పద్యపూర్వార్ధము చిత్రాంగి అన్నది. ఉత్తరార్ధము సారంగధరునిది! "విశ్వామిత్రుడు మేనకాకుచ గ్రహణముచేయు ఈ సన్నివేశము కంటివా?" – "గాధిరాజ సుతుడు" అనుదానిని సద్భావముతో ఉన్న సారంగుడు "నగాధిరాజ సుతుడు" గా పదచ్ఛేదము చేసినాడు. అనగా మైనాకుడు! "మేనకాదేవి పుత్రుని ముద్దుపెట్టుకొన బోవుచుండగా ఆకలిగొన్న బాలుడు పాలు ద్రావ, కుచగ్రహణము చేయుట బాల్యచేష్టకదా!" కామోద్రేకమును, బాల్యచేష్టగా మార్చుట–కాముక చిత్రమును – తల్లీ బిడ్డల అనుబంధముగా మార్పించిన చేమకూరకవి అభినందనీయుడు!

**6**

**సమస్య: "మానవతీలలామ కభిమానమె చాలును చీరయేటికిన్?"**

తిరుపతి వేంకట కవులు పూరించినట్లుగా (గోపికా వస్త్రాపహరణము):–

ఉ॥ ఓ నవనీతచోర! కృపయుంచి పటమ్ముల నిచ్చి వేగ మా
మానము కావుమన్న ప్రజమానిని పల్కులకెంతొ వింత న
వ్వాననసీమఁ దోప ధవళాక్షుడు తానిటు పల్కు - మానినీ!
మానవతీలలామ కభిమానమె చాలును చీరయేటికిన్?

**7**

"సంధ్యావందనమాచరింపవలదా చౌశీతి బంధంబులన్!"

తిరుపతి వేంకట కవులు పూరించినట్లున్న మరొక సమస్య:-

శా॥ వింధ్యాద్రిప్రభనొప్పు బల్కుచములన్ వేపట్టి పెంపొందు కా
మాంధ్యం బార్పగలేక - వెఱ్ఱివలె ఏలా మంచి యీ రాతిరిన్
వంధ్యం జేసెదు, కాముకేలియనగా పాండిత్యమా? లేక యీ
సంధ్యావందనమా? చరింపవలదా చౌశీతి బంధంబులన్!

**8**

కృష్ణశాస్త్రిగారి పద్యముగా విన్నది. (వేమన పద్యమునకు అనుకరణము):-

ఆ॥ పంచదారకన్న పరదార తియ్యన,
రాజుకన్న మోజు అంకుమగడు,
ఐనదానికన్న కానిది మేలయా!
విశ్వదాభిరామ వినురవేమ!

**9**

తిరుపతి వేంకటకవులు కుండపై చెప్పిన శృంగార పద్యము - కుండను సంబోధించి చెప్పినట్లు:-

ఉ॥ కుమ్మరి గూటపుం బెలుచ కుమ్ముల కోర్చితి, వెండదాడికిన్
కిమ్మన కూరకుంటి, వొగి కీలి మహోజ్జ్వలకీల కోర్చి నే
మమ్మున నుంటి, వీ కతన మానవతీ కుచపార్శ్వదేశ వా
సమ్ము ఘటిల్లె! కష్టములు సైచక కుంభమ! సౌఖ్యమబ్బునే?

మట్టిని మెత్తపరచుట - ఎండబెట్టుట - ఆవములో పెట్టి కాల్చుట-అను పనులు కుండ సైచిన కష్టములు! ఇది కాళిదాసుని రచనగా చెప్పబడుచున్న "శృంగార తిలకము"లోని ఒక శ్లోకమునకు అనువాదము.

## 10

మొదటిరాత్రి గడచినది. తెల్లవారినది. నాయికకు రాత్రి చేసిన అలంకారములలో మార్పురాలేదు. చెరుగలేదు. ఉదయం ఆమెను చెలికత్తెలు గుమిగూడి ప్రశ్నించుచున్నారు. 11వ పద్యంలో ఆమె సమాధానం. ఈ తెలుగు పద్యాలకు మూలశ్లోకములు శృంగారశ్లోకములలో చూడనగును (సంఖ్య:28). అవి కాళిదాసుని 'శృంగారతిలకము'లోనివి. వానిని తిరుపతి వేంకటకవులు అనువదించినారు.

**చ॥ కలికిరొ! చెక్కులన్ మకరికల్ చెడలే, దల చందనమ్ము చ**
**న్నుల చెదరంగలే, దిదె కనుంగవ కాటుక జారలేదు, త**
**మ్ములమున పొల్చు కావిపొలుపున్ నెరవాతెర వీడలేదు, నా**
**చెలి! మది కోపగించితివొ? చెల్వుడు తా పసివాడొ? చెప్పుమా?**

## 11

**చ॥ అలుగను సెజ్జనింట, విభుడన్నను బాలుడు కా, డలంకృతుల్**
**నిలుకడ నున్న కారణము నిక్కము తెల్పెద నో లతాంగి! నన్**
**విలసిత యౌవనాంగి, విధుబింబముఖిం గని, మన్మథార్తుడై**
**అల పతి నష్టదైత్యగురుడయ్యె వడిన్! రతమేడ నవ్వలన్?**
(నష్టదైత్యగురుడు = శుక్రుడు నష్టమైనాడు అని ప్రచ్ఛన్నముగా చెప్పుట)

## 12

'తురగా రామకవి' వార్షికమునకు రెండవసారి వెళ్ళగా తిరస్కారము జరిగినది. అప్పుడు కోపముతో:– 'ఆదిన్ శ్రీసతి కొప్పుపై తనువుపై' అను పోతనగారి పద్యము ననుకరించుచు నిట్లు చెప్పెను:–

**ఉ॥ 'పెండెల నాగి' చెక్కులను – 'పెద్ది' కటిస్థలి – 'గంగి' గుబ్బచన్**
**కొండల నుండు రామకవికుంజరు హస్తము క్రిందు చేసెగా!**
**పండక 'బంటుమల్లి' – అది పండిన యీ కసుమాల ధారుణీ**
**మండలనాథుబోలు నొక మానవనాథుని వేడనిచ్చునే?**

కవి నివాసము బంటుమల్లి అనియు, అతనికి "నాగి" "పెద్ది" "గంగి" అను ఉంపుడుకత్తెలుండిరని తెలియుచున్నది.

## 13

తిరుపతి వేంకట కవులను ఒక ఆస్థానములో స్త్రీలకు జడ వెనుక నుండుటకు హేతువేమని అడుగగా, రెండు పద్యములు చెప్పినారట. అందులో ఒకటి:–

**మ॥ ఎదుటన్ వర్తిలు నట్టి యంగముల కెంతేనిన్ నఖాది క్షతా**
**పద పల్మారును గల్గు సంగతిని తా ప్రత్యక్షముం జూచి, నె**
**మ్మదిలో భీతిలి, చాటుచోటనుచు సంభావించి, వెన్నంటుచున్**
**పొదలం బోలును వేణి! లేకునికి దా ముందుండ కట్లుండునే?**

## 14

**"అద్దరి మే లిద్దరి కీడునుం గలదె యుద్యద్రాజబింబాననా!"** ఇది సమస్యగా దోచును. తెనాలి రామకృష్ణుడు చెప్పినట్లు ప్రచారములో నున్నది:–

**మ॥ వరబింబాధరమున్, పయోధరములున్, వక్రాలకంబుల్, మనో**
**హర లోలాక్షులు చూప, కవ్వలి మొగంబైనంత నేమాయె? నీ**
**గురు భాస్వజ్జఘనంబు, క్రొమ్ముడియు, మాకుంజాలవే? గంగకు న**
**ద్దరి మే లిద్దరి కీడునుం గలదె? యుద్యద్రాజబింబాననా!**

## 15

కూచిమంచి తిమ్మకవిని కవిత్వము నేర్చిన ఒక వేశ్య కౌగిలింపగా, అతడు నైష్ఠికుడగుటచే మారుమోము పెట్టెనట! అపుడా కవిశిఖామణి చెప్పిన పద్యముగా చెప్పుదురు. వేశ్య ప్రశ్న – కవి ఉత్తరముగా ఉన్న పద్యమిది:–

**చ॥ 'చతురులలోన నీవు కదు జాణవటంచును నెంచి కౌగలిం**
**చితి, నిటు మారుమోమిడగ చెల్లునె యో రసికాగ్రగణ్య?' – 'అ**
**ద్భుతమగునట్టి బంగరపు బొంగరపుంగవబోలు నీ కుచ**
**ద్వితయము ఱొమ్మునాటి, అల వీపున దూసె, నటంచు చూచితిన్!'**

## 16

**ఆ॥ జొన్న చేనుకాడ సొగసుకత్తెను జూచి**
**నిన్నటేలనుండి నిదురరాదు!**
**దాని నన్ను గూర్చి దయచూడు మాధవా!**
**పొన్నపూలు తెచ్చి పూజసేతు!**

## 17

పోతన భాగవతములోని దశమస్కంధము. ఇసుకనేలలో పాదముద్రల గుర్తులు ఆధారముగా గోపికలు సంభావించిన శృంగారము పరాకాష్ఠనందినది. నీటికొలది తామరగా ఊహ్యము. వాచ్యముగా చెప్పినది కవిత్వము కాదు.

**సీ॥ కొమ్మకు పువ్వులు కోసినా డిచ్చట,**
**మొనసి పాదాగ్రంబు మోపినాడు!**
**సతి నెత్తుకొని వేడ్క జరిగినా డిక్కడ,**
**తృణములో తోపదు తెరవ జాడ!**
**ప్రియకు ధమ్మిల్లంబు పెట్టినా డిక్కడ,**
**కూర్చున్నచోటిదె కొమరు మిగులు!**
**ఇంతికి కెమ్మో యిచ్చినా డిచ్చట,**
**వెలది నిక్కిన గతి విశదమయ్యె!**
**ఆ॥ సుదతితోడ నీరు చొచ్చినా డిచ్చట,**
**చొచ్చి తా వెడలిన చోటు లమరె!**
**తరుణి కాముకేళిఁ దనిపినా డిచ్చట,**
**అనగి పెనగి యున్న అందమొప్పె!**

దైవనివేదితమైనది యెంతటి శృంగారమైనను దోషము లేదు.!

## 18

సంకుసాల నృసింహకవి పద్యముగాను, సమస్యాపూరణముగాను ప్రచారములో నున్నది. (యౌవనములో ప్రవేశించిన బాలిక వర్ణనము)

**తే॥ ఒత్తుకొని వచ్చు కటికుచోద్వృత్తి చూచి**
**తరుణి తనుమధ్య మెచటికో తరలిపోయె!**
**ఉండెనేనియు కనపడకున్నె యహహ!**
**ఉద్ధతుల మధ్య పేదలకుండవశమె?**

## 19

ఇది శ్రీనాథుని చాటువుగా ప్రసిద్ధి. కవి తములపాకులు కొనుటకై వెళ్ళి, లింగధారిణియైన యువతి సౌందర్యమునకు మోహితుడగుట! అది దోషము. కాదనుకొనుట!

**చ॥ తొలకరి మించుతీవగతి దోప దుకాణముమీదనున్న అ**
**య్యలికులవేణితో తములపాకుల బేరములాడబోయి నే**
**వలచుటకేమి? శంకరునివంటి మహాత్ముడు లింగరూపియై**
**కులికెడి దాని గబ్బిచనుగుబ్బల సందున నాట్యమాడగన్!**

(గబ్బి=నిక్కిన; గుబ్బ=గుండ్రమైనది; చనుగుబ్బలు=గుండ్రని చన్నులు)

## 20

కవి ధూర్జటికి వేశ్యానుబంధమున్నదట! అది తెరచాటు రహస్యము. ఒకనాడు రాయలు **"స్తుతమతియైన ఆంధ్రకవి ధూర్జటిపల్కుల కేలకల్గె నీ యతులిత మాధురీ మహిమ?"** అని సభలో ప్రశ్నించినాడట! అతడు నిరంతరముగా వారవనితా మధురాధరపానము చేయుట చేతనే అట్టిశక్తి వచ్చెనని రామకృష్ణకవి పూరించినట్లు–

**చ॥ 'స్తుతమతియైన ఆంధ్రకవి ధూర్జటిపల్కుల కేలగల్గె నీ**
**యతులిత మాధురీ మహిమ?'– 'హా! తెలిసెన్ భువనైక మోహనో**
**ద్ధత సుకుమార వారవనితా జనతా ఘనతాపహారి సం**
**తత మధురాధరోదిత సుధారసధారల నానుటంజుమీ!'**

భువనైక మోహనలైన సుకుమారలైన వారకాంతల గొప్పతాపమును హరించెడి అధర సుధారసమానుట వలన కవితకు మాధుర్యము వచ్చినది.

## 21

చమత్కార మంజరిలో 2 ఆశ్వాసములో 43 పద్యము. నాయకుని దగ్గరనున్న యువతులను వర్ణించు సందర్భము. గజనిమ్మలు గర్వాన్ని కోల్పోయినవి, పద్మము సిగ్గుతో ప్రాణములు విడనాడుచున్నది. కోదండము దండము పెట్టుచున్నది. జంబీరము (గజనిమ్మ) = (జం) బీరము మానుచున్నది. రాజీవము = (రా) జీవము విడచుచున్నది. కోదండము (కో) దండము పెట్టుచున్నది. మొదటి అక్షరములు విడచుట – ఇందలి చమత్కారము.

**మ॥ బిగువుం జన్నులు గాంచి మాను నల జంబీరంబు బీరంబు! క్రొం**
**జిగి మోముం గని సిగ్గునన్ వదలు రాజీవంబు జీవంబు! విం**
**తగు భ్రూరేఖలు గాంచి భీతినిడు కోదండంబు దండంబు! త**
**జ్జగతీనాథుని మ్రోలనున్న చెలులం జర్చింపగా పాడియే?**

**22**

క్రీ.శ. 10వ శతాబ్దానికి చెందిన ఒక కన్నడ శాసనంలో శృంగార రసాన్ని ధ్వనింపజేసే ఈ క్రింది పద్యమున్నది:–

**ఎనిత్తెనిత్తంబుజపత్రనేత్రెయా**
**ఘనస్తనంగళ్ బళెగుం కిరాతెయా–**
**అనిత్తనిత్తం వనదొళ్ వనేచరం**
**బిల్లానదనెంతె కీసువం!**

(ఇంటి దగ్గర) పద్మపత్రములవంటి నేత్రములు గలిగిన కిరాత యువతియొక్క ఘనస్తనములు పెరుగుతున్నకొలదీ, అడవిలో వేటనిమిత్తం చరిస్తున్న (ఆమె భర్తయైన) కిరాత యువకునకు విల్లు ఎక్కుపెట్టే శక్తి తగ్గిపోతూ వస్తోంది!

**23**

శ్రీకృష్ణదేవరాయలవారి 'ఆముక్తమాల్యద' కావ్యంలో గోదాదేవి – శ్రీరంగనాథుల వివాహవర్ణనలో శృంగారరసాత్మకమైన ఒక చక్కని పద్యం ఉన్నది. వధూవరులు తలంబ్రాలు పోసుకుంటున్నారు. శ్రీరంగనాథుడు సాలప్రాంసుడు, ఆజానుబాహుడు, కూర్చున్నాసరే ఎత్తుగా ఉన్నాడు. గోదాదేవిది స్త్రీ సహజమైన తగుమాత్రపు ఎత్తు. ఆమె దోసిట్లోకి తలంబ్రాలు తీసికొని, చేతులు బాగా పైకి ఎత్తి, భర్త తలమీద పోస్తోంది. అప్పుడు శ్రీరంగనాథుడు గుండ్రంగా అందంగా ఉన్న ఆమె పాలిండ్లవైపు కొంటెగా చూస్తున్నాడట. గోదాదేవి ఆయన కొంటెచూపులు కనిపెట్టింది. చాలా సిగ్గుపడిపోయింది. ఆ తరువాత తలంబ్రాలు దోసిట్లోకి తీసికొని, చేతులు పైకి ఎత్తకుండానే, వ్రేళ్ళతోనే పైకి ఎగురజల్లిందట!

**తే॥ ఇంతి దోయిట సేస బ్రాలెత్తుచోట**
**గుబ్బపాలిండ్లక్రేవ గ్రక్కున మురారి**
**కన్నువేయుట గని, లజ్జగదుర, బాహు**
**లెత్తక కరాగ్రములన పైకెగుర జల్లె!**

**24**

'యుగకవి', 'నవకవితా పితామహులు' డా॥ గుంటూరు శేషేంద్రశర్మగారు. పద్యకవితా రచనలోను గద్యకవితా రచనలోను అందెవేసిన చేయి; 'సవ్యసాచి'; 'ఉభయకవిమిత్రుడు'! విద్యార్థి దశనుంచీ ఆయాసందర్భాలలో ఆశువుగా ఎన్నో పద్యాలు చెప్పారు. యౌవనదశలో తన మిత్రునితో కలిసి, అతని ప్రియురాలైన ఒక వన్నెలాడిని (సినీతారను) దర్శించి, సఖుని కోరికపై ఆమెను గురించి చెప్పిన కొన్ని శృంగారచాటువులు (ఆశువు):-

(1) హేమాహేమీలు:

**క॥ హేమాహేమీ లందఱు**
**భామా! నీ పాదములకు బానిసలటగా!**
**ఏమాకిటు కిటు వారిని**
**టామీలను చేసినావె టక్కరి భామా!**

**(2) "భువనమోహిని":**

**సీ॥ సింహాచలమ్ములో చిక్కని తోటలో**
**వలచు అనాసవే వన్నెలాడి!**
**సామర్లకోటలో జాళువా తోటలో**
**చెఱకుముక్కవె నీవు చిగురుబోడి!**
**అల రాజమండ్రిలో అపరంజి రుచులీను**
**పనసతొనవే నీవు పద్మగంధి!**
**నెల్లూరి చేలలో పిల్లగాలుల కూగు**
**వరివెన్నువే నీవు వగలమారి!**

**తే॥ మురిసి మురిపించి మరపించు మురువు జూపు**
**భువనమోహినివే నీవు పువ్వుబోడి!**
**పల్లెపల్లెల ప్రేమ తపస్వి జనుల**
**కొంగు బంగారువే నీవు కోమలాంగి!!**

(3) "నితంబిని":

**మ॥ పిరుదుల్ నీ కసమానమైన బిరుదుల్ పీనస్వరూపంబులై,**
**ఒరగంబండిన మందసా పనసపండ్లో లేక దిండ్లోయనన్,**
**బరువై, నీ కిరువైపులం గులుకుచుం భాసింప సొంపారు నీ**
**చురుకుంగొల్పు మదేభయానమునకున్ జోహారు భామామణీ!**

(పీనము = బలిసినది)

(4) "కామాక్షి":

**మ॥ తరమే నీదు విలోకన ప్రభలకుం దాళంగ? కుఙ్మాంగజుం**
**దురగంబుంబలె దూకు బ్రాకు శతవిద్యుద్వల్లికల్ గావునన్**
**విరి చెంగల్వలవోలె మోహనములై విప్పారి యొప్పారు నీ**
**వర నేత్రద్వయి నాపయిం బరపకే వామాక్షి! కామాక్షివై!**

(5) "పొలయలుక":

**మ॥ అలుకా నాపయి పంచదార చిలుకా! హల్వావు నీవున్నచో**
**చలికాలంబు జయింతు, సర్వసుఖముల్ సాధింతు, బాధింతు నీ**
**కులిశక్రూర కఠోర ఘోరతర వక్షోరాక్షస ద్వంద్వమున్,**
**కలకాలంబు వసింతు నీ చరణరేఖా నాకలోకంబులన్!**

(కులిశము = వజ్రాయుధము)

(6) గబ్బిగుబ్బలు" (=నిక్కిన చన్నులు):

**మ॥ కులుకుం బంగరు బొంగరంబులబలెన్ గుత్తంపు జాకెట్టులో**
**కొలువైయున్న సమున్నత స్తనములన్ కుంభించి హస్తద్వయిన్**
**కలయంబట్టి మథింపనీవె సుమనోగంధీ! తదీయాగ్రముల్**
**కలచెన్ చిత్త కవాట పాటనకళా కౌశల్య శల్యంబులై!**

(7) "ప్రేమోన్మత్తుడు":

సీ॥ కోటి రంభలు వచ్చి కులుకు చూపించినా
కాలదన్నుదు నేను కమలగంధి!
ఒక వేయి రాజ్యంబు లూరికే వచ్చినా
ఉమ్మివేయుదుగదే ఉత్పలాక్షి!
లోకమేకంబుగా దూకి బెదిరించినా
ఎదిరించి నిలుతునే ఇగురుబోడి!
అల సూర్యచంద్రులే హద్దులు దాటినా
మాటకు నిల్తునే మధురవాణి!

తే॥ గంధగజయాన! నీదు బంగారు కొంగు
సోకినం జాలు నేను మజ్నూకు అన్న!
చూచినం జాలు దేవదాసునకు మిన్న!
నీవు లేకున్న బ్రతుకుటే నిండు సున్న!!

(8) "కీచకుడు":

క॥ అధునాతన కీచకుడను,
అధరాధర యాచకుడను, హా! మదిరాక్షీ!
రుధిరము పొంగెను, ఊహా
మధుమాసము మోసులెత్తె, మన్నింపగదే!

(9) "బాహులతల ఖైదీ":

క॥ తరుణీ! నను త్రాచులవలె
కరచెడు నీ బాహులతల ఖైదీ – నీ
సరసాలే చెరసాలగ
చిరకాలము బ్రతుకనిమ్ము చిగురాకువలెన్!

(10) "చరణదాసుడు":

కః నీ వెంట తిరుగు పాపను,
నీ వలలో జిక్కి వెడలనేరని చేపన్!
నా వలపు బాధ బాపన్
నీవే శరణమ్ము! కొలుతు నీ చరణమ్మున్!!

(– "జనవంశమ్" నుండి)

ఉః ముంగురు లుంగరాలు, చనుమొగ్గలు బంగరు బొంగరాలు, క
న్నుంగవ గండుమీలు, సుమనోవృతమై తగు వేణిబంధ, మా
చెంగులువారు చీర కటిసీమపయి న్నటియింప, వచ్చె న
మ్మంగలివారి కాంత, విటమానస మంతయుఁ జూఱపుచ్చుచున్.

– శ్రీనాథుని చాటువులు

సీః పొలుపొందఁగ విభూతిబొట్టు నెన్నొసలిపైఁ
దళుకొత్తు చెమట కుత్తలపడంగ,
సొగసుగాఁ బూదండఁ జోపిన కీల్కొప్పు
జాఱఁగా నొకచేత సరుదుకొనుచు,
బిగిచన్నుగవ మీఁద బిరుసు పయ్యెద చెంగు
దిగజాఱి శివసూత్ర మగపడంగ,
ముక్కున హరుముంజి ముత్యాలముంగర
కమ్మవాతెఱమీఁద గంతులిడఁగఁ,
తేః గౌను జవ్వాడ, మెట్టియల్ గదిసిమ్రోయఁ,
గమ్మవిలుకాని జాళువాబొమ్మ యనఁగ,
మెల్లమెల్లన సింహాద్రి మీఁదికేగెఁ
గన్నెపూఁబోఁడి యగసాలి వన్నెలాడి!

–శ్రీనాథుని చాటువులు

# 1.3 హాస్యపద్యములు

**1**

**"ఇటు మో మటు త్రిప్పబోకుమీ!"** అను సమస్యను పూరించిన విధము:–

ఉ॥ **హాసము మోమునందొలక, సంగజు ప్రేరణచే ప్రియుండు తా**
**మోసముచేసి ముద్దుగొన – ముద్దియ పెన్గగ సాగె–అప్డు వా**
**డా సతితోడ నిట్టులను – "అక్కట! అల్లరి మాను! నత్తులో**
**మీసము చిక్కుకొన్నది సుమీ! యిటు మో మటు త్రిప్పబోకుమీ!**

**2**

చెళ్ళపిళ్ళవారు "అభినవ రామలింగ బిరుదాంకితులు". వారి బూతులు పాండిత్య ప్రచ్ఛాదితములు. వీరు 65 సంవత్సరముల వయస్సులో ముక్త్యాల సంస్థానమునకు వెళ్ళినారు. సభచేసి, ఆ సభలో వెంకటశాస్త్రిగారిని ఆశువుగా పద్యములు చెప్పుదని సభ్యులు కోరినారు. అప్పుడు ప్రారంభించుచు, తలలు నరసిన శిష్యులను చూచి –

తే॥ **"శిష్యులకుఁగూడ తల నరసినది కొంత !**
**నాకు తలయొక్కటియె గాదు !"**

అని పొడుము కాయతీసి నస్యము పీల్చుటకు (కొంటెగా) విరామ మిచ్చిరి. సభలోని మొదటితరగతి సభ్యులు "ఇదేమి? శాస్త్రిగారు అసభ్యములోనికి దిగినారే!" అని మొగములు ముడుచుకొన్నారు. రెండవ తరగతివారు గొల్లుమని నవ్వుకొన్నారు. నస్యము పీల్చుట అయినది. శాస్త్రిగారు గంభీరముగా "నరసె మీస(లు)" అన్నారు. అందరును కలిసి నవ్వుకొన్నారు. పూర్తిపద్యమును మా బావగారు దుగ్గిరాల రామారావుగారు (చెళ్ళపిళ్ళ వెంకటశాస్త్రిగారి వీరాభిమాని) నాతో చెప్పినారు (–తంగిరాల)

తే॥ **"శిష్యులకుఁగూడఁ దల నరసినది కొంత,**
**నాకుఁ దలయొక్కటియె కాదు, నరసెమీస,**
**లిట్టి నేఁ గైతలను జెప్పనేల? అయినఁ**
**జెప్పకే తప్ప కొక్కింతఁ జెప్పుచుంటి!'**

### 3

తిరుపతి వేంకట కవులు బూతులను ప్రచ్ఛన్నముగా (అవసరమైన చోట్ల) కవితలో చొప్పించిన సన్నివేశములున్నవి. ప్రతిపక్షమువారు విసుగించి బాధించుచున్నారు. 'కింకవీంద్ర ఘటాపంచాననము" గర్జించినది.

**"కల సారస్యము నీకగాని తెలియంగారాదు బింబాధరీ!"** అను సమస్య వచ్చినది. (ఈకల - ఈ...కల గా విడదీసి సభను గొల్లుమనిపించినారు).

**మ॥ కలగంటిన్ వినుమిప్పుడీ కలచమత్కారంబు నీ వంచు న**
**వ్వొలయం బక్కెడు వారకాంతగని, "ఓహో! ఈ...కలా? ఈ... కలా?**
**లలనా! నాకిది చెప్పశక్యమగునా? లక్షించి చూడంగ ఈ**
**కల సారస్యము నీకగాని తెలియంగా రాదు బింబాధరీ!**

### 4

ఏక సంధాగ్రాహినని యొక నత్తివాడు గర్వించుచున్నాడట! అట్టివాని ఎదుట తెనాలి రామకృష్ణుడు చదివిన పద్యమనియు, ఆ నత్తివాడు తిరిగి చెప్పలేక పోయెననియు ప్రసిద్ధి.

**క॥ నరసింహకృష్ణరాయని**
**కరమరుదగు కీర్తియొప్పె [1]కరిభిత్ గిరిభిత్**
**[2]కరిభిద్గిరి గిరిభిత్కరి**
**[3]కరిభిద్గిరిభిత్తురంగ కమనీయంబై!**

శ్రీకృష్ణరాయల కీర్తి [1]శివ-వజ్రాయుధములను-; [2]వెండికొండ- ఐరావతములను; [3]శివ దేవేంద్ర వాహనముల తెల్లందనమును బోలి మనోహరమై యున్నది. (నత్తివారికి 'క' కారము పలుకదు. అదియే ఈ పద్యములో ఎక్కువగా వచ్చినది).

### 5

బసవయ్య కుమారుడు గోవిందరాజు. అతనిని తిట్టుచు చెప్పిన పద్యము! ఆ తండ్రికి పుట్టినప్పుడే వాడు పశువు! గడ్డి తినడనుకొనవద్దు! శత్రువులు యుద్ధమునకు వచ్చినప్పుడు గడ్డి కరచును. (గడ్డిపరకను నోట బెట్టుకొన్నచో ఓటమి నంగీకరించుట ఆనాటి ఆచారము).

కII బసవనకు పుట్టినప్పుడె
పసరము గోవిందరాజు పసరంబయ్యెన్!
కసవేటికి తినడనగా
కసవుం దిను శత్రు లాజి గదిసిన వేళన్!

6

ఒక సాధారణ కవికి చిన్న చిన్న చిల్లర సన్మానములతో అహంకారము. పెరిగినది. ఒక మహాకవి మీదకు కాలు దువ్వినాడు! ఆ మహాకవి (అల్లసాని పెద్దన) అన్యాపదేశముగా (కోడిపుంజు నుద్దేశించి) చెప్పినది:-

శాII రంతుల్ మానుము కుక్కుటాధమ! దరిద్ర క్షుద్ర శూద్రాంగణ
ప్రాంతోలూఖలమూల తండులకణగ్రాసంబుచే క్రొవ్వి - దు
ర్దాంతాభీల ఫణీంద్ర భీషణ ఫణాంతర్మాంస సంతోషిత
స్వాంతుండైన ఖగేంద్రు కట్టెదుట నీ జంజాటముల్ సాగునే?

(1) ఈ పద్యసందర్భము వేటూరివారి చాటుపద్యమణిమంజరి (ద్వితీయ భాగము) లో సరిగా నున్నది (చూ.పుటలు 49-50) "రాయలకోరికపై ఈ క్రింది మూడు పద్యములును పెద్దన-తిమ్మన - భట్టుమూర్తి కవులచే రచింపబడినవి. పై పద్యము అల్లసాని పెద్దన చెప్పినది. "స్థానవిశేషమాత్రమున తామరపాకున నీటిబొట్టు!..." అనే పద్యము (చూ.48వ ఖండిక) నంది తిమ్మన చెప్పిన పద్యం. భట్టుమూర్తి చెప్పిన పద్యం మా అన్నయ్యగారు ఇవ్వలేదు. నేను దిగువ ఇస్తున్నాను చూడండి (-తంగిరాల)

(2)ఉII తక్కక నేల ముట్టెగొని త్రవ్వఁగనేర్తు నటంచుఁ దాకుతా
వొక్కటె జాతియంచు ముదమొందకు బుద్ధిని వెట్టిపంది! నీ
వెక్కడ? యాదిఘోణియన నెక్కడ? యద్రిసముద్రదుర్గ ధూ
ర్భాక్కుతలంబు నొక్క యరపంటనె మింటికి నెత్తనేర్తువే?

(ఆదిఘోణి=ఆదివరాహము; ధూః+భాక్+కుతలంబున్=మిక్కిలి బరువైన భూమిని)

7

కవులు కానివారు కవులను వేషములో-మాటలలో-అనుకరించుట యున్నది. ఇట్టి కాకవులను నిరాకరించుచు అన్యాపదేశముగా సంస్కృతకవి "నీలం

వపుర్వ్యహతు" అను శ్లోకము చెప్పినాడు. ఆ శ్లోకముయొక్క అనువాద పద్యము (కాకి నుద్దేశించి):-

**ఉ॥ ఈకలు నల్లనైనవని యెంచి, విశాల రసాలశాఖ ను**
**త్సేకముతోడ నెక్కి, వికసించి, ఫలంబుల నీవు మేయుచున్,**
**కోకిలరీతి నుందువనుకొన్నను నుందువుగాక పాపమున్**
**కాకమ! నీకు తన్మధుర గానము కల్గునె యెన్ని పల్కినన్?**

**8**

సింగధీమణి-పెనుమెళ్ళ రాఘవులు-వెంకటాద్రి-మొదలుగా కొందరు చాటుపద్య ప్రసిద్ధులు-కొఱగానివి ఏడింటిని ఈ పద్యములో కూర్చినాడు చాటుకవి:

**ఉ॥ వాసనలేని పువ్వు - బుధవర్గములేని పురంబు - నిత్య వి**
**శ్వాసములేని భార్య - గుణవంతుడుకాని కుమారుడున్ - సద**
**భ్యాసములేని విద్య - పరిహాసములేని ప్రసంగవాక్యమున్ -**
**గ్రాసములేని కొల్వు - కొఱగానివి పెమ్మయ సింగధీమణీ!**

**9**

ఈ పై పద్యముతో కవి తృప్తి పడలేదు. వ్యర్థములు మఱి యేడింటిని ఈ పద్యములో కూర్చినాడు:-

**ఉ॥ గారెలులేని విందు - సహకారములేని వనంబు - తొల్తనోం**
**కారములేని మంత్ర - మధికారములేని ప్రతిజ్ఞ - వాక్చమ**
**త్కారములేని తెల్వి - గుణకారములేనటువంటి లెక్క - సా**
**కారముగాని పూజ - కొఱగానివి పెమ్మయ సింగధీమణీ!**

"పెమ్మయ సింగధీమణీ!" అనే మకుటంతో ఒక శతకమే ఉండాలని పరిశోధకులు భావిస్తున్నారు. కాని 15 పద్యాలు మాత్రమే నేడు లభిస్తున్నాయి. (చూ.అనుబంధము -8) -తంగిరాల.

**10**

ఒక కవి కడుపు రగిలించు ఆఱింటిని ఈ పద్యములో పెనుమెళ్ళ రాఘవాంకితముగా చెప్పినాడు. ఈ ఆఱింట నేదో కవిని బాధించియుండును.

**చ॥ ఎనయగ హీనుదంట - జలమింతయు నిల్వని పాడుగుంట - నీ**
**చునకు పదార్థముంట - తనుజూచి సహింపని యూరనుంట - లే**
**దనియెదు చేనిపంట - వెస నాకటికందని వంట - మంటకా?**
**జనకసుతాభిరామ! బుధసన్నుత! శ్రీ పెనుమెళ్ళ రాఘవా!**
దంట = జంట (స్నేహము)

**11**

గరగరమైన భోజనమునకు అలవాటు పడిన కవికి ఒక రాత్రి "కుభోజన" మేర్పడినది. ఇట్టి భోజనము శత్రువునకైనను కల్పింపవద్దని దైవము సర్థించు సందర్భము. ఈ పద్యము శ్రీనాథునిదని యందురు.

**ఉ॥ మూతిని ముట్టగా వెరతు - ముద్దకు ముద్దకు కూటిలోపలన్**
**పాతికపాలు సైకతము - పచ్చడి కొంచెము - ఆది యంతమున్**
**చూతమటన్న లేదు - మఱి సున్నము కన్నను మెత్త నన్న, మీ**
**రాతిరివంటి భోజన మరాతికినైనను వద్దు దైవమా!**

(సైకతము=ఇసుక; ఆది = నేయి; అంతము = పెరుగు; నేతితో ఆరంభించుట, పెరుగుతో ముగించుట భోజన సంప్రదాయము).

**12**

"గంగమ్మగారి మొగుడు"గా కోట సింగరాజుగారి చిరునామా. ఈ సింగరాజు ఇల్లరికపుటల్లుడు కానోపును? పెత్తనము గంగమ్మదే! ఈ విషయమెఱిగిన భట్రాజు 'ఇంటి గౌరవమునకు ఇల్లాలే కారణమగుననుట సత్యము' అనుచు:-

**ఆ॥ కోట సింగరాజు మాటవాసే గాని**
**గంగమాంబచేత ఘనతకెక్కె!**
**గంగమాంబ పెద్ద గయ్యాళి దైతేను**
**సింగరాజు ఏమి చేయఁగలడు?**

**13**

ఏకచక్రపురవాసులు బకాసురునకు ఆహారమునకు రోజునకొక్కరుగా ఏర్పాటు! ఈ కథను స్ఫురింపచేయు హాస్యరసాత్మక పద్యము తిరుపతి వేంకటకవులు చెప్పినట్లు:-

**శా॥ ఆ రాజేంద్రుడు రాత్రియుం బవలు కామాసక్తిచే ఊరిలో**
**నీరేజేక్షణలన్ బలాత్కృతిగ నెంతే బాధనొందింప – ఆ**
**యూరన్ కాపురముండువార లొకరోజొక్కక్క రాత్రీయమా**
**దారన్ పంపెదమన్న నొప్పెనట! ఆతండెంత పుణ్యాత్ముడో!**

(పుణ్యజనుడు = రాక్షసుడు! చివర కొసమెరుపు చూపినాడు కవి!)

**14**

రామకృష్ణకవులకు నన్నయాదికవులు దైవస్వరూపులు! అయినను వారుచేసిన పనులను ఎత్తి చూపించి, వారితో చనువుగా పరిహాసమాడిన పద్యములు ఒకప్పుడు భారతిలో కవులపాట్లుగా ప్రకటితములు. అందుకొన్ని – ఆదికవి నుద్దేశించి:–

**తే॥ ఆంధ్రలోకోపకారమ్ము నాచరింప**
**భారతమ్మును నన్నయభట్టు తెనుగు**
**చేయుచున్నాడు సరియె! బడాయిగాక,**
**తొలుత సంస్కృతపద్యమెందులకు చెపుడి?**

**15**

తిక్కన నుద్దేశించి:–

**తే॥ అచ్చ తెలుగు పదంబుల నిచ్చకొలది**
**బుచ్చి, తలతిక్క అన్వయంబులను బెట్టి,**
**పాడుచేసెను నన్నయభట్టుదారి!**
**ఉభయకవిమిత్రులష! తిక్కయొజ్జగారు!**

"అష ఇష" అనుట ప్రాచీన శిష్ట ఉచ్చారణము.

**16**

ఎఱ్ఱాప్రెగడను గుఱించి:–

**తే॥ పామరుడువోలె తిక్కన సోమయాజి**
**వెరచి ఆంధ్రీకరింపక విడచినట్టి**
**భారతమ్మున వ్రేల్పెట్ట బట్టిగాక,**
**ఎఱ్ఱప్రెగ్గడ బందార మెవడెఱుగడు?**

**17**

శ్రీనాథుని గురించి:–

**తే॥ ఎఱచి తినువారలేనియు నెమ్ము మెడకు**
**కట్టుకొందురె శ్రీనాథకవివరేణ్య!**
**సానికూతుల తగుల మీశానునకును**
**బలికితివి నీ స్వభావంబు బయలుగాగ!**

**18**

పెద్దనను గుఱించి:–

**తే॥ ముసలితనమున నదియేమి ముచ్చటయ్యె**
**తాతగారికి? మనుచరిత్రమ్ము నందు**
**వెఱ్ఱిబాపడు ప్రవరుని పేరు చెప్పి**
**ఎంత ప్రేమకలాప మాడించినాడు!**

**19**

తిక్కన స్వప్నవృత్తాంతమునకు శ్రీకారము చుట్టినాడు. పోతనాదులు తమ స్వప్న వృత్తాంతములు వ్రాసినారు. స్వప్నవృత్తాంతము కవి సంప్రదాయమైనది! వారిని హేళనగా –

**తే॥ ఒకడు స్వప్నప్రకారంబు నుగ్గడింప**
**ఎల్లవారలకు కలలె తెల్లవార్లు!**
**నవ్వుదురను తలంపులేదెవ్వరికిని**
**పేరుకొననేమిటికి వట్టి బీదకవుల!**

**20**

శ్రీకృష్ణదేవరాయలను గుఱించి:–

**తే॥ కృష్ణరాయుడు చేసిన విష్ణుచిత్త**
**కావ్యమందలి భావము శ్రావ్యమె యగు!**
**ఎన్నిమార్లు పఠించిన నెఱుకబడని**
**వట్టి పాషాణపాక మెవ్వండు చదువు?**

**21**

పింగళి సూరనను గుఱించి:-

**తే॥ శ్లేష కావ్యంబు చేసి విశేష యశము**
**గనిన పింగళి సూరన గడుసువాడె!**
**కాని శుభమస్తని యదేమి 'గారుడంబు'**
**తెనుగు చేసినవాడు వైదికుని భంగి?**

**22**

ఈ విధముగా పూర్వకవుల ప్రస్తుతించి – లోకులెఱుగుటకై:-

**తే॥ పూర్వ కవిరాజులకు నిది భూషణంబొ**
**దూషణమె యనుకొనుడు మీ తోచినటుల**
**నన్నయాదుల పట్ల మాకన్న కూర్మి**
**కలుగువారలు లేరు జగమ్మునందు!**

**23**

మా చిన్నతనము నాటికి కులములను అనుసరించి, తెలుగు పలుకుబడి భిన్నభిన్నములుగా నుండెడిది. ప్రాంతీయమును బట్టి– జాతిని బట్టి పోల్చుకొనుటకు వీలులేనంత భేదము కన్పట్టెడిది! ఆనాటి (100 సంవత్సరముల పూర్వము) విప్రభామల సంభాషణమును దాసు శ్రీరాములుగారు వీధిభాగవతములో–

**శా॥ 'అస్సే! చూస్తివషే! వొసే చెముడషే! అష్టాగషే యేమిషే?**
**విస్సావజ్ఝులవారి బుఱ్ఱినష ఆ విస్సాయి కిస్సారషే!**
**విస్సండెంతటివాడె? యేండ్లు పదిషే! విన్నావషే! యెంత వ**
**ర్చస్సే!' యందురు శ్రోత్రియోత్తమపదస్త్రీ లాంధ్రదేశమ్మునన్!**

**24**

ఆశుకవిత్వముగా సంభాషణము పద్యపాదములతో సాగించుట పూర్వకవుల సంప్రదాయము; అది ఒక సరదా. ఒక కవితాప్రియునింట వివాహము వైభవముగా జరిగినది. "సాధారణ బ్రాహ్మణులకు సాధారణ సత్కారము. కవులకు ప్రత్యేక సత్కారము" అని ముందుగా ప్రకటితమైనది. ఆ యజమాని ఒక కవికి సాధారణ సత్కారము చేయబోయినాడు. కవికి కోపము వచ్చినది. కందపద్యమందుకొన్నాడు!

**"కవి గనుము కనులు లేవా?"** – అన్నాడు – ఇది కందపద్యంలో మొదటిపాదం.

యజమానికి కూడ ఆశుకవిత్వ ప్రజ్ఞయున్నది.

యజమాని: **"కవివైతే చంకనాకు! గంటంబేదీ?" –** అని కందపద్యంలో రెండవ పాదము పూరించినాడు.

పూర్వము కవులు చంకలో తాటియాకులు (అలేఖ్యములు), మొలలో గంటమును ధరించెడివారు. ఈ కవికి "చంకన్, ఆకును, మొలను గంటమును" కన్పించుట లేదు. ఆ రెంటిని ప్రశ్నించు తీరులో అహంకారమునకు అందముగా చుఱకపెట్టినాడు యజమాని!! ("చంకనాకు!" అనునది సాధారణముగా ఉపయోగించే తిట్టు).

## 25

నన్నయ, మఱికొందఱును తప్ప ఆంధ్రకవులందఱును నియోగి బ్రాహ్మణులే! ఒక వైదికకవి ఈర్ష్యతో తెలుగు పలుకుల వెలది నుద్దేశించి–

**క॥ తెలుగు బలుకుల వెలదీ!**
**పలుగాకి! నకారగుల్ల పాలైతి గదే!**
**ఇలలో వైదిక విద్వ**
**తిలకంబుల కేమిదిక్కు తెలిపితివమ్మా?**

## 26

కన్యాశుల్కము నాటకములో గిరీశము పాత్ర హాస్యనిలయము. చుట్టకాల్చుట–చుట్టను నేర్పుట–చుట్ట గొప్పతనమును ప్రశంసించుట గిరీశము విశిష్టత. తన లోపమును గొప్పగా చెప్పుకొనుట–అమాయకులను నమ్మించుట అతనికి వెన్నతో పెట్టిన విద్య! గిరీశము శిష్యుని ఎంగిలి చుట్టకు ఆశించినాడు. దానికి పురాణ ప్రమాణముగా చుట్టకు ఎంగిలిలేదనుటకు, మరి మూడింటిని జోడించిన– పద్యము:

**క॥ పొగచుట్టకు, సతిమోవికి,**
**అగణితముగ మద్యమునకు, అమృతంబునకున్,**
**తగ నుచ్ఛిష్టము లేదని**
**ఖగవాహనుతోడ కాలకంఠుడు పల్కెన్!**

ఈ మహత్తర విషయమును విష్ణువుతో – శివుడు చెప్పినాడట!

## 27

గిరీశము (గురజాడ) పొగాకు చెట్టు జన్మవృత్తాంతమును ఎంత ఉత్కృష్ట స్థాయిలో చెప్పుచున్నాడో గమనింపుడు! మాతృదాస్య విమోచనమునకై గరుత్మంతుడు – అమృతము దెచ్చు వేళలో తొణికి – అమృతభాండమునుండి ఒకచుక్క భూమిపై పడినదట! అదియే పొగచెట్టుగా జన్మించెనట! అట్టి పొగ త్రాగనివాడు – దున్నపోతుగా పుట్టునని శపించుచున్నాడు!

**క॥ ఖగపతి అమృతము తేగా**
**భుగభుగమని పొంగి చుక్క భూమిని వ్రాలెన్**
**పొగచెట్టై జన్మించెను**
**పొగత్రాగనివాడు దున్నపోతై పుట్టున్!**

## 28

త్రిలోక సంచారి నారదుడు వైకుంఠమునకు వెళ్ళినాడు. అక్కడ త్రిమూర్తులు చుట్టకాల్చుచు ఆనందపారవశ్యములో నున్నారు! నారదుడాశ్చర్యముతో ప్రశ్నించుట – వారి సమాధానము! నీచవిషయము వైకుంఠములో చర్చనీయాంశమగుట!

**క॥ 'మీరుం బొగ త్రావుదురా**
**వారిజభవ! వామదేవ! వైకుంఠహరీ?'**
**'ఓరీ నారద వినరా!**
**ఈరేడు జగంబులందు ఇది ముఖ్యమురా!!**

## 29

అరవపిల్లపై శ్రీనాథుడు చెప్పిన పద్యముగా ప్రచారములో ఉన్న పద్యం:

**తే॥ మేతఁ గరిపిల్ల! పోరున మేకపిల్ల!**
**పారుబోతుతనంబున పందిపిల్ల!**
**ఎల్ల పనులను జెరుపంగ పిల్లిపిల్ల!**
**అందమున కోతిపిల్ల యీ అరవపిల్ల!**

**30**

శ్రీనాథుడు "తిరుగగావలె దేశదేశాల వెంబడి – పడవలె పడరాని పాటులెల్ల" గా, ఆంధ్రదేశములో పర్యటించినవాడు! ఆ కాలములో పలనాటిసీమలో ఒక "కుగ్రామము" చేరి, పలనాటికి వచ్చుటను ఆత్మదోషముగా తనలో–

**ఉ॥ అంగడి యూర లేదు, వరియన్నము లేదు, శుచిత్వమేమిలే,**
**దంగన లింపులేరు, ప్రియమైన వనంబులు లేవు, నీటికై**
**భంగపడంగ పాల్పడు కృపాపరు లెవ్వరు లేరు, దాత లె**
**న్నంగను సున్న! కాన పలనాటికి మాటికి పోవనేటికిన్?**

**31**

శతావధానమును నిర్వహించుచున్నాడు. సభ్యులు అవధానికి సభాపరాభవము చేయుటకై అల్లరి చేయుచున్నారు. **"అందఱి కందఱే మఱియు నందఱి కందఱె యందఱందఱే!"** అను సమస్య నిచ్చినారు. దానిని కవి ఎంత మెత్తగా పూరించెనో గమనించిన "మెత్తని కత్తి"యనిపించును. "కోతులు! దున్నపోతులు! కుక్కలు! ఎద్దులు! గాడిదలు!" గా సభ్యులను నిందించిన అందమైన పద్యము:–

**ఉ॥ కొందఱు పార్థు టెక్కెములు! కొందఱు కాలుని వాహనంబులున్!**
**కొందఱు భైరవాశ్వములు! కొందఱు నీశ్వరు వాహనంబులున్!**
**కొందఱు కృష్ణజన్మమున కూసిన ధన్యులు! నెంచి చూడగా**
**నందఱి కందఱే! మఱియు నందఱి కందఱె యందఱందఱే!**

ఈ సమస్యను శ్రీనాథునకు ఒక సభలో ఇచ్చిన సమస్యగా కూడా చెపుతారు. అప్పుడు శ్రీనాథుడు ఈ క్రింది విధంగా పూరించాడట:–

**ఉ॥ కొందఱు భైరవాశ్వములు, కొందఱు పార్థునితేరి టెక్కెముల్,**
**కొందఱు ప్రాక్కిటీశ్వరులు, కొందఱు కాలుని యెక్కరింతలున్,**
**కొందఱు కృష్ణజన్మమున కూసినవారలు, నీ సదస్సులో**
**నందఱు నందఱే మఱియు నందఱు నందఱె యందఱందఱే!**

(చూ. డా॥ కోడూరు ప్రభాకరరెడ్డి, శ్రీనాథుని చాటువులు, పుట–32)

**32**

అరసికజన సంభాషణము, అరసికులున్న సభలోనికి వెళ్ళుట, పండితుడు చేయకూడని పనులు. అన్యాపదేశముగా ఈ భావము కొంగలు ప్రశ్నించుట - హంస సమాధానము చెప్పుటలో కవి ధ్వనింపజేసినాడు:

**ఉ॥ 'ఎవ్వడ వీవు కాళ్ళు మొగ మెఱ్ఱన?'-'హంసమ!' - 'ఎందునుందువో?'**
**'దవ్వుల మానసంబునను!' - 'దాన విశేషము లేమి చెప్పుమా?'-**
**'మవ్వపు కాంచనాబ్జములు, మౌక్తికముల్ కలవందు!'- 'నత్తలో?' -**
**'అవ్వి యెఱుంగ' మన్న, - 'నహహా!' యని నవ్వె బకంబులన్నియున్!**

**33**

తిరుమల రాయలు ఒంటి కన్నువాడు! అతడొక కవీశ్వరునితో శత్రుత్వము పెట్టుకొన్నాడు. ఆ కవి చెప్పిన కందపద్యము:-

**క॥ అన్నాతి గూడ హరుడవు!**
**అన్నాతిం గూడకున్న అసుర గురుడవౌ!**
**అన్నా! తిరుమలరాయా!**
**కన్నొక్కటి దక్కెగాక కౌరవపతివే!**

స్త్రీ మోముతో నీ మోము కలిపిన (2+1) ముక్కంటివి. ఒంటరిగా ఉన్న వేళలో శుక్రాచార్యుడవు! (శుక్రుడేకాక్షుడు). నీకు ఆ ఒక్క కన్ను ఉన్నది కాని, అదిలేనిచో నీవు నిజముగా ధృతరాష్ట్రుడవే! (ధృతరాష్ట్రుడు పుట్టంధుడు కదా!)

**34**

పూర్వము భట్రాజులు గృహస్థులపై పద్యములు చెప్పి కవితాశీస్సులు అందించెడి వారు. **"కవితాశీస్సులపైన కోర్కె యది సంస్కారంబుచే నబ్బు"**. అట్టి సంస్కారము లేని అరసికుడు "పద్యము నాపై చెప్పవద్ద"న్నాడు. అయినను ఆ భట్రాజు ప్రతి ఫలాపేక్షతో పద్యము చెప్పబోవుచుండగా, అతనికి జంటయైన భట్రాజు ఆ అరసికుని, పందిగా - దుక్కెద్దుగా - నపుంసకునిగా - వితంతువుగా - సింగయ్యయెదుట ఎంత అందముగా నిందించినాడో ఈ పద్యము చదువుడు:-

**ఉ॥ వద్దన పద్యమేల? మఱి పందికి నివ్వెఱ గంధమేల? దు**
**క్కెద్దుకు పంచదారటుకులేల? నపుంసకుడైనవానికిన్**
**ముద్దులగుమ్మయేల? నెఱముక్కఱయేల వితంతురాలికిన్?**
**గ్రద్దకు స్నానమేల? నగరా విని సింగయవంశ ధీమణీ!**
(నివ్వెఱ = పారవశ్యమును కలిగించు)

ఈ పద్యం కొంచెం మార్పులతో చాటుపద్యమణిమంజరి (ద్వితీయభాగము, పుట-290)లో నున్నది:

**ఉ॥ పద్దెము లోభికేల? మఱిపందికి జాఫరుగంధమేల? దు**
**క్కెద్దుకు పంచదారటుకులేల? నపుంసకుఁడైనవానికిన్**
**ముద్దులగుమ్మయేల? నెఱముక్కఱయేల వితంతురాలికిన్?**
**గ్రద్దకు స్నానమేమిటికిఁ గావలెఁ? బెమ్మయ సింగధీమణీ!**

### 35

ఒక పరమలోభి భట్రాజును సొమ్మీయనని విసరి కొట్టినాడు. పోనీ! భోజనమైనను పెట్టించుమన్నాడు. అన్నముకూడ పెట్టనన్నాడు. ఆ లోభిని బక్కావుతో పోల్చి కసితీరక 'కుక్కా!' యని సంబోధించుచు –

**కః పెక్కావులు కలవారికి**
**బక్కావొకటీయకున్న పాడికి కఱవా?**
**పెక్కంద్రు దాతలుండగ**
**కుక్కా! నువు పెట్టకున్న కూటికి కఱవా?**

### 36

**"నిర్మలావయవమ్ముల నెమ్మివిడచి-వ్రణములకు బారు మక్షికావ్రతతి భంగి"** దోషైక దృక్కులుగా కొందఱుందురు. అట్టివారిపై కవికి కోపము వచ్చినది. కోపము ముదిరిన కొలదియు బూతులు వచ్చుట సహజము. తప్పులను మాత్రమే వెదకు వారిని నక్కలుగా – పందులుగా – కుక్కలుగా పోల్చుచు చెప్పిన పద్యము:–

**కII నక్కలు బొక్కలు వెదకును,**
**అక్కఱతో ఊరపంది అగడిత వెదకున్,**
**కుక్కలు చెప్పులు వెదకును,**
**తక్కిడి నా లంజకొడుకు తప్పే వెదకున్!**

నక్కలు పీతకన్నములలో తోకలు దూర్చి, కోపముతో తోకను కరచిన పీతలను పైకిలాగి భక్షించును. తక్కెడ విలువైన దానిని క్రిందు చేయును, తేలికైన దానిని పైకెత్తును! (అగడిత=కోటచుట్టు త్రవ్వబడిన జలాధారము. ఇక్కడ 'బురదకాలువ' అని అర్థము.)

**37**

శ్రీ ముట్నూరి కృష్ణారావుగారిని ఒక సభలో సంస్కృత పరిచయములేని సభ్యులు "అనుష్టుప్" శ్లోకము అనగా ఎట్లుండును? అని ప్రశ్నించిరి. పాదమునకు 8 అక్షరములు – ఇట్లు 4 పాదములు – మొత్తము 32 అక్షరములు – అని చెప్పి. ఉదాహరణముగా ఇట్లు చెప్పినారు:

**ఒక కాని ఒకేకాని, రెండు కానులు అర్ధణా ।**
**మూడు కానులు ముక్కానీ, నాల్గు కానులు ఒక్కణా ॥**

**38**

అధికారము వచ్చుట కొందఱకు రోగము వచ్చుట వంటిది. అట్టివానిని సుమతీ శతక కర్త **"అధికార రోగపూరిత బధిరాంధక శవము"**గా నిర్ణయించినాడు. ఈ కవి మత్తేభములో –

**మII విధి సంకల్పముచే నొకానొకడు తా విశ్వంబు పాలించుచో**
**బధిరం బెక్కువ–చూపు తక్కువ–సదా భాషల్ దురుక్తుల్, మనో**
**వ్యథతో మత్తతతోడ దుర్వ్యసన దుర్వ్యాపారతన్ చెందు! న**
**య్యధికారాంతమునందు చూడవలెగా ఆయయ్య సౌభాగ్యముల్!**

**39**

పీతాంబరధారి విష్ణువు – గజచర్మధారి శివుడు – భైరవుడు దిగంబరుడు! ఈ ముప్వురు నిట్లు ఉతుకు వస్త్రములు ధరింపకపోవుటకు కారణము చాకివానితో జగడములు పడలేకయే! అని చమత్కరించుట –

**ఆ॥ చాకివానితోడ జగడాలు పడలేక**
**సిరిగలాడు పట్టుచీరఁ గట్టె,**
**శివుడు తోలుఁ గట్టె, "సీ"యని మదిరోసి**
**భైరవుండు చీర పారవైచె!**

**40**

వంటవార్పుల తీరెరుగక – ఆధునిక విధానములో అలంకరించుకొని తిరుగు ఆమెను (సుకుమారిని) ఒక సామాన్యుడు ప్రేమించినాడు. ఆమె అతనితో జీవితము పంచుకొనెద నన్నది. ఆమెను ఆధునిక విధానములో ప్రశ్నించుచున్నాడు:–

**సీ॥ క్రోటన్సు గుబురులా కులుకుచుండెడి నీవు**
**వంటింటి పొగలలో వరలగలవె?**
**క్యాబేజి పువ్వులా డాబైన నీ మోము**
**వేపుళ్ళ వేడికి వ్రీగిపోదె?**
**జలతారు అంచుల చెలగెడి నీ నవ్వు**
**మసిగోడలకు మధ్య మసలగలదె?**
**పూలవాసనలోన బ్రుంగెడు నాసిక**
**తిరగమోతల ఘాటు మరగగలదె?**

(ఎత్తుగీతి లభింపలేదు)

**41**

యజమాని కష్టసుఖాలు గమనింపక తమ కోరికలు తీర్చుకొనగోరు ఐదుగురను కవి ఎంత అందముగా కందములో కూర్చెనో గమనింపుడు! కాటయ వేముని సంబోధించిన పద్యము:–

**క॥ వెలయాలు – శిశువు – నల్లుడు–**
**ఇలయేలిక – యాచకుండు – ఏపురు ధరలో**
**కలిమియు లేమియు తలపరు**
**కలియుగమున, కీర్తికామ! కాటయవేమా!**

**42**

**కII అడిగిన జీతంబియ్యని**
**మిడిమేలపు దొరను గొల్చి మిడుకుట కంటెన్,**
**వడిగల యెద్దుల గట్టుక**
**మడిదున్నుక బ్రతుకవచ్చు మహిలో సుమతీ!**

ఈ సుమతీ శతక పద్యమును అనుకరించుచు, విద్యార్థుల ధూమపాన వ్యసనమును అధిక్షేపించుచు చెప్పిన పేరడీ పద్యమిది! చిన్నపిల్లలకు కూడా బీడీ సిగరెట్లు అలవాటగుచున్నవను ఆందోళనము:-

**కII అడిగిన సిగరెట్టివ్వని**
**నడమంత్రపు చవట నడిగి నమ్ముట కంటెన్**
**బడిలోనికేగు పిల్లల**
**నడిగిన సిగరెట్లు దొరకవా? శ్రీ శ్యామా?**

**43**

పొగగ్రక్కుట బీడీ లక్షణము. అది కోపముగా నూహించి కోపము వద్దని కవి మందలింపు. ధర (ఖరీదు) లో సిగరెట్టు బీడీలు ఒకటే! (ఒకే విధముగా నాశనము చేయునని తాత్పర్యము).

**కII సిగరెట్టు పేరు చెప్పిన**
**పొగగ్రక్కుచు కోపగింపబోదువు, నీకున్**
**తగదటువంటి విరోధము**
**తగవేటికి? యిరువురొకటె ధరలో బీడీ!**

**44**

గంగిరెద్దును శివునితో పోల్చుచు హాస్యముగా గంగిరెద్దుల వాళ్ళు చెప్పిన పద్యమిది? శివుని కంటే గంగిరెద్దు గొప్పదనుట -

**సీII ఆతడంబకు మగం, డీత దమ్మకు మగం,**
**దెలమి నాతనికన్న నితడె ఘనుడు!**
**అతడు శూలము ద్రిప్పు, నితడు వాలము త్రిప్పు,**
**నెలమి నాతనికన్న నితడె ఘనుడు!**

**ఆత దమ్మున వ్రేయు, నితడు కొమ్మున దూయు,**
**నెలమి నాతనికన్న నితడె ఘనుడు!**
**అతని కంటను చిచ్చు, నితని కంటను బొచ్చు,**
**నెలమి నాతనికన్న నితడె ఘనుడు!**
**తే॥ శూలి యాతడు, కాపుల కూలి యితడు,**
**దేవు డాతడు, కుడితంత దేవు నితడు,**
**ఈశ్వరుని సన్నిటను మించు నెద్దు కాదె?**
**ఎద్దులేకున్న కదలలే డీశ్వరుండు!**

**45**

వేంకటేశ్వరునిపై నిందాస్తుతిగా మద్దులపల్లి వెంకట సుబ్రహ్మణ్యశాస్త్రిగారు చెప్పిన పద్యము:–

**మ॥ కడు నాపత్తుననుండి కావుమని మ్రొక్కన్ నిల్వుదోపించు – పే**
**ర్వడగా కొండలపాలుచేయు – దరిచేరన్ బోడికొట్టించుచుం**
**డెడుగా – తిర్పతి వేంకటేశ్వరుడు! కానీ యింత గావించినన్**
**చెడువాడందురె? లక్ష్మియున్నపుడు దేనింగాని లెక్కింతురే?**

ఆపదలో నిల్వుదోపిడి – కొండను కాలినడక – బోడి కొట్టించుకొనుట – ఇవి మ్రొక్కులు! ఈ పనులు వేంకటేశ్వరుని చేష్టలుగా చెప్పి – డబ్బున్నవాడు చేసిన చెడ్డపనులను కూడ గొప్పగా చెప్పికొందురు. ధనవంతుని తప్పులు కన్పించవనుట.

**46**

రాముని (విష్ణువు) నాభియందు తామర (చర్మవ్యాధి) పుట్టినది! అది అల్లుకొని పోవునది! రాముని మోము తామర (పద్మము)! కన్ను తామర (పద్మము)! చేతులు తామర (పద్మము)! పాదములు తామర (పద్మము). 'తామర' అను పదమునకున్న 'చర్మవ్యాధి' అర్థముతో ఇంతటి హాస్యము సృష్టించినాడు మహాకవి! రామునిగూర్చి శతానందుడు విశ్వామిత్రునితో చెప్పిన సందర్భము:– తామరతూడునకు – తామర (చర్మ) వ్యాధికి వ్యాపించు లక్షణము సమానధర్మము.

**ఉ॥ తామర యంటులోనిది కదా! యది తంపరగాక మానునే?**
**రాము గభీర నాభి కుహరంబున తామరపుట్టె నంటు కా**
**దామరి? దాని జాతి యది యంతన వీడెనె? ప్రాకెగాక! నె**
**మ్మోమును, కన్నుదోయి, కరముల్, పదముల్, సరిగా నెగాదిగన్!**

## 47

దురద పుట్టు చర్మవ్యాధిని భాగ్యముగా భావించి, దానిని దేవేంద్రపదవిగా చెప్పిన హాస్యమైన కందము – ఇట్టి పిచ్చి పద్యములు కూడ పూర్వకవుల ధోరణిననుసరించుట విశేషము!

**క॥ తీటగల భాగ్యశాలికి**
**నీటుగలుగు గోళ్ళు – వేడినీళ్ళు లభింపన్**
**తాటించి బఱుక సాగిన**
**తీటయె దేవేంద్ర పదవి తిరముగ జగతిన్!**

ఈ పద్యాన్ని అనుకరిస్తూ, సంస్కృతం + తెలుగు భాషల్ని మిశ్రమంచేసి, ఒక కవి ఒక శ్లోకం చెప్పాడు:–

**శ్లో॥ దురదంచ గోకడం చైవ – ప్రస్తుతం సుఖమేవ చ ।**
**తర్వాత మంట మాప్నోతి –ఇత్యైవ దురద లక్షణమ్ ॥**

(ఈ అనుష్టుప్ శ్లోకంలో కొన్నిచోట్ల అక్షరాలు ఎక్కువ అయ్యాయి. పాదానికి 8 అక్షరాలు మాత్రమే ఉండాలి.)

## 48

అన్యాపదేశమనగా కుక్కమీద – పిల్లిమీద పెట్టి తిట్టుట! ఇది కవిత్వములో ఒక విభాగము. అసమర్థుడు సమర్థుని ప్రాపకముతో విఱ్ఱవీగుట లోక ధర్మము! సమర్థుడైన వాడిచ్చిన అభిమానముతో తనంతటివాడు లేడనుకొనును – అట్టివాని నుద్దేశించి (ఉమ్మెత్త పూవు మీదపెట్టి అసమర్థుని) హెచ్చరించుచున్నాడు కవి! దీనికి సంస్కృత శ్లోకమున్నది. ఒక మహాకవి అనువాదము:–

**ఉ॥ వారక యీశ్వరుండు తలపై ధరియించిన యంత మాత్ర న**
**వ్వారిజ వైరితోడ సరివత్తువే యుమ్మెతపూవ? నీ పసన్**
**వారిధులుబ్బునో, దెసల వన్నెలు తేరునొ, చంద్రకాంతముల్**
**నీరగునో, చకోరముల నెవ్వగ తీరునొ, తాపమారునో?**

ఇట్టిదే తామరపాకుననున్న నీటిబొట్టుమీదపెట్టి చెప్పిన పద్యము:

**ఉ॥ స్థానవిశేష మాత్రమున తామరపాకున నీటిబొట్ట! నిన్**
**పూనిన మౌక్తికంబనుచు పోల్చిన మాత్రనె గర్వమేటికే?**
**మానవతీ శిరోమణుల మాలికలందున కూర్పవత్తువో?**
**కానుక లీయవత్తువొ? వికాసము దెత్తువొ? మేలునిత్తువో?**

తామరాకునుండి నీటిలోనికి జారినచో నీకు నామరూపములుండవు. నీ బ్రతుకు నీళ్ళలో కలియుటయే! (ఇది రాయలవారి కోరికపై నంది తిమ్మన చెప్పిన పద్యం – తంగిరాల)

## 49

**"ఈతాకుల యింటిలోన యినుడుదయించెన్!"** సమస్య!

సమస్యాపూరణములో కూడ ముడి విప్పిన ఆనందహాసము లభించును.

**క॥ సీతాపతి పూదోటకు**
**ఏతామెత్తంగవలయు వేకువవేళన్,**
**తాతా! నిదురించితివా**
**ఈతాకుల యింటిలోన? – ఇనుడుదయించెన్!**

## 50

గొఱ్ఱెల కాయుట – గొఱ్ఱెబొచ్చునిచ్చి దాని వినిమయముగా తనకు కావలసిన సామగ్రి తెచ్చుకొనుట గొల్లనికి పరిపాటి! అదియునుగాక అతనికి లోకజ్ఞానముతో సంబంధము చాల తక్కువ! అట్టి గొల్లడు కోమటి దుకాణము దగ్గర సామగ్రికై యున్నాడు. కోమటి కస్తూరిని తీసి శృంగార పురుషునకు అమ్మబోవుచున్నాడు. గొల్లనికి – భేరికిని జరిగిన సంభాషణము – గొఱ్ఱెబొచ్చు – పాలు అమ్ముకొనుట – పాలు ఎక్కువగా ఇచ్చుటకు చేయవలసిన దోహదములు వానికి కావలయును. కస్తూరికి గొంగడి పరచినాడు! మేకల పొదగున రాయునట్టి దోహద ప్రక్రియగా గొల్లడు కస్తూరిని సంభావించుట–

**ఉ॥ నల్లనిదేది ఖేరి? - మృగనాభిర గొల్లడ! - దాని తిందురా?**
**ఫుల్లసరోజనేత్ర చనుమొగ్గల పూతురు! - పూసినంతనే**
**జల్లున చేపునా చనులు? సయ్యన పాలను గ్రుమ్మరించునా?**
**గుల్లకు నెంతయెత్తనుచు గొంగడి పర్చిన, నవ్విరందఱున్ !**
(గుల్ల = గొట్టెబొచ్చు)

**51**

వేమన పద్యములలో వెక్కిరింతతో కూడిన హాస్యముండును. వేమన పేరుతో - వేమన కవితాలక్షణములతో - వేలాది పద్యములున్నవి. ఒక క్లిష్టప్రశ్నను అడిగి సమాధానము చెప్పుట వేమన లక్షణము.

**ఆ॥ పాలసాగరమున పవ్వళించినవాడు**
**గొల్లయిండ్ల పాలు కోరనేల?**
**ఎదుటివారి సొమ్ము లెల్లవారికి తీపి!**
**విశ్వదాభిరామ వినుర వేమ!**

(ఈ విధంగా హాస్యరసాత్మకములైన పద్యాలు వేమనలో చాలా ఉన్నాయి. సుమారు 20 పద్యాలు అనుబంధం-9లో ఇచ్చాను-చూడండి-తంగిరాల)

**52**

కవిచౌడప్ప శతకము ద్వారా బూతుకవిగా ప్రసిద్ధుడైనాడు. అతని కవితాధార అద్భుతము! పద్యపాదములు అవ్యవధానముగా -అనాయాసముగా తమంతట తాము వచ్చినట్లుగా కన్పించును. ఆహా! యనిపించును. “స్త్రీ అలంకరించుకొనుట వలననే ప్రకాశించును” అను విషయము చెప్పుటకు - మరి మూడింటిని కలిపి, వివక్షితమును ధ్రువీకరించుచున్నాడు!

**క॥ మీసము పస మగమూతికి,**
**వాసము పస యిండ్లకెల్ల, వనితలకెల్లన్**
**వేసము పస - బంట్రోతుకు**
**గ్రాసము పస - కుందవరపు కవిచౌడప్పా!**

## 53

కవిత్వము లేకుండా కేవలము ఛందస్సు మాత్రమున్న పద్యము! ఇది కవిత్వమనబడదు:-

**తే॥ రెండు కాకులు కూర్చుండె బండమీద,**
**ఒండెగిరిపోయె నింక నందొండు మిగిలె,**
**రెండవది పోయె - నింక నందొండు లేదు!**
**బండ మాత్రము పాప మందుండిపోయె!**

## 54

గురివిసెట్టి వ్యాపారము చక్కగా చేసికొనుచు, ధనమార్జించుకొనుచున్నాడు. "గంగాధరు"డను సంగీత విద్వాంసుడు అతనికి సంగీతము నేర్పనారంభించెను. గురివిసెట్టి సంగీతము పిచ్చిలో పడి వ్యాపారము పాడుచేసికొనెను. అవసరము కాని విషయములలో తలదూర్చరాదు!

**క॥ లింగాల గురివిసెట్టికి**
**గంగాధరుడేమి గతులు కల్పించెనయా?**
**బంగారువంటి కోమటి**
**సంగీతముచేత బేరసారములుడిగెన్ !**

## 55

శ్రీనాథుడు దాహబాధితుడై పరమేశ్వరుని పరియాచకమాడుచు యాచించిన విధానము:-

**క॥ సిరిగలవానికి చెల్లును**
**తరుణుల పదియాఱువేల తగ పెండ్లాడన్!**
**తిరిపమున కిద్దఱాండ్రా?**
**పరమేశా! గంగ విడువు, పార్వతి చాలున్!**

## 56

తండ్రిలోనున్న మంచిగుణములు కొడుకునకు వచ్చుట చూడగలము, అభినందించగలము! తండ్రి దుర్గుణములు పుణికి పుచ్చుకొన్న జమీందారు

కామయ్యగారి పుత్రునుద్దేశించి నిందాపూర్వకముగా కవి చెప్పిన పద్యమిది! గాడిద – కాకి – కుక్క అనునవి నీచప్రాణులు. ఇది శ్రీనాథుని చాటువు.

**ఉ॥ మా 'కలిదిండి కామయ' కుమారకు డన్నిట తండ్రి పోలికే!**
**కాక మఱొక్కడెట్లగును? గాడిదకుం తురగంబు పుట్టునే?**
**చేకొని కొంకినక్కకును సింగము పుట్టునె? మాలకాకికిన్**
**కోకిల పుట్టునే? చిఱుతకుక్కకు మత్తగజంబు పుట్టునే?**

**57**

హాస్యములో ఆత్మాశ్రయ హాస్యమున్నది. హాస్యబ్రహ్మ సృష్టి సర్వతోముఖము, అడిదము సూరకవి పుత్రుడు వికృతముగా నుండెడివాడట! అట్టి తన పుత్రుని నుద్దేశించి ముద్దుగా చెప్పిన పద్యముగా ప్రసిద్ధి:–

**క॥ బాచా బూచుల లోపల**
**బాచన్నే పెద్దబూచి పండ్లుం దానున్!**
**'బూచన్న' రాత్రి వెఱతురు –**
**బాచన్నను చూచి పట్టపగలే వెఱతుర్!**

**58**

జాషువాకవి పూర్వకవులను ముక్తపదగ్రస్తములో ఎంత హాస్యరసాత్మకముగా స్తుతించెనో చూడుడు:

**సీ॥ విజయవిలాసుని వినుతింపఁదలచిన,**
**జక్కన్న కోరమీసాలు దువ్వె!**
**జక్కన కవనంబు చక్కనిదని పల్క,**
**పినవీరకవి నాల్క వెళ్ళబెట్టె!**
**పినవీరకవి పల్కువెలదికి మగడన్న,**
**గండపెండారము ఘల్లుమనియె!**
**పెద్దన్న కవితకు పెదతాతయని పల్క,**
**రామభూషణు డంబరంబు చూచె!**

**తే॥ భట్టుమూర్తికి కవిరాజుపట్టమీయ,**
**తిట్టి లింగడు చేపలబుట్ట చూపె!**
**అందఱందఱు మహనీయులని తలంచి**
**ఒక నమస్కార మొనరించి ఊరకుంటి!**

**59**

భువనవిజయ సభలో **"రాజనందనరాజ రాజాత్మజులు సాటి తలప నల్లయ వేమ ధరణిపతికి"** అను సీసపద్యము నాలుగు పాదములను అట్లేయిచ్చి, ఎత్తుగీతిలో **"భావ భవభోగ సత్కళా భావములను"** అను నాలుగు పాదములిచ్చి, అర్థము విశదీకరింపుడని ఒక పరదేశకవి ప్రశ్నించెనట! తెనాలి రామలింగడు **"దానికి నేనర్థము వివరించెద. ఈ సీసమునకు అర్థము చెప్పుము!"** అని యిచ్చిన పద్యముగా ప్రసిద్ధినందిన సీసము:-

**సీ॥ మేకతోకకు మేక, మేకతోకకు మేక,**
**మేకతోకకు మేక, మేకతోక!**

(ఇట్లే తక్కిన నాల్గుపాదములు చెప్పి)

**తే॥ మేక మెకమేక మెకమేక మేక మేక!**
**తోక తొకతోక తొకతోక తోక తోక!**

(ఇట్లే తక్కిన రెండు పాదములు)

మేకలగుంపు నడచు విధానము: మేక – తోకకు మేకగా పోవును. మేకలగుంపు సెలయేటిలో నీరు త్రాగువేళ ముందునుండి చూచిన **"మేక–మెకమేక–మెకమేక – మేక మేక!"** అన్నియును మేకలే! వెనుకనుండి చూచిన **"తోక–తొకతోక–తొకతోక –తోక తోక!"** అన్నియును తోకలే! ఈ పద్యములో మేకలగుంపు నడచు విధానము, నీరు త్రాగునప్పుడు ప్రక్క ప్రక్కలుగా నిలచు విధానము – దానిని ముందునుండి – వెనుకనుండి చూచినప్పుడు కన్పించు తీరు "మ–క–త" అను మూడక్షరములతో చిత్రించినాడు మహాకవి!

ఒకే అక్షరముతో చెప్పిన వాక్యము: **"కాకీక కాకికి కాక కుక్కకా?"**. పిండి ఆరబోసి, కాకులు రాకుండా కాకీకలు గ్రుచ్చి పెట్టినదట ఇల్లాలు. కుక్క వచ్చి

పిండి బొక్కినది. "కాకీకలు, కాకులను బెదరింపగలవు కాని, కుక్కను భయపెట్టగలవా?" అని భావము. ఒకే అక్షరముతో చెప్పిన పద్యములు కూడ మన సాహిత్యములో నున్నవి!

**60**

వికృతాకారుడు, బ్రతుకు తెరువు లేనివాడు అయినను, మగవాడైన చాలును! కట్నములిచ్చి పిల్లలనిచ్చువారున్నారని, కట్నములను అధిక్షేపించుచు ఒక కవి శివునితో–

**క॥ గణపతికి పెండ్లి చేయవు!**
**'మని' లేదా మాకు పంపు! మగవాడైనన్,**
**కనుముక్కుతీరు లేకు**
**న్నను, భువికట్నంబు లెదురునడచును శంభో!**

**61**

గిరిజా కల్యాణము అను కావ్యమును గంటి కృష్ణవేణమ్మగారు రచించిరి. ఆ కావ్యములో బ్రహ్మ విష్ణు మహేశ్వరులు వివాహభోజనవేళ సరససంభాషణలు:–

విష్ణువు శివునితో –

**ఆ॥ విసము తిన్ననోట కసవయ్యె కాబోలు**
**భక్షణంబులెల్ల పార్వతీశ!**
**అట్టి దివ్యమైన ఆహారములు లే**
**వటంచు బల్కె విష్ణు దభవుతోడ –**

అప్పుడు శివుడు –

**ఉ॥ నిక్కము నీవు పల్కినది నీరజనాభ! ఇటెందు మ్రుచ్చిలన్**
**చిక్కదు వెన్న! తెత్తుమన చిక్కవు ఎంగిలి కాయలెందు, నీ**
**కెక్కడఁ దెత్తుమయ్య అవి యిప్పుడటంచు శివుండు నవ్వినన్,**
**అక్కడ పంక్తిభోజనమునందు పకాలున నవ్విరందఱున్.**

విష్ణువు బ్రహ్మతో –

**తే॥ వండి వడ్డింప దొకనాడు వనిత నీకు**
**ఉండు తలవాకిటనె గాన – ఓ విధాత!**
**భుక్తి సలుపుమ యిపుడైన బొజ్జనిండ–**
**అనుచు పరిహాసమాడె నా హరియు నపుడు.**

**62**

లోకము ఎంతటి స్వార్థపరతంత్రమో వివరించుచు – తిరుపతి వేంకట కవులు వీరేశలింగముగారిపై చెప్పిన సీసపద్యము –

**సీ॥ 'మా డబ్బు చెడదొబ్బ మా పెబుద్దుండ' ని**
**మంగలివాండ్లు తన్నుం గణింప–**
**పెండ్లములకు వండిపెట్టగా సుఖియించు**
**వారలెల్లరు తన్ను దూరుచుండ –**
**విద్యార్థులును మెట్టవేదాంతులును గూడి**
**తన్ను నేవేళ నిందను నొనర్ప –**
**మును చచ్చినట్టి మగని తద్దినంబెట్టు**
**అని బుధవరులు వాదొనరcజేయ –**
**తే॥ అన్నిటికి నోర్చి 'విధవలౌ సంగనలకు**
**భ్రూణహత్యలు జరుగక పోవుగాక!'**
**అంచు పెండ్లిండ్లు చేయ యత్నించుచుండె**
**కందుకూరి వీరేశలింగప్రధాని!**

(విధవా స్త్రీలకు ముందనము చేయుట ప్రాచీనాచారము, ఆ పని మంగళ్ళకు పోయినది! విధవలు అయా యిండ్లలో వంటలు వండుతూ ఉంటే, గృహిణులు హాయిగా కూర్చునేవారు. భార్యలు పనిచేయనవసరం లేదని గృహస్థులు ఆనందించేవారు. విధవా వివాహాలతో గృహస్థులకు ఆ ఆనందం పోయింది. ఇప్పుడు వారు కందుకూరి వారిని తిట్టుకుంటున్నారు. విద్యార్థులు–మెట్టవేదాంతులు

విధవాస్త్రీలతో నెయ్యము చేసెడివారు! విధవరాలు వివాహమాడినచో "మొదటి భర్తకు తద్దినము నెవరు పెట్టింతురు?" అని బుధవరులు చర్చింతురు).

**63**

రామకృష్ణ కవులకు కవిత్వధార యున్నంత మాత్రమున అవధానమునకు సరిపడరని చెప్పుచు తిరుపతి వేంకట కవులు ఈ సన్నివేశమును చెప్పిరి, ఒకనికి దారిలో ఒక గుఱ్ఱపు లాడము (గుఱ్ఱము నాల్గుకాళ్ళకు గుండ్రముగా నుండు ఇనుప కట్టులు) దొరకినది! "నేను గుఱ్ఱపుస్వారి చేయుటకు ఇంక మూడు లాడములు, ఒక గుఱ్ఱము మాత్రమే తక్కువ" అనుకొన్నాడట ఆ వెఱ్ఱివాడు?

**శా॥ దారింజిక్కిన లాడమొండు గని, మోదంబంది, యీ మీద నే**
**స్వారింజేయగ మూడు లాడములు అశ్వమ్మొక్కడుం దక్కువం**
**చూరంజొచ్చినభంగి బాలకవులేదో కొంచెమార్జించి, ఆ**
**ధారాధారమునన్ భవత్పదవికై యత్నించుచున్నారహో!**

– అని కామేశ్వరీమాతకు విజ్ఞప్తి చేసిరి.

**64**

తిరుపతి వేంకట కవులు: "వ్రేలున్నంత మాత్రమున గారెల పిండివంట పూర్తి కాదు! ధారయున్నంత మాత్రమున అవధానమునకు అర్హులు కారు!" అనుచు–

**ఉ॥ గారెల పిండివంటకయి కాంతుడు కాంతను పృచ్ఛసేయ, ఆ**
**సారసనేత్ర వ్రేలొకటి చయ్యనజూపి "యిదొక్కటున్న దా**
**ధార"మటన్న సామెతగ ధారయొకించుక గల్గినంతనే**
**వీరవధానపుంబనికి వీరిడులై యతినించి నారహో!**

**65**

కందుకూరి వీరేశలింగం పంతులుగారు క్లాసులో (రాజమండ్రిలో) ఆటవెలది పద్యానికి గల ఛందోనియమాలను చెపుతున్నారు:

**'ఇనగణ త్రయంబు, ఇంద్ర ద్వయంబును**
**హంస పంచకంబు ఆటవెలది'**

– అనే లక్షణం బోర్డుమీద వ్రాసి వివరించారు.

"మూడు సూర్యగణాలు, రెండు ఇంద్రగణాలు 1, 3 పాదాలలో ఉంటాయి. 2,4 పాదాలలో ఐదును సూర్యగణాలే! ప్రతిపాదంలోనూ 1-4 గణాధ్యక్షరాలకు యతి" - అని బోధించి, చివరలో బోర్డుమీద -

**'ఆటవెలది మీర లారసి చేయుడీ!**
**చేయకున్న మీకు సిగ్గుచేటు'**

- అని ఆటవెలది రెండు పాదాలు వ్రాశారు.

మర్నాడు విద్యార్థులందరూ ఆ తక్కిన రెండు పాదాలూ పూర్తిచేసికొని వచ్చారు. పంతులుగారు అన్ని పూరణలూ చూచి, ఒక విద్యార్థి భుజం తట్టి "చాలా బాగా పూర్తిచేశావురా!" అని మెచ్చుకున్నారు. అతని పూరణ ఈ క్రింది విధంగా ఉంది:

**'సిగ్గు లెన్నియున్న చెదరిపోవును కద**
**ఆటవెలది చెంత ఆర్యులార!'**

"ఆటవెలది" శబ్దానికి రెండు అర్థాలున్నాయి: (1) ఆటవెలది ఛందము (2) వేశ్య. రెండవ అర్థంలో చమత్కారంగా పూర్తిచేసి గురువుగారి ఆశీస్సులు పొందిన ఆ విద్యార్థి "కూచి నరసింహంగారు".

## 66

ఉ॥ **ఫుల్లసరోజనేత్ర! అల పూతనచన్నుల చేదుద్రావి నా,**
**డల్ల దవాగ్ని ద్రింగితి, నటంచును నిక్కెద వేల? తింత్రిణీ**
**పల్లవయుక్తమౌ నుడుకు బచ్చలి శాకము జొన్నకూటితో**
**మెల్లన నొక్కముద్ద దిగద్రింగుము! నీ పస కాననయ్యెడిన్!**

**"తిరుగగావలె దేశదేశాల వెంబడి"** - మహాకవి లక్షణము దేశ సంచారము. శ్రీనాథుడు పల్నాటిసీమలో ఆ కాలములో తాను తిన్న "కుభోజనము" నుద్దేశించి చెప్పిన చాటువు. బచ్చలిని చింతాకుతో కలిపి ఉడికించిన కూరను జొన్నకూటితో పెట్టిరట! ఆ భోజనవేళ దేవుడు కన్పించినాడు. ఆ కృష్ణపరమాత్మతో చెప్పిన పద్యమిది!

## 67

'చంద్రశేఖర శతకము' ను మూర్ఖులభాషలో రచించినాడొక శతకకవి. ఒక మూర్ఖుడు తాను పొందిన భాగవత పురాణ అనుభూతిని వివరించుచున్నాడు:-

**ఉ॥ "గంటము పేర యింటను బగాతము సెప్పితె యీదిలోన ఓ**
**రెంటిలి సూత్తినేను! ఇను! రేత్రి రమేండము బాగసెప్పె ! మా**
**యింటి! దురోదనుండు బవు ఇద్ద మిబీసను సేసి, లంకలో**
**మంటెలిగించి వచ్చె" నను మందుడు మూర్ఖుడు చంద్రశేఖరా!**

(బగాతము = భాగవతము; ఓరెంటిలి = ఓరంత ప్రొద్దు = దినమంతయు; రమేండము = రామాయణము; మాయింటి = మహావిన్నాను; దురోదనుండు = దుర్యోధనుండు; ఇద్దమిబీసను సేసి = యుద్ధము విభీషణునితో చేసి; మందుడు = చొరవలేనివాడు.)

## 68

"మీ మాటలు మంత్రంబులు మీ మెట్టినయెడ ప్రయాగ" అను పద్యము ప్రవరుడు సిద్ధునితో చెప్పినది; మనుచరిత్రములోనిది. మనుచరిత్రమునకు పేరడీగా "దుర్మార్గ చరిత్రము"ను విష్ణుభొట్ల సుబ్రహ్మణ్యేశ్వర కవి రచించెను. అందులో పై కందపద్యమునకు అనుకృతిగా –

**క॥ మీ మాటలు శూలంబులు!**
**మీ మెట్టినయెడ శ్మశానమేదిని! మీ అం**
**ఘ్ర్యామల తోయములు కిటి**
**స్తోమేడిత కర్దమములు శుంఠాధ్యక్షా!**

కిటి – స్తోమ – ఈడిత – కర్దమములు = పందుల సమూహముచే పొగడబడిన అడుసులు (బురదలు).

## 69

మనుచరిత్రలో ప్రవరుడు సిద్ధుని యాత్రలనుగూర్చి ప్రశ్నించుచు "ఏయే దేశములం జరించితిరి? మీ రేయే గిరుల్ చూచినారు?" ఈ యాదిగా ప్రశ్నించును. ఆ పద్యమునకు అనుకృతిగా దుర్మార్గచరిత్రములో –

**శా॥ ఏ యే వేశ్యగణంబు నారసితి? రే యే శిష్టులం దిట్టినా?**
**రే యే కొంపలయందు జొచ్చితిరి? మీ రే చెఱ్ఱులం బూడ్చినా?**
**రే యే దారుల కంప గొట్టితిరి? మీ రే తోటలం బీకినా?**
**రా యా దుష్ట విదుష్ట చేష్టలను భ్రష్టా! నాకు చెప్పంగదే!**

(పేరడీలోని హాస్యము మూలమెరిగిన వారికే ఆస్వాద్యము! మిమిక్రీ, అసలు వ్యక్తి సంభాషణ తీరు నెఱిగిన వారికే ఆనందకరము! మనుచరిత్రయందలి పై పద్యములు వచ్చిన వారికే యిందలి హాస్యము గిలిగింత పెట్టును.)

## 70

'చంద్రరేఖా విలాపము' నీలాద్రిరాజును శపించుచు వ్రాసిన కావ్యము. నీలాద్రి భూపుండు తన ఉంపుడుకత్తెను నాయికగా, తనను నాయకునిగాచేసి, కృతి రచింపుమని, చివరకు తన శూన్యహస్తములు చూపినాడు. అప్పుడు జగ్గకని. 'విలాసము'ను 'విలాపము'గా మార్చెను. అందలి ప్రార్థన పద్యము:

శా॥ శ్రీకంఠుండు, భుజంగ భూషణుడు, భస్మీభూత పంచాస్త్రు, డ
స్తోకాటోప బలప్రతాప పురరక్షాదక్ష సంశిక్షణుం,
డాకాశోజ్జ్వల కేశపాశుడు, త్రిశూలాంకుండు, రుద్రుండు, తా
వీకన్ చింతలపాటి నీలనృపతిన్ వీక్షించు నేత్రత్రయిన్!

గరళ కంఠుడు-సర్పభూషణుడు-మన్మథుని భస్మము చేసినవాడు- పురనాశకుడు, త్రిశూలాంకుడు, రౌద్రముగా చింతలపాటి నీలాద్రిరాజును మూడు నేత్రములతో చూచుగాక! ఇది శాపము! (పరికరము - నాశనము)

## 71

క్రీ.శ. 1932లో "అనంతపంతుల రామలింగస్వామి" అనుకవి "శుక్లపక్షము"అను హాస్యకావ్యము వ్రాసి ముద్రింపించెను. అందు కుకవినింద చేయుచు ఈ హాస్యకవి:

**సీ॥ <u>రసము</u> నే నెఱుగనా? ప్రారబ్ధమిదియేమి?**
**ద్రవిడదేశాన్నసత్రముల నిడరె?**
**సముచి<u>తాలంకార</u>సమితి నే నెఱుగనా?**
**మగువలు ధరియించు నగలు కావె?**
**<u>యతి</u>ని నే నెఱుగనా? క్షితిలోన**
**కాషాయవస్త్రధారుండైనవాడు కాడె?**
**<u>గురువు</u> నే నెఱుగనా? సరి సరి! అక్షరా**
**భ్యసనంబు సల్పిన యతడు కాడె?**

**తే.గీ. <u>శబ్దమన</u> నే నెఱుంగనా? చప్పుడు గదె?**
**అనుచు వచియించు అజ్ఞానజనములోన**
**అగ్రగణ్యుండవగు నీ వహా! కవిత్వ**
**మును రచించుట భాషకు ముప్పు గాదె?**

**72**

జలసూత్రం రుక్మిణీనాథశాస్త్రి (జరుక్ శాస్త్రి) కవి, హాస్యప్రియుడు, మహా పండితుడు! అతడు నాయని సుబ్బారావు – రాయప్రోలు – కృష్ణశాస్త్రి – విశ్వనాథ – శ్రీశ్రీ మొదలగు పేరెన్నికగన్న కవులను వారిస్థాయిలో అనుకరించినాడు! మూలపద్య మెఱిగినవారికే ఇందలి హాస్యము పరిమితము. నాయనివారు చంద్రాస్తమయము నుద్దేశించి –

**తే.గీ. ఎవ్వడా క్రూరకర్మరు డెవడు? నీల**
**జలద నిర్ముక్త శైశిర శర్వరీ ప్ర**
**శాంత మలవాటుపడిన నిశాంతమందు**
**అకట! నట్టింటి దీపమ్ము నార్పినాడు?**

జరుక్ పేరడీ:

**తే॥ ఎవ్వడా చచ్చునాగమ్మ యెవడు?**
**నేను ప్రేయసీ విరహాన నిర్మించుకొన్న**
**రమణి మంజుల ప్రణయ చిత్రమ్ముపైన**
**నిండు నీల్కాలు బుడ్డి తన్నేసినాడు?**

**73**

"చిన్న చిన్న మాటలతో ఏదో గొప్ప అర్థాన్ని బోధింపజేస్తున్నాను" అను భావం రాయప్రోలు సుబ్బారావుగారిది! తృణకంకణములో కొన్ని పద్యములకు జరుక్ శాస్త్రి పేరడీ:

**క॥ అచ్చనగాయలు, పూల్,**
**జడకుచ్చులు, ముగ్గులును, తెలుగు కోమలివేరా!**
**మచ్చరము మర్మమెఱుగదు**
**పచ్చని కర్పూరమన్న భావకవివిరా!**

## 74

ప్రముఖకవి డా॥ గుంటూరు శేషేంద్రశర్మగారు కాలేజీలో చదువుకునే రోజుల్లో తన స్నేహితునితో కలిసి ఆశుకవిత్వం అభ్యాసం చేసేవారు. ఇద్దరూ ఒకే గదిలో నివసించేవారు. శేషేంద్రగారికి రాత్రి పదిగంటలు కాగానే నిద్ర ఆవరించేది. స్నేహితుడేమో ఇంకా లైటు వేసుకుని చదువుతూ ఉండేవాడు. అప్పుడు శేషేంద్ర **"ఏమయ్యా! పదియైన దింక పదుకో!"** అనేవారు. వెంటనే స్నేహితుడు: **"ఏడ్చావులే ఊరుకో!"** అనేవాడు. ("శార్దూల విక్రీడితం" పద్యంలో ఒక పాదం పూర్తి అయిపోయింది). ఇలా నడిచేది. సర్వకాల సర్వావస్థలయందూ వాళ్ళ ఆశుకవితాభ్యాసం. ఎవరైనా వాళ్ళని, "ఎందుకండీ ఈ ఆశుకవిత్వం? ఏదయినా మంచి పుస్తకం వ్రాయకూడదా?" అంటే – **"వ్రాయుటయన్న ఎంతపని? వ్రాయగలారము గాని"** – అని ఒకడు అంటే, **"కాని ఆదాయము లేక వృథాయని ధీ యనిశంబు దెల్పుటన్"** – అని రెండో వాడనేవాడు. వెంటనే **"వ్రాయుట మానినారము"** అని మొదటివాడు వాక్యం పూర్తిచేసేవాడు. ఇలా సాగినవారి ఆశు కవితా సంభాషణలో, ఛందోబద్ధముగా అలవోకగా ఉత్పలమాల పద్యములో రెండున్నర పాదములు సలక్షణముగా పూర్తి అయిన తీరును గమనింపుడు:

**ఉ॥ వ్రాయుటయన్న నెంతపని? వ్రాయగలారముగాని, కాని ఆ**
**దాయము లేక వ్రాయుట వృథాయని ధీ యనిశంబు దెల్పుటన్**
**వ్రాయుట మానినారము!. . . . . . . . . . . . . . . . . . . . .**

ఆ యువకవి మిత్రులిద్దరూ కలిసి ప్రొద్దున్నే కాఫీ హోటల్కు బయల్దేరే వాళ్ళు. హోటలు అల్లంత దూరాన ఉండగానే ఒకడు 'పులిపాటి'లా గొంతెత్తి: ("అదిగో! ద్వారక..." శైలిలో) ...

**మ॥ అదిగో హోటలు! కాలభైరవ వరాహవ్యూహ కోలాహలా**
**స్పదమై, భక్షక మక్షికా తుముల దృశ్యద్వార దుర్దాంతమై,**
**మద మాతంగ తురంగ సంగర ధరా మధ్యంబుగా దోచు, నా**
**సదనంబున్ దరియంగ జొచ్చుకొనగా శక్తుండనే మిత్రమా!**

వెంటనే రెండోవాడు లంకించుకొనేవాడు:

**శా॥ నేనుండంగ ప్రచండ భండన కళా నిష్ణాతుడన్ బాలకా!**
**లోనన్ నీకు భయంబదేల? పద, కల్లోల ప్రపంచంబునన్**
**లీనంబై, పెసరట్లు గారెలును ఇడ్లీల్ చీల్చి చెండాడు నీ**
**జాను వ్యాప్తములైన బాహువులతో సవ్యాపసవ్యంబుగన్!**

"ఈ విధంగా కురుక్షేత్రయుద్ధంలో కాఫీ అధ్యాయం ముగిసేది" – అని శేషేంద్రశర్మగారు తమ "జనవంశమ్" అనే కావ్యకృతిలో "చంపూకాండ"లో – "సాహిత్యఖండం" లో వ్రాసుకున్నారు: (చూ. పుటలు 173, 174).

**75**

శ్రీకృష్ణదేవరాయలవారి దగ్గర "తిమ్మన" అనే మహావీరుడు ఆయనకు అంగరక్షకుడుగా ఉండేవాడు. అతని ధైర్యసాహసాలకు మెచ్చుకొని రాయలవారు ఒకసారి అతనికి రత్నాలు పొదిగిన ఒక శాలువాను బహూకరించారు. ఒకరోజు అతడు ఆ శాలువాను కప్పుకొని ఇంటిముందు అరుగుమీద కూర్చున్నాడు. అష్టదిగ్గజ కవులలో నలుగురు ఆ వీథిగుండా వెడుతున్నారు: అల్లసాని పెద్దన, ముక్కుతిమ్మన, భట్టుమూర్తి, తెనాలి రామకృష్ణుడు. తిమ్మణ్ణి చూడగానే వారికి ఒక పద్యం చెప్పాలని పించింది. మొదట పెద్దనగారు ఎత్తుకున్నారు. **"వాకిట కావలి తిమ్మా!"** అన్నారు. ఇది కందపద్యంలో మొదటిపాదం. వెంటనే నందితిమ్మనగారు: **"ప్రాకటముగ సుకవివరుల పాలిటి సొమ్మా!"** అన్నారు. కందపద్యంలో రెండవపాదం అయి పోయింది. మూడవ పాదాన్ని భట్టుమూర్తి (రామరాజభూషణుడు) **"నీకిదె పద్దెము కొమ్మా!"** అని పూరించాడు. వెంటనే నాల్గవపాదాన్ని పూరిస్తూ **"నాకీ పచ్చడమె చాలు నయముగ నిమ్మా!"** అన్నాడు మన తెనాలి రామకృష్ణుడు. కావలి తిమ్మన వెంటనే తాను కప్పుకున్న రత్నాల శాలువాను రామకృష్ణునకిచ్చి, తక్కిన కవులను కూడా యథోచితంగా సత్కరించి పంపించాడు. మొత్తం పద్యం ఇప్పుడు చూద్దాం:–

**కం॥ "వాకిట కావలి తిమ్మా!**
**ప్రాకటముగ సుకవివరుల పాలిటి సొమ్మా!**
**నీకిదె పద్దెము కొమ్మా!**
**నాకీ పచ్చడమె చాలు నయముగ నిమ్మా!"**

**76**

'హరికథా పితామహుడు' ఆదిభట్ల నారాయణదాసుగారు బహుభాషా కోవిదులు. వారు ఒకప్పుడు ఇంగ్లీషు పద బాహుళ్యముగా చేసిన ఈశ్వర ప్రార్థనము:

**ఉ॥ హెడ్డున మూను, స్కిన్ను పయి నెంతయు దస్టును, ఫైరునేత్రమున్,**
**సైడున గ్రేటు బుల్లు, బహు చక్కని గాంజెసు హైరులోపలన్,**
**బాడికి హాఫెయౌచు నల పార్వతి మౌంటెను డాటరుండ, ఐ**
**షుడ్డు డివోటు దండములు సోకగ ప్రేయరుసేతు నెప్పుడున్!**

(తలపై నెలవంక – భస్మాంగరాగము – ఫాలనేత్రము – ప్రక్కననంది – శీర్షమున గంగ – శరీరార్ధముగా పార్వతి – ఈ ఆరులక్షణములతో సాక్షాత్కరించు శివుని ప్రార్థింతును).

**77**

వివాహములో కవితాశీస్సులు అందించుట ఆచారము. వధూవరులు ఆంగ్లభాషలో డిగ్రీలు పొందినవారు. వరుడు పెద్ద డిగ్రీలు విదేశములలో సాధించినవాడు. ఆశీస్సులను అందించు కవి పంచరత్నములతో ప్రవేశించినాడు. మొదటి పద్యములో శివ పార్వతులు – రాధాకృష్ణులు – సీతారాములు మిమ్ము రక్షించగాక! – అన్నాడు. రెండవ పద్యములో ఉభయ కుటుంబములను, మూడవ పద్యములో వధూవరుల తల్లిదండ్రులను అభివర్ణించి, ఆ కుటుంబములకు వన్నె తెచ్చు ఆదర్శదంపతులుగా జీవింతురు గాక! – అన్నాడు. నాల్గవ పద్యములో వధువును చెల్లిగా సంబోధించి, భర్తతో మెలగవలసిన విధానమును సీసపద్యములో విశదీకరించినాడు:–

**సీ॥ హజ్బెండు తెచ్చిన అన్వ్యాల్యు థింగైన**
**'మోస్టు బ్యూటీ' యంచు మురిసికొనుము!**
**రిక్వెస్టు చేయగా రెఫ్యూజు చేయక**
**'థేంక్సని' యద్దాని తీసికొనుము!**
**సిల్లిగా ఎపుడైన చిలిపి చేష్టలు చేయ**
**సీరియస్ కాబోకు చెల్లి నీవు!**

**ఆఫీసు వేళైన, కాఫీకి లేటైన**
**"సారీ"ని చెప్పుమా సారసాక్షి!**
**తే॥ ఆంగ్లభాషకు అలవడ్డ అయ్యవార్ల**
**తోడి కాపురమును చేయు జాడ లెఱిగి**
**స్త్రీలు వర్తించు నట్టివౌ సీకిరేట్లు**
**ఎఱిగి మసలిన వారికి హెవెను మెట్లు!**

**78**

అనుకరణ (పేరడీ) పద్యములు హాస్యమును పుట్టించును. సుమతీ శతకములో–

**క॥ అక్కఱకు రాని చుట్టము,**
**మ్రొక్కిన వరమేని వేల్పు, మోహరమున దా**
**నెక్కిన బారని గుఱ్ఱము,**
**గ్రక్కున విడువంగ వలయు గదరా సుమతీ!**

పై పద్యమునకు పేరడీ:

**క॥ అక్కరకు రాని బస్సును,**
**చక్కగ సినిమాకు రాక సణిగెడు భార్యన్,**
**ఉక్కగ నుండెడు కొంపను,**
**గ్రక్కున విడువంగవలయు గదరా సుమతీ!**

**79**

మోడరన్ లివింగ్: ఈ కాలములో బాధ్యతారహితులైన కొందరు యువకుల లక్షణములను తెలుపుచు ఆంగ్లపద బాహుళ్యముగా వ్రాసిన సీసపద్యము:–

**సీ॥ సందులో శ్టాండింగు, సతులకై వెయిటింగు,**
**మోడరన్ డ్రస్సింగు, పోజ్ గివింగు!**
**సిగరెట్సు స్మోకింగు - సినిమాస్కు గోయింగు,**
**ఫ్రెండ్సుతో మూవింగు, వాండరింగు!**

ఇరిటేటు మైండింగు, హిప్పీసు కట్టింగు,
రెకులెస్సు టాకింగు, రీజనింగు!
కోయిన్సు స్పెండింగు, గుడ్నాట్టు హియరింగు,
రెఛడుగా హెడ్‌స్ట్రాంగు రిప్లయింగు!

తే॥ విలను పోజింగు, తండ్రికి వేవరింగు,
తల్లి ఫియరింగు, కార్యసాధన నథింగు,
భవ్యవైఖరి తమ్ముళ్ళు ఫాలొాయింగు
రాంగు గోయింగు ఈ మోడరన్ లివింగు!!

## 80

**ఉపన్యాస గర్దభులు:** నీచోపన్యాసకులు సభ్యులను వేధించుట – విసిగించుట చేయుదురు. అట్టి ఉపన్యాసకులను గూర్చి:–

సీ॥ 'గొడవగా నున్నారు కూర్చుందునా?' యని
కూర్చుండ డిదియేమి గొడవవచ్చె!
హస్తసంజ్ఞలు చేసి ఆపుమన్నను గాని
ఆపుచేయ డిదేమి పాపమొక్కొ!
తనమాట వినిపించుకొనుచుండిరో లేదొ
గమనింప డిదియేమి ఖర్మమొక్కొ!
చప్పట్లు కొట్టిన, చాలు చాలన్నను,
దిగకుండె నేమి తద్దినము వచ్చె!

తే॥ అనుచు గడియారములు చూచునట్టివారు,
లేచిపోవంగ అటునిటు చూచువారు,
కలుగు సభలో నుపన్యాస గర్దభులన
అరచువారల కీ పద్య మంకితమ్ము!



# 1.4 ఏకాంతశృంగారపద్యములు

**1**

బలహీనుడు వణికిపోవునట్టి రెండు సన్నివేశములను బూతుకవి – కవిచౌడప్ప పేర్కొనుచున్నాడు:

**కll పరసతి గవయగ జనుచో,**
**అరుణోదయవేళ తానమాడం జనుచో,**
**పొరిపొరి వణకు నశక్తుడు**
**కరుణారస! కుందవరపు కవిచౌడప్పా !**

**2**

పొడుపు పద్యము:–

**ఆll జడలను ధరియించు – జడదారియును గాడు!**
**తల్లక్రిందునుండు – తపసికాదు!**
**బిడ్డల కనజేయు – బెమ్మదేవుడు కాడు!**
**దీని భావమేమి తిరుమలేశ ?**

(దీనికి ఇంచుమించుగా మూలమనదగిన సంస్కృత శ్లోకము ఒకటి ఉన్నది. సంస్కృత కవిత్వములో శృంగార శ్లోకములలో 35వ శ్లోకమును చూదుదు).

**3**

వీరశైవులు– వీరవైష్ణవులు నుందురు. వారి వీరభక్తిని అపహసించుచు బూతుకవి–

**ఉll జంగమురాలి బట్టి, యొక జంగము వంగగ బెట్టి, యోనిలో**
**లింగము బెట్టి క్రుక్కి యదలించుచు నొక్కొక తాకు తాకినన్,**
**'లింగ! నమశ్శివాయ! గురులింగ! మహేశ్వర! జంగమయ్య! ఓ**
**యంగజ భంగ! సాంబ! గురుదా!" యను తాకిన తాకు తాకుకున్!**

**4**

రోగభీతి – సంఘభీతి – అసమర్థత – కారణాలుగా వ్యభిచారము అదుపులో నున్నది. సుఖరోగ భీతితో చేతకాని కవి చెప్పిన పద్యము:–

**చ॥ ఇరవుగ నొక్కమారు విషయేచ్ఛనుగోరి సుఖించినంతనే**
**కొరుకు-సవాయి-పొక్కు-మధుమేహ - భగందర జాడ్యసంతతుల్**
**విరివిగ బుట్టి దేహమును వేదనపాలొనరించుగాన, ఓ**
**సురతపు సాధనంబ! భగదేవత! నీకిదె భక్తి మ్రొక్కెదన్!**

(2, 4 పాదములలో యతి భంగము)

**5**

ఒక కాముకుడు మంగలి కొండయ్యను కత్తిమ్మని అడుగుచున్నాడు. కారణము చెప్పుచున్నాడు. (ఆ కాలములో కత్తినిచ్చువాడు ఊరమంగలి).

**క॥ మత్తగజయాన యొక్కతె**
**క్రొత్తగ వచ్చినది, దాని కోరిక తీర్పన్**
**చిత్తజుకేళికి పోవలె,**
**కత్తీరా కొండ! శష్పఖండనమునకై!**

**6**

పద్యములల్ల నేర్చిన బ్రహ్మచారి అర్ధరాత్రి కామముతో మేల్కొన్నాడు. అప్పుడు ప్రజాపతి (బిడ్డల పుట్టించువాని) నుద్దేశించి చెప్పిన పద్యము:-

**ఉ॥ కూటమి నొక్కనాటికి త్రికోణ సహస్రములం బెకల్చు నీ**
**ధాటికి చల్లడంబులును, దారుణ గోణము, లంచుగోచులున్,**
**శాటులు నోర్వగా గలవె? చాలును నీదు విజృంభణంబయో!**
**యేటికి లేవబారితివి యీ సరిపొద్దుకడం బ్రజాపతీ?**

(శాటి = సన్న్యాసులు ధరించు వస్త్రము)

**7**

వ్యభిచారములో సుఖరోగముల బాధలు పొందినవాడు! అతనికి బుద్ధి వచ్చినది. అయినను అతని కామమునకు బుద్ధిరాలేదు! కామాంగము నుద్దేశించి - (శ్రీనాథుని పద్యముగా చెప్పుదురు). హాస్యము రామలింగానికి, బూతులు శ్రీనాథునకు మనవారంట గట్టుట యాచారము.

**ఉ॥ మాపట కొండవీటి కసుమాలపు తొత్తుల జూచి యేల యు**
**త్థాపనశక్తి చూపెదవు దబ్బఱ శిశ్నమ? వారి సౌమన**
**శ్చాప గృహాంతరాళతల జాగ్రదుదగ్ర నిరర్గళ వ్రణో**
**ద్దీపిత కాలకూట విషదిగ్ధ శరీరుల మున్నెఱుంగవే?**
(కసుమాలము = కశ్మలము, దబ్బఱ = మోసము లేదా విపత్తు)

**8**

బ్రాహ్మణులు రంభాసంభోగఫలప్రాప్తిని ఆశించి యజ్ఞములు చేయుటను పరిహసించుచు పండితకవి చెప్పిన పద్యము:-

**మ॥ శ్రుతిశాస్త్ర స్మృతు లభ్యసించుకొని విప్రుండంత నానాధ్వర**
**వ్రతుడై పోయి కనున్ పురందర పురారామద్రుమానల్ప క**
**ల్పతరుప్రాంత లతాకుడుంగ సుఖసుప్తప్రాప్త రంభాభగ**
**ప్రతిరోమాంకుర పాటనక్రమ కళాపాండిత్య శౌండీర్యమున్!**

(ఈ విప్రుడు నందన ఉద్యానములో - కల్పవృక్షచ్ఛాయలో - పొదరింట పరున్న - రంభ ఊరుమూల కేశముల పెకలించుటలో పాండిత్యము చూపగలడు! అంతకంటె నేమి చేయగలడు? (కుడుంగము=పొదరిల్లు; పాటనము= చీల్చుట (పెకలించుట); శౌండీర్యము= గర్వము)

**9**

శ్రీనాథుడు చెప్పిన పద్యస్థాయిలో ఉన్న పద్యము! ద్రవిడ సుందరి యొక్క గోప్యాంగమును పొందుట తన పుణ్యమనియు, ఆమెను వర్ణించుటకు బృహస్పతి కూడ అసమర్థుడనియు చెప్పుచున్నాడు. దుష్కర ప్రాసము:

**ఉ॥ గోష్పద రూపమై - మిగుల కోమలమై - గణుతింపరానిదై -**
**శష్పవిహీనమై - నునుపు చాలగఁగల్గి - ద్రవంబపారమై -**
**పుష్పిణియైన నీ భగము పుణ్యమునన్ భజియింపగల్గె, వా**
**స్తోష్పతికైన యో ద్రవిడ సుందరి! నిన్ను వచింప శక్యమే?**

(ఇది శ్రీనాథుని చాటుపద్యమే! సందేహం లేదు-తంగిరాల)

## 10

అవధిలేని - తనశక్తి నెఱుగని - కామము ఒక వయస్సులో పరవళ్ళు త్రొక్కు చుండును. కోరికలు దురాశగా నుండును. కళ్ళు మూసికొనియున్న యువకుడు అత్యాశతో వేశ్యాగృహము చేరినాడు. ఏబదియేండ్లలోపు వయస్సున్న ఆమె–తన –కూతురును – మనుమరాలిని – తనను పరిచయము చేసి – కూతురుతో నుండి అల్లుడవయ్యెదవా? నన్ను కూడి మగడవౌదువా? మనుమరాలితో నుండి మనుమడవయ్యెదవా? అని ప్రశ్నించు తీరును ఈ పద్యములో చూడవచ్చును:–

**ఉ॥ 'మొల్ల సుగంధి కూతురది ముంగిట నున్నది దాని చూడు, ము**
**త్ఫుల్ల సరోజనేత్ర వరపుత్రిక పుత్రిక దీని చూడు, మే**
**నెల్ల విధంబులన్ రతుల నేలిన దానను నన్ను చూడు, నీ**
**వల్లుడవయ్యెదో? మగడవయ్యెదొ? ముద్దుల మన్మడయ్యెదో?"**

కొందరు కవులు వేశ్యలతో గడపువారు. వేశ్యలుకూడ కవితలు చెప్పువారనుటకు రంగాజమ్మ, ముద్దుపళని వంటివారుదాహరణములు..

ఈ పద్యమునకు ఆ యువకవి సమాధానము అదే ప్రాసలో - అదే వృత్తములో "చూడు" అనుటకు బదులుగా "మాన" గా మూడుచోట్ల సవరించి చెప్పినాడు.

**ఉ॥ 'మొల్ల సుగంధి కూతురది ముంగిటనున్నది దాని మాన, ను**
**త్ఫుల్ల సరోజనేత్ర వరపుత్రిక పుత్రిక దీని మాన, నీ**
**నెల్ల విధంబులన్ రతుల నేలిన దానవు నిన్ను మాన, నే**
**నల్లుడనయ్యెదన్! మగడనయ్యెద! ముద్దుల మన్మడయ్యెదన్!!**

## 11

ఒక సత్యము చెప్పదలచి, మరియొక సత్యమును చూపుటయే 'దృష్టాంతము' అను అలంకారము.

**క॥ అనిమొన కేగెడి యోధుడు**
**అసువగు ఆయుధములేక అందునె జయమున్?**
**ననబోడి - (1) దూలను**
**ఘనమేఢ్రము లేక తీర్పగా తరమగునే?**

**12**

**క॥ సామజము చెఱకు మేసిన**
**దోమలు పదివేలు చేరి తోలంగలవా?**
**గ్రామపతి తగవు దప్పిన**
**గ్రామములో నున్నవారు కాదనగలరా?**

అను నీతిపద్యమునకు ఛాయయైన బూతుపద్యము:-

**ఆ॥ ఖ్యాతిగన్నవాడు నీతితప్పి చరింప**
**జగడమాడఁగలరె జగతి జనులు?**
**సోకు - (2) నిక్కి - (3) లో దూరంగ**
**- (4) లన్ని గూడి ఆపగలవె?**

**13**

బూతుకవిత్వములో కవిత్వలక్షణములు పరిపూర్ణముగా నుండును. అందుచేతనే "లోకుల రసనలె ఆకులు"గా అది నిలచినది. 'కాకరపఱ్ఱు' పశ్చిమగోదావరి జిల్లాలో తణుకు తాలుకాలో ఎన్నికగన్న పండితగ్రామము. నా చిన్నతనములో అచ్చట "కప్పగంతుల సుబ్బారాయుడు" అను కవి ఆశువుగా బూతుపద్యములు చెప్పిడివాడు! గ్రంథస్థము చేయు నలవాటు లేదు. ఆ పద్యములు గాలిలో కలిసిపోయినవి! అసభ్యములగుట సభలకెక్కలేదు! "జీర్ణమంగే సుభాషితమ్!" నేను విని ధారణచేసిన రెండు పద్యములు -

మొదటి పద్యములో భ్రాంతి మదలంకారము - రెండవ దానిలో స్వభావ చిత్రణము- ధారాశుద్ధి గొప్పది!

మోకాటి బంటిగా - తొడబంటిగా నీళ్ళున్నప్పుడు, కోకెత్తుకొని నీటిలో నడచుట పూర్వసంప్రదాయము.

**క॥ చేకూరి సుబ్బికూతురు**
**పేకేటికి పోవు కాల్వ వేగమ దాటన్**
**కోకెత్తి కాల్వ దిగబడ**
**బోకురు కప్పంచు పాము - (5)ం బట్టెన్!**

## 14

"అత్తిలి వెంకన్న" పొగాకు అమ్ముకొనువాడు. అతడు అమ్మక సంచారమునకు వెళ్ళినప్పుడు అతని ఆలిని ఒక మిండడు అనుభవించినాడు. ఆమె సంతోషముతో అతనికి ఒక పొగాకును ప్రతిఫలముగా నిచ్చినది!

**కు॥ అత్తిలి వెంకన యాలిని**
**యొత్తిగిల పరుండబెట్టి యోపికతోడన్**
**తత్తబక తబక తబకని**
**– (6) పగుల గొట్టువాని కిచ్చె పొగాకున్!**

## 15

అన్నముడికిన తరువాత అందలి గంజివార్చుట పూర్వసంప్రదాయము. ఆ గంజి ఏ మాత్రము కాళ్ళమీద పడినను చాలా ప్రమాదము. గంజివార్చుట ప్రమాదాత్మకము. ఒకామె భయపడుచు – అతి జాగ్రత్తగా ఊపిరి బిగబెట్టి గంజి వార్చుచున్నది! ప్రియుని పని ప్రియునిది! (స్వార్థకృత్యము పరులకు బాధాకరము కారాదు– అను జ్ఞానము లేని వ్యక్తులు).

**ఆ॥ కాంత యొకతె వేగ గంజి వార్చుచునుండ**
**ప్రియుడు – (7) పట్టి పిసకదొడగె!**
**కదల నొక్క – (8) కదలకుండిన – (9)**
**ఏమి చేయగలదు ఇంతియపుడు?**

కదలినను ప్రమాదమే (వేడిగంజితో) – కదలకున్నను ప్రమాదమే (విటునితో).

## 16

కంకంటి పాపరాజు (ఉత్తర రామాయణకర్త) మహాకవి! ఆయన పై చెప్పిన పద్యముగా ప్రసిద్ధి. 1, 2 పాదములు పాపరాజు పలుకులు. 3, 4 పాదములు వేశ్య సమాధానము.

**తే॥ "ఒంటిమెట్టను కాపురంబున్నయట్టి**
**సిద్ధసానికి సంకల్ప సిద్ధిరస్తు!"–**
**"చెలగి నామీద పద్యంబు చెప్పినట్టి**
**పాపరాజుకు సంగమప్రాప్తిరస్తు!"**

## 17

ఒకే పని, కర్తలు మారగా, ఫలితములు మారుట అద్భుతము. బ్రహ్మకు అసాధ్యములుండవని బ్రహ్మదేవునకు కవిచౌడప్ప జోతలిచ్చిన పద్యము:–

**శా॥ ఒద్దారంబు ఘటించె బ్రహ్మ వినరా ఓ రోరి! చన్మొక్కలన్**
**బిడ్డండంటిన పాలుగారు! అవియే ప్రేమన్ విభుండంటినన్**
**జడ్డం చెమ్మగు కాళ్ళసందుది! మహాసాధ్యంబె! ఆ బ్రహ్మకున్**
**దొడ్డా? కుందవరంపు రాయసుకవీ! ధూర్తప్రకారాగ్రణీ!**

## 18

కాకుళయ్య తిరునాళ్ళలో వేశ్యలతో పనిలేదు. బాలవితంతువులు దొరకుదురనుచు చెప్పిన పద్యము:– (పూర్వము తిరునాళ్ళలో వ్యభిచారములు అధికముగా జరిగెడివి).

**క॥ ముంజ పదనైన శంబర**
**భంజను గేహములు గల్గు బ్రాహ్మణ విధవా**
**పుంజములుండగ నూరక**
**లంజలు నేమిటికి కాకులయ తిరునాళ్లన్!**

(ముంజపదనైన= తాటిముంజలవలె మెత్తనైన లేక నునుపైన; శంబరభంజను గేహములు=మన్మథుని గృహములు)

## 19

'గుడిచేటిది' అనగా దేవాలయములలో నాట్యము చేయు దేవదాసి (వేశ్య), అట్టివేశ్యల నాట్యములు లేనిచో గుడికి అందము కాదు; ప్రజలకు ఆనందము రాదు – అనుచు కవిచౌడప్ప చెప్పిన పద్యము:

**క॥ లంజలు రాకుండిన, గుడి**
**రంజిల్లదు, ప్రజల మనసు రాగిల్లదు! ఆ**
**లంజల నేల సృజించెను**
**కంజజుఁడిల? కుందవరపు కవిచౌడప్పా!**

## 20

శ్రీనాథుని పద్యముగా కర్ణాటక స్త్రీ నుద్దేశించిన పద్యము:-

**శా॥ పంచారించిన నీ పయోధరము లాస్ఫాలింతునో? లేత బొ**
**మ్మంచుం గెంజిగురాకు మోవి ణిశి ధాత్వర్థం బనుష్ఠింతునో?**
**పంచాస్త్రోపనిషద్రహస్య పరమ బ్రహ్మస్వరూపంబు నీ**
**కాంచీదామ పదంబు ముట్టుదునొ? ఓ కర్ణాట తాటంకినీ!**

విటునకు ఆమెను చూడగా ముచ్చటగా మూడు కోరికలేర్పడినవి: పయోధరము లాస్ఫాలించుట-పెదవికి "ణిశి"ధాత్వర్థము(ణిశి=చుంబనే) అనుష్ఠింప గోరిక-కామోపనిషద్రహస్యస్థానమైన నడుమును కౌగిలించుట. (పంచారించిన =అతిశయించిన; ఆస్ఫాలించు = చఱచు; కాంచీదామపదము = కటిప్రదేశము).

## 21

శ్రీనాథుని పద్యముగా చెప్పుదురు. రాజమహేంద్రవరములో పండితు లొక్కచోట చేరి చేయు తర్కమును అవహేళనముచేయుచు నిరసించుచు బూతుకవి చెప్పిన పద్యము - "హంసీయానకు ఊరుమూలమున రోమములు లేవు! ఆ లేకపోవుట ప్రాగ భావమా? ప్రధ్వంసాభావమా?" అని తర్కింతురు. (ప్రాగభావము = ఘటములేదు. ప్రధ్వంసాభావము=ఘటమున్నది, కాని అది పగులగొట్టబడినది. ధ్వంసము చేయ బడుటచే ఇప్పుడు లేదు). అసలు రోమములు మొలవలేదా? లేక తీసివేయబడుటచే ఇప్పుడు లేవా? ఈ అభావము "ప్రాగభావమా?" లేక "ప్రధ్వంసాభావమా?" అని చర్చింతురట! (రాజమహేంద్రవరములోని పండితులను శ్రీనాథుడు అవహేళన చేసినాడు.)

**శా॥ హంసీయానకు గామికి న్నధమ రోమాళుల్ నభఃపుష్పముల్**
**సంసారద్రుమ మూల పల్లవ గుళుచ్ఛంబైన యచ్చోట వి**
**ద్వాంసుల్ రాజమహేంద్ర పట్టణమునన్ ధర్మాసనంబుండి 'ప్ర**
**ధ్వంసాభావము!' 'ప్రాగభావ'మనుచుం దర్కింతు రశ్రాంతమున్ !**

## 22

తూర్పుగోదావరిజిల్లాలో గౌతమీ తీరాన "పలివెల" గ్రామము వేశ్యలకు ఆనాడు ప్రసిద్ధి. వారి అశుభ్రత - అలవాట్లు - వారిని ఆశించిన వారికి గల్గు

దురవస్థలు – అనుభవ పూర్వకముగా గ్రహించిన కవి చెప్పిన పద్యము. 'అరనిముష భోగము – ఆరునెలల రోగము' అను సామెత యున్నది! (శ్రీనాథుని చాటువు)

**చ॥ ఉలిమిడి చెక్కయున్, మిగుల నుక్కయు, చప్పని రొట్టెముక్కయున్,**
**మలినపు గుడ్డలున్, నులక మంచపు కుక్కియుఁ, జీకటిల్లునుం**
**దలచిన రోతవచ్చు, నొకనాటి సుఖం బొకయేటి దుఃఖ, మీ**
**పలివెల వారకాంతల యుపస్థలకుం బదివేల దండముల్!**

**23**

తెలికుల స్త్రీ విటునితో "సంకేత స్థలమునకు వచ్చెద"నని కాళికాలయ దేవతపై ఒట్టుపెట్టి చెప్పినది. అయినను ఆమె రాలేదు! ఆ కవి కోపముతో కాళిక నుద్దేశించి చెప్పిన పద్యము: (ఇదియును శ్రీనాథుని చాటువుగానే ప్రసిద్ధికెక్కినది).

**చ॥ గొఱియలమేకపోతులను కొమ్ముపొటేళ్ళను గావుగొందు వీ,**
**వరయగ సందెకాడ తగవత్తునటంచు భవచ్చిరంబుపై**
**కరమిడి పోయినట్టి తిలఘాతుకురాలి తదీయ శష్పముల్**
**పెఱుకగలేవు, నీవు నొక భీకరమూర్తివె? కాళికేశ్వరీ!**

**24**

**శా॥ హైమగ్రావనితంబ, భూరికచభారాభీర, లున్మత్తలున్**
**కామాంధల్, వెలనాటి కోడెవిధవల్, కాకుళ్ళ తిర్నాళ్ళలో,**
**మా మాంధాతయు, భీమసేనుడు, హిండింబానందనుం, డోపితే**
**నేమోకాని, తెమల్పజాల రితరుల్ హేలారతిక్రీడలన్.**

శ్రీనాథుడు శ్రీకాకుళం తిరునాళ్ళకు వెళ్ళినప్పుడు పరువంలో ఉన్న వెలనాటి విధవలను చూసి చెప్పిపద్యం. "ఆ తిరునాళ్ళలోని వెలనాటి విధవలు మంచి పరువంలో, పసిడికొండల్లాంటి పిరుదులతో, గొప్ప కొప్పుకలిగి, మదంతో కామాంధలై విచ్చలవిడిగా తిరుగుతూ ఉంటారు. వాళ్ళను రతికేళిలో గెలవాలంటే (సంతృప్తి పరచాలంటే) మాందాత, భీముడు, ఘటోత్కచులకే సాధ్యమవుతుందేమో కాని ఇతరులకు సాధ్యంకాదు"–అంటున్నాడు కవి. మాంధాత యవనాశు

ృనిపుత్రుడు. యవనాశ్వుడు సంతానంకోసం పుత్రేష్టి చేయగా భృగుమహర్షి మంత్రజలాన్ని రాణులకీయడానికై ఒకచోట ఉంచాడు. యవనాశ్వుడు దాహార్తుడై, మంత్రపూతమైనదని తెలియక ఆ బలాన్ని త్రాగి గర్భందాల్చాడు. అతని గర్భం చీల్చుకొని మాంధాత బయట పడ్డాడు. మాతృస్తన్యం లేనందువల్ల ఇంద్రుడు వచ్చి తన బొటనవ్రేలుపెట్టి కుడిపించాడు. పురుషగర్భంనుండి ప్రభవించడం వల్లనూ, ఇంద్రుని వ్రేలు చీకడంవల్లనూ మాంధాత అతిశక్తిమంతుడయ్యాడు. వాయుపుత్రుడైన భీమసేనుడు, అతని పుత్రుడైన ఘటోత్కచుడు సుప్రసిద్ధ బలశాలురు. హైమగ్రావము = బంగారు రంగుగలరాయి. (డా॥ కోడూరు ప్రభాకరరెడ్డిగారు, శ్రీనాథుని చాటువులు, పుటలు: 102–103). క్రీడాభిరామంలో పై పద్యం ఈ క్రింది విధంగా ఉంది:–

**శా॥ వ్యామగ్రాహ్య నితంబబింబ కుచభారాభీల భద్రాకృతుల్**
**కామాంధల్ వెలనాటి కోడెవిధవల్, కాకొల్లితిర్నాళ్ళలో**
**నా మాంధాతృుఁడు భీమసేనుఁడు, హిడింబాధీశ్వరుండోపునో**
**యేమో కాని, తెమల్పనేర రితరుల్ హేలారతిక్రీడలన్!**

(వ్యామగ్రాహ్య = బారలతో పట్టదగిన; తెమల్చు = సంతృప్తిపరచు.)

## 25

"విద్వజ్జన కోలాహలుడు" అను కవికి "గుదియల కామి" అను ఉంపుడుకత్తె యుండెనట. అతడు రాయలసభకు వచ్చి ఆంధ్రకవితా పితామహుని గండపెండారము నుద్దేశించి సభ్యులకు సమస్యగా రెండు పాదములు చెప్పినట. దానిని రామకృష్ణకవి పూరించినట్లు ప్రచారములో ఒక పద్యమున్నది. (పద్యమును బట్టి మన ప్రబుద్ధులు కథనల్లి యుండవచ్చును).

**చ॥ 'వదలక మ్రోయు నాంధ్రకవి వామపదంబున నున్న నూపురం**
**బుదిత మరాళకంఠ నినదోక్తుల నేమని పల్కు? పల్కుడీ!'**

తెనాలి రామకృష్ణ కవి:–

**'గుదియల కామి నున్నని త్రికోణమునంగల భాగ్యరేఖ నీ**
**నుదుటను లేదు లేదనుచు నూటితెటుంగుల నొక్కి పల్కెరా!'**

**26**

చంద్రరేఖావిలాపములో కూచిమంచి జగ్గకవి చంద్రరేఖ విరహవేదన ఘట్టములో చెప్పిన పద్యము. చంద్రరేఖ తన త్రికోణమునుద్దేశించి–

ఉ॥ **పమ్మిన వేడ్క, వ్రాతపని పావడ పైకెగద్రోసి వైచి, చొ**
**క్కమ్ముగ – (10) క్రింద నొక కమ్ముల దుప్పటి నెత్తుపెట్టి, మే**
**ఢ్రమ్ము నిగిడ్చి, లోనికి దడాలున అంచులుమోయ దూర్చి, నీ**
**తిమ్మిరివోవ వాడెపుడు దీకొని తాకునొ యో త్రికోణమా!**

(చొక్కము = స్వచ్ఛము, కమ్ములు = అంచులు)

**27**

పరపురుషాసక్తితో జారత్వమునకు పాల్పడి, అందు ఆశించిన తృప్తిని పొందలేక, ఆ పొసగుడు కత్తెతో "ఈ మాత్రమునకు వీనివరకెందులకు?" అని నిరసించుచు నాయిక –

**'మదన మందిర సంస్పర్శ మాత్రుడైన**
**ఇతడు రానేల? మా యింటి యతడు లేడె?'**

**28**

ఈ క్రింది పద్యము– శ్రీనాథుని చాటువులలోనిది. దీనిని గురించి సి.పి. బ్రౌన్‌దొరగారు ఇట్లు వ్రాసిరి. "శ్రీనాథుడు శఠకోపజియ్యరుమీఁద చెప్పినది. తన యింటియంచు మఱుగుతావులో జియ్యరు వుండగా, అక్కడికి వక స్త్రీ వస్తే, వాని పనులు వాడు చేసుకున్నట్టు చూచి, శ్రీనాథుఁడు తెల్లవారి చెప్పినది."

ఉ॥ **ఇంగలమంచు వచ్చి, యడియేనని కొత్తమసాని మ్రొక్కఁగాఁ,**
**గొంగు బిరాల్నఁ బట్టి, తిరుకొంగుటు దీసి, జలారి–చెంతనే**
**వంగఁగఁ బెట్టి, యోనిఁ దిరువట్టలఁ గొట్టఁగఁ, జాలుఁజాలునీ**
**....(11)లటంచు నిన్ను మఱి తిట్టెనుగా శఠకోపజియ్యరూ!**

(ఇంగలము = పిడకనిప్పు, అడియేన్+అని=నీ దానురాలను+అని; జలారి= జాలారు= పాత్రలు మొదలగునవి కడుగుచోటు; స్నానాలగది.)

**29**

ఈ క్రింది రెండు పద్యాలుకూడా శ్రీనాథుని చాటువులలోనిన్!

**ఉ॥ గండము దప్పె నంధ్రకవిగానికి నిన్నటిరేయి, పుష్పకో**
**దండునికేళిఁ గూడకయ తద్దయు నిల్చితిఁ గాని, యయ్యయో**
**బండరువారి పాపికిని బైటి పసారమె కాని ...(12)లోఁ**
**బుండఁట, యెల్లవంకఁ జెడిపోదుఁగదా విషయింపఁబోయిననే.**

**30**

**చ॥ సడిగల వంటగుంటకులసంభవ వేంకటభట్లయింటిలో**
**వడుగని చేరవత్తురఁట, వచ్చిన బ్రాహ్మలకేమి వెట్టునో,**
**పిడుకలఁ బెట్టునో, మఱియుఁ బీఁటలఁ బెట్టునొ, ఱాలఁ బెట్టునో,**
**తడఁబడ లేవఁద్రోలి తన దడ్డొక(13) టడ్డము బెట్టి కొట్టునో!**

(-శ్రీనాథుని చాటుధార)

**31**

ఈ క్రింది పద్యం శ్రీనాథుని చాటువుగా చెప్పుదురు. కాని యిది తురగా రామకవి చాటువని వేటూరి ప్రభాకరశాస్త్రిగారు భావించినారు. (చూ.క్రీడాభిరామము, పుట-50).

**ఉ॥ రాతిరి నేను పస్తు, హయరత్నము పస్తు, కవీంద్రగాయక**
**వ్రాతము పస్తు . . . . . . . . . . . . . . . . . . . . . .**
**. . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . .**
**లేఁత మిటారి నా వయసులేమ యుపస్థకుఁ(14) బస్తు భూవరా!**

**32**

నరసరావుపేటలో ఒక విద్వాంసుడు శ్రీనాథుడు సుఖరోగగ్రస్తుడై నప్పుడు చెప్పిన ఒక సీసపద్యమును (చాటువును) వేటూరి ప్రభాకరశాస్త్రికి చదివి వినిపించాడట. కాని శాస్త్రిగారు ఆ పద్యంలో మొదటి పాదాన్ని మాత్రమే తమ క్రీడాభిరామము పీఠికలో (పుట-40) ఉదాహరించారు.

**సీ॥ నగముఁ బోలెఁడు మేను సగముచేసెను గదా**
**భగముకాదది మహోరగముగాని....**

కాని, శ్రీనాథుని చాటువులను సేకరించి వ్యాఖ్యానించిన డా॥ కోదూరు ప్రభాకరరెడ్డిగారు ఈ పద్యాన్ని యించుమించుగా పూర్తిగా ఇచ్చారు:-

**సీ॥ నగముఁ బోలెఁడు మేను సగముచేసెను గదా**
**భగముకాదది మహోరగముగాని,**
**పెల్లురోగముల దుఃఖిల్లఁజేసెను గదా**
**గొల్లికాదది యాతముల్లుగాని,**
**గోకుడు పుండ్లఁ జీకాకుఁజేసెను గదా**
**- (15) కాదది మరుని బాకుగాని,**
**భగభగల్ తనువెల్ల రగులఁజేసెను గదా**
**- (16) కాదది నిప్పు ముద్దగాని,**

**తే.గీ. . . . . . . . . . . . . . . . . . . . . . . . .**
**. . . . . . . . . . . . . . . . . . . . . . . .**
**. . . . . . . . . . . . . . . . . . . . . . . .**
**పయి పసారంబుఁగని పొరబడితిఁ జెడితి!**

(శ్రీనాథుని చాటువులు, పుట–59)

**కొన్ని సూచికలు:** ఈ ఏకాంత శృంగార పద్యములలో కొన్నింటిలో కొన్ని బూతుమాటలు అచ్చతెలుగు భాషలో ఉన్నాయి. అందువల్ల వాటిని ముద్రించడం నాకు సాధ్యం కాలేదు. సంస్కృతంలో ఎంత పచ్చిబూతు అయినా నాగరికంగా వినబడుతుంది. అది ఆ భాషయొక్క గొప్పతనం. ఉదా॥ "కాణేది పుత్రా!" (లంజకొడకా!) 11 నుంచి 15వరకు గల పద్యములలోను, 26 నుండి 32 వరకునుగల పద్యములలోను కొన్ని ఖాళీలు వదలి, వాటిని సంఖ్యలతో గుర్తించారు. ఆయా అచ్చతెలుగు పదాలకు సమానమైన తత్సమపదాలను దిగువ సూచిస్తున్నాను. ఈ తత్సమపదాలనుబట్టి, వాటికి సమానమైన అచ్చతెలుగు పదాలను పాఠకులు సులభంగా ఊహించుకోగలరు:

| | | |
|---|---|---|
| 11వ పద్యం | : | (1) స్త్రీ జననేంద్రియం |
| 12వ పద్యం | : | (2) పురుషాంగం |
| | | (3) స్త్రీ జననేంద్రియం |
| | | (4) శష్పములు |
| 13వ పద్యం | : | (5) స్త్రీ జననేంద్రియం |

| | | |
|---|---|---|
| 14వ పద్యం | : | (6) స్త్రీ జననేంద్రియం లోని లింగం (Clitoris) |
| 15వ పద్యం | : | (7) స్తనములు |
| | | (8), (9) రతి |
| 26వ పద్యం | : | (10) పురీషద్వారం |
| 28వ పద్యం | : | (11) రతిక్రీడ సలుపుట |
| 29వ పద్యం | : | (12) స్త్రీ జననేంద్రియం |
| 30వ పద్యం | : | (13) దద్దు=మగగుఱి |
| 31వ పద్యం | : | (14) స్త్రీ జననేంద్రియం |
| 32వ పద్యం | : | (15) స్త్రీ జననేంద్రియం |
| | | (16) పురీషద్వారం |



## భట్టుమూర్తి - తిమ్మరుసు

రామరాజ భూషణనకు 'భట్టుమూర్తి' అని నామాంతరము. ఈతడు కృష్ణరాయల ఆస్థానములోని అష్టదిగ్గజములలోనివాడని ప్రతీతి. ఒకసారి మహామంత్రి తిమ్మరుసు భట్టుమూర్తిని అవమానించినాడు. అప్పుడు భట్టుమూర్తి కోపముతో, దైన్యమైన తిమ్మరుసు పూర్వజీవితమును బట్టబయలు చేయుచు ఒక పద్యము నిట్లు ప్రారంభించెను:-

**శా॥ గుత్తిం బుల్లెలు కుట్టి, చంద్రగిరిలోఁ గూడెత్తి, పెగ్గొండలో**
**హత్తిన్ సత్రమునందు వేడి, బలు దుర్గాధీశు తాంబూల పుం**
**దిత్తుల్మోసి, పదస్థులైన ఘనులన్ దీవింప.................**

ఈ రీతిగా పద్యము సాగుచుండగా, తిమ్మరుసు భయపడి వెంటనే తన మెడలోనున్న పచ్చలహారమును తీసి భట్టుమూర్తి మెడలో వేసెను. అప్పుడా కవి "దీవింప" అను పదమును మార్చి పద్యము నిట్లు ముగించెను:

**................................................దీవించెదన్**
**మత్తారాతి యయాతి నాగమసుతున్ మంత్రీశ్వరున్ తిమ్మరున్!**

# సంస్కృతభాషావైభవము

ప్రపంచములోని అతి ప్రాచీన భాషలలో సంస్కృతము ఒకటి, (గ్రీకు, లాటిన్, అరబిక్, పారశీకము, చైనా భాషలు కూడా సంస్కృతము వలనే ప్రాచీనములు). వేదములు, రామాయణ–భారత–భాగవతములు, అష్టాదశ పురాణములు, పాణిని వ్యాకరణము (అష్టాధ్యాయి), చరక సంహిత, వాత్స్యాయన కామసూత్రములు – మొదలగు మహోన్నత రచనలు సంస్కృత భాషా వైశిష్ట్యమునకు నికషోపలములు. ఇవి కేవలము భారతీయులకే కాక యావత్ ప్రపంచ మానవులకును ఈనాటికిని మార్గదర్శకములుగా నున్నవి. వాల్మీకి, వ్యాసుడు, భాసుడు, కాళిదాసుడు, భర్తృహరి ఇత్యాది మహాకవుల రచనలు సంస్కృత సాహిత్య వైభవమునకు ఎత్తిన జయపతాకలు. భారతీయ సంస్కృతి అంతయు సంస్కృత భాషలో నిక్షిప్తమై యున్నది. సంస్కృతము చదువనివారికి మన సంస్కృతియొక్క గొప్పతనము అర్థము కాదు. ఆధునిక భారతీయ భాషా సాహిత్యములన్నియును సంస్కృత భాషా సాహిత్యములచే మిక్కిలిగా ప్రభావితమైనవి. ఇట్టి సంస్కృత సాహిత్యమునుండి నేను సేకరించిన కొన్ని శ్లోకములను ఇచ్చుట పొందుపరచినాను. వీనిని నీతి శ్లోకములు, చమత్కార శ్లోకములు, శృంగార శ్లోకములు, హాస్య శ్లోకములు – అని నాల్గు వర్గములుగా విభజించి ఇచ్చుచున్నాను. పఠించి ఆనందించగలరు.

**– టి.వి.కె. సోమయాజులు**

# సంస్కృతకవిత్వము

## (సభారంజన శ్లోకములు)

## 2.1 నీతిశ్లోకములు

**1**

**శ్లో॥ ధర్మార్థ కామ మోక్షేషు - వైచక్షణ్యం కళాసు చ ।**
**కరోతి కీర్తిం ప్రీతిం చ-సాధుకావ్య నిషేవణమ్ ॥**

సత్కావ్యములను పఠించినచో ధర్మ-అర్థ-కామ-మోక్షములయందు జ్ఞానము - కళనుగ్రహించు శక్తి - కీర్తి - ఆనందము లభించును.

**2**

**శ్లో॥ జ్ఞాత తత్త్వస్య లోకోయం - జడోన్మత్త పిశాచివత్ ।**
**జ్ఞాత తత్త్వోపి లోకస్య - జడోన్మత్త పిశాచివత్ ॥**

జగత్తును అర్థము చేసికొన్నవానికి ప్రపంచము మూర్ఖమై, పిచ్చియెత్తిన పిశాచమువలె గోచరించును. అట్టి మహాజ్ఞాని కూడ యీ లోకమునకు, మూర్ఖమై పిచ్చియెత్తిన పిశాచమువలె గోచరించును.

**3**

**శ్లో॥ సముద్ర మథనే లక్ష్మీం - హరిర్లేభే హరోవిషమ్ ।**
**భాగ్యం ఫలతి సర్వత్ర - న విద్యా న చ పౌరుషమ్ ॥**

సముద్రమథనవేళ హరికి లక్ష్మియును, శివునకు విషమును లభించినవి. అదృష్టమే ఫలించునుగాని విద్య-కృషి ఉపయోగింపవు. ప్రాణమునకు తెగించినవాడు శివుడు!

**4**

**శ్లో॥ యద్యపి బహునా ధీషే - పఠ పుత్ర! వ్యాకరణమ్ ।**
**స్వజన శ్వజనో మాభూత్! - సకలం శకలం, స్వకృత్ శ్వకృత్! ॥**

అనేక గ్రంథములు చదువుట కంటె పుత్రా వ్యాకరణము చదువుట మంచిది. లేనిచో స్వజనము-శ్వజనము (శునకజనులు) గాను, సకలము-శకలము (ముక్క) గాను, స్వకృత్ (తనకృత్యము) -శ్వకృత్ (కుక్కపని) గాను మారును.

**5**

**శ్లో॥ ఉషశ్శశంస గార్గ్యస్తు - శకునంతు బృహస్పతిః ।**
**మనోజయంతు మాండవ్యః - విప్రవాక్యం జనార్దనః ॥**

ప్రయాణమునకు మంచియేది? అనగా గార్గ్యుడు తెల్లవారు జాము మంచిదనెను. బృహస్పతి శకునము చూచుకొని వెళ్ళుట క్షేమమనెను. మనస్సునకు కోరిక కల్గినవేళయని మాండవ్యుడు చెప్పెను. బ్రాహ్మణుని మాట మంచిదని జనార్దనుడు చెప్పెను.

**6**

**శ్లో॥ న గచ్ఛేత్ రాజయుగ్మం చ - న గచ్ఛేత్ బ్రాహ్మణత్రయమ్ ।**
**చతుశ్శూద్రా న గచ్ఛేయుః-న గచ్ఛేత్ వైశ్యపంచకమ్ ॥**

ఒక పనిని సాధించుటకు ఇద్దరు రాజులు - ముగ్గురు బ్రాహ్మణులు - నలుగురు శూద్రులు - ఐదుగురు వైశ్యులు పోరాదు.

**7**

**శ్లో॥ గీతే వాద్యే తథా నృత్యే - సంగ్రామే రిపు సంకటే ।**
**ఆహారే వ్యవహారే చ - త్యక్తలజ్జః సుఖీభవేత్! ॥**

పాడునప్పుడు-వాయించునప్పుడు - నృత్యములో - యుద్ధములో-ఆహారవేళ - వ్యవహారములోను సిగ్గును మొగమోటమును విడిచినవాడే సుఖపడును.

**8**

**శ్లో॥ జిహ్వాగ్రే వర్తతే వ్యాధిః - జిహ్వాగ్రే మిత్రబాంధవాః ।**
**జిహ్వాగ్రే బంధ సంప్రాప్తిః - జిహ్వాగ్రే మరణం ధ్రువమ్ ॥**

వ్యాధులు - మిత్రులు - బంధువులు - బంధనము - మరణము - అన్నియును, నాలుకను నియమించుకొనుట - నియమించుకొనకపోవుట అను రెంటివలననే యేర్పడుచుండును. జిహ్వను నియమించుట అవసరము.

**9**

**శ్లో॥ అతిథి ర్బాలకశ్చైవ - స్త్రీజనో నృపతి స్తథా ।**
**ఏతే విత్తం నజానన్తి - జామాతాచైవ పంచమః ॥**

అతిథి - బాలుడు - ఆడది - రాజు - అనువారు యజమాని పరిస్థితిని ఆలోచింపరు. అల్లుడు కూడ అట్టివారిలో ఐదవవాడు (పంచముడు!)

**10**

**శ్లో॥ నశ్యత్యనాయకం కార్యం - తథైవ శిశునాయకమ్ ।**
**స్త్రీనాయకం, తథోన్మత్తనాయకం, బహునాయకమ్ ॥**

నాయకుడులేని పని, బాలుని నాయకత్వము, స్త్రీ నాయకత్వము, పిచ్చివాని నాయకత్వము - బహునాయకత్వము నాశనము కల్గించును.

**11**

**శ్లో॥ అర్థా గృహే నివర్తన్తే - శ్మశానే మిత్రబాంధవాః ।**
**సుకృతం దుష్కృతంచైవ - గచ్ఛంతమనుగచ్ఛతః ॥**

ధనములు ఇంటితోనే ఆగిపోవును. మిత్రబాంధవులు శ్మశానము వఱకు మాత్రమే వత్తురు. పుణ్యాపాపములు ఈ లోకమును విడుచువానిని విడువక అనుసరించును.

**12**

**శ్లో॥ తస్కరస్య వధో దండః - దాస దండస్తు ముండనమ్ ।**
**భార్యాదండం పృథక్శయ్యా - మిత్రదండ మభాషణమ్ ॥**

దొంగవానిని - చంపుట, దాసుని (తనకు సేవలు చేయువాని)కి - తల గొరిగించుట, భార్యకు - వేరుగా పరుండుట, మిత్రునికి - మాటలాడకుండుట: అనునవి శిక్షించు విధానములు.

**13**

**శ్లో॥ అగ్నిహోత్రం గృహం క్షేత్రం - గర్భిణీం వృద్ధ బాలకౌ ।**
**రిక్త హస్తేన నోపేయాత్ - రాజానం దైవతం గురుమ్ ॥**

అగ్నిహోత్రము దగ్గరకు - గృహమునకు - పంట పొలమునకు - గర్భవతి చెంతకు - వృద్ధ బాలకుల చూచుటకు - రాజును, దేవుని గురువును సందర్శించుటకు వట్టి చేతులతో పోరాదు!

**14**

**శ్లో॥ శ్వః కార్య మద్య కుర్వీత - పూర్వాహ్నేచాऽపరాహ్ణికమ్ ।**
**నహి మృత్యోః ప్రతీక్షాన్తి - కృతే వా హ్యథ వాऽకృతే ॥**

రేపు చేయవలసిన పనిని ఇప్పుడే చేయవలయును. మధ్యాహ్నము చేయవలసిన పనిని ఉదయమే చేయవలయును. మనము పనులు ముగించితిమా? లేదా? యని మృత్యువాగదు! (మహాభారతము, శాంతిపర్వము, 321–73)

**15**

**శ్లో॥ మాంసలుబ్ధో యథా మత్స్యః - లోహ శంకుం నపశ్యతి ।**
**సుఖలుబ్ధః తథా దేహీ - యమబాధాం న పశ్యతి ॥**

చేప, ఎరయందలి మాంసము మీది ఆసక్తితో, "గాలము గొంతునకు తగులుకొను" నను బాధను తలంపదు. అట్లే సుఖాసక్తితో జీవుడు యమబాధను తలంపక పాపకార్యములు చేయును.

**16**

**శ్లో॥ తులసీ విటపి స్థానం - గృహే య స్యావ తిష్ఠతే ।**
**తద్గృహం తీర్థ రూపంహి - నా యాన్తి యమకింకరాః ॥**

ఏ గృహములో తులసి వృక్షముండునో ఆ యిల్లే తీర్థము వంటిది. ఆ యింటికి యమకింకరులు రారు.

**17**

ఆఱు నెలలలో భారతమునకు ప్రతి వ్రాసినవాడు– చివరలో వ్రాసిన శ్లోకము:

**శ్లో॥ భుగ్న పృష్ఠ కటి గ్రీవః - స్తబ్ధ దృష్టి రథోముఖః ।**
**కష్టేన లిఖితం గ్రంథం - యత్నేన పరిపాలయేత్! ॥**

నడుము–తుంటిభాగము–మెడ - వంగిపోవునట్లు వ్రాసితిని. వ్రాత పూర్తియగుసరికి నా దృష్టి కూడ పాడైనది. కష్టపడి యీ ప్రతి వ్రాసితిని. ఓ పాఠకులారా! ఈ గ్రంథమును జాగ్రతగా రక్షించుకొందురుగాక!

**18**

**శ్లో॥ అగ్నే రక్ష! జలాద్రక్ష! - రక్షమాం శ్లథబంధనాత్! ।**
**పునశ్చ యాచకాత్ రక్ష! - యాచకాంతంహి పుస్తకమ్ ॥**

పుస్తకమే "తననెవరెవరినుండి పరిరక్షించవలెనో?" చెప్పుచున్నది. అగ్నినుండి, జలములనుండి నన్ను రక్షించుము (పూర్వము అగ్ని ప్రమాదములు, జల ప్రళయములు–నదులుపొంగుట అధికము). కట్టినత్రాడు ఊడిపోకుండ కాపాడుము.

మరచితిని! యాచకునినుండి రక్షించుట అన్నిటికంటె ముఖ్యము. యాచకుని (ఒక్కసారి చదివియిత్తునని అభ్యర్థించువాని) నుండి మరల పుస్తకము రాదు!

**19**

**శ్లో॥ విద్యా వివాదాయ , ధనం మదాయ**
**శక్తేః పరేషాం పరిపీడనాయ ।**
**ఖలస్య, సాధోర్విపరీతమేతత్**
**జ్ఞానాయ దానాయ చ రక్షణాయ ॥**

దుర్మార్గులకు, విద్య – ధనము – శక్తి అనునవి వరుసగా (కుతర్కముతో) వివాదమునకు – గర్వమునకు – ఇతరులను పీడించుటకు కారణములగును. ఈ మూడును సజ్జనులకున్నచో విద్య–జ్ఞానమునకును, ధనము–దానమునకును, శక్తి– యితరులను రక్షించుటకును కారణమగును.

**20**

**శ్లో॥ కర్తా కారయితా చైవ – ప్రేరకశ్చానుమోదకః ।**
**పుణ్యకార్యే పాపకార్యే – చత్వారః సమభాగినః ॥**

పనిచేయువాడు, చేయించువాడు, ప్రేరేపించువాడు, అభినందించువాడు – అను నల్గురును పుణ్యపాప కార్యములలో సమాన భాగస్వాములు.

**21**

**శ్లో॥ విపుల హృదయాభియోగే – ఖిద్యతి కావ్యే జడోన మౌర్ఖ్యే స్వే ।**
**నిందతి కంచుకమేవ – ప్రాయః శుష్కస్తనీ నారీ! ॥**

మందబుద్ధియైనవాడు భావగాంభీర్యమున్న కావ్యము నర్థము చేసికొనలేక కావ్యమును నిందించును. వక్షస్థలము ఎండిన స్త్రీ రవిక బాగుగాలేదని రవికను నిందించును. (–భోజచరితమ్)

**22**

**శ్లో॥ చరన్వనాంతే నవమంజరీషు**
**న షట్పదో గంధఫలీ మజిఘ్రత్! ।**
**సా కిం న రమ్యా? సచ కిం న రంతా?**
**బలీయసీ కేవల మీశ్వరేచ్ఛా! ॥**

వనములో తుమ్మెద పూలగుత్తులపై తిరుగాడుచు సంపెంగను వాసనకూడ చూచుట లేదు. దానికందము లేదా? తుమ్మెదకు అనుభవించు శక్తి లేదా? దైవనిర్ణయము బలీయము. (–పండితరాజ శతకం)

**23**

ధారా నగరములో 'పరమేశ్వరి' – 'సోముదు' అను చర్మకార దంపతులకు 'సునందుదు' అను బాలుడు పుట్టెను. అతడు పూర్వజన్మములో ఒక గొప్ప యతి. అందువలన 13 సంవత్సరములకే గొప్ప జ్ఞాని అయ్యెను. ఒకనాటి రాత్రి రాజభటుడైన తన తండ్రికి బదులుగా తాను రాజనగరునకు కాపలా కాయవలసి వచ్చెను. అప్పుడు బ్రాహ్మీముహూర్తమున సునందుదు ధారానగర ప్రజలను మేల్కొల్పుచు పదునాలుగు శ్లోకములు చెప్పెను. వానిలోని నీతిశ్లోకములు:–

**శ్లో॥ మాతా నాస్తి, పితా నాస్తి – నాస్తి బంధు సహోదరాః ।**
**అర్థం నాస్తి, గృహం నాస్తి – తస్మాత్ జాగ్రత! జాగ్రత! ॥ 1**

తల్లిదండ్రులు, బంధు సోదరులు, గృహధనములు జన్మతో వచ్చును. మరణముతో తెగిపోవునవి! ఇవి యేవియును లేవని గ్రహించి జాగ్రత వహింపుదు!

**శ్లో॥ జన్మదుఃఖం జరాదుఃఖం – జాయాదుఃఖం పునః పునః ।**
**సంసార సాగరం దుఃఖం – తస్మాత్ జాగ్రత! జాగ్రత! ॥ 2**

జన్మించుటయే దుఃఖించుటకు – వార్ధక్యము దుఃఖాకరము – భార్యవలన మరిన్ని దుఃఖములు – పుట్టుట చచ్చుట అను సంసార సాగరము దుఃఖము – ఈ విషయములో మేల్కొనుదు! మేల్కొనుదు!!

**శ్లో॥ కామః క్రోధశ్చ లోభశ్చ – దేహే తిష్ఠన్తి తస్కరాః ।**
**జ్ఞానరత్నాపహారాయ – తస్మాత్ జాగ్రత! జాగ్రత! ॥ 3**

కామము–క్రోధము–లోభము అను ముగ్గురు దొంగలు మన దేహములో మకాము వేసియున్నారు. వారు జ్ఞానమనెడి రత్నమును దొంగిలించుటకే యున్నారు! మేల్కొనుదు! మేల్కొనుదు!!

**శ్లో॥ ఆశయా బద్ధతే లోకః – కర్మణా బహుచింతయా ।**
**ఆయుక్షీణం న జానన్తి – తస్మాత్ జాగ్రత! జాగ్రత! ॥ 4**

లోకులు ఆశకును – కర్మకును కట్టుబడి, ఏవో ఏవో విచారములతో జీవితములు గడుపుచుందురు. ఆయుర్దాయము తరిగిపోవుచున్న విషయము గమనింపరు! ఈ విషయములో మేల్కొనుడు! మేల్కొనుడు!

**శ్లో॥ సంపద స్స్వప్న సంకాశాః – యౌవనం కుసుమోపహమ్ ।**
**విద్యుచ్చంచల మాయుష్యం – తస్మాత్ జాగ్రత! జాగ్రత! ॥ 5**

సంపదలు స్వప్నము వంటివి – (అశాశ్వతమైనవి). యౌవనము పూవుతో సమానము – (ఎపుడు వాడి నశించునో తెలియదు). ఆయుస్సు మెఱపుతీగవలె చంచలమైనది. కావున మేల్కొనుడు! మేల్కొనుడు!

**శ్లో॥ క్షణం విత్తం, క్షణం చిత్తం – క్షణంజీవితమావయోః ।**
**యమస్య కరుణా నాస్తి – తస్మాత్ జాగ్రత! జాగ్రత! ॥ 6**

విత్తము, చిత్తము, జీవితము క్షణభంగురములు (శాశ్వతమైనవి కావు). యమునకు కరుణ లేదు. కావున మేల్కొనుడు! మేల్కొనుడు!

**శ్లో॥ యావత్కాలం భవేత్కర్మ – తావత్తిష్ఠంతి జంతవః ।**
**తస్మిన్ క్షీణే వినశ్యంతి – కా తత్ర పరివేదనా? ॥ 7**

ప్రపంచముతో తమ కర్మబంధము ఎంతవరకు ఉండునో అంత వరకే ప్రాణులు జీవించును. ఆ కర్మబంధము వీడిపోగానే మరణించును. (జనన మరణములు జీవుని ధర్మములు). దానికి బాధపడుట ఎందులకు?

**శ్లో॥ ఋణానుబంధ రూపేణ – పశుపత్నీ సూతాలయః ।**
**ఋణక్షయే క్షయం యాంతి – కా తత్ర పరివేదనా? ॥ 8**

ఋణానుబంధము ఉన్నంతవరకే భార్య సంతానము ఇల్లు పశువులు ఉండును. ఆ బంధము తీరిపోవగనే ఇవన్నియును నశించిపోవును. అందులకు వ్యథ చెందుట ఎందులకు?

**శ్లో॥ పక్వాని తరుపర్ణాని – పతన్తి క్రమశో యథా ।**
**తథైవ జంతవః కాలే – కా తత్ర పరివేదనా? ॥ 9**

పండిన ఆకులు చెట్టునుండి రాలిపోవును. అట్లే మరణము ఆసన్నమైనప్పుడు ప్రాణులు మరణించును. దానికి చింతించుట ఎందులకు?

**శ్లో॥ ఏక వృక్ష సమారూఢా - నానాజాతి విహంగమాః ।**
**ప్రభాతే విదిశో యాంతి - కా తత్ర పరివేదనా? ॥ 10**

చీకటి పడగానే అనేక జాతుల పక్షులు ఒకే వృక్షము నాశ్రయించి విశ్రమించును. తెల్లవారగనే ఆ పక్షులన్నియును వృక్షమును వీడి తమతమ ఆహార సంపాదనకు వెళ్ళిపోవును. (అట్లే బంధుబలగముతో కూడియున్న మానవుడు కూడ కాలమాసన్నమైనపుడు తన శరీరమను ఇంటిని వదలి వెళ్ళిపోవును). అందులకు బాధపడ నవసరము లేదు.

**శ్లో॥ ఇదం కాష్ఠం ఇదం కాష్ఠం - నద్యా వహంతి సంగతః ।**
**సంయోగాశ్చ వియోగాశ్చ - కా తత్ర పరివేదనా? ॥ 11**

ప్రవహించెడి నదిలో రెండు కట్టెపుల్లలు దగ్గరకు చేరును. కొంత దూరము కలసి పయనించును. తరువాత విడిపోవును. అట్లే మానవులు ఈ ప్రపంచ ప్రవాహములో కొంతకాలము సంయోగ సుఖమును, మరికొంత కాలము వియోగ దుఃఖమును అనుభవింతురు. దానికి పరివేదన చెందనవసరము లేదు.

**24**

**శ్లో॥ గుణ-దోషౌ బుధో గృహ్ణన్ - ఇందు క్ష్వేళావివేశ్వరః ।**
**శిరసా శ్లాఘతే పూర్వం - పరం కంఠే నియచ్ఛతి! ॥**

శివుడు చంద్ర - విషములను గ్రహించినట్లు, పండితుడు మంచి చెడులను గ్రహించును. చంద్రుని శిరస్సున ధరించినట్లు మంచిని తలయూచి మెచ్చును; చెడును కప్పిపుచ్చును. శివుడు విషమును కంఠమున దాచెనుగదా!

**25**

**శ్లో॥ నారికేళోదకం స్నిగ్ధం - స్వాదు వృష్యం హిమం లఘు ।**
**తృష్ణా పిత్తానిలహరం - దీపనం వస్తి శోధనమ్ ॥**

కొబ్బరినీరు బలము నిచ్చును. రుచి కలది. చలువ చేయును. దాహమును, వేడిని హరించును. ఆకలి పుట్టించును. నీరుడు జారీచేయును.

**26**

**శ్లో॥ నిస్తేజాః పరిభూయతే పరిభవాన్నిర్వేద మాపద్యతే**
**నిర్విణ్ణ శ్శుచమేతి శోక పిహితః బుద్ధ్యా పరిత్యజ్యతే**

**నిర్బుద్ధిః క్షయమేతి** (మృచ్ఛకటికము)

తేజస్సులేనివారు సంఘముచే అవమానింపబడుదురు. అవమానములవలన దుఃఖము కల్గును. దుఃఖముతో దిగులుపడును. దిగులువలన బుద్ధి మందగించును. బుద్ధిహీనుడు నశించును.

**27**

**శ్లో॥ స్థానే స్వశిష్య నివహైర్వినియుజ్యమానా ।**
**విద్యా గురుం హి గుణవత్తర మాతనోతి ॥** (మురారి)

సభలలో శిష్యులు చూపించిన విద్యాపాటవము గురువునకు గౌరవము తెచ్చును. గురువు తన విద్యను తగిన విద్యార్థికి బోధించుటయే దానికి కారణము!

**28**

**శ్లో॥ నా నృషిః కురుతే కావ్యం - నా గంధర్వః సురూపభృత్ ।**
**నా దేవాంశో దదాత్యన్నం - నా విష్ణుః పృథివీపతిః ॥**

ఋషికానివాడు సత్కావ్యములు రచింపజాలడు. గంధర్వాంశ లేనివాడు. సుందరుడు కాజాలడు. దేవాంశ లేనిచో అన్నదానము చేయలేడు. విష్ణ్వంశ లేనిచో రాజు కాలేడు.

**29**

**శ్లో॥ ఆస్థా స్వాస్థ్యే యదిస్యాతాం - మేధయా కింప్రయోజనమ్?।**
**తావుభౌ యది నస్యాతాం - మేధయా కింప్రయోజనమ్? ॥**

విద్యార్థినిగూర్చి పెద్దలు చెప్పిన శ్లోకమిది. విద్య కావలెనను కాంక్షయును, ఆరోగ్యమును ఉన్నచో మేధాశక్తి అక్కరలేదు, విద్యావంతుడు కాగలడు. పై రెండును లేనిచో ఎంత మేధ ఉన్నను ప్రయోజనము లేదు.

**30**

**శ్లో॥ పూర్వజన్మని యా విద్యా - పూర్వజన్మని యద్ధనమ్ ।**
**పూర్వజన్మని యత్పుణ్యం - అగ్రే ధావతి ధావతి! ॥**

పూర్వజన్మలోని విద్య-ధనము-పుణ్యముల ఫలితము ఈ జన్మలో కనిపించును.

**31**

**శ్లో॥ యుక్తి యుక్తం వచోగ్రాహ్యం - బాలాదపి సుభాషితమ్ ।**
**వచనం తత్తు నగ్రాహ్యం - అయుక్తంతు బృహస్పతేః ॥**

లోకము మెచ్చునట్టి మాటను బాలుడు చెప్పినను గ్రహింపవలెను. లోకములో సరిపడని మాటను బృహస్పతి చెప్పినను గ్రహింపరాదు.

**32**

**శ్లో॥ ప్రియవాక్య ప్రదానేన - సర్వే తుష్యన్తి జంతవః ।**
**తస్మాత్ ప్రియంహి వక్తవ్యం - వచనే కా దరిద్రతా? ॥**

ఎదుటివారికి ప్రియముగా మాటలాడుటవలన అందరును సంతోషింతురు, మెచ్చుకొందురు. అందుచేత ఓ సంఘజీవీ! నీవు ప్రియముగా మాటలాడుచుండుము. మాటలకు దారిద్ర్యము (లోటు) ఉండదు కదా! మాటలో పోయినదేమి?

**33**

**శ్లో॥ సుజనో నయాతి వైరం పరహిత బుద్ధిః వినాశ కాలేపి ।**
**ఛేపి చందనతరుః సురభయతి ముఖం కుఠారస్య ॥**

సజ్జనుడు ఎల్లప్పుడును పరులకు మేలునే కోరును. తనను నాశనము చేయుచున్నవారికికూడ మేలునే చేయును. మంచిగంధపుచెట్టు తనను నరకుచున్నప్పుడు కూడ ఆ గొడ్డలికి తన సువాసన నిచ్చును గదా!

**34**

**శ్లో॥ నైవాకృతిః ఫలతి, నైవ కులం, న శీలం,**
**విద్యాపి నైవ, న చ యత్నకృతాపి సేవా ।**
**భాగ్యాని పూర్వతపసా ఖలు సంచితాని**
**కాలే ఫలంతి పురుషస్య యథైవ వృక్షాః ॥**

(–భర్తృహరి నీతిశతకం, శ్లో. 97)

సౌందర్యము – కులము – శీలము – విద్య – శ్రద్ధతో చేసిన సేవలు – ఇవి ఏవియును ఫలింపవు. పూర్వజన్మలో చేసిన తపస్సు కారణముగానే మానవుని కోరికలు, వృక్షములవలె, కాలమునకు ఫలించును. (అదృష్టమే కారణముగాని కృషి కారణము కాదు).

**35**

**శ్లో॥ యథా ధేనుసహస్రేషు - వత్సో వింద‌తి మాతరమ్ ।**
**తథా పూర్వకృతం కర్మ - కర్తార మనువిందతి ॥**

వేయి ధేనువులలో తన తల్లిని వెదకుచు లేగ చేరును. అట్లే పూర్వజన్మలో చేసికొన్న సుకృత- దుష్కృతములు మానవుని పట్టుకొనును.

**36**

**శ్లో॥ అబ్ధీరత్న మధోధత్తే - ధత్తే చ శిరసా తృణమ్ ।**
**అబ్ధే రేవహి దోషోయం - రత్నం రత్నం తృణమ్ తృణమ్! ॥**

సముద్రము రత్నములను అడుగున నుంచును. గడ్డి పరకలను తలపై ధరించును. అంతమాత్రాన రత్నములకు విలువ తగ్గదు; గడ్డిపరకలకు విలువ పెరుగదు. (కొందరు మహాకవులను నిర్లక్ష్యము చేయుచు, కాకవులను ఆదరింతురు. అట్టివారి నుద్దేశించినది ఈ శ్లోకము).

**37**

**శ్లో॥ పీత్వా కర్దమ పానీయం - భేకో వటవటాయతే ।**
**దివ్యం చూతరసం పీత్వా - గర్వం నాయాతి కోకిలః ॥**

బురదనీరు త్రాగిన కప్ప బెకబెకలాడును. పలకమారిన మామిడి రసము త్రాగిన కోకిల గర్వము నందదు. (అన్యాపదేశముగా వాచాటుని-ఉత్తమవాగ్మిని, ధ్వనింపజేయుచున్నాడు కవి).

**38**

**శ్లో॥ మృతస్య లిప్సా, కృపణస్య దిత్సా,**
**విమార్గగాయాశ్చ రుచిః స్వకాంతే ।**
**సర్పస్య శాంతిః, కుటిలస్య మైత్రీ,**
**విధాతృ సృష్టౌ నహి దృష్ట పూర్వాః ॥**

చచ్చినవానికి కోరిక - లోభికి దానముచేయు కోరిక - అంకుటాలికి భర్తయందు ప్రీతి - సర్పమునకు శాంతి - వంకర బుద్ధివానికి స్నేహభావము - ఈ ఐదును బ్రహ్మసృష్టిలో ఇంతవరకును కన్పింపలేదు.

**39**

**శ్లో॥ అన్యథా చింతితం కార్యం - దైవ మన్యత్ర చింతయేత్ ।**
**రాజకన్యాం ప్రలోభంతం - విప్రం భల్లూక భక్షిణమ్ ॥**

మనము ఒక విధముగా ఆలోచించిన పనిని దైవము మరొక విధముగా తలచును. (తానొకటి తలచిన దైవము మరొక్కటి తలచును). రాజకన్యను అపహరింపదలచిన బ్రాహ్మణుని భల్లూకము భక్షించినది.

**40**

**శ్లో॥ గతానుగతికో లోకో - నలోకః పారమార్థికః ।**
**ఏలా వాలుక లింగేన - నష్టం మే తామ్రభాజనమ్ ॥**

ఈ లోకములో ప్రజలు ముందువారిని వెనుకవారు గుడ్డిగా అనుసరింతురు. అంతేకాని, అందులోని పరమార్థమును గుర్తింపరు, ఆలోచింపరు. ఏలానది ఒడ్డున నేను ఇసుక లింగము చేసి నా రాగిచెంబు పోగొట్టుకొంటిని. (గ్రహణవేళ చెంబునకు గుర్తుగా ఇసుక ప్రోగుపెట్టినాడు. స్నానము చేసి వచ్చుసరికి అదే ఆకృతిలో లోకులు ఇసుక లింగములు పెట్టినారు. తన చెంబు పెట్టుకొన్న ఇసుక కుప్పను గ్రహింపలేక రాగిచెంబు పోగొట్టుకొన్నాడు.)

**41**

**శ్లో॥ సంగీతంచైవ సాహిత్యం - సరస్వత్యాః కుచ[1]ద్వయమ్ ।**
**ఏక మాపాత మధురం - పరం [2]త్వాలోచనామృతమ్ ॥**

సంగీత - సాహిత్యములు సరస్వతీమాత పాలిండ్లు! అందు సంగీతము, విన్నంత సేపు మాత్రమే ఆనందము. సాహిత్యము ఆలోచించిన కొలదియు ఆనందములూరును. (1. స్తనద్వయమ్; 2. అన్యదాలోచనామృతమ్ = పాఠాంతరాలు)

**42**

**శ్లో॥ ముక్తాఫలేషు ఛాయాయాః - తరళత్వమివాంతరా ।**
**ప్రతిభాతి యదంగేషు - తల్లావణ్య మిహోచ్యతే! ॥**

ముత్యాల పేరులలో నిగనిగగా - తళతళగా కన్పించు కాంతివలె శరీర భాగములలో కన్పించు కాంతినే లావణ్యమందురు.

**43**

**శ్లో॥ అశ్వాలంభం, గవాలంభం - సన్న్యాసం, పలపైతృకమ్ ।**
**దేవరాచ్చ సుతోత్పత్తిః - కలౌ పంచ వివర్జయేత్ ॥**

అశ్వముతో యజ్ఞము, గోవుతో యజ్ఞము, సన్న్యాసము, మాంసము పితృ దేవతలకు పెట్టుట, బావగారితో పిల్లలను కనుట - ఈ ఐదును కలియుగమున నిషిద్ధములు.

**44**

**శ్లో॥ సర్వమన్యత్ పరిత్యజ్య - శరీరమనుపాలయేత్ ।**
**తదభావే కింభవానాం - సర్వాభావః శరీరిణామ్ ॥**

అన్ని పనులను ప్రక్కకు పెట్టి, శరీరమును ఆరోగ్యవంతముగా బలిష్ఠముగా ఉండునట్లు పోషించుకొనవలయును. శరీరములేనిచో ప్రపంచ సంబంధము తెగిపోవును. సర్వశూన్యము. (చరకుడు)

**45**

**శ్లో॥ అనేక నంశయోచ్చేదీ - పరోక్షార్థస్య దర్శనమ్ ।**
**సర్వస్య లోచనం శాస్త్రం - యస్యనాస్త్యంధ ఏవసః ॥**

అనేక సంశయములను తొలగించునదియు, నేత్రముతో చూడ శక్యము కాని విషయములను దర్శింపజేయునదియు శాస్త్రజ్ఞానము! అట్టి శాస్త్రజ్ఞానము లేనివాడే నిజమైన గ్రుడ్డివాడు!

**46**

**శ్లో॥ యౌవనం, ధనసంపత్తిః - ప్రభుత్వ, మవివేకితా ।**
**ఏకైకమప్యనర్థాయ - కిముయత్ర చతుష్టయమ్?॥**

యౌవనము-ధనముండుట-అధికారము - జ్ఞానములేకుండుట - అనువానిలో ప్రతియొక్కటియును అనర్థము కల్గించును. నాల్గును ఉన్నచో చెప్పునదేమి?

**47**

**శ్లో॥ ఉద్యోగినం పురుషసింహముపైతి లక్ష్మీః**
**దైవేన దేయమితి కాపురుషా వదన్తి ।**
**దైవం నిహత్య కురు పౌరుష మాత్మశక్త్యా**
**యత్నేకృతే యది నసిద్ధ్యతి కోఽత్రదోషః ॥**

కృషి చేయువానిని సిరి వరించును. దైవమిచ్చునని సోమరులందురు. దైవము లేదనుకొని నీ కృషి నీవు చేయుము. నూరుపాళ్ళుగా కృషి చేసినను ఫలింపనిచో, నీ దోషము లేదు.

**48**

**శ్లో॥ హీయతేహి మతిస్తాత! – హీనైస్సహ సమాగమాత్ ।**
**సమైశ్చ సమతామేతి – విశిష్టైశ్చ విశిష్టతామ్! ॥**

నాయనా! నీవు తక్కువవారితో స్నేహము చేసినచో నీ బుద్ధి క్రిందికి వచ్చును. నీ సమానులతో చెలిమి చేసినచో లాభనష్టములుండవు. ఉత్తములతో స్నేహము చేసినచో గొప్పతనమును పొందగలవు.

**49**

**శ్లో॥ కీటోపి సుమనః సంగాత్ – ఆరోహతి సతాం శిరః ।**
**అశ్మాపి యాతి దేవత్వం – మహద్భిః సుప్రతిష్ఠితమ్॥**

పురుగు కూడా పుష్పసంబంధము వలన మహాత్ముల శిరస్సుల నెక్కగలదు! బండరాయి కూడా మహాత్ములచే ప్రతిష్ఠింపబడి దేవుడుగా మారును!

**50**

**శ్లో॥ ఘాతం న ఘాతుకో విప్రః – క్షత్రియో రిపుఘాతుకః ।**
**విశ్వాసఘాతుకో వైశ్యః – శూద్రః సర్వస్యఘాతుకః ॥**

అపకారికి అపకారము చేయనివాడే విప్రుడు! శత్రువులను సంహరించువాడు క్షత్రియుడు! నమ్మించి మోసగించువాడు వైశ్యుడు! అన్ని విధముల అందఱను మోసగించువాడు శూద్రుడు! (జన్మనుబట్టి కాక, ఆయా మానవుల గుణములను బట్టి కులములు నిర్ణయింపవలెనని భావము.)

**51**

**శ్లో॥ అగ్నిర్దేవో ద్విజాతీనాం - మునీనాం హృదిదైవతమ్ ।**
**ప్రతిమా స్వల్పబుద్ధీనాం - దేవోనాస్తి దురాత్మనామ్ ॥**

బ్రాహ్మణులకు అగ్నియే దైవము! మునీశ్వరులకు హృదయమే దైవము! స్వల్పబుద్ధి వారికి ప్రతిమయే దైవము! దురాత్ములకు (నాస్తికులకు) దైవమే లేదు!

**52**

**శ్లో॥ హృది ప్రాణో గుదే పానః - సమానో నాభి సంస్థితః ।**
**ఉదానః కంఠదేశస్థో - వ్యానః సర్వశరీరగః ॥**

హృదయములో "ప్రాణము" - గుదమునందు "అపానము" - నాభియందు "సమానము" - కంఠమునందు "ఉదానము" - శరీరమంతయును వ్యాపించి "వ్యానము" - అను పంచప్రాణములుండును.

**53**

**శ్లో॥ దదాతి ప్రతిగృహ్ణాతి - గుహ్యమాఖ్యాతి పృచ్ఛతి ।**
**భుంక్తే భోజయతే చైవ - షడ్విధం మిత్రలక్షణమ్ ॥**

అవసరమైనప్పుడు అప్పునిచ్చుట - పుచ్చుకొనుట - రహస్యములు చెప్పుట - రహస్యముల నడుగుట - మిత్రునింట భుజించుట - మిత్రుని తన యింట భుజింపజేయుట - ఈ ఆఱును మిత్రలక్షణములు.

**54**

**శ్లో॥ నవ నవ సుదృగ్విలాసైః - ననూత్సుకాః కామినోయథానుదినమ్ ।**
**ఏవమపూర్వాసు కృతిషు - ఆదరవంతోహి రసాయితారః ॥**

కాముకులు క్రొత్త క్రొత్త చూపులు - ఒయ్యారములు అను శృంగార భావ ప్రకటనములయందు ఆసక్తి చూపుదురు. అట్లే రసలుబ్ధులు క్రొత్త క్రొత్త కావ్యములను ఆదరింతురు.

**55**

**శ్లో॥ అనంతశాస్త్రం బహువేదితవ్యం**
**అల్పశ్చకాలో బహవశ్చ విఘ్నాః ।**
**యత్ సారభూతం తదుపాశ్రితవ్యం**
**హంసోయథా క్షీరమివాంబుమిశ్రమ్ ॥**

తెలిసికొనవలసిన శాస్త్రము అనంతము. కాలమా అల్పము. ఆటంకములు అధికము. కావున హంస నీటిని విడిచి పాలను గ్రహించినట్లు సారమైనది గ్రహించవలెను.

**56**

**శ్లో॥ ఏకేన రాజహంసేన - యాశోభా సరసో భవేత్ ।**
**న సా బక సహస్రేణ - పరితః తీరవాసినా ॥**

ఒక్క రాజహంస సరస్సులో ఈదుచున్న చాలును! సరస్సునకు అందము వచ్చును! ఆ అందము వేయి కొంగలు ఒడ్డున నున్నను రాదు!

**57**

**శ్లో॥ దోషమపి గుణవతిజనే దృష్ట్వా - గుణరాగిణోభినంద్యన్తే ।**
**ప్రీత్యైవ శశి నిపతితం పశ్యతి - లోకః కళంకమపి ॥**

సద్గుణములను అభిమానించు మహనీయులు మహాత్ములలో ఏదైన దోషము కన్పించినను దానిని చెడ్డగా పేర్కొనరు; అభిమానముగానే చూచెదరు. చంద్రునిలోని కళంకమును లోకులు అభిమానముగానే చూతురుగదా!

**58**

**శ్లో॥ వజ్రాదపి కఠోరాణి - మృదూని కుసుమాదపి ।**
**లోకోత్తరాణాం చేతాంసి - కోహి విజ్ఞాతు మర్హతి? ॥**

మహాత్ముల మనస్సులు కష్టవేళలో వజ్రము కంటె కఠినములు. తక్కినవేళలో పూవులకంటె మృదులములు! అట్టి మహాత్ముల మనస్సులను ఎవరు అర్థము చేసికొనగలరు?

**59**

**శ్లో॥ జయన్తితే సుకృతినో - రససిద్ధాః కవీశ్వరాః ।**
**నాస్తి తేషాం యశఃకాయే - జరామరణజం భయమ్ ॥**

రససిద్ధులై సత్కావ్యములు రచించిన కవీశ్వరులున్నారు. వారికి జయంతులే కాని వర్ధంతులుండవు! వారి కీర్తిశరీరమునకు వార్ధక్యము - మరణములవలన భయము ఉండదు.

## 60

**శ్లో॥ అర్థనాశం, మనస్తాపం - గృహే దుశ్చరితాని చ ।**
**వంచనం, చావమానం చ - పంచైతాన్ న ప్రకాశయేత్ ॥**

(1) ధనమును పోగొట్టుకొనుట, (2) మనస్సునందలి బాధ, (3) గృహ కలహములు, (4) తాను పొందిన మోసము, (5) అవమానము - ఈ ఐదింటిని రహస్యముగా నుంచుకొనవలయును.

## 61

**శ్లో॥ పురాణ మిత్యేవ న సాధు సర్వం**
**న చాపి కావ్యం నవమిత్యవద్యమ్ ।**
**సన్తః పరీక్ష్యాన్యతరద్భజన్తే**
**మూఢః పరప్రత్యయనేయ బుద్ధిః ॥** (-కాళిదాసు)

ప్రాచీనమైనంత మాత్రమున కావ్యము గొప్పది కాదు! ఆధునికమైనంత మాత్రమున అది త్రోసివేయదగినదియును కాదు! సజ్జనులు తాము పఠించి సాధుత్వ - అసాధుత్వములు గ్రహింతురు. మూఢుడు ఇతరులు చెప్పినదానిని అనుసరించును.

## 62

**శ్లో॥ ప్రథమ వయసి పీతం తోయమల్పం స్మరన్తః**
**శిరసి నిహిత భారాః నారికేళా నరాణామ్ ।**
**సలిల మమృతకల్పం దద్యురాజీవితాన్తం**
**నహి కృతముపకారం సాధవో విస్మరన్తి ॥**

మొక్కగా ఉన్నప్పుడు మానవుడు పోసిన నీటిని తలచుకొనుచు, కొబ్బరిచెట్టు, తలపై గెలల బరువును మోయుచు, బ్రతికినంత కాలమును అమృత జలము నందించును. సజ్జనులు ఇతరులవలన పొందిన ఉపకారమును మరువరు!

## 63

**శ్లో॥ ఉత్తమం ప్రణిపాతేన - శూరం భేదేన యో జయేత్ ।**
**నీచం అల్పప్రదానేన - సమశక్తిం పరాక్రమైః ॥**

ఉత్తముని నమస్కారముచేతను - బలవంతుని భేదోపాయముచేతను - నీచుని లంచముచేతను-సమశక్తిమంతుని పరాక్రమముతోడను వశము చేసికొనవలెను!

**64**

**శ్లో॥ పరవిత్త జిగీషయా ప్రవృత్తః,**
**పిశునస్తు స్వయమేవ నాశమేతి ।**
**సులభః శలభస్య కిం న దాహః**
**పృథు దీప గ్రసనాయ జృంభితస్య॥**

పరధనములను మ్రింగజూచు లోభి స్వయముగా నాశనమగును. గొప్ప దీపమును మ్రింగయత్నించిన మిడుత మాడిపోవుట లోకప్రసిద్ధమేకదా!

**65**

**శ్లో॥ దోషా కరోపి కుటిలోపి కళంకితోపి**
**మిత్రావసాన సమయే విహితోచ్ఛయోపి ।**
**చంద్రః తథాపి హరవల్లభతాముపైతి**
**నైవాశ్రితేషు మహతాం గుణదోషచింతా॥**

చంద్రుడు దోషాకరుడు (రాత్రించరుడు). పుట్టినవేళ వంకరయున్నది. కళంకితుడు. సూర్య (మిత్ర) మరణవేళ అభివృద్ధితో ఆనందించును. అయినను శివుడు అతనిని శిరమున ధరించును. మహాత్ములు ఆశ్రితులను అభిమానించుటయే కాని వారి గుణదోషము లెంచరుగదా!

**66**

**శ్లో॥ పరోక్షే కార్యహంతారం - ప్రత్యక్షే ప్రియభాషిణమ్ ।**
**వర్జయేత్ తాదృశం మిత్రం - విషకుంభం పయోముఖమ్ ॥**

ప్రత్యక్షముగా ప్రియభాషలాడుచు, పరోక్షమున హానితలపెట్టు మిత్రుని విడువ వలెను. అట్టివాడు పయోముఖ విషకుంభము! (పైన పాలవలె నుండి, లోపల విషముతో నిండిన కుండ!)

**67**

**శ్లో॥ మహాత్మనోఽనుగృహ్ణంతి - భజమానాన్ రిపూనపి ।**
**సపత్నీః ప్రాపయన్త్యబ్ధిం - సింధవో నగనిమ్నగాః ॥**

మహాత్ములు తమను ఆశ్రయించిన శత్రువులను కూడా అనుగ్రహింతురు. పర్వతములనుండి ప్రవహించు నదులు తమ సవతులను కూడ సముద్రమునకు చేర్చుచున్నవి కదా!

**68**

**శ్లో॥ దారిద్ర్య రోగ దుఃఖాని - బంధన వ్యసనాని చ ।**
**ఆత్మాపరాధ వృక్షస్య - ఫలాన్యేతాని దేహినామ్ ॥**

బాధలన్నిటిని దైవకృతములనుకొనుట తప్పు. దారిద్ర్యము-రోగము-దుఃఖము -బంధనము - కష్టములు అనునవి చాలవఱకు తాము చేసికొన్న కర్మల ఫలము వలన ప్రాప్తించినవే! అవి ఆత్మాపరాధము అను వృక్షముయొక్క ఫలములు.

**69**

**శ్లో॥ మర్దలస్తు నితరా మచేతనః**
**తన్ముఖాదపి ధనం ధనం ధనమ్! ।**
**ఇతమేవ నినదః ప్రవర్తతే**
**కింపునర్యది జనస్సచేతనః ॥**

ప్రాణములేని మద్దెల ధనమ్ ! ధనమ్! ధనమ్ ! అనియే అరచుచున్నది. అట్టిచో ప్రాణమున్న మానవుడు ధనము ధనమని ఏడ్చుటలో ఆశ్చర్యము లేదు!

**70**

**శ్లో॥ ధనమార్జయ కాకుత్స్థ! - ధనమూల మిదం జగత్ ।**
**అంతరం నాభిజానామి - నిర్ధనస్య మృతస్య చ ॥**

విశ్వామిత్రుడు రామునితో:- "రామా! ఈ జగత్తు ధనముపై ఆధారపడి యున్నది. కావున ధనమార్జింపుము. ధనము లేనివానికిని - చచ్చినవానికిని భేదము నాకు కన్పింపలేదు."

**71**

**శ్లో॥ ధనై ర్నిష్కులీనాః కులీనా భవన్తి**
**ధనై రాపదం మానవా నిస్తరన్తి ।**
**ధనేభ్యః పరోబాంధవో నాస్తిలోకే**
**ధనాన్యార్జయధ్వం ధనాన్యార్జయధ్వమ్ ॥**

ధనమున్నచో కులములేనివాడు గొప్పకులమువాడగును. మానవులు ధనముతో ఆపదలను దాటుదురు. ధనమును మించిన బంధువు లోకములో లేదు. ఈ రహస్యమెఱిగి ధనమార్జించుట ప్రధానముగా భావింపుము.

**72**

**శ్లో॥ గతే భీష్మే, హతే ద్రోణేఽ,ప్యంగరాజే దివంగతే ।**
**ఆశా బలవతీ రాజన్ - శల్యో జేష్యతి పాండవాన్ ॥**

అతిలోకవీరుడు భీష్ముడు పడిపోయినాడు. అఖిల ధనురాచార్యుడు ద్రోణుడు కూలిపోయినాడు. అందరికంటె తన్నుద్ధరించునని దుర్యోధనుడు ఎవరిమీద తన సర్వాశలును నిలుపుకొనినాడో ఆ కర్ణుడు కూడా ఒరిగిపోయినాడు. కాని ఆశ ఎంత బలమైనదో కదా! దుర్యోధనుడు, శల్యుని సేనానాయకునిగా చేసికొని, భీష్మద్రోణ కర్ణులవంటి మహావీరులనే పడగొట్టగలిగిన పాండవులను గెలువగలనని భావించినాడు! (భట్టనారాయణుని వేణీసంహార నాటకము, 5–23)

**73**

**శ్లో॥ బాల్యే సుతానాం, సురతేఽంగనానాం**
**స్తుతౌ కవీనాం, సమరే భటానామ్ ।**
**త్వంకారయుక్తాహి గిరః ప్రశస్తాః**
**కస్తే ప్రభో మోహభరం స్మరత్వమ్! ॥**

**క॥ చిన్నప్పుడు, రతికేళిక**
**నున్నప్పుడు, కృతులయందు, యుద్ధమునందున్**
**మిన్న సుమీ రాకొట్టుట**
**చెన్నుగ నో పూసపాటి సీతారామా!**

**74**

**శ్లో॥ శ్లోకార్థేన ప్రవక్ష్యామి - యదుక్తం గ్రంథకోటిభిః ।**
**పరోపకారః పుణ్యాయ - పాపాయ పరపీడనమ్! ॥**

కోటిగ్రంథ సారమును సగము శ్లోకములో చెప్పగలను. పరపీడనమే పాపము! పరోపకారమే పుణ్యము!

**75**

**శ్లో॥ అయంబంధు రయంనేతి - గణనా క్షుద్రచేతసామ్ ।**
**ఉదారచరితానాంతు - వసుధైవ కుటుంబకమ్ ॥**

ఇతడు బంధువు! ఇతడు బంధువుకాడు! – అని నీచబుద్ధుల ఆలోచనము. ఉదారవంతులకు లోకమే కుటుంబము.

**76**

**శ్లో॥ అన్నదానం మహాదానం - విద్యాదాన మతఃపరమ్ ।**
**అన్నేన క్షణికా తృప్తిః - యావజ్జీవంతు విద్యయా ॥**

అన్ని దానములలోను అన్నదానము గొప్పది! దానికంటె విద్యాదానము గొప్పది! అన్నమువలన క్షణికమైన తృప్తి లభించును. విద్యవలన బ్రతికినంతకాలము తృప్తిగా జీవించును.

**77**

**శ్లో॥ కవిర్యద్యవధానీస్యాత్ - సంపాద్యం ధ చతుష్టయమ్ ।**
**ధైర్యం, ధారా, ధోరణీ, చ - ధారణా చ మహోజ్జ్వలా ॥**

కవిత్వమల్లనేర్చినవాడు అవధానికావలెనన్నచో నాల్గు 'ధ'కారములు సంపాదింప వలయును. అవి 1. ధైర్యము, 2. ధార = కవిత్వధార, 3. ధోరణి = అశువుగా విషయములల్లుట, 4. ధారణ = జ్ఞాపకశక్తి.

**78**

**శ్లో॥ <u>వ</u>స్త్రేణ <u>వ</u>పుషా <u>వా</u>చా - <u>వి</u>ద్యయా <u>వి</u>నయేన చ ।**
**వకారైః పంచభిర్యుక్తః - నరో భవతి పూజితః ॥**

లోకములో ఐదు 'వ' కారములు కలిగిన నరుడు పూజింపబడును: (1) వస్త్రేణ =తగిన వస్త్రధారణముచేత; (2) వపుషా = శరీరసౌష్ఠవముచేత; (3)

వాదా = వాచాలత (మాటకారితనము)చేత; (4) విద్యయా = విద్యచేత; (5) వినయేన వినయముచేత – కూడిన వ్యక్తి గౌరవింపబడును.

**79**

**శ్లో॥ శతేషు జాయతే శూరః – సహస్రేషు చ పండితః ।**
**వక్తా శతసహస్రేషు – దాతా భవతి వా? న వా? ॥**

కొన్ని వందలమందిలో ఒక్కడు శూరుడు ఉండును. కొన్ని వేలమందిలో ఒక్కడు పండితుడు ఉండును. కొన్ని పదుల వేలల్లో (కొన్ని లక్షలలో) ఒక్కడు వక్త ఉండవచ్చును; కాని వారిలో దాత ఉండునో ఉండడో చెప్పలేము!

**80**

**శ్లో॥ శ్వా యథా చర్వయన్నస్థి – తతః స్వముఖ శోణితమ్ ।**
**మత్వా తదీయం రమతే – తద్వియోగేచ ఖిద్యతి ॥**

శునకము ఎముక ముక్కను నమలుచు, తన నోటినుండి వచ్చిన రక్తమును త్రాగుచు, దానిని ఎముకనుండి వచ్చు రక్తముగా భావించును. ఆ ఎముక ముక్క దూరమైనప్పుడు బాధపడును. (చివరకు తన రక్తమును తాను త్రాగి నీరసించును).

**81**

**శ్లో॥ అపారే కావ్యసంసారే – కవిరేవ ప్రజాపతిః ।**
**యథాస్మై రోచతే విశ్వం – తథేదం పరికల్ప్యతే ॥**

అంతములేని కావ్యప్రపంచమును సృష్టించు కవియే బ్రహ్మదేవుడు. అతనికి ఈ ప్రపంచము ఎట్లు గోచరించునో అట్లే నిర్మించును.

**82**

**శ్లో॥ న విషం న అమృతం కించిత్ – ఏకాం ముక్త్వా నితంబినీమ్ ।**
**సైవామృతలతా రక్తా – విరక్తా విషవల్లరీ! ॥**

ఈ ప్రపంచములో విషము – అమృతము: రెండును ఒక్క యువతియే! అనురాగమున్నచో ఆమె అమృతలతయై చుట్టుకొనును. విరక్తురాలైనచో విషపుతీగయే!

**83**

**శ్లో॥ సహస్ర దుఃఖాని సహన్తి ధీరాః**
**చత్వారి దుఃఖా న్యతిదుస్సహాని ।**
**కృషిశ్చ నష్టా గృహిణీచ దుష్టా**
**పుత్రోప్యవిద్వాన్ ఉదరే వృథాచ ॥**

ధీరులు వేయి దుఃఖములైనను సహింపగలరు! కాని నాలుగు దుఃఖములు భరింపలేనివి: (1) చేసిన కృషి కలసిరాకపోవుట, (2) గయ్యాళియైన భార్య, (3) జ్ఞానశూన్యుడైన పుత్రుడు, (4) ఉదరమునందలి బాధ (పుత్రశోకము). ఈ నాలుగును మిక్కిలి బాధాకరములు.

**84**

**శ్లో॥ విశ్వామిత్ర పరాశర ప్రభృతయో వాతాంబు పర్ణాశనాః**
**తేపి స్త్రీ ముఖ పంకజం సులలితం సంవీక్ష్య మోహంగతాః ।**
**శాల్యన్నం సఘృతం పయో దధియుతం భుంజంతి యేమానవాః**
**తేషా మింద్రియనిగ్రహో యది భవేత్ వింధ్యః ప్లవేత్ సాగరే! ॥**

విశ్వామిత్రుడు – పరాశరుడు మొదలగువారు వాయు – జల – పర్ణములను భక్షించువారు. అట్టివారు కూడ స్త్రీని చూచి మోహమును పొందినారు. సన్నన్నము – నెయ్యి – పాలు–పెరుగు భక్షించునట్టి వారికి ఇంద్రియ నిగ్రహమున్నచో సముద్రములో వింధ్య పర్వతము తేలును!

**85**

**శ్లో॥ తృషా శుష్యత్యాస్యే పిబతి సలిలం శీతమధురమ్**
**క్షుధార్తః శాల్యన్నం కబళయతి మాంసాది కలితమ్ ।**
**ప్రదీపే కామాగ్నౌ సుదృఢతరమాలింగతి వధూమ్**
**ప్రతీకారం వ్యాధేః సుఖమితి విపర్యస్యతి జనః ॥**

దాహముతో నోరెండినప్పుడు చల్లని తీయని నీరు త్రాగుచున్నాడు. ఆకలిమంట వచ్చినప్పుడు సన్నన్నము మాంసముతో కలిపి భక్షించుచున్నాడు. కామాగ్ని

మండినప్పుడు భార్యను కౌగిలించుకొనుచున్నాడు. వ్యాధులకు మందులను వాడుచు ఆనందముగా నుంటినని మానవుడు భ్రమించుచున్నాడు!

**86**

**శ్లో॥ సతి సక్తో సరో యాతి సద్భావం హ్యే కనిష్ఠయా ।**
**కీటకో భ్రమరం ధ్యాయన్ భ్రమరత్వాయ కల్పతే ॥**

సజ్జనులతో నిరంతర సంబంధమువలన మానవుడు సజ్జనుడుగా మారును. పురుగు తుమ్మెదను తలచుకొనుచు తుమ్మెదగా మారుచున్నది కదా!

**87**

**శ్లో॥ అత్యంబు పానా, దతి మైథునాచ్చ,**
**దివాస్వపాత్, జాగరణాచ్చరాత్రౌ ।**
**విధారణాత్ మూత్రపురీషణాచ్చ,**
**షడ్భిః మనుష్యైః ప్రభవన్తి రోగాః ॥**

మితము, సమయము తెలియక నీరుత్రాగుట–అతిసంభోగము–పగటినిద్ర – రాత్రి మేల్కొనుట–మూత్ర పురీషములను బిగబట్టుట – అను ఆఱు కారణములచే రోగములు వచ్చును (చరకుడు).

**88**

**శ్లో॥ భార్యాహీనం గృహస్థస్య – శూన్యమేవ గృహం భవేత్ ।**
**నగృహం గృహమిత్యాహుః – గృహిణీ గృహముచ్యతే ॥**

ఇంటిలో భార్యలేనిచో గృహస్థునకు గృహమేలేనట్లు తోచును. ఇల్లు – ఇల్లుకాదు! ఇల్లాలే ఇల్లు!

**89**

**శ్లో॥ కుపితంచ మహీపాలం – కుంజరంచ మదాలసమ్ ।**
**అతి దూరే పరిత్యజ్య – వామనన్తి మనీషిణః ॥**

కోపించిన రాజునకు – మదించిన ఏనుగునకు బుద్ధిమంతులు వీలైనంత దూరముగా తప్పుకొని తిరుగుదురు.

**90**

**శ్లో॥ అధికారం చ, గర్భం చ - ఋణం చ, శ్వానబంధనమ్ ।**
**ప్రవేశే సుఖమాప్నోతి - నిర్గమే ప్రాణసంకటః ॥**

అధికారము - గర్భము - ఋణము - శునక బంధనము ప్రారంభములో ఆనందమేకాని, విడిపించుకొనువేళ ప్రాణముమీదికి వచ్చును.

**91**

**శ్లో॥ అధ్వా జరా మనుష్యాణాం - అనధ్వా వాజినాం జరా ।**
**అమైథునం జరా స్త్రీణాం - అశ్వానాం మైథునం జరా ॥**

శక్తిని మించిన కాలినడక మనుష్యలకు వార్ధక్యమును తెచ్చును. పరుగెత్తింపనిచో గుఱ్ఱమునకు వార్ధక్యము. పురుష సంపర్కములేనిచో స్త్రీలకు తొందరగా వార్ధక్యము వచ్చును. గుఱ్ఱములకు దాంపత్య క్రీడ వార్ధక్యకరము!

**92**

**శ్లో॥ వాగ్వాదం - అర్థ సంబంధం - పరోక్షే దారభాషణమ్ ।**
**యత్ర మిత్రత్వ మిచ్ఛన్తి - తత్ర త్రీణి నకారయేత్ ॥**

వాదన చేయుట - ధనసంబంధము పెట్టుకొనుట - భర్తలేనివేళలో భార్యతో మాటలాడుట - అను మూడు పనులు మైత్రి కావలయునన్నచో మానవలెను.

**93**

**శ్లో॥ కుభోజనం, క్రోధముఖీ చ భార్యా**
**కుగ్రామవాసః, కుజనస్యసేవా ।**
**అల్పా చ విద్యా, విధవా చ కన్యా**
**వినాగ్నినా షట్ ప్రదహన్తి కాయమ్ ॥**

కూరలు, పచనము సరిలేని భోజనము - చిరచిరలాడు భార్య - ప్రయాణ, విద్యా, వైద్య సౌకర్యములు లేని గ్రామనివాసము - దుర్మార్గుని దగ్గర ఉద్యోగము - వచ్చీరాని చదువు - విధవరాలైన కూతురు - అను ఆఱును అగ్నిలేకుండా శరీరమును కాల్చును!

## 94

**శ్లో॥ చితి–చింతా ద్వయోర్మధ్యే – చింతానామ గరీయసీ ।**
**చితిర్దహతి నిర్జీవం – చింతా ప్రాణయుతం వపుః ॥**

"చితి (తగులబెట్టుటకు పేర్చిన కట్టెలపాన్పు) – చింత" అను రెంటిలోను చింతయే గొప్పది! ఏలయన, చితి చచ్చినవానిని గాల్చును; చింత ప్రాణముతో నున్న దేహమును కాల్చును!

## 95

**శ్లో॥ అకృత్వా పరసంతాపం – అగత్వా ఖలమందిరమ్ ।**
**అక్లేశయిత్వా చాత్మానం – యదల్పమపి తద్బహు ॥**

ఇతరులను బాధింపక–నీచులను ఆశ్రయింపక – ఆత్మక్షోభ పొందక – తక్కువ ఆర్జించినను అది ఎక్కువయే!

## 96

**శ్లో॥ అతిచతుర కవేః సృష్టిః అప్యుజ్ఝితోర్వీ ప్రాప్యవ్యోమ్నాంతరాళమ్ ।**
**పునరపి సహసా విందతే పూర్వ ముర్వీమ్ ॥**

చాతుర్యము కల్గిన మహాకవి ఆలోచనలు భూపరిధి దాటి – వ్యోమవీథిలో విహరించును. భూమిపై చరించు ప్రాణుల హృదయస్పందనములు గ్రహింపగల్గును.

## 97

**శ్లో॥ నరత్వం దుర్లభం లోకే – విద్యాతత్ర సుదుర్లభా**
**కవిత్వం దుర్లభంతత్ర – శక్తిస్తత్ర సుదుర్లభా ।**
**అస్మిన్నతి విచిత్ర కవిపరంపరా వాహిని సంసారే**
**ద్వి – త్రాః – పంచ – షావా మహాకవయ ఇతి గణ్యంతే ॥**

మానవత్వము దుర్లభము. విద్య అంతకంటే దుర్లభము. కవిత్వము – రసపుష్టి, మఱింత దుర్లభము. కవి పరంపరలో ఇద్దరో ముగ్గురో, లేదా ఐదారుగురో మహాకవులుగా గణింపబడుదురు.

**98**

**శ్లో॥ గర్భే - వ్యాధౌ - శ్మశానేచ - పురాణేయా మతిర్భవేత్ ।**
**సా యది స్థిరతాం యాతి - కో నముచ్యేత బంధనాత్? ॥**

ప్రసూతివేళ - వ్యాధి వచ్చినప్పుడు - శ్మశానమునకు వెళ్ళినప్పుడు - పురాణ శ్రవణమునందు ఏర్పడిన అలోచనములు స్థిరముగానున్నచో, సంసార బంధమునుండి ప్రతివ్యక్తియును విముక్తుడగును!

**99**

**శ్లో॥ ఆత్మబుద్ధిః సుఖంచైవ - గురుబుద్ధి ర్విశేషతః ।**
**పరబుద్ధి ర్వినాశాయ - స్త్రీ బుద్ధిః ప్రలయాంతకః ॥**

తన ఆలోచనము సుఖము నిచ్చును. గురువుతో ఆలోచించుట సుఖతరము. శత్రువుతో ఆలోచించుట నాశనము చేయును. స్త్రీ యాలోచనము సర్వనాశనము కల్గించును.

**100**

**శ్లో॥ ఏకోపి గుణవాన్ పుత్రః - నిర్గుణేన శతై రపి ।**
**ఏకశ్చంద్రః తమోహన్తి - నక్షత్రైః కింప్రయోజనమ్? ॥**

గుణవంతుడైన పుత్రుడొక్కడున్న చాలును. గుణహీనులు వందమంది యున్నను ప్రయోజనమేమి? చీకటి తొలగించుట కొక్క చంద్రుడు చాలును. నక్షత్రము లెన్నియున్నను లాభముండదు కదా!

**101**

**శ్లో॥ పితాచ ఋణవాన్ శత్రుః - మాతాచ వ్యభిచారిణీ ।**
**భార్యా రూపవతీ శత్రుః - పుత్రః శత్రుః అపండితః ॥**

అప్పులున్న తండ్రి పుత్రునకు శత్రువు. వ్యభిచరించు తల్లిని కొడుకు ద్వేషించును. భార్యా + అరూపవతీ = వికృతాకారయైన భార్య శత్రువు (అట్టి పిల్లలే పుట్టుట-వారికి పెండ్లిండ్లు చేయలేక బాధపడుట). భార్యా + రూపవతీ = అందమైన భార్య శత్రువు (రూపమున్న భార్యను ఇతరులాశింతురు. శత్రుత్వము పెరుగును). జ్ఞానశూన్యుడైన (ఆరోగ్యము - ఆర్థికము తెలియని) పుత్రుడు శత్రువు.

**102**

**శ్లో॥ దాసీ, భృత్యః, సుతో, బంధుః - వస్తువాహనమేవ చ ।**
**ధన - ధాన్య సమృద్ధిశ్చ - అష్టైశ్వర్యాః ప్రకీర్తితాః ॥**

దాస దాసీ జనము–సేవకులు - పుత్రులు - బంధువులు - వస్తువులు - వాహనములు - ధనము - ధాన్యము సమృద్ధిగానుండుట - అను ఎనిమిదియును అష్టైశ్వర్యములనబడును.

**103**

**శ్లో॥ దాతృత్వం - ప్రియవక్తృత్వం - ధీరత్వ ముచితజ్ఞతా ।**
**అభ్యాసేన నలభ్యన్తో - చత్వారః సహజా గుణాః ॥**

దానగుణము - ఎదుటివ్యక్తికి సంతోషకరముగా మాటలాడుట–గంభీరముగా నుండుట–ఉచిత, అనుచిత జ్ఞానము–అను నాల్గును పుట్టుకతో రావలసినవేకాని నేర్చుకొన్నచో రావు.

**104**

**శ్లో॥ అంకోలం నిజబీజసంతతి, మయస్కాంతోపలం సూచికా,**
**సాధ్వీ నైజ విభుం, లతా క్షితిరుహం, సింధు స్సరి ద్వల్లభం ।**
**ప్రాప్నోతీహయథా, తథా పశుపతేః పాదారవిందద్వయం**
**చేతో వృత్తి రుపేత్య తిష్ఠతి సదా సాభక్తి రిత్యుచ్యతే ॥**

ఊడుగుచెట్టు తన విత్తనములను తనవైపునకు ఆకర్షించినట్లు - అయస్కాంతము సూదిని లాగినట్లు - సాధ్వి తన భర్తను ఆకర్షించినట్లు - లత, చెట్టును ఆకర్షించినట్లు - నది సముద్రుని వైపు ఆకర్షితమైనట్లు - పరమేశ్వర పాదారవిందములను ఎడబాయక, నిరంతరముగా మనస్సునందు నిలుపుటయే భక్తియనబడును.

**105**

**శ్లో॥ న నిర్మితోవై నచ దృష్టి పూర్వో**
**నశ్రూయతే హేమమయః కురంగః ।**
**తథాపి తృష్ణా రఘునందనస్య**
**వినాశకాలే విపరీత బుద్ధిః ॥**

బంగారు లేడి బ్రహ్మసృష్టిలో లేదు. కనలేదు వినలేదు! అయినను రామునకు అట్టి లేడిపై ఆశ కల్గినది. వినాశకాలము వచ్చినప్పుడు విపరీతబుద్ధులు పుట్టునుకదా!

**106**

**శ్లో॥ అతిపరిచయా దవజ్ఞా - సంతతగమనా దనాదరో భవతి ।**
**మలయే భిల్లపురంధ్రీ చందనతరు - కాష్ఠ మింధనం కురుతే! ॥**

ఎక్కువ పరిచయము నిర్లక్ష్యమునకు దారితీయును. ఇతరుల ఇంటికి తరచుగా వెళ్ళుటవలన ఆదరణము తరిగిపోవును. మలయపర్వతము పై నివసించు భిల్లస్త్రీ మంచిగంధపు చెక్కలను వంట చెఱకుగా నుపయోగించును.(-పండితరాజ శతకం)

**107**

**శ్లో॥ విద్వానేవ విజానాతి - విద్వజ్జన పరిశ్రమమ్ ।**
**నహి వంధ్యా విజానాతి - గుర్వీం ప్రసవ వేదనామ్ ॥**

విద్వాంసుల కృషిని విద్వాంసుడే గ్రహింపగలడు. ప్రసవవేదనను గొడ్రాలు తెలిసికొనలేదు కదా!

**108**

**శ్లో॥ చంద్రే లాంఛనతాం, హిమో హిమగిరౌ, క్షారం జలం సాగరే,**
**బద్ధాశ్చందన పాదపేషు ఫణినః, పద్మేషువై కంటకాః ।**
**స్త్రీరత్నేషు జరా, కుచేషు పతనం, విద్వత్సు నిశ్శ్రీకతా,**
**సర్వం రత్న ముపద్రవేణ సహితం, నిర్దోష మేకం యశః ॥**

చంద్రునిలో మచ్చ-హిమాలయముపై మంచు - సముద్రములో పానయోగ్యము కాని లవణజలము - మంచి గంధపుచెట్లను చుట్టుకొని సర్పములు - పద్మముల కాడకు బొడిపెలు - సుందరీమణులకు వార్ధక్యము - కుచములకు జారుపాటు-విద్వాంసులకు దారిద్ర్యము-చూడగా లోకములో గొప్పవి అన్నియును ప్రమాద సహితములనిపించును. ఏ ప్రమాదమును లేనిది కీర్తియొక్కటే కదా!

**109**

**శ్లో॥ మితం దదాతి హి పితా - మితం మాతా, మితం సుతః ।**
**అమితస్యతు దాతారం - భర్తారం కా న పూజయేత్?॥**

తండ్రి మితముగనే యిచ్చుచున్నాడు; తల్లియు, కొడుకును కూడ మితముగనే యిచ్చుచున్నారు; కాని మితము లేకుండ కావలసిన వన్నియు నిచ్చువాడు భర్త. అట్టి భర్తను ఎవతె పూజించదు? (రామాయణము-అయోధ్యాకాండ, 39-40)

**110**

సంస్కృతములో "విహస్య" (=నవ్వి) అనునది ప్రాథమికునకు షష్ఠీ విభక్తిగా దోచును. ప్రాథమికునకు "విహాయ" (= విడిచి) చతుర్థిగా తోచును. మఱియు "అహం" (= నేను)- "కథం" (=ఎట్లు?) ఈ రెండును రామశబ్దమాత్ర జ్ఞానమున్న వానికి ద్వితీయా విభక్తులుగా దోచును. ఇట్లు తోచుట భాషాజ్ఞానశూన్యలక్షణము. "అట్టివానికి నేను భార్యను కాజాలను" అనుచున్నది ఒక యువతి:-

**శ్లో॥ యస్య షష్ఠీ చతుర్థీ స్యాత్ - 'విహస్య' చ 'విహాయ' చ ।**
**'అహం! 'కథం' ద్వితీయాస్యాత్ - ద్వితీయాస్యామహం కథమ్? ॥**

ఎవనికి "విహస్య" - "విహాయ" అను ధాతువులు షష్ఠీ-చతుర్థీ విభక్తులుగా గోచరించునో; "అహం" అను సర్వనామము "కథం" అను అవ్యయము ద్వితీయా విభక్తులనిపించునో; అట్టి అజ్ఞానికి నేను ఎట్లు ద్వితీయ (భార్య)ను కాగలను? ('రామ' వంటి శబ్దములకు మాత్రమే విభక్తులుండును. 'విహస్య' - 'విహాయ' అను అవ్యయములకు, 'అహం' అను సర్వనామమునకు, 'కథం' అను అవ్యయమునకు విభక్తులుండవు. రామశబ్దము మాత్రమే చదువుకున్నవాడు వీనిని విభక్త్యంతములుగా భ్రమించును).

**111**

**శ్లో॥ సిద్ధమన్నం, ఫలం పక్వం - నారీ ప్రథమ యౌవనమ్ ।**
**కాలక్షేపం నకర్తవ్యం - ఆలస్యా దమృతం విషమ్ ॥**

వేడియైన అన్నము - ఆరముగ్గిన పండు - స్త్రీయొక్క ప్రథమ యౌవనము - వీని అనుభవమునకు వాయిదా వెయ్యరాదు. ఆలసించినచో అమృతము కూడా విషముగా మారు ప్రమాదమున్నది!

**112**

**శ్లో॥ రాజా రాక్షసశ్చైవ - శార్దూలాః తత్ర మంత్రిణః ।**
**గృధ్రాశ్చ సేవకాస్సర్వే - యథారాజా తథాప్రజాః ॥**

రాజు రాక్షసుడైనచో మంత్రులు బెబ్బులులు! సేవకులందఱును గ్రద్దలు! రాజును బట్టియే ప్రజలుందురు.

### 113

**శ్లో॥ వేదమూల మిదం జ్ఞానం - భార్యామూల మిదం గృహమ్ ।**
**కృషిమూల మిదం ధాన్యం - ధనమూల మిదం జగత్ ॥**

జ్ఞానమునకు ఆధారము వేదము. గృహమునకు భార్యయే ఆధారము. ధాన్యమునకు వ్యవసాయము ఆధారము. జగత్తు ధనముపై ఆధారపడియున్నది.

### 114

**శ్లో॥ రాజ్ఞి ధర్మిణి ధర్మిష్ఠాః - పాపే పాపరతాస్సదా ।**
**రాజాన మనువర్త న్తే - యథారాజా తథాప్రజాః ॥**

రాజు ధర్మాత్ముడైనచో ప్రజలు ధర్మనిష్ఠతో నుందురు. పాపాత్ముడైనచో పాపాత్ములగుదురు. ప్రజలెల్లప్పుడును రాజునే అనుసరింతురు. రాజెట్లో ప్రజలును అట్లే యుందురు.

### 115

**శ్లో॥ అతిరూపాత్ హృతా సీతా - అతిధర్వా ద్రావణోహతః ।**
**అతిదానాత్ బలిర్బద్ధః - అతి సర్వత్ర వర్జయేత్ ॥**

అతి రూపము వలన సీత అపహరింపబడెను. అతి గర్వమువలన రావణుడు చంపబడెను. అతి దానము వలన బలి బంధింపబడెను. కావున "అతి" అన్నిచోట్లను హానికరము.

### 116

**శ్లో॥ క్షతే ప్రహారాః నిపతంత్యనేకం**
**ధనక్షయే వర్ధతి జాఠరాగ్నిః ।**
**ఆపత్సు వైరాణి సముద్భవన్తి**
**ఛిద్రేష్వనర్థాః బహుధా భవన్తి! ॥**

గాయమునకే అనేక గాయములు గ్రుచ్చుకొనును. పేదరికములో ఆకలి యెక్కువగా నుండును. ఆపదలు వచ్చినప్పుడు విరోధములు వచ్చును. బాధలలోనే బాధలు వచ్చుట లోకధర్మము!

**117**

**శ్లో॥ మాతాసమం నాస్తి శరీరపోషణమ్,**
**విద్యాసమం నాస్తి శరీరభూషణమ్ ।**
**భార్యాసమం నాస్తి శరీరతోషణమ్,**
**చింతాసమం నాస్తి శరీరశోషణమ్! ॥**

శరీరమును పోషించుటలో తల్లితో సమానులు లేరు. విద్యతో సమానమైన శరీరాలంకారము లేదు. శరీరమునకు సంతోషము కల్గించుటలో భార్యతో సమానులు లేరు. శరీరము చిక్కిపోవునట్లు చేయుటలో విచారముతో సమానము వేరొక్కటి లేదు!

**118**

**శ్లో॥ క్షణే తుష్టః, క్షణే రుష్టః - వితుష్టిశ్చ క్షణేక్షణే ।**
**అవ్యవస్థిత చిత్తస్య - ప్రసాదోపి భయంకరః ॥**

స్థిరచిత్తములేనివాడు క్షణములో సంతోషించును; మరుక్షణములో కోపించును. ప్రతిక్షణములోను అసంతృప్తిగా నుండును. అట్టి స్థిరచిత్తములేని వానియొక్క అనుగ్రహము కూడా భయంకరమే!

**119**

**శ్లో॥ స్వసుఖనిరభిలాషః ఖిద్యసే లోకహేతోః**
**ప్రతిదిన మథవాతే వృత్తిరేవం విధైవ ।**
**అనుభవతిహి మూర్ధ్నా పాదపః తీవ్రముష్ణం**
**శమయతి పరితాపం ఛాయయా సంశ్రితానామ్ ॥**

తా॥ తన సుఖమునందు దృష్టినుంచుకొనక, లోకముకొఱకై ఎల్లప్పుడును విచారించుచుండు మహాపురుషులదే కదా జన్మ! వారికది సహజవ్యాపారమే! మహావృక్షమును చూడుడు–తీవ్రమైన ఎండనంతటిని తానే భరించును. తన్ను ఆశ్రయించిన వారికి మాత్రము తాపోపశాంతినొసగి, నీడనిచ్చి సుఖపెట్టుట దానికి నిత్యకృత్యమే కదా! (కాళిదాసు – అభిజ్ఞానశాకుంతలమ్)

**120**

**శ్లో॥ అసభ్యాసే విషం శాస్త్రం - అజీర్ణే భోజనం విషమ్ ।**
**దరిద్రస్య విషం గోష్ఠీ - వృద్ధస్య తరుణీ విషమ్ ॥**

అభ్యాసము చేయనివానికి శాస్త్రము విషము. అజీర్ణముగా ఉన్నప్పుడు భోజనము విషము. దరిద్రునకు సద్గోష్ఠి విషము. వృద్ధునకు వయస్సులో ఉన్న భార్యయే విషము!

**121**

**శ్లో॥ అల్పజ్ఞః పూజ్యతే గ్రామే - విశేషజ్ఞ వివర్జితే ।**
**దేశే వృక్షవినా భూతే - హ్యేరండోహి వనస్పతిః ॥**

ఎక్కువగా చదువుకొన్నవారు లేని గ్రామములో తక్కువ చదువుకొన్నవాడు కూడా పూజింపబడును. వృక్షములులేని దేశములో ఆముదపుచెట్టు మహావృక్షము గదా!

**122**

**శ్లో॥ నిరస్త పాదపే దేశే - హేరండోపి ద్రుమాయతే ।**
**సాలి-దేంద్ర సభామధ్యే - సాతానిః పండితోత్తమః ॥**

చెట్లులేని దేశములో ఆముదపుచెట్టే మహావృక్షము! సాలివారు జేంద్రవారు చేరిన సభలో సాతానివాడే పండితోత్తముడు!

**123**

**శ్లో॥ అజవత్ భోజనం కుర్యాత్ - గజవత్ స్నానమాచరేత్ ।**
**శుకవత్ భాషణం కుర్యాత్ - బకవత్ ధ్యానమాచరేత్ ॥**

మేకవలె భోజనము-ఏనుగువలె స్నానము - చిలుకవలె భాషణము - కొంగవలె ధ్యానము చేయవలయును.

**124**

**శ్లో॥ బాలసఖిత్వ, మకారణహాస్యం,**
**స్త్రీషు వివాద, మసజ్జనసేవా ।**
**గార్దభయాన, మసంస్కృతవాణీ,**
**షట్సు నరో లఘుతా ముపయాతి ॥**

చిన్నపిల్లలతో స్నేహము–కారణములేని నవ్వు – స్త్రీలతో పోట్లాట – దుర్మార్గులను సేవించుట – గాడిదనెక్కుట – గ్రామ్యభాషా భాషణము–అను ఆరు పనులవలన నరుడు గౌరవము కోల్పోవును. (అసంస్కృతవాణీ = బూతులు మాటలాడుట అనియు నర్థము).

### 125

**శ్లో॥ మంత్రే, తీర్థే, ద్విజే, దైవే – దైవజ్ఞే, భేషజే, గురౌ ।**
**యాదృశీ భావనా యత్ర – సిద్ధిర్భవతి తాదృశీ ॥**

మంత్రము – తీర్థము – విప్రుడు – దైవము – జ్యోతిషుడు – వైద్యుడు – గురువు–అను ఏడింట నమ్మకమునుబట్టి ఫలితముండును.

### 126

**శ్లో॥ అశ్వస్య లక్షణం వేగః – మదో మాతంగ లక్షణమ్ ।**
**చాతుర్యం లక్షణం స్త్రీణాం – ఉద్యోగం పురుష లక్షణమ్ ॥**

వేగంగా పరుగెత్తడం గుఱ్ఱంయొక్క లక్షణం (స్వభావం). మదజలాన్ని స్రవించడం ఏనుగు లక్షణం. చాతుర్యం స్త్రీల లక్షణం. (ఒక లక్ష్యాన్ని పెట్టుకొని దాని కోసం) ప్రయత్నించడం పురుషుని లక్షణం!

### 127

**శ్లో॥ క్షణశః కణశశ్చైవ – విద్యా మర్థంచ సాధయేత్ ।**
**క్షణ త్యాగే కుతో విద్యా? – కణ త్యాగే కుతో ధనమ్?॥**

క్షణము పోనీయకుండా విద్యను – కణము (చిన్నముక్క) పోనీయకుండా ధనమును సాధించవలయును. (కొన్ని క్షణములే జీవితము – కొన్ని పైసలే మహాధనము). క్షణములను నిర్లక్ష్యము చేసినవానికి విద్యయు – కణములను నిర్లక్ష్యము చేసినవానికి ధనమును ప్రోగుకావు.

### 128

**శ్లో॥ గుణైః ఉత్తుంగతాం యాతి – నోచ్చైః ఆసన సంస్థితైః ।**
**ప్రాసాద శిఖరస్థోపి – కాకః కిం గరుడాయతే? ॥**

గుణములచే గొప్పవారగుదురే కాని, ఉన్నత పదవులయందున్నంత మాత్రాన గొప్పవారు కారు. పెద్ద భవనంయొక్క శిఖరంమీద ఉన్నంత మాత్రాన కాకి, గరుత్మంతుడగునా?

**129**

**శ్లో॥ లుబ్ధానాం యాచకః శత్రుః - మూర్ఖాణాం బోధకో రిపుః ।**
**జారిణీనాం పతిః శత్రుః - చోరాణాం చంద్రమా రిపుః ॥**

లోభులకు యాచకుడు - మూర్ఖులకు బోధకుడు-అంకుటాలికి భర్త - చోరులకు చంద్రుడు శత్రువులు.

**130**

**శ్లో॥ చితా చింతా సమాహ్యుక్తా - బిందుమాత్ర విశేషతః ।**
**సజీవం దహతే చింతా! - నిర్జీవం దహతే చితా! ॥**

చితా (చితి) - చింతా అను రెండును సమానములే! సున్నమాత్రమే భేదము.. తగులబెట్టుటలో కూడ ఎక్కువ భేదము లేదు! చింత సజీవుని తగులబెట్టును; చితా (చితి) నిర్జీవుని తగులబెట్టును.

(ఇదే భావంగల శ్లోకం ఇంకో రూపంలో ఇంతకు ముందు వచ్చింది. చూడుడు: 94వ సంఖ్యదగ్గర ఉన్న శ్లోకం)

**131**

**శ్లో॥ మూలే భుజంగైః, శిఖరే విహంగైః,**
**శాఖాః ప్లవంగైః, కుసుమాని భృంగైః ।**
**ఆశ్చర్యమేతత్ ఖలు చందనస్య!**
**పరోపకారాయ సతాం విభూతయః ॥**

గంధపుచెట్టుయొక్క మొదలు సర్పములకు - చిటారు కొమ్మలు పక్షులకు - కొమ్మలు కోతులకు - పుష్పములు తుమ్మెదలకు - ఉపయోగపడుచున్నవి. ఆహా! సజ్జనుల సంపదలన్నియును పరోపకారమునకే కదా!

**132**

**శ్లో॥ అశక్తస్తు భవేత్సాధుః - బ్రహ్మచారీ తు నిర్ధనః ।**
**వ్యాధితో దైవభక్తశ్చ - వృద్ధనారీ పతివ్రతా! ॥**

బలహీనుడు మంచిగా బ్రతుకును. ధనహీనుడు బ్రహ్మచర్యము పాటించును. వ్యాధిగ్రస్తుడు దైవభక్తితో నుండును. వార్ధక్యములోనికి వచ్చిన స్త్రీ పతివ్రతగా మెలగును.

**133**

**శ్లో॥ ధర్మోపదేశ సమయే - జనాస్సర్వేపి పండితాః ।**
**తదనుష్ఠాన సమయే - మునయోపి న పండితాః ॥**

ధర్మములను ఉపదేశించుటలో అందరును పండితులే! ఆచరణములో మాత్రము మునులు కూడా చేతకానివారే!

**134**

**శ్లో॥ దేశాటనం పండిత మిత్రతా చ**
**వారాంగనా రాజసభా ప్రవేశః ।**
**అనేక శాస్త్రార్థ విలోకనం చ**
**చాతుర్య మూలాని భవన్తి పంచ ॥**

దేశాటనము-పండిత స్నేహము-వేశ్యలతో సంభాషించుట-సభలకువెళ్ళుట - అనేక శాస్త్రార్థముల నెఱుంగుట - అనునైదును వాక్చాతుర్య కారణములు.

**135**

**శ్లో॥ అనర్ఘమపి మాణిక్యం - హేమాశ్రయ మపేక్షతే ।**
**నిరాశ్రయా నశోభిస్తే - పండితా వనితా లతాః ॥**

రత్నము అమూల్యమైనను బంగారము నాశ్రయింపనిచో (బంగారమున పొదగబడనిచో) ప్రకాశింపదు. అట్లే పండితులు - వనితలు - లతలు ఆశ్రయము లేనిచో ప్రకాశింపరు!

**136**

**శ్లో॥ వైద్యాః వదన్తి కఫ పిత్త మరుద్వికారాన్,**
**జ్యోతిర్విదో గ్రహగతం పరివర్తయన్తి ।**
**'భూతాభిషంగ' ఇతి భూతవిదో వదన్తి,**
**ప్రాచీనకర్మ బలవాన్ మునయో వదన్తి॥**

శారీరక బాధలు వచ్చినప్పుడు వైద్యులు కఫ-వాత-పిత్తవికారములందురు - జ్యోతిషులు గ్రహస్థితి పేర్కొందురు. భూతవైద్యులు భూత సంబంధమందురు. పూర్వజన్మ కర్మమని మునీశ్వరులందురు. వీనిలో ఏది నిజమో దేవుడెఱుగును!

**137**

**శ్లో॥ ఉపకారోహి నీచానాం - అపకారాయ జాయతే ।**
**పయఃపానం భుజంగానాం - కేవలం విషవర్ధనమ్ ॥**

నీచులకు ఉపకారము చేసినచో అది వారికి అపకారకారణముగా పరిణమించును. పాములకు పాలుపోసినచో విషమే వృద్ధియగును గదా!

**138**

**శ్లో॥ అసారే ఖలు సంసారే - సారం శ్వశుర మందిరమ్ ।**
**క్షీరాంబ్ధౌ చ హరిశ్శేతే - శివశ్శేతే హిమాలయే ॥**

సారములేని యీ సంపారములో పురుషులకు సార(ఆనంద)మైనది అత్తవారిల్లు! అందుచేతనే విష్ణువు క్షీరసాగరముపై పవ్వళించుచున్నాడు! శివుడు హిమాలయముపై వసించుచున్నాడు! రెండవ పాదమునకు పాఠాంతరము: **"హిమాలయే హరశ్శేతే - హరిశ్శేతే మహోదధౌ॥"** "క్షీరాబ్ధౌచ" కి పాఠాంతరం: "క్షీరాంభసి".

**139**

**శ్లో॥ సులభాః పురుషా లోకే - సతతం ప్రియవాదినః ।**
**అప్రియస్య చ పథ్యస్య - వక్తా శ్రోతా చ దుర్లభః ॥**

ముఖప్రీతి (తాత్కాలికము)గా ఆనందమైన మాటలాడువారు లోకములో చాలమందియుందురు. బాగును కోరునట్టి మంచిమాటను చెప్పువారును - వినువారును లోకములో దొరకరు.

**140**

**శ్లో॥ అళీ-కుళీ-వృశ్చిక-వేణు-రంభా**
**వినాశకాలే ఫలముద్వహన్తి ।**
**యథా తథా సజ్జన-దుర్జనానాం**
**వినాశకాలే విపరీత బుద్ధిః ॥**

తుమ్మెద–పీత–తేలు–వెదురు–అరటి: ఇవి నాశనకాలము వచ్చినప్పుడు ఫలించును. సజ్జనులకు దుర్జనులకు పోగాలము దాపురించినవేళ విపరీతబుద్ధులు పుట్టును.

**141**

**శ్లో॥ ద్రవ్యాణి భూమౌ, పశవశ్చ గోష్ఠే,**
**భార్యా గృహద్వారి, జన శ్మశానే ।**
**దేహశ్చితాయాం, పరలోకమార్గే,**
**కర్మానుగో గచ్ఛతి జీవ ఏకః ॥**

సంపాదించిన ద్రవ్యములు భూమిమీద – పశువులు శాలలోను–భార్య గృహద్వారము లోపల – బంధుమిత్రులు శ్మశానము దగ్గర – దేహము చితియందు – మిగిలిపోవును. కర్మ ఒక్కటే జీవుని అనుసరించి వెళ్ళును!

**142**

**శ్లో॥ నిర్వాణ దీపే కిము తైలదానం?**
**చోరేగతేవా కిము సావధానమ్?।**
**వయోగతే కిం వనితా విలాసః?**
**పయోగతే కిం ఖలు సేతుబంధః?॥**

దీపము ఆరిపోయిన తరువాత తైలము పోయుట ఎందులకు? దొంగ దొంగిలించుకొని పోయిన తరువాత మేల్కొనుటవలన ప్రయోజనమేమి? వయస్సు అయిపోయిన తరువాత పురుషునకు స్త్రీ వ్యామోహమెందులకు? నీళ్ళు పోయిన తరువాత గట్టువేయుట వలన ఉపయోగమేమి? (సకాలములో జాగ్రత్త వహింపనివాని కృషి ఎంత గొప్పదైనను వ్యర్థము).

**143**

**శ్లో॥ కర్మాయత్తం ఫలం పుంసాం – బుద్ధిః కర్మానుసారిణీ ।**
**తథాపి సుధియా భావ్యం – సువిచార్యైవ కుర్వతా ॥**

తన కర్మను అనుసరించియే ఫలితము లభించును. బుద్ధి, కర్మను అనుసరించును. (కర్మను అనుసరించి బుద్ధి పుట్టుచుండును). అయినను పండితుడు

చక్కగా ఆలోచించి పనులు చేయవలెను. తెలివితక్కువ పనులు చేసి కర్మపై ఆరోపించరాదు!

**144**

**శ్లో॥ శ్రుతిశ్చ భిన్నాః, స్మృతయశ్చ భిన్నాః,**
**మహాఋషీణాం మతయశ్చ భిన్నాః ।**
**(నైకో మునిః యస్య వచః ప్రమాణం)**
**ధర్మస్య తత్త్వం నిహితం గుహాయాం,**
**మహాజనోయేన గతస్సపంథా॥**

వేదములు – ధర్మశాస్త్రములు – మహర్షుల మతములు భిన్నభిన్నములుగా కన్పించును. ధర్మ సూక్ష్మమును గుహలలో (ఎదదలలో) నిక్షేపించినారు. మహాత్ములు నడచినదే మనకు మార్గము!

**145**

**శ్లో॥ దృష్టిపూతం న్యసేత్ పాదం – వస్త్రపూతం జలం పిబేత్ ।**
**శాస్త్రపూతాం వదేత్ వాణీం – మనఃపూతం సమాచరేత్ ॥**

ప్రదేశము చూచుకొనుచు పాదము పెట్టవలయును. గుడ్డతో వడగట్టిన నీరు త్రాగవలెను. శాస్త్రసమ్మతముగా మాటలాడవలయును. మనస్సాక్షిగా ప్రవర్తించవలెను!

**146**

**శ్లో॥ మనసైవ కృతం పాపం – నశరీరకృతమ్ కృతమ్ ।**
**యేనైవాఽలింగితా కాంతా – తేనైవాఽలింగితా సుతా ॥**

మనస్సుతో చేసిన పాపమే పాపము గాని శరీరముతో చేసినది పాపము కాదు. భార్యను కౌగిలించుకొన్న చేతులతోడనే కూతురును కౌగిలించుకొనుచున్నాడు. మనస్సులో ఎంత వ్యత్యాసము!

**147**

**శ్లో॥ యథా వ్యాళగళస్థోపి – భేకో దంశా నపేక్షతే ।**
**తథా కాలాదినాగ్రస్తో – లోకో భోగా నపేక్షతే ॥**

సర్పము గొంతులో సగము చిక్కిన కప్ప బయటఉన్న కీటకములకై నాలుక చాచుచున్నది! అట్లే కాలముచే కబళింపబోవు లోకము భోగములను అపేక్షించుచున్నది!

**148**

**శ్లో॥ ఉత్సవే వ్యసనే చైవ - దుర్భిక్షే, శత్రువిగ్రహే ।**
**రాజద్వారే, శ్మశానే చ - యస్తిష్ఠతి సబాంధవః ॥**

సుఖదుఃఖములందును, కఱవు వచ్చినప్పుడును - శత్రువులు మన మీదకు వచ్చినప్పుడును, రాజసన్మానమును పొంది వచ్చినప్పుడు ద్వారము దగ్గర అభినందించుటకును, చచ్చినప్పుడు శ్మశానమునందును, మనలను విడువకుండువాడే నిజమైన బంధువు!

**149**

**శ్లో॥ కర్మణోహి ప్రధానత్వం - కింకుర్వన్తి శుభాశ్శుభాః ।**
**వశిష్ఠదత్తలగ్నోపి - రామః కిం భ్రమతే వనే? ॥**

కర్మయే నడిపించునుగాని, శుభాశుభ జ్యోతిషము లెక్కలేమియును చేయజాలవు. వశిష్ఠుడంతటి జ్యోతిషుడు పట్టాభిషేకమునకు పెట్టిన లగ్నమునకు రాముడు అడవుల పాలైనాడు!

**150**

**శ్లో॥ దుర్జనస్య విశిష్టత్వం - పరోపద్రవ కారణమ్ ।**
**ఉపోషితస్య వ్యాఘ్రస్య - పారణం పశుమారణమ్ ॥**

'దుర్మార్గుడు మంచిగా ప్రవర్తించుచున్నాడు' - అనగా 'ఏదో ఇతరులకు ప్రమాదము తెచ్చిపెట్టబోవుచున్నాడు'- అని అర్థము. పెద్దపులి ఉపవాసము చేయు చున్నదనగా - మర్నాడు రెట్టింపు జంతువులను చంపుటకే కదా!

**151**

**శ్లో॥ దుర్మంత్రీ రాజ్యనాశాయ - గ్రామనాశాయ కుంజరః ।**
**శ్యాలకో గృహనాశాయ - సర్వంనాశాయ మాతులః ॥**

దుష్టమంత్రి రాజ్యము నాశనము చేయును. ఏనుగును గ్రామములో విడిచినచో, అది ఆ గ్రామమును నాశనము చేయును. బావమరిదిని ఇంటిలో పెట్టుకొన్నచో గృహనాశనము చేయును. మేనమామను ఆశ్రయించిన సర్వనాశనము చేయును.

**152**

**శ్లో॥ గర్జతి శరది న వర్షతి – వర్షతి వర్షాసు నిస్వనో మేఘః ।**
**నీచో వదతి నకురుతే! – న వదతి సుజనః కరోత్యేవ ॥**

శరత్కాల మేఘము ఉరుమునుగాని వర్షింపదు. వర్షాకాల మేఘము ఉరుమకయే వర్షించును. నీచుడు ప్రగల్భములాడునేకాని ఏ పనియును సాధింపలేడు. సజ్జనుడు ప్రగల్భములాడడు, పనిని సాధించును.

**153**

**శ్లో॥ నిర్విషేణాపి సర్పేణ – కర్తవ్యా మహతీ ఫణా ।**
**విషం భవతు మా భూద్వా – ఫటాటోపో భయంకరః ॥**

విషములేని సర్పముకూడా పడగవిప్పి బుసకొట్టుచుండవలయును. విషమున్నను లేకపోయినను పడగవిప్పినచో భయంకరముగా నుండును గదా! అట్లు చేయుట ఆత్మరక్షణకు ఉపయోగించును.

**154**

**శ్లో॥ ఖ్యాతశ్శక్రో భగాంకః, విధురపి మలినః, మాధవో గోపజాతః,**
**వేశ్యాపుత్రో వశిష్ఠః, రతిపతి రతనుః, సర్వభక్షో హుతాశః ।**
**వ్యాసో మాత్స్యోదరీయః, లవణ జలనిధిః, పాండవా జారజాతాః,**
**రుద్రః ప్రేతాస్థిధారీ, త్రిభువన విషయే కస్యదోషం నచాస్తి?॥**

ఇంద్రుడు గౌతమ శాపముతో మచ్చలున్నవాడు. చంద్రుడు కళంకి. కృష్ణుడు యాదవ వంశీయుడు. వశిష్ఠుడు వేశ్యాపుత్రుడు. మన్మథుడు దేహములేనివాడు. అగ్ని సర్వమును భక్షించునది. వ్యాసుడు పల్లెస్త్రీకి జన్మించినవాడు. సముద్రజలము ఉప్పు. పాండవులు జారత్వమువలన పుట్టినవారు. శివుడు శవముల ఎముకలు ధరించువాడు. దోషములేనివాడు ముల్లోకములు వెదికినను కానరాదు!

### 155

**శ్లో॥ వృషస్య వృషణం స్పృష్ట్వా - ఈశ్వరస్యావలోకనమ్ ।**
**శృంగమధ్యే శివం దృష్ట్వా - కైలాసం భవతి ధ్రువమ్ ॥**

నందీశ్వరుని వృషణమును అంటి ఈశ్వర దర్శనము చేయవలయును. కొమ్ములపై చూపుడు - బొటనవ్రేళ్ళుంచి చూచినచో కైలాసప్రాప్తి యేర్పడును.

### 156

**శ్లో॥ యస్సుందరః తద్వనితా కురూపా**
**యాసుందరీ సాపతి రూపహీనా ।**
**యత్రోభయం తత్ర దరిద్రతాచ**
**విధేర్విచిత్రాణి విచేష్టితాని! ॥**

సుందరుడైన భర్తకు కురూపిణి భార్యయగును. సుందరస్త్రీకి కురూపుడైన భర్త యేర్పడును. భార్యాభర్తలు అందముగా నున్నచో వారికి దారిద్ర్యము వచ్చును. విధి విలాసము విచిత్రము!

### 157

**శ్లో॥ ఆకారైః ఇంగితైః గత్యా - చేష్టయా భాషణేన చ ।**
**నేత్ర వక్త్ర వికారైశ్చ - లక్ష్యతే అంతర్గతం మనః ॥**

ఆకారము చేతను, ఇంగితమును గ్రహించుట (మనస్సును గమనించుట) చేతను, నడక - చేష్టలు - సంభాషణము - కళ్ళు ముఖము త్రిప్పుట చేతను, ఇతరుల మనస్సు గ్రహింపబడుచున్నది.

### 158

**శ్లో॥ లోకేషు నిర్ధనో దుఃఖీ - ఋణగ్రస్తః తతోధికమ్ ।**
**తాభ్యాం రోగయుతో దుఃఖీ - తేభ్యోదుఃఖీ కుభార్యకః ॥**

లోకములో ధనములేనివాడు దుఃఖించును. వానికంటెను అప్పున్నవాడు దుఃఖించును. వీరిద్దరికంటె రోగముతో బాధపడువాడు దుఃఖించును. వీరందరికంటె గయ్యాళిభార్య కలవాడు మహాదుఃఖమును అనుభవించును!

**159**

**శ్లో॥ ఉత్తమే క్షణకోప స్యాత్ - మధ్యమే ఘటికా ద్వయమ్ ।**
**అధమేస్యాత్ అహోరాత్రం - పాపిష్ఠే మరణాంతకమ్ ॥**

ఉత్తమునకు కోపము క్షణకాలముండును. మధ్యమునకు రెండు ఘడియలు (24+24 నిమిషములు) ఉండును. అధమునకు ఒక రాత్రి, ఒక పగలు ఉండును. పాపాత్మునకు మరణపర్యంతమూ ఉండును!

**160**

**శ్లో॥ గాత్రం సంకుచితం, గతిర్విగళితా, భ్రష్టాచ దంతావళిః,**
**దృష్టిర్నశ్యతి, వర్ధతే బధిరతా, వక్త్రం చ లాలాయతే ।**
**వాక్యం నాద్రియతే చ బాంధవజనైః, భార్యా న శుశ్రూషతే,**
**హా కష్టం! పురుషస్య జీర్ణవయసః, పుత్రోఽప్యమిత్రాయతే ॥**

ముసలితనము వచ్చిన మానవునకు ఒడలు ముడుతలు పడును. అడుగులు తడబడును. దంతములు రాలిపోవును. చూపు నశించును. చెవుడు పెరుగును. నోరు చొంగకారును. చుట్టాలు మాట వినరు. పెళ్ళాంకూడా సేవచేయదు. పుత్రుడు సహితము శత్రువగును. హా! ఎంతకష్టం వచ్చినది?

**161**

**శ్లో॥ మాధుర్య మక్షరవ్యక్తిః - పదచ్ఛేదస్తు సుస్వరః ।**
**ధైర్యం లయ సమర్థం చ - షడేతే పాఠకా గుణాః ॥**

రసానుగుణముగా చదువుట - అక్షరోచ్చారణము - పదచ్ఛేదము - చక్కని కంఠస్వరము - తడబాటు లేకుండుట - లయ తప్పకుండుట - అను ఆఱును ఉత్తమపాఠక లక్షణములు!

**162**

**శ్లో॥ శీఘ్రీ, గీతీ, శిరఃకంపీ - యథా లిఖితపాఠకః ।**
**అనర్థజ్ఞోఽల్పకంఠశ్చ - షడేతే పాఠకాధమాః ॥**

తొందరగా చదువుట-మూలుగుతూ చదువుట - తల ఆడించుచు చదువుట - వ్రాయుచున్నట్లుగా చదువుట - అర్థజ్ఞానము లేకుండ చదువుట - నీరసముగా చదువుట - అను ఈ ఆఱును అధమ పాఠకుని లక్షణములు!

**163**

**శ్లో॥ న కాష్ఠే విద్యతే దేవో - న పాషాణే న మృణ్మయే ।**

**భావో హి విద్యతే దేవో - తస్మాత్ భావో హి కారణమ్ ॥**

దేవుడు కొయ్యబొమ్మలో లేడు. రాయిలో లేడు. మట్టిబొమ్మలో లేడు. భావనలోనే భగవంతుడున్నాడు. భావము (నమ్మకము) ప్రధానము.

**164**

**శ్లో॥ వనాని దహతో వహ్నేః - సఖాభవతి మారుతః ।**

**స ఏవ దీపనాశాయ - 'కృశే కస్యాస్తి గౌరవమ్?' ॥**

అగ్ని బలముగా అడవులను కాల్చువేళ, గాలి తోడగును, ఆ గాలియే అగ్ని చిన్న దీపముగా ఉన్నప్పుడు ఆర్పివేయును. కృశించినవాని నెవ్వరును ఆదరింపరు!

**165**

**శ్లో॥ వనే చ రామః వనితాన్ హరామః**

**నదీన్ తరామ: న భయం స్మరామః ।**

**ఇతీరయన్తః సతతం కిరాతాః**

**ముక్తిం గతాః రామ పదానుషంగాత్ ॥**

"వనములో సంచరింతము! వనితలను హరింతము! నదుల దాటుదము! భయమును స్మరింపవద్దు!".. అని తమలో తాము సతతము పలుకుటలో అప్రయత్నముగా "రామ" పదసంబంధముతో కిరాతులు మోక్షమును పొందిరి!

**166**

**శ్లో॥ రా శబ్ద ఉచ్చారణాదేవ - ముఖాన్నిర్యన్తి పాతకాః ।**

**పునః ప్రవేశ భీత్యాచ - మకారస్తు కవాటవత్ ॥**

"రా" అనుటలో నోరు తెరచుటచే పాపములు బయటకు పోవును! ఆ పాపములు తిరిగి ప్రవేశింపకుండా "మ" కవాటమువలె నోరు మూయించును!

**167**

**శ్లో॥ సంగీత సాహిత్య రసానుభూత్యై**
**కర్ణద్వయం కల్పితవాన్ విధాతా ।**
**ఏకేన హీనః పునరేక కర్ణో**
**ద్వాభ్యాం విహీనో బధిరస్సఏవ! ॥**

సంగీత – సాహిత్యముల అనుభూతికే బ్రహ్మదేవుడు రెండు చెవులు పెట్టినాడు. సంగీతానుభవశక్తి లేనివాడు ఒక చెవిని కోల్పోవును. సాహిత్యనుభూతి తెలియనివాడు మరొక్కచెవిని కోల్పోవును. రెంటియందును ఆసక్తిలేనివాడే నిజమైన చెవిటివాడు!

**168**

**శ్లో॥ సంగీత సాహిత్య కళావిహీనః**
**సాక్షాత్పశుః పుచ్ఛవిషాణహీనః ।**
**తృణం న ఖాదన్నపి జీవమానః**
**తద్భాగదేయం పరమం పశూనామ్ ॥**

సంగీత సాహిత్య కళలలో ప్రవేశం లేనివాడు అచ్చంగా తోక కొమ్ములు లేని పశువు! ఈ వింతపశువు తన జీవితకాలంలో గడ్డిమేయటంలేదు. ఎందువల్లనంటే నిజమైన పశువులు చేసుకున్న అదృష్టంవల్ల!

**169**

**శ్లో॥ వాసః కాంచన పంజరే, నృపవరైః నిత్యం తనోర్మార్దనం,**
**భక్ష్యం స్వాదు రసాల దాడిమ ఫలం, పేయం సుధాంభః పయః ।**
**వాచ్యం సంసది రామనామ సతతం, ధీరస్య కీరస్య భోః,**
**హా! హా! హస్త! తథాపి జన్మ విటపిక్రోడం మనోధావతి ॥**

బంగార పంజరములో నివాసము. రాజాధిరాజులు శరీరము దువ్వు చుందురు. భక్షించునవి మామిడి – దానిమ్మ పండ్లు. త్రాగునది అమృతమయ ఉదకము. సభలో నిరంతరము రామనామోచ్చారణము. అయినను ఆ కీరము తాను పుట్టిన చెట్టుతొఱ్ఱనే మనస్సులో తలచుకొనుచున్నది! (జీవుడు ఎన్ని భోగములలో ఉన్నను తాను విడివడిన పరమాత్మలో కలియుటనే కోరును).

## 170

**శ్లో॥ రాత్రిర్గమిష్యతి, భవిష్యతి సుప్రభాతం,**
**భాస్వానుదేష్యతి హసిష్యతి పంకజశ్రీః ।**
**ఇత్థం విచింతయతి కోశగతేచ భృంగే,**
**హా! హన్త! హన్త! నళినీం గజ ఉజ్జహార ॥**

సాయంవేళ తుమ్మెద పద్మము నందలి మధువు క్రోలుచుండగా సూర్యాస్త మయముతో పద్మము ముడుచుకొన్నది. పద్మములో ఉన్న తుమ్మెద: "రాత్రి గడచిపోవును. తెల్లవారును. సూర్యుడుదయించును. పద్మము తెరుచుకొనును. నేను వెళ్ళి హాయిగా ఆప్త వర్గముతో కలిసియుందును" – అనుకొనుచుండగా ఆ రాత్రి ఒక ఏనుగు తామరకొలనులో ప్రవేశించి ఆ పద్మమును పొట్టబెట్టుకొన్నది!

## 171

**శ్లో॥ వేధా ద్వేధా భ్రమం చక్రే – కాంతాసు కనకేషు చ ।**
**తాసు తేష్వ ప్యనాసక్తః – సాక్షాద్భర్గో నరాకృతిః ॥**

బ్రహ్మదేవుడు ఈ సమస్త ప్రపంచమును కాంతా కనకాలు అనే రెండు చక్రాల మీద త్రిప్పుచున్నాడు. (అందరికీ ఈ రెండింటి మీదా మిక్కిలిగా ఆశ ఉంటుంది. కొందరికి ఈ రెండింటిలో ఏదో ఒక్కదానిమీదే ఆశ ఉండవచ్చును. ఈ రెండింటిలో దేనిమీదా కూడా ఆశలేనివాడు మాత్రం లోకంలో ఉండడు. ఒకవేళ ఈ రెండింటిలోనూ దీనిమీదా ఆశలేనివాడు ఎవడైనా ఉంటే అతడు సాక్షాత్తు మానవరూపంలో ఉన్న పరమేశ్వరుడే! (తాసు + తేషు + అపి + అనాసక్తః = తాసు తేష్వప్యనాసక్తః)



# 2.2 చమత్కారశ్లోకములు

1

**శ్లో॥ అజాగళస్థస్తన, ముష్టపృష్ఠం,**
**నాసాంతరే కేశ, మధాండయుగ్మమ్ ।**
**వృథాసృజన్ సాహిణిమారభూపం**
**పూజాంనలేభే భువి పద్మయోనిః ॥**

మేక మెడలో స్తనములు – ఒంటె వీపు – ముక్కులోపల వెంట్రుకలు – వృషణములు – సాహిణిమారభూపతిని – వృథాగా సృష్టించుట చేతనే బ్రహ్మ – ఆలయములు పూజలు లేనివాడయ్యెను. వ్యర్థమైన వస్తువులలో సాహిణిమారుని చేర్చుటచే అతడు కూడా వ్యర్థుడని తెలియుచున్నది.

2

**శ్లో॥ భ్రాతృహంతా, పితృహంతా – మాతృహంతా, చయఃపుమాన్ ।**
**త్రయేతే చ మహాభక్తాః – ఏతేషాం చ నమామ్యహమ్ ॥**

అన్నను చంపించినవాడు – తండ్రిని చంపించినవాడు – తల్లిని చంపినవాడు – ఈ ముగ్గురు మహాభక్తులు! వీరికి నమస్కారము. (విభీషణుడు, ప్రహ్లాదుడు, పరశురాముడు)

3

**శ్లో॥ ఉచ్ఛిష్టం, శివనిర్మాల్యం – వమనం, మృతపర్పటమ్ ।**
**శ్రాద్ధే సప్త పవిత్రాణి – దర్భాశ్చ, కుతపో, తిలః ॥**

1. ఎంగిలి; 2. శివుని పూజించిన తరువాత తీసివేసినది; 3. కక్కు (వాంతి); 4. శవంమీద కప్పిన గుడ్డ; 5. దర్భలు; 6. రెండు జాముల వేళ దాటుట; 7. తిలలు – ఈ యేడును శ్రాద్ధములో పవిత్రమైనవి. ఈ శ్లోకంలో మొదటి నాలుగు పదాలలోను ఒక చమత్కారం ఉంది:

1. ఉచ్ఛిష్టం = ఎంగిలి = ఆవుపాలు = (దూడ ఎంగిలి చేశాక మనం ఆవుపాలు పితుక్కుంటాము).

2. శివ నిర్మాల్యం = శివుని పూజించిన తరువాత తీసివేసినది = గంగోదకం (ఆకాశగంగ మొదట శివుని శిరస్సుపై పడి, తరువాత భూమిమీదికి వచ్చినది)
3. వమనం = వాంతి = తేనె = తేనెటీగ పూలలోని తేనెను త్రాగి, తిరిగి వచ్చి దానిని తేనెపట్టు గదిలో కక్కుతుంది).
4. మృతపర్పటం = శవం మీద కప్పిన గుడ్డ = పట్టుబట్ట = (పట్టుపురుగు తన చుట్టూ గూడు అల్లుకుంటుంది. అప్పుడు దానిని వేడినీళ్ళలో ఉడకబెడతారు. లోపలి పురుగు చచ్చిపోతుంది. పైన ఉన్న గూడునుండి నూలుతీసి పట్టుబట్టను నేస్తారు).

**4**

**శ్లో॥ సజ్జనస్య హృదయం నవనీతం**
**వర్ణయన్తి విబుధాః తదలీకమ్ ।**
**అన్యదేహ విలసత్ పరితాపాత్**
**సజ్జనో ద్రవతి, నో నవనీతమ్ ॥**

సజ్జనుని హృదయము నవనీతమని కవులు వర్ణింతురు. అది అసత్యము. ఇతరుల దేహమునకు పరితాపము వచ్చినప్పుడు సజ్జనుడు కరగిపోవును; వెన్న కరగదు. వెన్న తనక్రింద వేడివచ్చి నప్పుడు మాత్రమే కరగును.

**5**

**శ్లో॥ నయనం తవదేవి భాసురం**
**విపరీతేపి వివర్ణతాం నయాతి ।**
**కమలం నతమేతి సుందరాంగి**
**సుస్పష్టం చ విచిత్ర సత్యమైతత్ ॥**

ఓ దేవీ నీ నయనములు అందముగా నున్నవి. “నయన” ఎటు త్రిప్పినను అందమే! (వెనుకనుండి చూచినను). “కమల” అను శబ్దమునకీ అదృష్టము లేదు! ఇది విచిత్ర సత్యము!

**6**

**శ్లో॥ నైవ వ్యాకరణజ్ఞమేతి పితరం, నభ్రాతరం తార్కికమ్,**
**దూరాత్ సంకుచతీవ గచ్ఛతి వపుః చండాలవత్ ఛాందసాత్ ।**
**మీమాంసా నిపుణం నపుంకమితి జ్ఞాత్వా నిరస్యాదరాత్,**
**కావ్యాలంకరణజ్ఞమేవ కవితాకన్యా వృణీతే స్వయమ్ ॥**

కవితాకన్య వ్యాకరణపండితుని తండ్రిగా భావించును. తార్కికుని సోదరునిగా తలంచును. ఛాందసుని (ఛందశ్శాస్త్ర పండితుని) చండాలునిగా భావించి దూరముగా తొలగును. మీమాంసాపండితుని నపుంసకునిగా భావించి నిరసించును. కావ్యాలంకార పద్ధతుల నెఱిగిన రసజ్ఞుని మాత్రమే కవితాకన్య వరించును!

**7**

**శ్లో॥ కస్యవా నభవేత్ రోషో – ప్రియాయాః సవ్రణాధరమ్ ।**
**సభ్రమర పద్మాఘ్రాణ – శీలే సహస్వేదానీమ్! ॥**

నాయిక పరపురుషుని దంతక్షతము పొందినది! అంతలోనే భర్త వచ్చినాడు. అతనికి అనుమానము రాకుండా చెలికత్తె నాయికతో "ప్రియురాలి పెదవి గాటు చూచిన ఏ ప్రియునకు రోషము రాదు? నేను చెప్పినను వినక తుమ్మెదయున్న పద్మమును ఆఘ్రాణించితివి! కర్మమును అనుభవింపుము" అని భర్త వినునట్లుగా అనుచున్నది. (రెండవపాదములో ఛందస్సు తప్పనది – శలాక)

**8**

**శ్లో॥ అర్థం దానవవైరిణా, గిరిజయాప్యర్థం శివస్యాహృతమ్,**
**దేవేత్థం జగతీతలే పురహరాభావే సమున్మీలతి ।**
**గంగాసాగర, మంబరం శశికళా, నాగాధిప క్ష్మాతలమ్,**
**సర్వజ్ఞత్వ మధీశ్వరత్వ మగమత్త్వాం, మాంతు భిక్షాటనమ్ ॥**

శివునిలో సగము నారాయణుడాక్రమించినాడు. తక్కిన సగము పార్వతి ఆక్రమించినది. శివుడే లోకములో లేకుండా పోయినాడు. ఆయనను ఆశ్రయించి యున్న గంగ సముద్రములో కలిసినది. చంద్రకళ ఆకాశము నాశ్రయించినది. సర్పరాజు పాతాళమునకు పోయినాడు "సర్వజ్ఞత్వము" "అధీశ్వరత్వము" – అనునవి

నిన్నాశ్రయించినవి. భిక్షాటనము నన్ను పట్టుకొన్నది. (ఇవి ఒక కవి, రాజుతో చెప్పుచున్న మాటలు. 'నా దారిద్ర్యమును తొలగింపుము' అని కవి మొర).

**9**

**శ్లో॥ వాపీ స్వల్పజలా, సరోబిలసమం, నీచావగాహో హ్రదః,**
**స్వచ్ఛస్వాదు సుశీతలా త్రిపథగా వైకుంఠ పాదాగ్రజా ।**
**నీచక్షారతరో మహాన్ జలనిధి ర్గండూష మాత్రం మునేః**
**తన్మానీ ఖలు చాతకః జలముచాం ఉచ్చైఃపయో వాంఛతి ॥**

దిగుడు బావులలో నీరు స్వల్పము. సరస్సులు గోతులు. మడుగులలో పందులవంటి నీచజంతువులు పొర్లాడును. గంగనీరు శీతలము; పైగా విష్ణువు పాదముల నుండి పుట్టినది. సముద్రము ఉప్పునీరు! అది అగస్త్యుడు పుక్కిలించినది.. అందుచేతనే అభిమానముగల చాతకము మేఘోదకము నాకాంక్షించుచున్నది.

**10**

**శ్లో॥ లక్ష్మానా నివాస ఇతి వారిరుహాం ప్రసిద్ధిః,**
**అన్వేషితాః కతిపయా విరళాస్తు సన్తి ।**
**రాజ్ఞి ప్రసారిత కరే కిమహం దదామి?**
**సంకోచితం వదన మంబురుహై రతీవ! ॥**

"పద్మములు లక్ష్మీ నివాసములని ప్రసిద్ధి. ఈ విషయమును విమర్శించినవారు తక్కువ. రాజంతటివాడు (చంద్రుడంతటివాడు) కరములు (కిరణములు) చాచగా మేము ఏమియ్యగలము?" అని పద్మములు ముఖము ముడుచుకొన్నవి. (చంద్రకిరణములు పడుటతో పద్మములు ముడుచుకొనును).

**11**

**శ్లో॥ యాసాం దృష్ట్వా నయనసుభగం వంగవారాంగనానాం**
**దేశత్యాగః పరమ కృతిభిః కృష్ణసారై రకారి ।**
**తాసా మేవ స్తనయుగ జితాః కుంభిన స్సంతి మత్తాః**
**ప్రాయో మూర్ఖః పరిభవ విధౌ నాభిమానం విధత్తే ॥**

వంగవేశ్యల నేత్రసౌందర్యమునకు సరిపోలజాలమని నల్లనిజింకలు దేశమును విడిచి అడవులలో దాగినవి! ఆ యువతుల కుచసౌందర్యమునకు ఓడిన ఏనుగులు మాత్రము దేశములోనే తిరుగుచున్నవి. ఎంత అవమానము జరిగినను మూర్ఖునకు పౌరుషముండదు కదా!

**12**

**శ్లో॥ అత్యుచ్చేనా విరుద్ధేన - సువృత్తేనాతి చారుణా ।**
**అంతర్భిన్నేన సంప్రాప్తం - మౌక్తికేన నిబంధనమ్ ॥**

ముత్యము మిక్కిలి గొప్పది - భేదము లేనిది - గుండ్రమైనది (మంచి ప్రవర్తన కలది) - చక్కనిది. అయినను అంతర్భేదము (భేదాభిప్రాయము లేక లోపల రంధ్రముండుట) చేత ముత్యమునకు బంధనము ఏర్పడినది.

**13**

**శ్లో॥ రత్నాకరే పరిహృతా వసతిః కిమన్యత్**
**అంగీకృతః కఠిన వేదన దుఃఖభారః ।**
**వక్షోజకుంభ పరిరంభణ లోలుపేన**
**కిం కిం నతేన విహితం బతమౌక్తికేన ॥**

ముత్యమునకు వక్షోజములను కౌగిలించుకొనవలెనని ప్రగాఢమైన కోరిక కల్గినది. వెంటనే రత్నాకర (సముద్ర) నివాసమును వదులుకొన్నది. రంధ్రము చేయబడుటలోని దుఃఖమును సహించినది. వక్షోజములను నిరంతరమును కౌగిలించుకొనవలెననెడి కోరికయే ఇన్ని బాధలను సహింపజేసినది!

**14**

శంఖధ్వనిని - ఆ శంఖ దుఃఖముగా కవి సంభావించుచున్నాడు:-

**శ్లో॥ క్వ వాంభోధౌ జన్మ? క్వచ వపురిదం కుందధవళమ్,**
**క్వ చావాసి స్థానం కృత మహహా! విష్ణోః కరతలమ్! ।**
**క్వ నీచానా మాస్యే పరిణతిరియం చుంబనవిధౌ**
**ఇతీవా యం శంఖః కరుణ కరుణం రోదితి ముహుః ॥**

“సముద్రములో నా జన్మము! శరీరము కుందమువలె ధవళము! నివాసమా విష్ణుకరతలము! చివరకు నీచకులస్థులు పెదవితో చుంబనముచేయు స్థితికి నా బ్రతుకు దిగజారినది” అని శంఖము మాటిమాటికి ఏడ్చుచున్నది!

**15**

**శ్లో॥ వింధ్య - మందర - సుమేరు భూభృతామ్**
**యత్పతిః తుహిన పర్వతో భవత్ ।**
**ఈశ్వర శ్వశురతాప్రభావతః**
**తద్రువం జగతి జృంభతే యశః ॥**

ఈశ్వరునకు మామయగుటవలన హిమవంతుడు వింధ్య- మందర - మేరు మొదలగు పర్వతములకు రాజైనాడు. అది నిశ్చయము! జగత్తులో కీర్తి విస్తరించినది.

**16**

**శ్లో॥ అధునా మధుకరపతినా**
**గిలితోపి అపకార దంపతీ ।**
**త్రాత స్సపాలయేన్మాం**
**విగత వికారో వినాయకో లక్ష్మ్యాః ॥**

అధునా = ధకారములేని, మధుకరపతి = మకరపతిచే, అపకార-పకారము లేని, దంపతీ = దంతీ (ఏనుగును), త్రాతః = రక్షించిన, విగతవికారో = వికారము లేని లక్ష్మ్యాః = లక్ష్మియొక్క(వి)నాయకః = భర్త, మాం = నన్ను, పాలయేత్=రక్షించుగాక!

**17**

**శ్లో॥ రామచంద్రే ‘రణ’ ప్రాప్తే - మధ్య ‘మం’ నాక యోషితః ।**
**ఆది ‘మం’ లేభిరే వీరాః - భీరమశ్చ ఆది ‘చం’ ‘రణమ్ ॥**

రామచంద్రుడు “రణమ్” నకు వెళ్ళినాడు. నాకయోషితః = దేవతాస్త్రీలు “రణ” మధ్య “మ” ను పొందిరి = “రమణ” రమణులను పొందిరి. వీరులు ఆది

"మ"ను పొందిరి = "మరణ"మును పొందిరి. భీరువులు (పిరికివారు) ఆదిలో ""చ"ను పొందిరి = చరణములను పొందిరి (=పారిపోయిరి).

**18**

**శ్లో॥ త్వయి ప్రసన్నే మమ కిం గుణేన?**
**త్వయ్యప్రసన్నే మమ కిం గుణేన? ।**
**రక్తే - విరక్తేచ వరే వధూనాం**
**నిరర్థకః కుంకుమ పత్రభంగః ॥**

నీకు నాపై అభిమానమున్నప్పుడు నాకు అలంకారములు అవసరము లేదు. నాపై నీకు అభిమానము లేనప్పుడు నేను ఎన్ని రచనలు (అలంకరణలు) చేసికొన్నను ఉపయోగము లేదు. ప్రియునకు ప్రేయసిపై అనురక్తియున్నప్పుడు - అనురక్తి లేనప్పుడు (రెండు వేళలను) అలంకరణమునకు శ్రమయనవసరము! (లీలాశుకుని శ్రీకృష్ణకర్ణామృతము నుండి).

**19**

అంబలి - ఊరుపిండి - కూరగాయ - పాలు - నేయి:- న్యస్తాక్షరి

**శ్లో॥ <u>అం బలి</u>ద్వేషిణం వందే - <u>ఊరు పిండీ</u> కృతాసురమ్ ।**
**<u>కూరగాయ</u> కృతత్రాసం - <u>పాలనేతి</u>ప్రియం గవామ్ ॥**

బలిద్వేషిణ = బలిని ద్వేషించిన, అం = విష్ణువును; వందే = నమస్కరింతును; ఊరు = తొడలపై, పిండీకృత = నాశనము చేయబడిన, అసురం = మధుకైటభ - హిరణ్యకశ్యపాది రాక్షసులు కలవాడు; కు+ఉరగాయ = చెడ్డసర్పమునకు (కాళీయునకు), కృతత్రాసం = భయము కల్గించిన, గవాంపాలనే = గోరక్షణలో, అతిప్రియం = ఎక్కువ మక్కువ యున్నవాడు.

**20**

**శ్లో॥ విదుషాం నివహై రిహైకమత్యా**
**యదదుష్టం నిరంకి యచ్చదుష్టమ్ ।**
**మయి జల్పతి కల్పనాధినాథే**
**రఘునాథే మనుతాం తదన్యదైవ! ॥**

పండితులందరును ఏకగ్రీవముగా ఒప్పు అన్నను, తప్పు అన్నను, కల్పనాధి. నాథుడైన ఈ రఘునాథుడు వాదించినచో తారుమారు కావలసినదే!

**21**

**శ్లో॥ యే నామ కేచి దిహ నః ప్రథయన్త్యవజ్ఞాం**
**జానస్తుతే! కిమపి తాన్ప్రతి నైష యత్నః ।**
**ఉత్పత్స్యతే మమతు కోపి సమాన ధర్మా**
**కాలో హ్యాయం నిరవధి ద్విపులాచ పృథ్వీ! ॥**

నా కవిత్వమును తిరస్కరించువారందరును ఒక్కమాట గుర్తుంచుకొందురు. గాక! నా యీ ప్రయత్న మెంతమాత్రమును వారికోసము కాదు. నా భావములను – నా కల్పనలను అభినందించు నా సమానధర్ములు పుట్టకపోరు! వారు నా కవితను ఆదరింపకపోరు! కాలము అనంతము! దేశము విశాలము! (భవభూతి ఉత్తరరామ చరిత్ర నాటకము నుండి)

**22**

హనుమన్నాటకములో అంగద రాయబారములో రావణుడు ప్రశ్నించుచున్నాడు. అంగద సమాధానము –

**శ్లో॥ కస్త్వం వానర? రామరాజభవనే లేఖార్థ సంవాహకః,**
**యాతః కుత్ర పురాగతః సహనుమాన్ నిర్దగ్ధ లంకాపురః ।**
**బద్ధో రాక్షససూను నేతి కపిభిః సంతర్జిత స్తాడితః**
**సవ్రీడాత్త పరాభవో వనమృగః కుత్రేతి నజ్ఞాయతే! ॥**

"వానరా! నీవెవ్వడవు?" – "రామరాజు భవనములో లేఖలందించువాడను!" "ఇదివఱకు హనును అనువాడు వచ్చి లంకా పట్టణమును కాల్చినాడు. వాడు ఇప్పుడెక్కడున్నాడు?" – "రాక్షస బాలునిచేత కట్టుబడిన బలహీనుడవు" అని కొట్టి భయపెట్టగా ఆ కోతి సిగ్గుతో, అవమానముతో ఎక్కడకు పోయినదో ఏమో! తెలియదు!"

## 23

**శ్లో॥ హే గోదావరి దేవి! తావక తటోద్దేశే కళింగః కవిః**
**వాగ్దేవీం బహుదేశ దర్శన సఖీం త్యక్త్వా విరక్తిం గతః ।**
**ఏం అర్ణవ మధ్య సుప్త మురజిన్నాభీ సరోజాసనం**
**బ్రహ్మాణం గమయ క్షితౌ కథమసా వేకాకినీ స్థాస్యతి? ॥**

ఓ గోదావరీ దేవీ! బహుదేశములు సంచరించుటలో నాకు సహాయమైన కవితా సరస్వతిని నీలో విడిచి ఈ కళింగ కవి విరక్తి చెందినాడు. ఈ సరస్వతిని సముద్ర మధ్యమున యోగనిద్రలో నున్న మురారి నాభికమలములోని బ్రహ్మకు అప్పగింపుము. పాపము! ఈమె ఒంటరిగా ఎట్లుండగలదు? (నేను – బ్రహ్మ తప్ప, ఇతరులు సరస్వతీ పోషకులు కారు – అను సాత్విక అహంకారము).

## 24

(ఒక కవి సత్కారమును పొంది తృప్తిచెందక–దొడ్డి సంభావన త్రొక్కిసలాటలో పడినాడు – అక్కడివారు త్రోయగా సంతర్పణ గంజిబురదలో జారిపడినాడు. వస్త్రములు బురదమైనవి! "కవివర్యా! ఇదియేమి?" అని రాజు ప్రశ్నించినాడు. కవి సమాధానము:–

**శ్లో॥ క్షుత్ – తృట్ – ఆశా కుటుంబిన్యః – మయిజీవతి నాన్యగాః ।**
**తా సా మంత్యా ప్రియతమా – తస్యాః శృంగార చేష్టితమ్! ॥**

"రాజా! నాకు ఆకలి – దాహము – ఆశ అను ముగ్గురు భార్యలున్నారు. వారు నేను బ్రతికియుండగా నన్ను విడిచిపోరు. వారిలో చివరి ఆమె (ఆశ) నాకు చాలా ప్రియమైనది. ఆమె చేసిన శృంగారచేష్ట యిది!" అన్నాడు.

## 25

**శ్లో. ఉచ్చైరుచ్చరితవ్యం యత్కించి దజానతాపి పురుషేణ ।**
**మూర్ఖః బహుమన్యంతే విదుషామపి సంశయోభవతి! ॥**

పాండిత్యము లేనివాడు తనకు తెలియని విషయమును గొంతెత్తి అరచి చెప్ప వలయును. మూర్ఖులు మెచ్చుకొందురు. పండితులు సందేహములో పడుదురు. (సభలో విజయము సాధించుటకు మూర్ఖులకు ఇదియొక మంచి పద్ధతి).

### 26

**శ్లో॥ వరం తస్కర సంబంధః – సుజనైః సహ సంగమాత్ ।**
**తస్కరోహి హరత్యర్థం – సాధుస్తు హృదయం హరేత్! ॥**

సజ్జన సంబంధముకంటె దొంగతో సంబంధము మంచిది! దొంగ ధనమునే అపహరించును. కాని సజ్జనుడు హృదయమును హరించును!

### 27

**శ్లో॥ ధిక్ ధిక్! సజ్జనమైత్రీ! దుర్జన సంసర్గ ఏవ నో భవతు! ।**
**సజ్జన వియోగకాలే భవన్తి తీవ్రాణి దుఃఖాని ॥**

ఛీ! ఛీ!! మాకు సజ్జన మైత్రివద్దు! దుర్జనమైత్రియే కలుగుగాక! సజ్జనులతో విడిపోయినప్పుడు మహాదుఃఖము ఏర్పడును. దుర్జన వియోగముతో మనశ్శాంతి యేర్పడును!

### 28

**శ్లో॥ చాతకః త్రిచతురః పయః కణాన్**
**యాచతే జలధరం పిపాసయా ।**
**సోపి పూరయతి విశ్వమంభసా**
**హన్త హన్త! మహతా ముదారతా! ॥**

చాతకపక్షి దాహముతో మేఘుని మూడు నాలుగు చినుకులను మాత్రమే (తన అవసరమునకు) యాచించును. మేఘుడు జలముతో ప్రపంచమును ముంచివేయును. ఆహా! మహాత్ముల ఔదార్యము గొప్పది! (అడుగుటలో గొప్పది చాతకపక్షి! ఇచ్చుటలో గొప్పవాడు మేఘుడు!)

### 29

**శ్లో॥ తరంగమాలికాభీల – ధిక్ తే సాగర! గర్జితమ్ ।**
**యస్య తీరే తృషార్తాశ్చ – పాంథాః పృచ్ఛన్తి వాపికామ్! ॥**

(దాన విహీనుడైన ధనికుని అన్యాపదేశముగా నిందించుచున్నాడు కవి!) ఓ సముద్రుడా! కెరటములతో నీవు చేయు ఘోషకు విలువలేదు. నీ తీరమున దప్పికగొన్న పాంథులు నూతిని గూర్చి అడుగుచున్నారు!

## 30

**శ్లో॥ దిఙ్మండలం పరిమలైః సురభీ కరోషి**
**సౌందర్య మావహసి లోచన లోభనీయమ్ ।**
**అహో! రసాలఫలవర్య! తవాస్మిదూయే**
**యత్తుందిలం చ కఠినం హృదయం బిభర్షి ॥**

(కీర్తి సౌందర్యము ఉన్నంత మాత్రమున చాలదు. మెత్తని మనస్సు కావలెను). ఓ తీయ మామిడి ఫలమా! నీ సువాసనతో దిక్కులు పరిమళించుచున్నవి. బంగారు రంగుతో సుందరముగా నున్నావు. కాని కఠినమైన పెద్దటెంకను మనస్సుగా ధరించుట మాత్రము బాధగా నున్నది!

## 31

**శ్లో॥ అభూచ్ఛామా జంబూః - దళితహృదయం దాడిమఫలం-**
**సశూలం సంధత్తే హృదయ మవమానేన పనసః ।**
**భయాదంతస్తోయం తరుశిఖరజం లాంగలిఫలం**
**సముద్భూతే చూతే జగతి ఫలరాజే ప్రసరతి! ॥**

మామిడిపండు ఫలరాజముగా ప్రపంచములో ప్రఖ్యాతిపొందుచుండగా నేరేడుపండు మొగము మాడ్చుకొన్నది! దానిమ్మపండుకు గుండె బ్రద్దలైనది. పనసపండు గుండెలో గసిక గ్రుచ్చుకొన్నది! కొబ్బరి ఫలము గుండె నీరైనది!

## 32

**శ్లో॥ మణినా వలయం - వలయేన మణిః**
**మణినా వలయేన విభాతి చ కరః ।**
**కవినా చ విభుః - విభునా చ కవిః**
**కవినా విభునా చ విభాతి సభా! ॥**

మణిచే కంకణము - కంకణములో కూర్చుటవలన మణి - మణికంకణ ధారణచే చేయి ప్రకాశించును. కవిచే రాజు - రాజుచే కవి ప్రకాశింతురు. కవి వలన రాజులవలన సభ భాసిల్లును!

## 33

**శ్లో॥ కష్టా వేధవ్యధా కష్టః - నిత్యంచ వహన శ్రమః ।**
**శ్రవణానాలంకారః - కపోలస్య తు కుండలమ్! ॥**

చెవులకు పెట్టిన ఆభరణభారము శ్రమ చెవులది. అందము మాత్రము చెక్కిళ్లది! (సొమ్మొకరిది సోకొకరిది).

## 34

**శ్లో॥ పురా కవీనాం గణనా ప్రసంగే**
**కనిష్ఠికాధిష్ఠిత కాళిదాసా ।**
**అద్యాపి తత్తుల్య కవే రభావాత్**
**అనామికా సార్థవతీ బభూవ! ॥**

అనామికా = ఉంగరపు వ్రేలు ('మరొక పేరు లేదు' అని కూడ అర్థము). పూర్వము కవులను గూర్చి లెక్కించుచు ఒక రసజ్ఞుడు - చిటికెనవ్రేలు తీసి "ఒకటి కాళిదాసు!" అన్నాడట. రెండవ కవి పేరునకై ఉంగరపు వ్రేలు (అనామిక) తీసినాడు. మరొక్క పేరు చెప్పలేకపోయినాడు. అందుచేత ఉంగరపు వ్రేలుకు 'అనామిక' అను పేరు సార్థకమైనది! (కాళిదాసు పేరు చెప్పిన తరువాత చెప్పుటకు మరియొక కవి లేదని భావము).

## 35

**శ్లో॥ కుసుమే కుసుమోత్పత్తిః - శ్రూయతే న చ దృశ్యతే ।**
**బాలే! తవ ముఖాంభోజే - దృష్ట మిందీవర ద్వయమ్! ॥**

పుష్పములో పుష్పము పుట్టుట వినలేదు! కనలేదు! కాని ఓ సుందరీ! నీ ముఖ పద్మములో రెండు నల్లకలువలు (కళ్ళు) ఉన్నవి!

## 36

**శ్లో॥ నాహం జానామి కేయూరే - నాహం జానామి కుండలే ।**
**నూపురే త్వభి జానామి - నిత్యం పాదాభివందనాత్! ॥**

నగలు చూడగానే కళ్ళనీళ్ళు క్రమ్ముచున్న రాముడు, లక్ష్మణుని ఆ నగలు సీతవేమో చూడుమన్నాడు. దండకడియములు - కర్ణాభరణములు సీతవగునో?

కాదో? నాకు తెలియదు! అందెలు (పాదభూషలు) మాత్రము సీతవని నాకు బాగుగా తెలియును. నిత్యము పాదాభివందనము చేయువాడనగుటచే అవి సుపరిచితములు! (వదినెగారియందు లక్ష్మణునకున్న పవిత్రభావము వ్యక్తమగుచున్నది -వాల్మీకి రామాయణం).

**37**

**శ్లో॥ అనధిగత మనోరథస్య పూర్వం**
**శతగుణితేవ గతా మమ త్రియామా! ।**
**యదితు తవ సమాగమే తథైవ**
**ప్రసరతి సుభ్రు! తతః కృతీ భవేయమ్ ॥**

ఓ సుందరీ! మన వియోగములో రాత్రులు వందతో హెచ్చించినంతగా గడచెడివి కావు! మన సంయోగములో కూడ అట్లే ఉన్నచో నేను అదృష్టవంతుడను కాగలను. (కాని సంయోగములో రాత్రులు క్షణములుగా గడచి పోవును).

**38**

ప్రతివ్యక్తిని యాచింపవద్దని అన్యాపదేశముగా కవి చెప్పుచున్నాడు:

**శ్లో॥ రేరే చాతక! సావధాన మనసా మిత్ర! క్షణం శ్రూయతామ్**
**అంభోదా బహవో వసన్తి గగనే సర్వేపి నైతాదృశాః ।**
**కేచిత్ వృష్టిభి రార్ద్రయన్తి వసుధాం గర్జన్తి కేచిద్వృథా**
**యం-యం-పశ్యసి తస్య-తస్య పురతో మాబ్రూహి దీనం వచః ॥**

మిత్రా! చాతకమా! ఒక్కమాట సావధానముగా వినుము. ఆకాశములో మేఘము లనేకములు. అన్నియును ఒక విధము కావు. కొన్ని భూమిని ఫలింపజేయును. మఱికొన్ని వట్టిగా ఉరుమును. కనిపించిన ప్రతి మేఘము దగ్గఱను దీనముగా యాచింపకుము!

**39**

**శ్లో॥ దేవీం వాచ ముపాసతే హి బహవః సారంతు సారస్వతం**
**జానీతే నితరామసౌ గురుకుల క్లిష్టో మురారిః కవిః ।**
**అబ్ధిర్లంఘిత ఏవ వానర భటైః కింత్వస్య గంభీరతామ్**
**ఆపాతాళ నిమగ్న పీవర తనుర్జానాతి మంథాచలః ॥**

సరస్వతిని ఆరాధించు వారనేకులు. కాని సారస్వతసారము గురుకులములో శ్రమపడి విద్యనభ్యసించిన ఒక్క "మురారి" కే తెలియును. సముద్రమును ఎన్నియో కపులు దాటినవి. కాని సముద్రపులోతు పాతాళము వరకును మునిగిన మందర పర్వతమునకే తెలియును!

**40**

**శ్లో॥ మహారాజ శ్రీమన్ జగతి యశసా తే ధవళితే**
**పయః పారావారం పరమపురుషోయం మృగయతే ।**
**కపర్దీ కైలాసం కరివరమభౌమం కులిశభృత్**
**కళానాథం రాహుః కమలభవనో హంస మధునా ॥**

ఓ మహారాజా! నీ కీర్తి ప్రపంచమంతటను వ్యాపించినది. అన్నియును తెల్లగా కన్పించుచున్నవి. విష్ణువునకు ఏది పాలసముద్రమో తెలియుట లేదు. శివునకు వెండికొండ యేదియో తెలియుట లేదు. ఇంద్రునకు ఐరావతమేదియో తెలియుట లేదు. రాహువు చంద్రుని కనుగొనలేకపోవుచున్నాడు. బ్రహ్మకు తన వాహనము హంస గుర్తు తెలియుటలేదు!" (–భోజకాళిదాసు కథలు)

**41**

**శ్లో॥ విద్వద్రాజ శిఖామణే తులయితుం ధాతా త్వదీయం యశః**
**కైలాసం చ నిరీక్ష్య తత్రలఘుతాం, నిక్షిప్తవాన్ పూర్తయే ।**
**ఉక్షాణం, తదుపర్యుమా సహచరం తన్మూర్ధ్ని గంగాజలమ్**
**తస్యాగ్రే ఫణిపుంగవం తదుపరిస్ఫారం సుధా దీధితిమ్ ॥**

రాజా! నీ కీర్తిని తూచవలెనని బ్రహ్మ తలంచినాడు. ఒక సిబ్బెలో కీర్తినుంచి వేరొక సిబ్బెలో వెండికొండను పెట్టినాడు. చాలలేదు. ఆపై నందీశ్వరుని – అదియును చాలక, ఆపై శివుని – ఆపై గంగాజలమును – ఆపై వాసుకిని – ఆపై చంద్రకళను పెట్టి విఫలుడైనాడు! (–భోజకాళిదాసు కథలు)

**42**

భోజమహారాజు గొప్ప కవితాప్రియుడు. తన రాజ్యములో ప్రతివ్యక్తియు కవిత్వము అల్లగలిగియుండవలెననియు, కవితాశక్తి లేనివానిని దేశమునుండి తరిమి వేయవలెననియు భటులకు ఆజ్ఞాపించినాడు. వారు కవితాశక్తిలేని ఒక

సాలెవానిని పట్టుకొని రాజు ఎదుట పెట్టినారు. "కవిత్వము చెప్పగలవా"? అని భోజుడు ప్రశ్నించినాడు. ఆ సాలివాడు భోజునివంక చూచినాడు. (భోజుని ముఖము చూడగానే ప్రతివ్యక్తికిని కవిత్వము హృదయము నుండి తన్నుకొని పైకి వచ్చును!) వెంటనే ఆ సాలెవాడు ఈ క్రింది విధముగా సమాధానము చెప్పినాడు:

**శ్లో॥ కావ్యం కరోమి న హి చారుతరం కరోమి**
**యత్నాత్ కరోమి యది చారుతరం కరోమి ।**
**భూపాలమౌళి మణిరంజిత పాదపీఠ!**
**హే సాహసాంక! కవయామి-వయామి-యామి! ॥**

కావ్యము వ్రాయగలను; కాని అందముగా రచింపలేను. ప్రయత్నించినచో అందముగా వ్రాయగలను. రాజుల కిరీటములలోని మణుల కాంతులతో ప్రకాశించు పాదపీఠముగల చక్రవర్తీ! కవయామి – వయామి – యామి = కవనమల్లగలను! – నేతనేయగలను! వెళ్ళుచున్నాను!

**43**

**శ్లో॥ భారతం చ ఇక్షుఖండం చ – సముద్రమపి వర్ణయ ।**
**పాదే నైకేన వక్ష్యామి – 'ప్రతి పర్వ రసోదయమ్' ॥**

"భారతము – చెఱకుగడ – సముద్రము ఈ మూడింటిని ఒక్క శ్లోకములో వర్ణింపుము" – "శ్లోకమెందులకు? ఒక్క పాదములోనే మూడింటిని చెప్పెదను" – "ప్రతిపర్వ రసోదయం" భారతములో ప్రతిపర్వమునందును రసము చిప్పిలుచుండును. చెఱకుగడలో ప్రతికణుపునందును రసముండును. సముద్రము ప్రతిపర్వదినమునను పొంగును.

**44**

**శ్లో॥ నపుంసకమితి జ్ఞాత్వా – ప్రియాయై ప్రేషితం మనః ।**
**తత్తు తత్రైవ రమతే – హతాః పాణినినా వయమ్! ॥**

మనస్సు నపుంసకలింగమని పాణిని మాట నమ్మి ప్రియురాలి దగ్గరకు నా మనస్సును పంపితిని. అది అక్కడనే రమించుచున్నది. పాణిని వలన నేను మోసపోయితిని! (పాణిని వ్యాకరణ కర్త).

## 45

శ్లో॥ లజ్జా - కీర్తిః - జనకతనయా శైవకోదండ భంగే
త్రిస్రః కన్యా నిరుపమతయా భేజిరే రామచంద్రమ్ ।
అంత్యా పాణిగ్రహణ సమయే జ్యాయసీ జాతరోషా
భూపై స్సార్థం ఖలు గతవతీ మధ్యమాగాత్ దిగంతాన్! ॥

రాముడు శివధనుర్భంగము చేయగానే ముగ్గురు కన్యలు (లజ్జ-కీర్తి-సీత) రామచంద్రుని దగ్గరకు వచ్చిరి. రాముడు మూడవ ఆమె పాణిగ్రహణము చేయగానే, పెద్ద ఆమె(లజ్జ)కు కోపము వచ్చి రాజులతో వెళ్ళిపోయినది. మధ్య ఆమె(కీర్తి) దిగంతములకు వ్యాపించినది!

## 46

శ్లో॥ జనస్థానే భ్రాంతం కనకమృగ తృష్ణాకులతయా
వచో వైదేహీతి ప్రతిపదముద్రశు ప్రలపితమ్ ।
కృతా లంకా భర్తుః వదన పరిపాటీషు ఘటనా
మయాప్తం రామత్వం కుశల వసుతా న త్వధిగతా ॥

రాముడు జనస్థానాటవితో బంగారు లేడియందు తృష్ణతో వెళ్ళినాడు. (నేను జనులున్నచోట ధనాశతో తిరిగితిని). రాముడు "వైదేహీ" అనుచు ఏడ్చుచు కలవరించినాడు. (నేను "దేహి" అనుచు ప్రతిపదమున అర్థించితిని). రాముడు లంకాభర్తయొక్క వదనములను పరిపాటించెను. (నేను కాభర్తుః = కుచ్చితరాజుల వదనములను దర్శించుచుంటిని). నేను రామునివలె ప్రవర్తించితిని. కాని కుశల = క్షేమముకూర్చు, వసుతా = ఐశ్వర్యము, సత్వధిగతా = లభింపలేదు. (రామునకు కుశలవసుతు లేర్పడినారు).

## 47

శ్లో॥ 'రాఘవ విరహానల సంతాపిత సహ్యాశైల శిఖరేషు
శిశిరే సుఖం శయానాః కపయః కుప్యన్తి పవనతనయాయ'

చలికాలములో రాముని వేడినిట్టూర్పులతో వెచ్చనైన సహ్యాపర్వత శిఖరములపై సుఖముగా నిద్రించుచున్న వానరులు చల్లని వార్త తెచ్చిన

హనుమంతుని తిట్టుకొను చున్నారు. (రాముని వేడి నిట్టూర్పులాగినవి; వానరులకు చలిబాధ యేర్పడినది). (భోజుని రామాయణ చంపూ).

**48**

**శ్లో॥ ఉన్నమయ్య పయసః కణాయ**
**వ్యోమ్ని స్థితస్యోపరి చాతకస్య ।**
**ముఖే పతేయుః జలబిందవో వా?**
**పర్షోపలో వా? అశని తీవ్రవేగాః?॥**

జలబిందువులకై ముఖము పైకెత్తి ఆకాశముపై తిరుగాడుచున్న చాతకముయొక్క ముఖమునందు పడునవి జలబిందువులా? వడగళ్ళా? పిడుగులా? (అభివృద్ధి కొఱకు ఆనందముకొఱకు శ్రమపడుచుండు మానవులకు ఆనందమో– దుఃఖమో – ఏది రానున్నదో అనిశ్చయము).

**49**

సంస్కృతశారదను వర్ణించిన శ్లోకము:–

**శ్లో॥ యస్యా శ్చోరః చికుర నికురో – కర్ణపూరో మయూరః,**
**భాసో హాసః, కవికులగురుః కాళిదాసో విలాసః ।**
**హర్షో హర్షః, హృదయ వసతిః పంచబాణస్తు బాణః,**
**శేషా నైషా కథయ కవితా కామినీ కౌతుకాయ? ॥**

సంస్కృత కవితా సుందరికి చోరకవి ముంగురులు! మయూరకవి తాటంకముల (కర్ణాభరణముల) వంటివాడు! ఆమెకు నవ్వు భాసుడు! విలాసము కవికులగురువైన కాళిదాసు! ఆమెకు ఆనందము హర్షకవి! హృదయమునందు తిష్ఠవేసిన మన్మథుడే బాణభట్టు! ఇట్టి దేవభాషాసుందరి ఎవరికి ఆనందదాయకము కాదో తెల్పుము?

**50**

**శ్లో॥ అహన్యహని భూతాని – గచ్ఛన్తీహ యమాలయమ్ ।**
**శేషాః స్థిరత్వ మిచ్ఛన్తి – కిమాశ్చర్య మతః పరమ్? ॥**

ప్రతిదినమును ప్రాణులు యమలోకమునకు పోవుచున్నవి. ఎప్పటికప్పుడు మిగిలినవారు మేము స్థిరమనుకొనుచున్నారు. ఇంతకుమించి ఆశ్చర్యమేమి? (మహాభారతము – యక్షప్రశ్నలు)

## 51

యమధర్మరాజు (యక్షుడు), ధర్మరాజుతో "భీమార్జున నకులసహదేవులలో ఒక్కరిని మాత్రము బ్రతికించెదను" అన్నాడు. అప్పుడు ధర్మజుడు "నకులుని" కోరినాడు. "భీమార్జునులుండగా నకులుని ఏలకోరితివి?" అని యముడు. ప్రశ్నించినాడు. దానికి ధర్మజుని సమాధానము:–

**శ్లో॥ కుంతీ చైవతు మాద్రీ చ –ద్వే భార్యే తు పితుర్మమ ।**
**ఉభే సపుత్రే స్యాతాంవై – ఇతి మే ధీయతే మతిః ॥**

నా తండ్రికి "కుంతి" "మాద్రి" ఇద్దరు భార్యలు. ఇద్దరికిని సమానముగా ఒక్కొక్క కొడుకు మిగులునుగాక! కుంతీపుత్రుడను నేను బ్రతికియుంటిని. అట్లే మాద్రి జ్యేష్ఠపుత్రుడు కూడా జీవించునుగాక! (– మహాభారతము– యక్షప్రశ్నలు)

## 52

కాళిదాసు చేపలు తినుచున్నట్లు భోజరాజుతో కవులు చెప్పినారు. అంగ వస్త్రమునకు చుట్టి చేపను తీసికొని వెళ్ళుచుండగా కవులు పట్టుకొన్నారు. చంకన చేపతో కాళిదాసును రాజసభలోనికి తెచ్చినారు. రాజు ప్రశ్నలు – కాళిదాసు సమాధానములు:–

**శ్లో॥ కక్షే కిం తవ? పుస్తకం! కి ముదకం? కావ్యార్థసారోదకమ్!**
**గంధః కిం? ఘన రామ రావణ మహాసంగ్రామ రంగోద్భవమ్! ।**
**పుచ్ఛః కిం? ఘన తాళపత్ర లిఖితం! కిం పుస్తకం హే కవే?**
**రాజన్! భూసుర దేవతైశ్చ పఠితం రామాయణం పుస్తకమ్! ॥**

నీ చంకనున్నదేమి? పుస్తకము! – ఉదకమేమి? కావ్యార్థసారము! – వాసనయేమి? రామరావణ యుద్ధములో ఏర్పడినది! – తోకయేమి? పొడవైన తాటియాకులపై వ్రాసిన గ్రంథము! – ఓ కవీ! అది ఏ పుస్తకము? రాజా! దేవబ్రాహ్మణులు పఠించు రామాయణ పుస్తకము! (కాళిదాసు మహిమతో చంకలోని చేప గ్రంథముగా మారిపోయినది).

## 53

**శ్లో॥ కాయస్థోపి న కాయస్థః – మాతృమాంసం న భక్ష్యతి ।**
**దయా తత్ర న హేతుః స్యాత్ – తత్రహేతు రదంతతా! ॥**

కంసాలి తల్లి కడుపులో ఉన్నప్పుడు తల్లి మాంసము తినడు. అక్కడ దయ కారణము కాదు. దంతములు లేకపోవుట కారణము! (కంసాలి బంగారమును తినివేయును. చెల్లెలు వస్తువు చేయుచున్నను చిన్నమెత్తు తినకుండా ఉండడు! తల్లి మాంసము తినకపోవుట వాని గొప్పతనము!)

**54**

**శ్లో॥ భో నారికేళ! తవ మస్తక భేదకానాం**
**సాధ్యం భవే త్తవజలం కఠినస్వరూప! ।**
**నాహం త్వదీయ సలిల గ్రహణే సమర్థః**
**అత్యంత ఖేద విముఖః శుకరాజ బాలః ॥**

ధనవంతులు నక్సలైట్స్‌కు లక్షలాది రూపాయలు చందాలుగా ఇచ్చెదరే కాని లలితకళలను చూపువారి కీయరు. చిలుక కొబ్బరి కాయను పొడిచి పొడిచి, కొబ్బరికాయతో చెప్పిన శ్లోకము:–

"ఓ నారికేళమా! నీవు, నీ తల బ్రద్దలకొట్టువారికి జలము నిచ్చెదవే కాని నావంటివారికీయవు! నేను చిలుకపిల్లను! ఖేదముతో నా కోరికను ఉపసంహరించు కొనుచున్నాను!".

**55**

ఒక మహాకవికి సన్మానము జరుగుచున్నది! ప్రతిభావ్యుత్పత్తులు లేని ఈర్ష్యాళువు సభలో సమ్మానితకవిని నిందించుచున్నాడు. ఆ మహాకవి అన్యాపదేశముగా కుక్కపై పెట్టి చెప్పిన శ్లోకమిది:

**శ్లో॥ ఉచ్ఛిష్ట పత్రనిచయే నిజజాతి వర్గైః**
**వైరం కురుష్వ కలహప్రియ సారమేయ! ।**
**పూజ్యం విలోక్య నరదేవగృహే కరీంద్రం**
**మా రోదనం కురు ఫలం నహి తేఽస్తి కించిత్! ॥**

కలహ స్వభావముగల శునకమా! నీవు ఎంగిలి విస్తరాకులపై నీ జాతివారితో పోరాటము సాగించుట మంచిది. రాజసన్మానములో పూజింపబడు ఏనుగును చూచి మొరగవద్దు! దానివలన కొంచెము కూడ ఫలితము లేదు!

## 56

**శ్లో॥ కింకవేః తస్య కావ్యేన - కిం కాండేన ధనుష్మతః ।**
**పరస్య హృదయే లగ్నం - న ఘూర్ణయతి యచ్ఛిరః ॥**

- ఇది "త్రివిక్రమభట్టు" అనే కవి రచించిన "నలచంపూ" కావ్యంలోనిది. "కవిత్వం ఎలా ఉండాలి?" - అంటే "వీరుడు విడిచిన బాణంలా ఉండాలి" అంటున్నాడు. బాణంలాగే కవిత్వం కూడా ఎదుటి వాడి గుండెల్లోకి లోతుగా నాటుకోవాలి. ఆ దెబ్బతో వాడు తల ఊపాలి. బాణం దెబ్బకి హాహాకారాలు చేస్తూ తల ఊపి చావాలి! కవిత్వం దెబ్బకి 'ఆహా! ఆహా' అంటూ తల ఊపుతూ ఆనందంతో తన్మయుడై పోవాలి! అలాకాకపోతే ఆ వీరుడు పట్టింది బాణమూ కాదు; ఈ కవి వ్రాసింది కావ్యమూ కాదు! కవిత్వం శ్రోతహృదయంలో గాఢంగా నాటుకోవాలనీ, అది అతన్ని ఆనందపరవశుణ్ణి చేయాలనీ తాత్పర్యం.

"కవిరాజ శిఖామణి" యైన నన్నెచోడ మహాకవి (క్రీ.శ. 1130) తన 'కుమార సంభవము' కావ్యంలో సరిగ్గా పై శ్లోకానికి అనువాదప్రాయమైన కందపద్యం ఒకటి వ్రాశాడు: (1-41)

**క॥ ముదమున సత్కవి కావ్యము,**
**సదరఁగ విలుకాని పట్టినమ్మును, బరహృ**
**ద్భిదమై తలయూపింపని**
**యది కావ్యమె? మఱియుఁ బట్టినదియున్ శరమే?**

## 57

శ్రీకృష్ణదేవరాయలవారు పట్టపురాణి తిరుమలదేవితో కలసి కంచిలోని వరదరాజ స్వామిని సేవించుకొనేందుకు వెళ్ళారు. తిరుమలదేవి వరదరాజ స్వామివారికి నమస్కరిస్తోంది. ఆ గుడిలో ఆచార్య నరసింహదీక్షితన్ అనే గొప్ప పండితకవి పూజారిగా ఉన్నాడు. అతడు అందమైన తిరుమలదేవిని చూచి, ఆశువుగా ఈ క్రింది శ్లోకం చెప్పాడు:-

**శ్లో॥ కాంచిత్ కాంచన గౌరాంగీం - వీక్ష్య సాక్షాదివ శ్రియమ్ ।**
**వరదః సంశయాపన్నః - వక్షస్థల మవైక్షత ॥**

బంగారంవంటి పసుపుపచ్చని శరీరంతో సాక్షాత్తూ లక్ష్మీదేవిలా ఉన్న తిరుమల దేవిని చూచి, వరదరాజ స్వామికి అనుమానం వచ్చి, తన గుండెలను తడిమి చూచుకొన్నాడట! (తన గుండెలమీద ఉండవలసిన లక్ష్మీదేవి దూరంగా అక్కడ నిలబడిందేమిటి? అని అనుమానం వచ్చింది స్వామివారికి).

**58**

"కావ్యం గ్రాహ్య మలంకారాత్" = కవిత్వాన్ని అలంకార ప్రయోగంవల్ల గుర్తిస్తాము. ఆదికవి వాల్మీకనుండి ఆధునిక కవులవరకూ అలంకారాన్ని ప్రయోగించ కుండా కవిత్వాన్ని చెప్పలేరు. రామాయణం సుందరకాండలో హనుమంతుడు అశోకవనంలో ప్రవేశించాడు. అప్పుడు సీతాదేవికి శుభసూచకంగా ఎడమకన్ను అదిరింది. ఎలా అదిరిందో ఒక చక్కని అలంకారంతో చెపుతున్నాడు కవి:

**శ్లో॥ తస్యాశ్శుభం వామ మరాళపక్ష్మ**
**రాజీవృతం కృష్ణ విశాల శుక్లమ్ ।**
**ప్రాస్పందతైకం నయనం సుకేశ్యాః**
**మీనాహతం పద్మమివాభితామ్రమ్ ॥**

మంచి కేశపాశములు కలిగిన సీతాదేవికి ఎడమకన్ను అదిరింది. ఆ యెడమ కన్ను ఎలా ఉందంటే – శుభకరమైనదిగా ఉంది. వంకరతిరిగిన కనురెప్పల వెంద్రుకల పంక్తితో చుట్టబడిఉంది. నల్లగ్రుడ్డు చుట్టూ తెల్లని విశాలప్రదేశం కలిగి ఉంది. అటువంటి ఎడమకన్ను – సరస్సులోని నీళ్ళల్లో (తామర) తూడుమీద చేపదెబ్బతిన్న ఎఱ్ఱతామర పువ్వులా అదిరింది!

కవిత్వంలో అలంకార ప్రాధాన్యాన్ని తెలిపే కథ ఒకటి భోజ–కాళిదాసు కథల్లో కూడా వస్తుంది. **"భోజనం దేహి రాజేంద్ర! ఘృతసూప సమన్వితమ్"** ("ఓ రాజా! మాకు పప్పు, నేతితో కూడిన భోజనం పెట్టు") అని పండితులు అల్లిన పాదాలలో కవిత్వం లేదు. వారికి కాళిదాసు అందించిన **"మాహిషం చ శరచ్చంద్ర చంద్రికాధవళం దధి"** (శరత్కాలపు చంద్రుని వెన్నెలవంటి తెల్లటి గేదెపెరుగుతో

భోజనం పెట్టు) అనే మరో రెండు పాదాలలో కవిత్వం ఉంది. అందువల్లనే భోజరాజు ఈ పాదాలకు మాత్రమే పండితులకు ధనమిచ్చాడు.

### 59

వార్ధక్యవశమున వంగి నడచుచున్న వృద్ధస్త్రీని ఒకడు ప్రశ్నించుట – ఆమె సమాధినించుట ఈ శ్లోకములో చెప్పబడినవి:

**శ్లో॥ 'అధః పశ్యసి కిం వృద్ధే?' – 'మృగ్యతే వస్తు కంచన!' ।**
**'కిం తద్వస్తు వినమ్రాంగి?' 'నష్టం తారుణ్య మౌక్తికమ్!' ॥**

"వృద్ధురాలా! నేలమీదికి చూచుచున్నా వేమి?" – "పడిపోయిన వస్తువును వెదకుచున్నాను!" – "వంగి, ఆసక్తిగా వెదకుచున్నావు ఆ వస్తువేమి?" –"నా యౌవనముత్యం పడిపోయింది నాయనా!". – వృద్ధనారి వంగి నడచుటకు హేతువు అందముగా ఉత్ప్రేక్షింపబడి కవిత్వము జిగేలు మనిపించుట రమణీయము.

### 60

ఒక దుర్మార్గుడు మహనీయుని పట్టించుకొనకుండా దూరముగా ఉంచినాడు. అదియే నీకు మేలని కవి ఆ మహనీయునితో అన్యాపదేశముగా రత్నముపై పెట్టి చెప్పుతున్నాడు. కోతికి రత్నము లభించినది–

**శ్లో॥ ఆఘ్రాతం పరిచుంబితం పరిముహుర్లీఢం ముహుశ్చర్వితం**
**త్యక్తం వా భువి నీరసేన మనసా తత్రవ్యథాం మా కృథాః ।**
**హే సద్రత్న! తదేతదేవ కుశలం యద్వానరేణాదరాత్**
**అంతస్సార విలోకన వ్యసనినా చూర్ణీకృతం నాశ్మనా! ॥**

ఓ రత్నమా! ఆ వానరము నిన్ను వాసన చూచినది? నాకినది? కొఱికినది? నిన్ను పారవేసినది! ఇట్లు చేసినందుకు బాధపడకుము. నీలో ఏమున్నదోయని, ఱాతితో పిండి చేయలేదు? అదే నీకు క్షేమమని భావింపుము.



# 2.3 శృంగారశ్లోకములు

**1**

**శ్లో॥ లంబోదరస్య విగళత్ కటిసూత్ర లంబీ**
**కౌపీనపార్శ్వ వివృతో మదనధ్వజో వ్యాత్ ।**
**యా సంభ్రమా దుపగమన్నురగ భ్రమేణ**
**చంచ్వా వికర్షతి షడాననయాన బర్హీ ॥**

విఘ్నేశ్వరుడు మొలత్రాటికి గోచీపెట్టుకొన్నాడు. ఆ గోచినుండి మదన ధ్వజము ఈవలకు వచ్చినది. ప్రక్కనున్న నెమలి (కుమారస్వామి వాహనము) దానిని పామని భ్రమించి ముక్కుతో పొడుచుచున్నది. అట్లు పొడువబడుచున్న మదనధ్వజము మిమ్ము కాపాడుగాక!

**2**

**శ్లో॥ చిరశ్రాంతో దూరాత్ అహముపగతో హస్త! మలయాత్**
**తదేకం త్వద్గేహే తరుణి పరిణేష్యామి దివసమ్ ।**
**సమీరేణోక్త్యేవం నవకుసుమితా చూతలతికా**
**ధునానా మూర్ధానం నహి-నహి-నహీ త్యేవ వదతి ॥**

వాయువు మామిడి కొమ్మతో:- "నేను మలయ పర్వతమునుండి అలసి వచ్చితిని. నీ దగ్గర ఒక్కనాడు గడుప దలచితిని" అన్నాడు. క్రొత్తగా పుష్పవతియైన ఆ కొమ్మ "వద్దు! వద్దు! వద్దు!" అని మూడుసార్లన్నది. (మూడు దినములు ఆగుమని భావము).

**3**

**శ్లో॥ పుష్పేషు మాతా పురుషాయమాణా**
**లజ్జావశాత్ విశ్వసృజం విలోక్య ।**
**ఆచ్ఛాదనే మార్గమపేక్షయన్తి**
**వామేతరం వారయతిస్మ నేత్రమ్ ॥**

లక్ష్మి పురుషాయితము చేయుచున్నది. అంతలో విష్ణునాభీ సరోజములో బ్రహ్మ కన్పించినాడు! ఆమె సిగ్గుపడి వెంటనే విష్ణువుయొక్క కుడికన్ను మూసినది.

(కుడికన్ను అంటే సూర్యుడుకదా! సూర్యుడు కన్పించకపోగా పద్మము ముడుచుకొన్నది. బ్రహ్మదేవుడు పద్మపురేకులలో దాచబడినాడు).

**4**

**శ్లో॥ అరసిక జనైః సంభాషణతః**
**రసిక జనైస్సహ కలహం శ్రేయః ।**
**లంబకుచాలింగనతః లికుచ**
**కుచాయాః పాదతాడనం శ్రేయః ॥**

రసజ్ఞత యెఱుగనివారితో సంభాషణముకంటె, రసికులైనవారితో కలహము మేలు. వ్రేలాడు కుచములున్న ఆమెను కౌగిలించుటకంటే, గజనిమ్మలవంటి కుచములున్న ఆమెచే తన్నులు తినుట మేలు!

**5**

**శ్లో॥ అథోముఖీ స్వయం రంధ్రీ - రంధ్రాన్వేషణ తత్పరః**
**కార్యాంతే చ పునర్నమః - కార్యకాలేతు నిష్ఠురః ।**
**. . . . . . . . . . . . . . . . . . . . . . .**
**లాలనాత్ కఠినంయాతి - శిశ్నతుల్యోహి దుర్జనః ॥**

ఒక కవి దుర్జనుని శిశ్నముతో పోల్చినాడు. నేల చూపులు చూచును. స్వయముగా వానికి రంధ్రము (లోపము) ఉన్నది. కాని ఇతర రంధ్రములను (లోపములను) వెదకును. తన అవసరము వచ్చినప్పుడు చాల కఠినముగా నుండును. తనపని తీరిన తరువాత వినమ్రుడగును! లాలించిన కొలదియు బిగిసిపోవును! - ఇవన్నీయును శిశ్నలక్షణములు. శిశ్నమువంటివాడే దుర్జనుడు!

**6**

**శ్లో॥ లాలనాత్ బహవో దోషాః - తాడనాత్ బహవో గుణాః ।**
**తస్మాత్ శిష్యంచ శిశ్నంచ - తాడయేత్ నతు లాలయేత్ ॥**

లాలించుటవలన దోషము లేర్పడును. తాడనమువలన చాలమంచి ఏర్పడును. అందుచే శిష్యునకు - శిశ్నమునకు తాడనమే మంచిది! లాలనము మంచిది కాదు!

**7**

ఒక స్త్రీ వ్యభిచరించినది. ఆ వ్యభిచారమునకు శిక్షగా శిరోముండనము విధించినాడు రాజు! అప్పుడు ఆ రండ ప్రశ్నించుచున్నది:-

**శ్లో॥ అష్టాదశాశ్చ స్మృతయో వదన్తి**
**యత్రాపరాధః ఖలు తత్ర దండః ।**
**కృతాపరాధే సతిచోరుమూలే**
**కుతశ్శిరోముండన మాయతాక్ష్యాః ॥**

ఏ భాగమున తప్పు జరిగిన ఆ భాగముననే శిక్ష విధించవలెనని అష్టాదశ స్మృతులును చెప్పుచున్నవి. తప్పుచేసినది ఊరుమూలము! శిరోముండనమేల విధించితిరి?

**8**

**శ్లో॥ యుక్తం కిం తవ శర్వరీశముఖ! మద్వేణీ సమాకర్షణం**
**వీథ్యాం? త్వత్కుచ మండలం మమకథం గృహ్ణాతి చేతో జవాత్? ।**
**వ్యత్యస్తం క్రియతేత్వయా! జహిజహి స్వామిన్! వచస్సాధుతే?**
**ఆగోయః కురుతే స ఏవభవతా దండస్య యోగ్యః ఖలు! ॥**

గోపిక: చంద్రముఖా! నడివీథిలో నా జడ పట్టుకొనుట తగునా?

కృష్ణుడు: నీ కుచములు నా మనస్సును హటాత్తుగా ఏల అపహరించినవి?

గోపిక: కృష్ణా నీవు తారుమారుగా చేయుచున్నావు! చాలు చాలు విడు విడు!! ఏమి మాటయిది? తప్పు చేసిన వారినే పట్టుకొనవలెను కాని ఇదియేమి? (కుచములు మనస్సును హరింపగా జడను పట్టుకొనుట యేమి? కుచములనే పట్టుకొనవలెను!)

**9**

ధ్వని – వక్రోక్తి – వ్యంగ్యములతో తమ భావమును యువతులు ప్రకటించు తీరును వివరించుటకు కొన్ని శ్లోకములు ఉదాహరించియున్నారు. ఒకపాంథుడు అరుగుపై కూర్చుండియున్నాడు. అతనితో ఆ కామిని:

**శ్లో॥ వాణిజ్యాయ గతస్సమే గృహపతి ర్వార్తాపి నశ్రూయతే**
**శ్వశ్రూః తద్భగినీ ప్రసూతి సమయే జామాతృ గేహం గతా ।**
**బాలాహం నవ యౌవనా కులవధూః ఏకాకినీ మందిరే**
**సాయం సంప్రతి వర్తతే పథిక హే! స్థానాంతరం గమ్యతామ్! ॥**

నా భర్త వ్యాపారమునకై పరదేశమేగినాడు, కబురులేదు! అత్త, ఆయన చెల్లెలికి ప్రసూతి సమయనుగుటచే అల్లునింటికేగినది. నవయౌవనములో ఉన్న నేను ఒంటరిగా ఇంటనున్నాను. ప్రొద్దు క్రుంకిపోవుచున్నది. ఓ పాంథుడా! నీవు వేరొక చోటునకు వెళ్ళుము. (కాళిదాసుని శృంగార తిలకము నుండి).

**10**

**శ్లో॥ హే పాంథ! పుస్తకధర! క్షణ మత్ర తిష్ఠ!**
**వైద్యోసికిం? గణితశాస్త్ర విశారదోవా? ।**
**కేనౌషధేన మమ పశ్యతి భర్తురంబా?**
**కింవా గమిష్యతి పతిః పరదేశవాసీ? ॥**

పుస్తకము చంకను పెట్టుకొని ఒక యువకుడు వెళ్ళుచున్నాడు. అతనిని ఒక కామిని సాభిప్రాయముగా ప్రశ్నించుచున్నది. "పుస్తకము పట్టుకొని వెళ్ళునట్టి ఓ పాంథుడా! కొంచెమాగుము! నీవు వైద్యుడవా? జ్యోతిష్కుడవా? వైద్యుడవైనచో, ఏ ఔషధమువలన మాయత్తకు కన్నులు కన్పించును? జ్యోతిష్కుడవైనచో పరదేశమున కేగిన నా భర్త యెప్పుడు వచ్చును?" అని రెండు ప్రశ్నలడిగినది. (భర్త యింటలేడు! ఇంట ఉన్న అత్తకు కళ్ళులేవు. మనకు అడ్డులేదని చెప్పక చెప్పుచున్నది). – ఇది "గాథాసప్తశతి"లోని శ్లోకము.

**11**

గ్రీష్మఋతువు! ప్రపాపాలిక (చలివేంద్రము నిర్వహించు యువతి) ఆగంతుకునితో ఇట్లనుచున్నది:–

**శ్లో॥ జ్యేష్ఠే మాసి కఠోర సూర్యకిరణైః సంతప్త గాత్రో భవాన్!**
**ఏకాకీచ భవాన్! అహంచ తరుణీ! శూన్య ప్రపా వర్తతే ।**
**అస్మిన్ కుబ్జవలే నిరంతరదళే – భోపాంథ! విశ్రామ్యతామ్!**
**లజ్జా మే కథతుం త్వమేవ చతురో జానాసి కాలోచితమ్! ॥**

నీవు గ్రీష్మసూర్య కిరణముల వేడిమికి అలసిపోయితివి! నేనా ఒంటరిగా ఈ చలివేంద్రములో నుంటిని! యువతిని? చలివేంద్రము కనుచూపుమేరలో ఎవ్వరును లేరు! ఈ పొట్టి మట్టిచెట్టు దట్టమైన ఆకులతో గుట్టుగా సున్నది. ఇక్కడ నీవు విశ్రమింపుము. ఇంతకంటే చెప్పుటకు నాకు సిగ్గగుచున్నది. ఇపుడు కర్తవ్యమేమో నీవే గ్రహింపగలవు! నీవు చాతుర్యము గలవాడవు!

**12**

**శ్లో॥ అండం కందూయమానేన - యత్సుఖం తవ భూపతే! ।**
**ఖర్జనానంతరం దుఃఖం - తదస్తు తవ వైరిణామ్ ॥**

రాజునకు కవి ఆశీస్సు నిచ్చుచున్నాడు. రాజా! అండమును గోకునప్పుడు వచ్చు సుఖము నీకగుగాక! గోకిన తరువాత వచ్చు మంట నీ శత్రువులకు కల్గుగాక!

**13**

**శ్లో॥ కిం కారణం స్తనద్వంద్వం - పతితం బ్రూహిమే ప్రియే? ।**
**పశ్యాధః ఖననాత్ మూర్ఖ! - పతంతి గిరయోహ్యపి! ॥**

"ప్రేయసీ! నీ కుచములు ఒరిగిపోయిన వేమి?"–"మూర్ఖుడా! క్రింద త్రవ్వుచుండగా ఎంతటి పర్వతములైనను ఒరిగిపోవునుగదా!"

**14**

**శ్లో॥ దినే దినే గచ్ఛతి నాథ యౌవనం**
**యభస్వ నిత్యం యది శక్తిరస్తి తే ।**
**మృతాయ కోదాస్యతి పిండసన్నిధౌ**
**తిలోదకైస్సార్థ మలోమశం భగమ్! ॥**

నాథా! ఆరోజు కారోజు నా యౌవనము తరిగిపోవుచున్నది. కావున నీ శక్తి యున్నంత వరకు రమింపుము, చచ్చిన వానికి పిండములతో తిలోదకములతో ఊరుమూలము నుంచరు!

**15**

ఒకడు గాడిదను - కంబళిని కోల్పోయి - వనములో వెదకుచున్నాడు. ఒక

వనచరుడు నగ్నమైన ప్రియురాలి అంగమును చూచుచు – తన ఆనందమును ప్రకటించుచుండగా గాడిదను కోల్పోయినవాడన్నమాట:–

**శ్లో॥ 'కింకిం పశ్యసి?', 'తే యోనౌ – త్రైలోక్యమిహ తిష్ఠతి!' ।**
**'పశ్య పశ్య విశాలాక్షి! – గర్దభం మమ కంబళమ్' ॥**

(ప్రియురాలు) "ఏమిటి పరిశీలనగా చూచుచున్నావు?" – (ప్రియుడు) "నీ యోనియందు ముల్లోకములును కన్పించుచున్నవి?" – (గాడిదపోయినవాడు) "ఓ విశాలనేత్రుడా! చూడు చూడు! నా గాడిదయు, కంబళియు ఉన్నవేమో చూడుము!"

## 16

**శ్లో॥ ఉగ్రరూపం కుచద్వంద్వం – హార గంగాధరం తవ ।**
**చంద్రచూడం కరిష్యామి – కురు తావ ద్దిగంబరమ్! ॥**

కుచద్వంద్వము శివాకృతిగా (లింగముగా) నున్నది. హారములు గంగానదిని పోలియున్నవి. ఇక ఈ కుచములను చంద్రచూడములు (నఖక్షతములు) గా చేసెదను! దిగంబరుని (వస్త్రము తొలగించుట) చేయుము.

## 17

**శ్లో॥ చంచచ్చంద్ర కరస్పర్శ – హర్షోన్మీలిత తారకా ।**
**అహో! రాగవతీ సంధ్యా – జహాతి స్వయమంబరమ్! ॥**

ఈ సంధ్య (యువతి) చంద్రకర (కిరణ) స్పర్శచే ఆనందముతో, తారక (కంటి నల్లగుడ్డు)లు ప్రకాశింపగా, అనురాగముతో స్వయముగా అంబరము (చీర)ను తీసివేయుచున్నది. (వాల్మీకి రామాయణము నుండి).

## 18

ఒక అభిసారికను ఆమె చెలికత్తె: "నీకు అందమైన భర్త సమర్థుడుండగా వ్యభిచారమేల?'' అని ప్రశ్నించింది. ఆమె సమాధానము:–

**శ్లో॥ ఆకారేణ శశీ, గిరా పరభృతః, పారావతశ్చుంబనే**
**హంసశ్చంక్రమణే సమం దయితయా, రత్యాం ప్రమత్తో గజః ।**
**ఇత్థం భర్తరిమే సమస్త యువతి శ్లాఘ్యైః గుణైః శోభితే**
**న్యూనం నాస్తి వివాహితః పతిరితి స్యాన్నైక దోషోయది! ॥**

"నా భర్త ఆకారములో చంద్రుడు! మాటలలో కోకిల! ముద్దులాడుటలో పావురము! నన్ను కౌంగుపట్టుకొని తిరుగుటలో రాజహంస! రతిలో మత్తగజమే! నా భర్తయందు యువతులు మెచ్చుకొను గుణములన్నియును ఉన్నవి. తాళికట్టిన మగడగుటయే పెద్ద లోపము! ఆ ఒక్క లోపము వలననే పరపురుషులను అభిసరించు చున్నాను.

19

**శ్లో॥ అళిరసౌ నళినీకుల వల్లభః**
**కమలినీ హృదికేళి కృతాదరః ।**
**విధివశాత్ పరదేశముపాగతః**
**కుటజపుష్పరసం బహుమన్యతే! ॥**

ఈ తుమ్మెద (నాయకుడు) పద్మములతో ఆనందించునదే! అయినను విధివశమున పరదేశమునకు వెళ్ళి అక్కడ కుటజ (మల్లె / కులట) పుష్పము నందలి మకరందమునకు అలవాటు పడినది!

20

**శ్లో॥ ప్రబంధనం పద్మవనే నిశాయాం**
**మాతంగ దానే మద కర్ణతాడః ।**
**స్వప్రాణభంగః ఖలు చంపకేస్మిన్**
**సర్వత్ర దుఃఖం భ్రమరస్య లోకే ॥**

కొన్ని రాత్రులు పద్మములలో బంధింపబడును. ఏనుగు మదము నాశించి నప్పుడు చెవుల దెబ్బలు తగులును. సంపెంగను పొందినప్పుడు ప్రాణము మీదికి వచ్చును. భ్రమరునకు (విటకానికి) లోకమునందంతటను దుఃఖమే!

21

వ్యభిచారాసక్తు నుద్దేశించిన అన్యాపదేశము:-

**శ్లో॥ అపసర మధుకర దూరం**
**పరిమళబహుళేపి కేతకీకుసుమే ।**
**ఇహనహి మధులాభస్తే**
**భవతిపరం ధూళిధూసరం గాత్రం ॥**

ఓ తుమ్మెదా! మొగలి తన సువాసనతో ఎంత ఆకర్షించినను నీవు దాని దగ్గరకు వెళ్ళకుము. అక్కడ నీకు మాధుర్యము లేదు. పైగా నీ శరీరము దుమ్మగును. (వేశ్యలను – కులటలను చూచి ఆకర్షితుడవు కావద్దు! అనుట).

**22**

వేశ్యలు కాగితపు పూవుల వంటివారనియు – తలవంపులు తప్ప ఆనందము లేదనుటయు ధ్వని:–

**శ్లో॥ దృష్ట్వా హృష్టోభవ దళి రసౌ చిత్ర సంస్థేచ పద్మే**
**'వర్ణం రూపం కిమితి కిమితి' వ్యాహరన్నా జగామ! ।**
**నాస్మిన్ గంధో నచ మధుకణో నాస్తి తత్సౌకుమార్యం**
**ఘూర్ణన్ ఘూర్ణన్ అవనతముఖో వ్రీడయా నిర్జగామ! ॥**

తుమ్మెద చిత్తరువు నందున్న పద్మమును చూచి ఆనందముతో "ఏమి రంగు? ఏమి అందము?" అని ఆనందించుచు దగ్గరకు చేరినది. ఆ పుష్పములో సువాసన లేదు. తేనె లేదు. తక్కిన పూవుల సౌకుమార్యము లేదు. చివరకు మూల్గుచు తలవంచుకొని సిగ్గుతో వెనుకకు పోయినది.

**23**

**శ్లో॥ నవలక్ష ధనుర్ధరాధినాథే**
**పృథివీం శాసతి వీరరుద్రదేవే ।**
**అభవత్ పరమగ్రహారపీడా**
**కుచకుంభేషు కురంగలోచనానామ్! ॥**

తొమ్మిది లక్షల ధానుష్కులకు అధినాథుడైన ప్రతాపరుద్రుడు పరిపాలించుచుండగా అగ్రహారపీడ అధికమయ్యెను (అగ్ర–హార పీడ). మృగీ నేత్రల కుచకుంభములయందలి అగ్ర–హారములకు పీడ (భర్తృపీడ) అధికమయ్యెను. అనగా ఆనందజీవితము అధికమయ్యెను. (అగ్రహారపీడ యువతుల కుచ–అగ్ర–హారములకే కల్గుచున్నది).

## 24

**శ్లో॥ అల మఖిల సురేంద్రై రస్తు పుత్ర ప్రదం వో**
**గురుతర మతి దీర్ఘం కుంభ కర్ణస్య శేఫః ।**
**అహని నిశిచ యస్యో జృంభణే వింధ్య బుద్ధ్యా**
**కలశిజమృషి ముచ్చైః క్రందత స్సూర్యచంద్రా! ॥**

కుంభకర్ణుని శేఫము చాల పొడవుగా (పర్వతమంత) ఉన్నది. అది రాత్రి పగలు పైకి లేచుచున్నది. దానిని సూర్యచంద్రులు చూచి, వింధ్యపర్వతమనుకొని అగస్త్య మహర్షిని బిగ్గరగా పిలుచుచున్నారు. అట్టి కుంభకర్ణ శేఫము మీకు పుత్రప్రదమగుగాక!

## 25

12, 13 సంవత్సరముల బాలికలను భర్తతో కలుపుట ప్రాచీనాచారము. పురుషాసక్తి నెఱుగని బాలిక తల్లితో నిట్లనుచున్నది:-

**శ్లో॥ మాతః! శ్వశురగృహం న యామి శయితుం, కస్మాచ్ఛ చంద్రాననే?**
**జామాతా అతినిర్దయో భుజలతాపాశేన మాం పీడతే ।**
**వక్షోజగ్రహణం కరోతి సతతం, ఓష్ఠం దశత్యాదరాత్,**
**నీవీబంధ విమోచనంచ కురుతే, నిద్రాం న లేభే నిశి ॥**

"అమ్మా! నేను అత్తవారింటికి శయనమునకు వెళ్ళను!" – "చంద్రముఖీ! కారణమేమి?" – "నీ అల్లుడు దయారహితుడు! నన్ను గట్టిగా కౌగిలించుకొనుచున్నాడు. ఉరోజములను నిరంతరము పట్టుకొనుచున్నాడు. పెదవి కొరుకుచున్నాడు. చివరకు చీరముడికూడ విప్పివేయుచున్నాడు. రాత్రంతయును నిద్రలేకుండ చేయుచున్నాడు?"

## 26

**శ్లో॥ అసంపూర్ణ నదీస్నానం – అవ్యక్త తరుణీరతమ్ ।**
**అవ్యాకరణ పాండిత్యం – త్రయం దుఃఖాయ కల్పతే ॥**

నీరు నిండుగాలేని నదీస్నానము – వ్యక్తురాలుకాని స్త్రీతో సంభోగము – వ్యాకరణ జ్ఞానములేని పాండిత్యము – ఈ మూడును దుఃఖాకరములు!

**27**

**శ్లో॥ అధరస్య మధురిమాణం**
**కుచకాఠిన్యం దృశోశ్చ తైక్ష్ణ్యంచ ।**
**కవితాయాః పరిపాకం**
**హ్యనుభవరసికో విజానాతి ॥**

పెదవి కొరుకుటలోని రుచి – కుచ కాఠిన్యము – చూపుల తీవ్రత – కవిత్వములోని అందము:– ఇవి అనుభవముతో తెలిసికొనవలసినవి!

**28**

వివాహానంతరము ప్రథమరాత్రి గడపిన వధువును ఆప్తులు ప్రశ్నించి, వివాహము సుఖాంతమైనదో లేదో గ్రహించుట పరిపాటి. ఒక వధువును ఉదయము ప్రశ్నలు – ఒక్కొక్క ఆమె ఒక్కొక్క ప్రశ్నగా –

**శ్లో॥ కస్తూరీ వరపత్రభంగ నికరో భ్రష్టో న గండస్థలే**
**నో లిప్తం సఖి చందన స్తనతటే, ధౌతం న నేత్రాంజనమ్ ।**
**రాగో నస్ఖలిత స్తవాధరపుటే తాంబూల సంవర్ధితః**
**కిం రుష్టాసి? గజేంద్రమత్తగమనే! కింవా శిశుస్తే పతిః? ॥**

కలికిరొ చెక్కులన్ మకరికల్ చెడలేదు! చందనంబు చన్నుల చెదరంగ లేదు! ఇదె కనుంగవ కాటుక జారలేదు! పెదవికి తాంబూలముచే నేర్పడిన ఎఱుపు చెఱగలేదు! ఓ గజగామినీ! నీవు కోపించితివా? లేక నీ భర్త పసివాడా? (–కాళిదాసుని శృంగార తిలకము నుండి). ఈ శ్లోకమునకు తిరుపతి వేంకటకవులు చేసిన పద్యానువాదమునకై చూడుడు: ప్రథమభాగము, పద్యకవిత్వము, శృంగార పద్యములు–10.

నవవధువు సమాధానము:

**శ్లో॥ నాహం నో మమ వల్లభశ్చ కుపితః, సుప్తా న, నా సుందరః,**
**నో వృద్ధో, న చ బాలకః, కృశతనుః, నో వ్యాధితో, నో శఠః, ।**
**మాం దృష్ట్వా నవయౌవనాం శశిముఖీం కందర్పబాణాహతో**
**ముక్తో దైత్యగురుః ప్రియేణ పురతః పశ్చాద్గతో విహ్వలః! ॥**

నేను–నా పతి కోపించుకోనలేదు! అతడు నిద్ర పోలేదు. కురూపి కాదు. వృద్ధుడు కాదు. బాలుడు కాదు. బలహీనుడు కాదు. వ్యాధిగ్రస్తుడు కాదు. మూర్ఖుడు కాదు. కాని నవయౌవనములోనున్న చంద్రముఖినైన నన్ను చూడగానే మన్మథావేశముతో రాక్షసగురుని (శుక్రమును) విడిచినాడు. నేను తెల్లబోయితిని (–కాళిదాసుని శృంగార తిలకము నుండి) (చూ. ప్రథమభాగము, తెలుగు కవిత్వము, శృంగార పద్యములు–11).

**29**

కోపము బూతులకు జన్మస్థానము, బిల్హణునకు రాజదర్శనము కాలేదు. ద్వారము దగ్గరనే కొన్ని రోజులు ఆగిపోయినాడు. "ఏమి ఇక్కడ నుంటివి" అని యొకకవి ప్రశ్నించగా బిల్లణుడు ఇట్లనెను:–

**శ్లో॥ రాజద్వారే భగద్వారే – విశంతి ప్రవిశంతి చ ।**
**శిశ్నవత్ పండితాస్సర్వే – బిల్హణో వృషణాయతే! ॥**

భగద్వారము వంటి రాజద్వారములోనికి – పండితులందరును శిశ్నమువలె లోపలకు పోవుచు బయటకు వచ్చుచున్నారు! ఈ బిల్హణుడు మాత్రము వృషణములవలె ద్వారము బయటనే యున్నాడు!

**30**

పూర్వము ఆంధ్రయువతులు నదులలో స్నానము చేసి, తడిబట్టలతో– మంచినీళ్ళ బిందెతో నింటికి వచ్చెడువారు. నదిలో స్నానము చేయుటకు ముందుగా కొంగు కప్పుకొని రవిక విప్పి దానిని నీళ్ళలో ముంచి–వంగి ఱాతిపై ఉతికెడివారు. ఆ పరిస్థితి కవి దృష్టిలో పడినది. శ్లోకమైనది!

**శ్లో॥ ఆంధ్రీ కాచన మన్మథాశుగనిభా కౌశేయకం కంచుకం**
**కక్షాత్ బాహుయుగేన కోమల తరేణాదాయ – తూర్ణం జలే ।**
**మగ్నీకృత్య కుచద్వయస్య కృశదం త్వాం మర్దయామితి సా**
**పాషాణే తదపీడయత్ కుచయుగం చక్రే ముదా నర్తనమ్! ॥**

ఒక ఆంధ్ర సుందరి స్నానమునకై నది రేవులోనికి వెళ్ళినది. రవికను, కొంగు ముసుగునుండి తీసినది – నీటిలో ముంచినది. (కుచములను పీడించు

నిన్ను జాతిపై కొట్టెదను అన్నట్లుగా) జాతిపై ఉతుక నారంభించినది. వంగి ఆమె ఉతుకుచుండగా కుచములు (తమ శత్రువునకు అతిదెబ్బలు తగులుచున్నవి కదాయని) సంతోషముతో నాట్యమాడినవి!

## 31

**శ్లో॥ దిశి – దిశి వికీర్ణ నయనం, సహసా సహసేతి ముగ్ధ సల్లాపమ్ ।**
**అవిగళిత నీవిబంధం, తస్కర సురతం నమామి తన్వంగ్యాః ॥**

ఎవరు వత్తురో యని ఖంగారుగా దిక్కులు చూచుట – 'కానిమ్ము కానిమ్ము తొందరగా' అను గుసగుసలు – కోకముడి విప్పకుండా పొందు లతాంగి దొంగ కూటమికి పదివేల నమస్కారములు!

## 32

నదులు – నీలాటి రేవులు – యువతులు మంచినీళ్ళు బిందెలతో తీసికొని వెళ్ళుట – ఒడ్డున మురికిగా నుందునను భావముతో చీరను మోకాళ్ళపైకి తప్పించి, లోపలి నీరు కోసము లోతునకు రంభోరులు వెళ్ళు వేళలో శృంగారము:–

**శ్లో॥ తిష్ఠన్తీ జానుదఘ్నే పయసి, నివసన ప్రాంత ముత్సాదయన్తీ**
**కించిల్లక్ష్యోరుకాండా ముఖరిత వలయం కుంభమగ్రే ధునానా ।**
**స్నాతాన్ వారి త్రయాదప్యధిక శత తమం సమ్యగాచామయన్తీ**
**శిష్టాన్ స్వాలోక సక్తాన్ రమయతి హృదయం మామకం కాపి బాలా!॥**

మోకాటిలోతువఱకు చీరపైకెత్తి పట్టుకొన్నది. తొడలు కొలదిదిగా కన్పించు చున్నవి. నీళ్ళకుండతో నీటిపై భాగము తొలగించుచు (తెప్పకొట్టుచు), నీటిపై వలయములు సృష్టించుచు, మంచినీటిని ముంచుటకు ప్రయత్నము చేయుచున్నది. మొలబంటి నీటిలో బాపనయ్యలు ఆమె తొడలు చూచుచు మూడుసార్లు చేయవలసిన ఆచమనము ముప్పదిసార్లు చేయుచున్నారు. శిష్టవిప్రులకు– నాకు, ఈ జలాహరణాసక్త చిత్తానందమును కల్గించుచున్నది!

**33**

**శ్లో॥ క్వ భ్రాత శ్చలితోసి? వైద్యక గృహే; కిం? తద్రుజా శాంతయే;**
**కింతే నాస్తి సఖే గృహే ప్రియతమా సర్వం గదం హస్తియా ।**
**వాతం తత్కుచకుంభ మర్దన వశాత్! పిత్తంతు వక్త్రామృతాత్!**
**శ్లేష్మాణం వినిహన్తి హంత సురతవ్యాపార కేళీ శ్రమాత్! ॥**

సోదరా ఎక్కడకు బయలుదేరితివి? వైద్యుని యింటికి! ఎందులకు? రోగశాంతికి! అన్ని రోగములను తొలగించు నీ ప్రియురాలు నీ యింటలేదా? కుచకుంభ మర్దనము వాతమును హరించును. అధర సుధారసము పిత్తమును (వేడిని) పోగొట్టును. సురత క్రీడాశ్రమ శ్లేష్మమును తగ్గించును. నీకు వైద్యుడెందులకు? (– కాళిదాసుని శృంగార తిలకము నుండి).

**34**

పూర్వము ప్రయాణములలో దారిలో మోకాటి బంటి–తొడ బంటిగా నీళ్లుండేవి. అక్కడ దాటుటకు చీరను పైకెత్తుకొని – అరచేయి అడ్డముపెట్టి, నీళ్ళు దాటెడివారు. ఆ దృశ్యమును చూచి ఒక యువకుడు – ఆమె అరచేయి అడ్డము పెట్టి ముందుకు సాగుచున్నది కదాయని – తన అంగమును గుప్పిలితో పట్టుకొందమని ఊహింపగా ఆ కోరిక నెరవేరలేదు. అప్పుడా యువకుడు తనలో:

**శ్లో॥ అహో! భాగ్యవతీ నారీ! వామ హస్తేన గోపితమ్! ।**
**పాపోహం పాపకర్మాహం! ద్విముష్టి చతురంగుళః! ॥**

ఆహా! ఈనారి ఎడమచేతిని అడ్డము చేసి ముందుకు సాగినది. ఈమె అదృష్టవంతురాలు! నేను పాపాత్ముడను, పాపకర్ముడను! రెండు గుప్పిళ్ళతో పట్టినను ఇంకను నాలుగంగుళములు మిగిలిపోయినది!

**35**

**శ్లో॥ ఏకాక్షీ నచ కాకోయం – బిలాన్వేషీ న మూషికః ।**
**సృష్టికర్తా న చ బ్రహ్మా – జటాధారీ న శంకరః ॥**

ఒకే కన్ను ఉంటుంది–కాని కాకికాదు. కలుగులను అన్వేషిస్తుంది–కాని ఎలుకకాదు. సృష్టికర్త–కాని బ్రహ్మకాదు. జడలను ధరిస్తుంది–కాని శంకరుడు కాదు. (దీని భావమేమి తిరుమలేశ!అనే పొడుపు పద్యంలాంటి శ్లోకం!) సమాధానం= శిశ్నం.

**36**

**శ్లో॥ తాంబూల పూరిత ముఖీ, తరళాయతాక్షీ,**
**నీలాలకా, రుచిర కాంచన కర్ణపత్రా ।**
**ద్వారస్థితైక నత సుందర పూర్వకాయా,**
**కుంభస్తనీ గురువధూ రవలోకతే మామ్! ॥**

తారాశశాంకులు చాలమంది యున్నారు. ఒక శిష్యుడు గురువధువును గూర్చి – "తాంబూలము నమలుచు – కనులు త్రిప్పుచు – నల్లని కేశపాశముతో – మిలమిలలాడు రవ్వల తాటంకములతో – ద్వారము లోపల నిలచి – తన అందమైన శరీరమును ద్వారము బయటకు వంచి – మత్తేభ కుంభ స్తనియైన గురుభార్య నాకై (ఎదురు) చూచుచున్నది!

**37**

**శ్లో॥ తుందిలః సురతాసక్తః – చుంబనోద్యుక్త మానసః ।**
**ఇతోభ్రష్టః తతోభ్రష్టః – చుంబనాత్ మైథునాదపి! ॥**

పెద్దపొట్ట కలవాడు సురతమారంభించినాడు. ఆ సమయములోనే ప్రేయసిని చుంబింపవలెనను కోరికతో ముందునకు వంగినాడు కాళ్ళు తేలిపోయినవి – రెండును ఏకకాలములో పొందవలెనను కోరిక బాధింపగా పొట్టపై తేలినాడు. చుంబనము –మైథునము – రెండును పోయినవి!

**38**

సన్నని ఆమెతో మహాబలవంతునకు కూటమి కల్గినది. ఆ బలవంతుడు దయాస్వభావుడు! ఆమె ఏమైపోవునో – అను శంకతో నెమ్మదిగా వ్యవహరించుచున్నాడు! అప్పుడామె ఆ బలవంతునితో – ఇట్లనుచున్నది:–

**శ్లో॥ తన్వీ శ్యామా మృదు తనురితి త్యజ్యతా మత్ర శంకా**
**లోకే మత్త భ్రమర పతనాత్ మంజరీ కిన్ను భగ్నా? ।**
**మందాక్రాంతా విసృజతిరసం నేక్షుయష్టిస్సమగ్రం?**
**తస్మా దేషా రహసి భవతా నిర్దయం మర్దనీయా! ॥**

నేను లతాంగినని, సుకుమారినని నన్ను శంకింపకుము! మదించిన తుమ్మెద ఎంత దూకుడుగా వ్రాలినను పూలగుత్తి విరుగునా? చెఱకుగడను నెమ్మదిగా

దువ్వినచో సమగ్రమైన రసము నిచ్చువా? అందుచేత నన్ను నీవు ఏకాంతములో దయా రహితుడవుగా అనుభవింపుము!

**39**

రాత్రి మొదటిజాములోనే సురతక్రీడకు బిల్హణుడు తొందర పడుచున్నాడు. అప్పుడామె ప్రియునితో –

**శ్లో॥ జాగర్తిలోకో – జ్వలతిప్రదీపః**
**సఖీజనో వీక్షతి కౌతుకేన ।**
**ముహూర్తమాత్రం కురు కాంత ధైర్యం**
**బుభుక్షితః కిం ద్వికరేణ భుంక్తే? ॥**

అందరును మెలకువగా నున్నారు. పెద్ద దీపములు వెలుగుచున్నవి. సఖురాండ్రు మనలను గమనించుచున్నారు. ఓ మనోహరా! ముహూర్తకాలము ధైర్యమవలం బింపుము! ఎంత ఆకలి వేసినను రెండు చేతులతో తిందురా?

**40**

పై ప్రశ్నకు బిల్హణుని సమాధానము –

**శ్లో॥ జాగర్తు లోకో – జ్వలతు ప్రదీపః –**
**సఖీజనో వీక్షతు కౌతుకేన ।**
**ముహూర్త మాత్రం నకరోమి ధైర్యం**
**పిపాసితః కిం ద్వికరేణ పీతే? ॥**

అందరును మెలకువగా నుండిన నుందురు గాక! పెద్దదీపములు వెలుగుచుండిన వెలుగుగాక! నీ చెలికత్తెలు ఉత్సాహముతో చూచుచుండిన చూడనిమ్ము! నేనింక ముహూర్తకాలము ధైర్యమవలంబింపజాలను? దప్పికగొన్నవాడు రెండు చేతులతో త్రాగడా?

**41**

**శ్లో॥ ఉర్వ్యాం కోఽపి మహీధరో లఘుతరో దోర్భ్యాం ధృతో లీలయా**
**తేనత్వం దివి భూతలేచ సతతం గోవర్ధనోద్ధారకః ।**
**త్వాం త్రైలోక్యధరం వహామి కుచయోరగ్రే సతద్గణ్యతే**
**కిం వా కేశవ! భాషణేన బహునా? పుణ్యై ర్యశో లభ్యతే! ॥**

కృష్ణా! నీవు ఏదో చిన్న పర్వతమును మహాబాహువులతో కష్టపడి యెత్తితివి! అంతమాత్రముననే నీకు స్వర్గ మర్త్య లోకములలో "గోవర్ధనోద్ధారకుడు" అను పేరు వచ్చెను. ముల్లోకములను ధరించు నిన్ను నా కుచాగ్రములపై మోయుచున్నాను. ఇది లెక్కలోనికెక్కలేదు! కృష్ణా! పలుపల్కులేల? పుణ్యమువలననే కీర్తి వచ్చును కాని, చేసిన కృషిని బట్టికాదు! (ఇట్టి అద్భుత శృంగార శ్లోకములు శ్రీకృష్ణకర్ణామృతములో కొల్లలుగా నున్నవి).

## 42

మహాకవి కాళిదాసు ఒక సుందరకాంతా సౌందర్యమును వర్ణించుచు ఆమెను ఒక రమ్యమైన సరస్సుతో పోల్చుచున్నాడు:–

**శ్లో॥ బాహూద్వోచ మృణాళ, మాస్య కమలం, లావణ్య లీలాజలం,**
**శ్రేణీ తీర్థశిలాచ, నేత్ర శఫరీ, ధమ్మిల్ల శైవాలకం ।**
**కాంతాయాః స్తన చక్రవాకయుగళం, కందర్ప బాణానలైః**
**దగ్ధానా మపగాహనాయ, విధినా రమ్యం సరోనిర్మితం ॥**

ఈ యువతి చేతులు తామరతూడులు; ముఖము కమలము; లావణ్యము (కాంతి)లీలా జలము; పిరుదులు పుణ్యతీర్థశిలలు; కన్నులు చేపలు; జుట్టు నాచు; గబ్బిగుబ్బలు చక్రవాకముల జంట; మన్మథ బాణాగ్నిలో దగ్ధమైనవారు స్నానము చేయుట కొఱకు బ్రహ్మదేవుడు సృష్టించిన అందమైన సరస్సు ఈ కాంత!

(– శృంగార తిలకము నుండి)

## 43

**శ్లో॥ కిం వదంతి విటం వేశ్యాః? కిమస్తి యమునాంతరే?।**
**ఆంధ్రగీర్వాణ భాషాభ్యాం ఏకమేవ ఉత్తరం వద! ॥**

విటునితో వేశ్యలు ఏమందురు? యమునా నదిలోపల ఏమున్నది? ఆంధ్ర – సంస్కృత భాషలకు సరిపడునట్లుగా ఒకే సమాధానమిమ్ము!

సమాధానం: 'నీ – లంజలం!'
'నీలం – జలం!'



# 2.4 హాస్యశ్లోకములు

**1**

శ్లో॥ విష్ణో రాగమనం నిశమ్య, సహసా కృత్వా ఫణీంద్రం గుణం,
కౌపీనం పరిధాయ చర్మకరిణః, శంభుః పురోధావతి; ।
దృష్ట్వా విష్ణురథం సకంప హృదయః సర్పో పతత్ భూతలే,
కృత్తి ర్వి స్థలితా, హ్రియా, నతముఖో, నగ్నో హరః పాతువః ॥

శివుడు దిగంబరుడై యున్నాడు. విష్ణువు రాక విన్నాడు. సర్పమును మొలత్రాడుగా ధరించి, గజచర్మమును కౌపీనముగా పెట్టుకొని ఎదురుగా వెళ్ళినాడు. గరుత్మంతుని చూడగనే మొలత్రాడు సర్పమునకు గుండెలు జారినవి. క్రింద పడినది! గోచి యూడినది! నగ్నుడై సిగ్గుతో తలవంచుకొనియున్న పరమేశ్వరుడు మిమ్ము రక్షించుగాక!

**2**

శ్లో॥ వాస శ్చర్మ విభూషణాని ఫణినః భస్మాంగరాగోధునా
గౌరేకః న చ కర్షణే న కుశలః సంపత్తి రేతాదృశీ ।
ఇత్యాలోచ్య విముచ్య శంకర మగాత్ రత్నాకరం జాహ్నవీ
వ్యర్థం నిర్ధనికస్య జీవన మహోదారై రపిత్యజ్యతే ॥

ధరించునది చర్మము! ఆభరణములు సర్పములు! అంగరాగము చితాభస్మము! ఉన్నది ఒక్క యెద్దు! అది దున్నుటకు ఉపయోగింపదు! ఈయన ఐశ్వర్యమిది! అని ఆలోచించి గంగాదేవి శంకరుని విడిచిపెట్టి రత్నాకరుని (సముద్రుని) చేరినది. ఆహా! ధనహీనుని జీవితమెంత వ్యర్థము! చివరకు భార్య కూడ విడనాడును కదా!

**3**

భర్త పరదేశమునకు వెళ్ళినప్పుడు – భార్య కంసాలి దగ్గర గేదెను కొన్నది. అది "లక్కగేదె" అనుచు భర్త యిట్లు నుడివినాడు –

శ్లో॥ ముగ్ధే! పయోపి దత్తే! తృణమప్యశ్నాతి తర్ణకం సూతే ।
నాడింధమస్య మాయాం జాతు న జానాసి జాతుషీ మహిషీ! ॥

పిచ్చిదానా! పాలను ఇచ్చును. గడ్డి మేయును. దూడను కనును. కంసాలి మాయను ఎన్నటికిని గ్రహింపలేవు! అది లక్కగేదెయే!

**4**

అన్నదమ్ములు ఇద్దరే ఆ పల్లెలో మహావైద్యులు. ఆ ప్రాంతములో అందరునువీరి చేతి మాత్రలతోనే వైకుంఠయాత్రలు చేయువారు. వారి అన్నదమ్ములిద్దరును పొరుగూరు వెళ్ళి వచ్చుచుండగా ఊరు బయట ఒక చితి కాలుచున్నది.

**శ్లో॥ జ్వలంతం చితి ముద్దిశ్య వైద్యో విస్మయమాగతః ।**
**నా హం గతో న మే భ్రాతా! కస్యేదం హస్తలాఘవమ్? ॥**

కాలుచున్న చితిని చూచి వైద్యుడాశ్చర్యపడెను. "నేను వెళ్ళలేదు. నా సోదరుడు వెళ్ళలేదు. ఇది ఎవరి చాతుర్యము?" అన్నాడు.

**5**

"వైద్యుడు యమునికంటే గొప్పవాడు అనుచు –

**శ్లో॥ వైద్యరాజ! నమస్తుభ్యం – యమరాజ సహోదర ।**
**యమస్తు హరతి ప్రాణాన్ – వైద్యః ప్రాణాన్ ధనాని చ! ॥**

యముని సోదరుడవైన ఓ వైద్యరాజా! నీకు నమస్కారము. యముడు ప్రాణములను మాత్రమే హరించును. వైద్యుడు ప్రాణములను – ధనమును కూడ అపహరించును. (ఇద్దరి చేతులలోను 'పాశము' ఉండును).

**6**

**శ్లో॥ అపశబ్ద భయం నాస్తి – అప్పలాచార్య సన్నిధౌ ।**
**అనాచార భయం నాస్తి – తిష్ఠన్మూత్రస్య సన్నిధౌ ॥**

అప్పలాచార్యుడు వ్యాకరణ జ్ఞానము లేనివాడు. అట్టివానియెదుట అపశబ్ద భయముండదు. నిలబడి మూత్రవిసర్జనము చేయువాని యెదుట అనాచార భయముండదు కదా!

**7**

ఆశ్రయదాత మరణించినాడు. కవులు గురవయ్యసెట్టి చుట్టును తిరుగుచున్నారు. గురవయ్యసెట్టి తనను రసజ్ఞశేఖరునిగా – మహాదాతగా –

కవిపోషకునిగా భావించు చున్నారని గర్వించినాడు – “నన్ను రసజ్ఞుడని ఆశ్రయించుచున్నారా?” అని ప్రశ్నించినాడు. వెంటనే ఒక కవి: “నాభి (విషము) ఉన్నదేమో అని నిన్నడుగుటకు నీ చుట్టును తిరుగుచున్నాము” అన్నాడు.

**శ్లో॥ త్యజ కింశుక! పుష్పితాభిమానం**
**నిజశీర్షే భ్రమరోపసేవనేన ।**
**వికస న్నవమల్లికా వియోగాత్**
**కురుతే వహ్ని ధియా త్వయి ప్రవేశమ్ ॥**

ఓ మోదుగ వృక్షమా! తుమ్మెదలన్నియును నీ చుట్టు తిరుగుచున్నవని గర్వింపకుము! నవమల్లికా వియోగమునకు తాళలేక అగ్నిలో పడదలచి, ఎఱ్ఱని నీ పూలగుత్తులను అగ్నిగా భ్రమించి, ఆత్మహత్యకు నీపై తిరుగుచున్నవి!

**8**

మణి ప్రవాళము (బహుభాషా మిశ్రితం మణిప్రవాళం):

**శ్లో॥ యూయం తత్ర సిడౌన్, తథాపి వెరివెల్, తస్మాత్ మమాయా శశీ,**
**నో గోసార్ – మదరాసుకాయ కరితం హింగేందు బాయేందునమ్ ।**
**ఇంగ త్పూరయ ఇంగ కూద విడుదల్ నీ వాడ నంటిం గదా!**
**కి స్వాస్తే మయి బోల్తుహుం అజిసునో తక్సీర్ నమేరే ఉపర్! ॥**

మీ రక్కడ కూర్చుండుడు. అయితే మంచిది ఇత్యాదిగా అర్థము చేసికొనవలెను. ఈ పద్యములో సంస్కృతము – ఆంగ్లము – తెలుగు – తమిళము – కన్నడము – హిందీ – ఉర్దూ భాషల మిశ్రమము కలదు.

**9**

**శ్లో॥ అత్తుం వాంఛతి వాహనం గణపతే ర్భూషా భుజంగం క్రుధా**
**తం వాహోపి షడాననస్య – గిరిజా వాహోపి నాగాననమ్ ।**
**గౌరీ జహ్నుసుతా మసూయతి – కళానాథం లలాటానలః**
**నిర్విణ్ణ స్సహసా కుటుంబ కలహా దీశో పిబద్దుర్విషమ్! ॥**

శివుని మెడలోని సర్పము గణపతి వాహనమును (ఎలుకను) మ్రింగజూచు చున్నది ఆ సర్పమును కుమారస్వామి వాహనము (నెమలి) భక్షింప పొంచియున్నది.

పార్వతి వాహనమైన సింహము గజముఖుని చంపజూచుచున్నది. శివుని తలపైనున్న గంగను పార్వతి ఈర్ష్యగా వీక్షించుచున్నది. శివుని ఫాలాగ్ని చంద్రుని మాడ్చి మసిచేయ జూచుచున్నది. ఇట్టి కుటుంబ అంతః కలహములను సర్దుబాటు చేయలేక శివుడు ఆత్మహత్యకై విషము మ్రింగినాడు!

**10**

**శ్లో॥ ఏకా భార్యా ప్రకృతి రచలా, చంచలా సా ద్వితీయా**
**ఏకః పుత్రో సకల సృడభూత్, మన్మథో దుర్నివారః ।**
**శేషశ్శయ్యా శయన ముదధిః వాహనం పన్నగాశీ,**
**స్మారం స్మారం స్వగృహ చరితం దారుభూతో మురారిః! ॥**

ఒక భార్య భూమి! ఆమెకు చలనము లేదు. రెండవ ఆమె (లక్ష్మి) బహు చంచల. ఒక కొడుకు (బ్రహ్మ) అడ్డమైన సృష్టియును చేయును. రెండవ కొడుకు మన్మథుడు. వానికి పట్టపగ్గాలు లేవు! పరుండ శయ్య పాము! పడక సముద్రము మీద – పాము పీకునో – నీటమునుగునో! వాహనము సర్పభక్షిణి! (గరుడుడు). ఇట్టి తన యింటిచరిత్ర తలచుకొనుచు తలచుకొనుచు మురారి కొయ్యబారిపోయినాడు! (పూరీ జగన్నాథములో కొయ్య విగ్రహము).

**11**

**శ్లో॥ కింకులే నోపదిష్టేన – శీలమేవాత్ర కారణం ।**
**భవన్తి నితరాం స్ఫీతాః – సుక్షేత్రే కంటకద్రుమాః ॥**

కులమునుగూర్చి చెప్పుటనుబట్టి వానిని గొప్పగా భావించరాదు. శీలమెట్టిదో తెలిసికొనవలెను. సుక్షేత్రములో ముండ్లమొక్కలు దట్టముగా పెరుగుచుండును గదా!

**12**

ఒక మూర్ఖుడు "రాభణుడు" అన్నాడు. దానిని పండితుడు సమర్థించుట–

**శ్లో॥ కుంభకర్ణే భకారోస్తి – భకారోస్తి విభీషణే ।**
**రాక్షసానాం కులశ్రేష్ఠః[1] – 'రాభణో' నతు రావణః! ॥**

రావణ – కుంభకర్ణ – విభీషణలు అన్నదమ్ములు. కుంభకర్ణునకు "భ" ఉన్నది. 'విభీషణ' అను పేరులోను 'భ' ఉన్నది. కాబట్టి రాక్షసకులములో పెద్దవానిని

"రాభణుడు" అనుటయే సముచితము; "రావణుడు" కాదు![1]

"అగ్రజశ్చ స్వయం రాజా" – పాఠాంతరము.

## 13

**శ్లో॥ మా గర్వ ముద్వహ బిడాల! మహీపతీనామ్**
**అంతర్గృహం మణిమయం సదనం మమేతి ।**
**పట్టాభిషేక సమయేతు నరేశ్వరాణాం**
**బాహ్యస్థితస్య కలభస్యహి మండన శ్రీః ॥**

రాజుల అంతఃపురములలో తిరుగుచున్నానని ఓ పిల్లీ! నీవు గర్వింపకుము. రాజుల పట్టాభిషేక సమయములో ఊరు బయట ఉన్న ఏనుగునకే అలంకారము! (నిన్ను తట్టక్రింద మూత పెట్టుదురు, ఎదురు వచ్చెదవేమోనని).

## 14

**శ్లో॥ కుత్రాస్మి న్నగరే మహాన్ కథయతాం? తాళద్రుమాణాం గణః!**
**కోదాతా? రజకో దదాతి వసనం ప్రాతర్గృహీత్వా నిశి! ।**
**కోదక్షః? పర దార విత్త హరణే సర్వోపి దక్షోజనః!**
**కస్మా జ్జీవసి హే సఖే? విషక్రిమి న్యాయేన జీవామ్యహమ్ ! ॥**

ఈ గ్రామములో పెద్దలెవ్వరు? తాళవృక్షములు! దాతయెవ్వరు? చాకలి – ఉదయము బట్టలను తీసికొని వెళ్ళి సాయంవేళ ఇచ్చును. అతడే దాత! సమర్థుడెవ్వరు? పరదారను – పరద్రవ్యమును అపహరించుటలో అందరును సమర్థులే! ఇట్టి గ్రామములో నీవెట్లు జీవించుచున్నావు? విషక్రిమి న్యాయముగా బ్రతుకుచున్నాను!

## 15

**శ్లో॥ ఆః పాకం నకరోషి పాపిని కథం? పాపీ త్వదీయః పితా!**
**రండే జల్పసి కిం ముధా కలహిని? రండా త్వదీయ స్వసా! ।**
**నిర్గచ్ఛస్వ హతాన్మదీయ భవనాత్! నైదం త్వదీయం గృహం!**
**హా! విశ్వేశ్వర దేహిమేద్య మరణం! శప్తం మదీయం గతమ్! ॥**

భర్త ప్రశ్న : "పాపాత్మురాలా! వంట చెయ్యలేదా?"
భార్య : "నీ తండ్రి పాపాత్ముడు!"

భర్త : "రండా! ఏమి ప్రేలుచున్నావు?"
భార్య : "నీ చెల్లెలు రండ!"
భర్త : "నా యింటినుండి వెంటనే పొమ్ము!"
భార్య : "ఇది నీ యిల్లు కాదు!"
భర్త : "హా! పరమేశ్వరా! నాకు మరణము నిమ్ము!"
భార్య : "నా వెంట్రుక (శష్పము) పోయినదనుకొందును."
(ఇది మార్జాలదాంపత్యము)

**16**

**శ్లో॥ గర్జన్నంబు దదాతి తచ్చ కణికా రూపేణ యత్ర క్వచిత్**
**కాలాపేక్ష తయా - ప్రదాన సమయే నైల్యం విధత్తే ముఖే ।**
**పశ్చాత్ పాండురతా ముపైతి లఘుతా మభ్యేతి భూయస్తరామ్**
**వీరశ్రీప్రభురత్నశేఖరమణే! దాతా కియాన్ వారిదః ॥**

మేఘుడు అరచుచు (తిట్టుకొనుచు) ఇచ్చును. ఆ యిచ్చునది కూడ బొట్లు బొట్లుగా - కాలాపేక్షతో - ఒక కాలములోనే యిచ్చును. పైగా ఇచ్చునప్పుడు మొగము మాడ్చుకొని యిచ్చును. ఇచ్చిన తరువాత తెల్లమొగము వేయును. తేలికగా ప్రవర్తించును. ఓ వీరేంద్ర భూపతీ! మేఘుడేమి దాత? నీవే దాతవు! (ఈ శ్లోకములో దాతృత్వములేని రాజులను అన్యాపదేశముగా నిందించుచున్నాడు).

**17**

**శ్లో॥ య దస్తి ద-ప యోర్మధ్యే - త దస్తి తవ మందిరే ।**
**తన్నాస్తి మద్గృహే రాజన్! - తదర్థ మహ మాగతః ॥**

ద-ప మధ్య ఉన్నది ఏదో అది నీ యింట ఉన్నది. అది నా గృహములో లేదు రాజా! నేను దానికొఱకు వచ్చితిని.(త థ **ద** ధ న-**ప** ఫ బ భ మ = "ధన")

**18**

**శ్లో॥ అనేక శతభాండాని - భిన్నాని మమ మస్తకే ।**
**అహెూ! భాగ్యవతీ నారీ! - భాండమూల్యం న యాచతే! ॥**

ఒకని భార్య కోపము వచ్చినప్పుడు కుండతో భర్తనుకొట్టి, కుండమూల్య మిమ్మని గద్దించుచున్నది. అది చూచిన అతని గురువు అనుభవవేత్త ఇట్లనుచున్నాడు:

"నా తలమీద నా భార్య ఎన్నో వందల కుండలు పగులగొట్టినది (కోపము వచ్చినప్పుడు కుండనెత్తి తలపై కొట్టెడిది). కాని ఎన్నడును కుండ వెలను అడుగలేదు! నా భార్యయే మహోత్తమురాలు!"

## 19

**శ్లో॥ విచిత్రం చారిత్రం తవ ఖలు మురారే! మమ పునః**
**ననిద్రా యత్కించిత్ భవతి మశకస్యైవ నినదాత్ ।**
**కథం నిద్రాసి త్వం? శయన భుజగోచ్ఛ్వాస రభసైః**
**విధే ర్వేదోద్ఘోషైః ప్రబలతర ఘోషైశ్చ జలధేః ॥**

మురారీ! నీ చరిత్ర విచిత్రము! చిన్నదోమ చెవిదగ్గర రొదచేసినంత మాత్రమున నాకు నిద్రపట్టదు! నీకు ఒక ప్రక్క వేయితలల పాము బుసలు! మఱియొక ప్రక్క బ్రహ్మ వేదఘోష! ఇంకొక ప్రక్క సముద్రఘోష! ఈ మధ్యలో నీవు ఎట్లు నిద్రపోవుచున్నావో కదా!

## 20

**శ్లో॥ కాకః కృష్ణః, పికః కృష్ణః - కో భేదః పికకాకయోః ।**
**వసంతకాలే సంప్రాప్తే - కాకః కాకః! పికః పికః! ॥**

కాకి నలుపు - కోకిలయును నలుపే! భేదమేమియును లేదు. వసంత కాలము రాగానే కాకి కాకియే! కోకిల కోకిలయే! (పండితునకు సామాన్యునకు భేదముండదు. సమయము వచ్చినప్పుడు తెలియును).

## 21

**శ్లో॥ ఘటం భింద్యాత్, పటం ఛింద్యాత్ - కుర్యాత్ రాసభ ఘోషణమ్ ।**
**యేన కేనా ప్యుపాయేన - ప్రసిద్ధః పురుషో భవేత్! ॥**

కుండ పగులగొట్టవలెను; వస్త్రమును చించుకొనవలెను; గాడిదవలె ఓండ్రపెట్టవలెను - ఏమి చేసినయైనను సరియే, పురుషుడు ప్రసిద్ధుడు కావలెను.

## 22

యజ్ఞముచేసిన వేదస్వాధ్యాయి వేశ్యను కలిసినాడు. సంభోగమునకు సిద్ధపడుచు - ఆమె ముద్దాడబోవుచుండగా ఆ ఛాందసుడు, -

**శ్లో॥ సామగాయన పూతం మే - నోచ్ఛిష్ట మధరే కురు! ।**
**ఉత్కంఠితాసి చేత్ భద్రే! - వామకర్ణం దశస్వమే! ॥**

సామవేద గానముతో పవిత్రమైన నా అధరము (పెదవి)ను ఎంగిలి చేయకుము! నీవు తమకము పట్టలేక పోయినచో నా యెడమ చెవిని కొరుకుము!

**23**

**శ్లో॥ కేశీసద్మ సమాగతం నిజవిభుం దృష్ట్వా నిలీయ క్వచిత్**
**పశ్చాదేత్యపిధాయ తస్య నయనే కాహం వదేతి ప్రియమ్? ।**
**అంతర్గేహ గతం నినాయ సహసా భ్రూసంజ్ఞయా మాం బహిః**
**సంత్యేవాత్ర సహస్రశో యువతయః సాచాతురీ దుర్లభా ॥**

నేనును ఆమెయును క్రీడాగృహములో నుండగా భర్తవచ్చుటను గమనించినది. నన్ను ఒకచో దాచినది. భర్తకు వెనుకగా వెళ్ళి, అతని కన్నులు మూసి "నేనెవ్వరనో చెప్పుము?" అనుచు నన్ను పారిపొమ్మని కనుసంజ్ఞ చేసినది. నేను బయటపడితిని. చాలమంది యువతులున్నారు. కాని అట్టి చాతుర్యమెవ్వరికిని అలవడదు!

**24**

**శ్లో॥ దగ్ధం ఖాండవ మరునేనచ వృథా దివ్యౌషధై ర్భూషితమ్**
**దగ్ధా వాయుసుతేన హేమరచితా లంకాపురీ స్వర్గభూః ।**
**దగ్ధః సర్వసుఖాస్పదశ్చ మదనో హాహా! వృథా శంభునా**
**దారిద్ర్యం ఘనతాపదం భువి నృణాం కేనాపి నో దగ్ధ్యతే ॥**

రాజా! అర్జునునిచే దివ్యౌషధ నిలయమైన ఖాండవము వ్యర్థముగా తగులబెట్ట బడినది. స్వర్గభూమియై బంగారముచే నిర్మింపబడిన లంకాపట్టణము వాయుపుత్రునిచే దగ్ధము చేయబడినది. నర్వ సుఖాస్పదుడైన మన్మథుడు శంభునిచే వృథాగా తగులబెట్టబడినాడు. భూమిలో మానవులకు ఘనతాపములను కల్గించు దారిద్ర్యము మాత్రము ఎవ్వరిచేతను తగులబెట్టబడుటలేదు! (నీవే సమర్థుడవు!).

**25**

**అదే ప్రశ్నకు - అదే సమాధానము:**

ప్రశ్న : **కే-దార పోషణ రతాః**? = దార (భార్యా) పోషణకు సమర్థులెవ్వరు?

సమా : **కేదార - పోషణ-రతాః** = పంటపొలమును పోషించుటలో శ్రద్ధావంతులు.

ప్రశ్న : **కం - సంజఘాన కృష్ణః?** = ఎవరిని చంపెను కృష్ణుడు?

సమా : **కంసం - జఘాన - కృష్ణః** = కంసుని చంపినాడు కృష్ణుడు!

ప్రశ్న : **కా-శీతల వాహినీ గంగా?** = శీతల ప్రవాహమున్న గంగ (నీరు) ఏది?

సమా : **కాశీ - తలవాహినీ - గంగా** = కాశీప్రాంతమున ప్రవహించు గంగ!

ప్రశ్న : **కం-బలవంతం న బాధతే శీతలమ్?** = ఏ బలవంతుని చలి బాధింపదు?

సమా : **కంబల-వంతం-నబాధతే శీతలమ్**=కంబళమున్నవానిని చలి బాధింపదు!

## 26

**శ్లో॥ ఉచ్చై రధ్యయనం, చిరంతన కథాః, స్త్రీభిః సమాలాపనం,**
**తాసా మర్భక లాలనం, పతిసుతిః, తత్పాక మిథ్యాస్తవమ్ ।**
**మిథ్యా దాన, మభూత పూర్వ చరితం, సాముద్రికం, జ్యోతిషం**
**వైద్యం, గారుడ మంత్రజాల మధికం భిక్షాటనే ద్వాదశ ॥**

గట్టిగా చదువుట - ఎక్కడెక్కడివో గాథలు చెప్పుట - స్త్రీలతో చక్కగా మాటలాడుట - వారిబిడ్డలను ముద్దుచేయుట - పై అధికారిని పొగడుట - వండిన వంటను మెచ్చుకొనుట - దానము చేసినట్లు కన్పించుట - లేని కథలు అల్లి చెప్పుట - హస్త సాముద్రికము - జ్యోతిషము - వైద్యము - పాము, తేలు మంత్రములు - అనునవి ఇతరులను ఆకర్షించు విద్యలు! ఈ 12 విద్యలలో కొన్నియైనను చేతకానిచో సంఘమును ఆకర్షింపజాలరు.

## 27

**శ్లో॥ ఆదిత్యాద్యాః గ్రహాః సర్వే - యథా తుష్యన్తి దానతః ।**
**సర్వస్వేపి న తుష్యేత - జామాతా దశమో గ్రహః ॥**

సూర్యాది నవగ్రహములు ఆయా దానములతో తృప్తిపడును. ఎన్ని దానములు చేసినను తృప్తినందని దశమ (పదవ) గ్రహము అల్లుడు!

## 28

**శ్లో॥ దుర్జనం ప్రథమం వందే - సజ్జనం తదనన్తరమ్ ।**
**ముఖ ప్రక్షాళనాత్ పూర్వం - గుద ప్రక్షాళనం యథా ॥**

నేను దుర్జనునకు ముందుగా నమస్కరింతును. సజ్జనునకు ఆ తరువాత నమస్కరింతును. ముఖప్రక్షాళనము (ముఖము కడుగుకొనుట) కంటె ముందుగా గుదప్రక్షాళనము చేయవలయునుగదా! (మలవిసర్జనము తరువాతనే పల్లు దోముట).

**29**

**శ్లో॥ కృపణేన సమో దాతా - న భూతో న భవిష్యతి ।**
**అస్పృశన్నేవ విత్తాని - యః పరేభ్యః ప్రయచ్ఛతి ॥**

లోభివానితో సమానమైన దాత పూర్వము లేడు; భవిష్యత్తులో ఉండడు. ధనమును చేతితో ముట్టుకొనకుండా ఇతరులకు ఇచ్చివేయును. (వాడు చచ్చిన తరువాత ఇతరులు తీసికొందురు).

**30**

**శ్లో॥ తృణాదపి లఘు స్తూలః - తూలాదపి చ యాచకః ।**
**వాయునా కిం ననీతో సౌ? - మామయం ప్రార్థయేదితి! ॥**

గడ్డిపరకకంటె దూదితేలిక. దూదికంటె యాచకుడు తేలిక. అయినచో గాలి అతనినెందుకు ఎగురగొట్టుట లేదు? అని ప్రశ్న! తనను యాచించునేమో? అను భయముతో గాలి అతని దగ్గరకు చేరుట లేదు! - అని సమాధానము.

**31**

లక్ష్మీ - పార్వతుల సంవాదము:-

**శ్లో॥ భిక్షార్థీ స క్వయాతః?-సుతను బలిమఖం!-తాండవం క్వాద్య భద్రే?**
**మన్యే బృందావనాంతే!-క్వను స మృగశిశుః?-నైవజానే వరాహమ్!॥**
**బాలే! కచ్చిన్నదృష్టో జరఠ మృగపతిః?-గోపయేవాత్ర వేత్తా!-**
**లీలా సంలాప ఇత్థం జలనిధి హిమవత్కన్యయోః త్రాయతాం నః! ॥**

లక్ష్మి : బిచ్చగాడు ఎక్కడకు వెళ్ళినాడు?

పార్వతి: బలియజ్ఞమునకు!

లక్ష్మి : ఈనాడు తాండవము ఎక్కడ?

పార్వతి: బృందావనములో అనుకొందును!

లక్ష్మి : ఆ జింకపిల్ల యెక్కడ?

పార్వతి: ఏమో! ఆ వరాహమును నేనెరుగను!

లక్ష్మి : బాలా! ముసలి ఎద్దు కన్పించలేదా?

పార్వతి: గోవులను కాయువానికే తెలియవలయును!

ఈ విధముగా సాగిన లక్ష్మీ పార్వతుల సంవాదము మమ్ము రక్షించుగాక!

**32**

**శ్లో॥ ద్వారం ద్వార మట న్భిక్షుః - శిక్షత్యేవం న యాచతే ।**
**అదత్వా మాదృశో మాభూః - దత్వాత్వం త్వాదృశో భవ! ॥**

భిక్షుకుడు ఇంటింటికి వెళ్ళి బోధించుచున్నాడు కాని యాచించుట లేదు. "నీవు దానము చేయక, నావంటి యాచకుడవు కావద్దు! దానము చేసి నీవు నీవలెనే ఉండుము!".

**33**

"అందఱను వర్ణించుచున్నారు. నన్ను వర్ణింపరేమి?" అన్నదట పెద్దిభట్టు భార్య. అప్పుడాయన ఇట్లు తన భార్యపై శ్లోకము చెప్పినాడు:

**శ్లో॥ మేరు మందర సమాన మధ్యమా,**
**తింత్రిణీ దళ విశాల లోచనా!**
**అర్క శుష్కఫల కోమల స్తనీ**
**పెద్దిభట్ట గృహిణీ విరాజతే! ॥**

మేరుపర్వతమువంటి నడుముతో- చింతాకులవలె విశాలనేత్రములతో - ఎండిన జిల్లేడువంటి కుచములతో - పెద్దిభట్టుభార్య ప్రకాశించుచున్నది!

**34**

నేను చాలా ఏండ్ల క్రిందట హైదరాబాదులో ఒక సాహిత్య సభకు వెళ్ళాను. అక్కడ వేదికమీద ఆచార్య శ్రీహరిగారి వంటి పండిత మిత్రులు ఏదో విషయం మీద తీవ్రంగా వాదించుకుంటున్నారు. అప్పుడు ఆ సభలో ఉన్న ప్రముఖ భాషాశాస్త్రవేత్త డా॥ బూదరాజు రాధాకృష్ణగారు ఒక శ్లోకం చెప్పి, ఆ పండితులను

ఆక్షేపించారు. ఆ శ్లోకం నేను మరిచిపోయాను. దాని భావం మాత్రం జ్ఞాపకం ఉంది. "ఒక కుక్కకు మరొక కుక్క ఎదురు పడితే గురగురలాడుతూ కాట్లాడుకుంటాయి. ఒక పండితుడు ఇంకొక పండితుణ్ణి చూస్తే, కుక్కలవలెనే గురగురలాడుతూ పోట్లాడుకుంటారు." ఈ భావంతో ఉన్న శ్లోకాన్ని చెప్పమని రవ్వా, శలాక, బేతవోలు మొదలైన పండితుల్ని అడిగాను. ఎవ్వరూ చెప్పలేక పోయారు. ఒకరిద్దరు "పండితం పండితో దృష్ట్వా - శ్వానవత్ ఘుర్ఘురాయతే" అనే పాదం మాత్రం చెప్పగలిగారు. ఇది శ్లోకంలో ఉత్తరార్థం మాత్రమే! పూర్వార్ధం జ్ఞాపకంలేదన్నారు. "సుభాషిత రత్నభాండాగారమ్"లో రెండువేల శ్లోకాలున్నాయి. దానిలో అకారాది శ్లోకానుక్రమణిక కూడా ఉంది. కాని శ్లోకంలోని పూర్వర్ధం లోని మొదటి పాదం తెలిస్తేనే కాని శ్లోకాన్ని పట్టుకోలేం. కాని బెంగుళూరులో ఉన్న నా పండిత మిత్రులు డా॥ కొడిమడుగు నాగేశ్వరశాస్త్రిగారు శ్లోకంలోని పూర్వార్థాన్ని కూడా కొంత జ్ఞాపకం చేసికొని, మొత్తం శ్లోకాన్ని పూరించి నాకు పంపించారు. వారికి నా కృతజ్ఞతలు. (ఇదే మూలమైన శ్లోకమని గట్టిగా చెప్పలేను)

**శ్లో॥ సింహాశ్చ శునకాశ్చైవ - పరస్పర విరోధినః ।**
**పండితం పండితో దృష్ట్వా-శ్వానవద్ఘుర్ఘురాయతే॥**

**తా॥** సింహాలు కుక్కలు పరస్పరం విరోధిస్తాయి. అలాగే పండితులు కూడ ఒకరికొకరు ఎదురుపడితే తమ ఆధిక్యం చాటుకోవడానికి గురగురలాడుతారు (వాదించుకొంటారు)



**శ్లో॥ సుభాషిత రసాస్వాద - బద్ధ రోమాంచ కంచుకాః ।**
**వినాపి సంగమం స్త్రీణాం - సుధియః సుఖ మాసతే ॥**

(పంచతంత్రం, మిత్రసంప్రాప్తి, 170)

సూక్తిసుధను ఆస్వాదించేసరికి ఒడలు పులకించి, చొక్కా తొడిగినట్టయి పోగా, పండితులు, స్త్రీలతో సంగమం లేకుండానే, పరమసుఖాన్ని అనుభవిస్తున్నారు. (ఏలూరిపాటి అనంతరామయ్యగారి 'ఆకాశవాణి సూక్తిముక్తావళి',పుట-1)

## అనుబంధం-1

# వేములవాడ భీమకవి

## (క్రీ.శ. 12వ శతాబ్ది పూర్వార్ధం)

ఈ గ్రంథంలో మా అన్నయ్యగారు చమత్కారములు, హాస్యరసభరితములు, శృంగారాత్మకములు అయిన చాటుపద్యాలను శ్రీనాథునితో మొదలుపెట్టారు. శ్రీనాథుడు క్రీ.శ. 15వ శతాబ్దంవాడు. కాని శ్రీనాథునికన్నా పూర్వులైన వేములవాడ భీమకవి చాటువులు, వీరాగ్రేసురుడైన ఖడ్గతిక్కనపై కవులు చెప్పిన చాటువులు; మహాదాతయు, వినుకొండ పాలకుడును అయిన రాయన భాస్కరునిపై వివిధ కవులు చెప్పిన చాటువులు; శ్రీనాథుని మరికొన్ని చాటువులు, భృంగపంచకము, పెమ్మయ సింగధీమణి పద్యాలు, శ్రీనాథుని తరువాతివారైన తెనాలి రామకృష్ణుని చాటవులు, మరికొన్ని చమత్కార శ్లోకములు-పద్యములు మొ॥ ఎన్నో ఉన్నాయి. వాటిలో కొన్నింటిని అనుబంధాలుగా ఇస్తున్నాను.

వేములవాడ భీమకవి నన్నయకన్నా పూర్వుడని తెలుస్తోంది (క్రీ.శ. 10వ శతాబ్దం). శ్రీనాథుడు తన కన్నా పూర్వులైన కవుల కవిత్వాలలోని ప్రధాన లక్షణాలను (లేదా వారి కవిత్వతత్త్వాలను) తెలియజేస్తూ మొట్టమొదట వేములవాడ భీమకవిని చెప్పాడు. తరువాత కవిత్రయాన్ని పేర్కొన్నాడు. భీమకవి కవిత్వం "ఉద్దండము" (=భయంకరమైనది లేదా ప్రౌఢమైనది) అన్నాడు. కాని వేటూరి ప్రభాకరశాస్త్రిగారు - "ఈ కవీశ్వరుడు పండ్రెండవ శతాబ్ది పూర్వార్ధమున నున్నవాడగును" అన్నాడు. ఇతడు మైలమ భీమన (ఏఱువ భీమ) పై చెప్పిన పద్యాలు కూడా ఉన్నాయి. మా అన్నయ్యగారు తన చమత్కారపద్యాలలో వేములవాడ భీమకవి పద్యాలు ఆరు ఇచ్చారు. వీటినిబట్టి భీమకవి శాపానుగ్రహ సమర్థుడైన కవి అని తెలుస్తోంది.

"వేములవాడ" అనే ఈ కవి యింటిపేరు, కొన్ని పద్యాలలో యతిస్థానంలో "లేములవాడ" అని ఉన్నది. ఇతడు శైవుడు. సంస్కృతాంధ్రాలలో కాకుండా కన్నడంలో కూడా ఇతనికి పాండిత్యముంది. పాల్కురికి సోమనాథుని బసవపురాణాన్ని కన్నడంలోకి అనుదించాడు. తెలుగులో నృసింహపురాణము, కవిజనాశ్రయము రచించాడు. ఇతని స్వగ్రామం తూర్పుగోదావరి జిల్లాలోని దాక్షారామమని కొందరు, తెలంగాణములోని వేములవాడ అని కొందరు భావిస్తున్నారు.

ఈ వేములవాడ భీమకవి మైలమభీమ లేక ఏఱువభీమ అనే రాజుపై చెప్పిన 14 పద్యాలను వేరుగా ఇచ్చారు ప్రభాకరశాస్త్రిగారు. వాటిలో కొన్ని ఈ అనుబంధంలో చేర్చాను.

### 1.1 వేములవాడ భీమకవి చాటువులు:

సాహిణి మారుఁడను దండనాథుఁడు చాళుక్యచొక్క భూపతి నెదిరించెనట! భీమకవి యామారుని శపించి, చొక్క భూపతికే జయము చేకూర్చెనట.

**ఉ. చక్కఁదనంబు దీవియగు సాహిణి మారుఁడు మారుకైవడిన్**
**బొక్కి పడంగలండు, చలమున్ బలమున్ గల యాచళుక్యపుం**
**జొక్కనృపాలుఁ దుగ్రుఁడయి చూడ్కుల మంటలు రాలఁ జూచినన్,**
**మిక్కిలి రాజశేఖరునిమీఁదికి వచ్చిన రిత్తవోవునే? 1**

చాళుక్యచొక్క భూపాలుఁ డొకప్పుడు భీమకవిమాహాత్మ్యమును బ్రత్యక్ష ముగా నెఱుఁగఁగోరి "స్వామీ! మీరాడినది యాట, పాడినదిపాట యగునందురు. వినోదార్థము కొండొకటి ప్రదర్శింప వేఁడెదను" అనఁగా భీమకవి "నీయభీష్టమే" మని యడిగి తెలిసికొని, యచ్చటి మల్లెసాలనున్న స్తంభము చివుళ్ళతో జొంపములతో వృక్షమగున ట్లీక్రిందిపద్యము చెప్పెను.

**శా. "ఆనీతాభ్యుపదానశృంఖళకరాభ్యాలంబిత స్తంభమా!**
**నేనే వేములవాడ భీమకవినేనిఁ జిత్రకూటంబులో**
**భూనవ్యాపృతపల్లవోపలతికాపుష్పోపగుచ్ఛంబులన్**
**నానాపుష్పఫలప్రదాయివగుమా నా కల్పవృక్షాకృతిన్" 2**

అట్లే యా స్తంభము పుష్పఫలభరితమగు వృక్షమయ్యెనట! మరల దాని నీ క్రిందిపద్యముఁ జెప్పి తొంటిరీతికిఁ దెచ్చినట!

**ఉ. "శంభువరప్రసాది, కవిజాలవరేణ్యుఁడ నైన నావచో**
**గుంభన మాలకించి, యనుకూలత నొంది తనూనభావనన్,**
**గుంభినిఁ జొక్కనామ నృపకుంజరు పందిటి మల్లెసాలకున్**
**స్తంభమురీతి నీతనువు దాలిచి, యెప్పటియట్ల యుండుమా!" 3**

భీమకవి తెలుంగాధీశుని (కళింగాధీశుఁడని కొన్ని ప్రతులు,) కస్తూరి యాచించుచుఁచెప్పిన పద్యము...

**మ. ఘనుఁడన్, వేములవాడవంశజుఁడ, దాక్షారామభీమేశ నం**
**దనుఁడన్, దివ్యవిషామృతప్రకట నానాకావ్యదుర్యుండ, భీ**
**మన నా పేరు, వినంగఁజెప్పితిఁ దెలుం(గళిం) గాధీశ! కస్తూరికా**
**ఘనసారాది సుగంధవస్తువులు వేగం దెచ్చి, లాలింపురా! 4**

చోడగంగుపైఁ జెప్పిన పద్యములు...

**చ. అనిమొనఁ జోడగంగఁడు, మురారి-బకారి-నరుండు-మాద్రిజుం**
**డన, ఘనచక్ర-తోమర-శరాసన-కుంతము లల్కఁ బూని, వ్రే**
**యను-వడిదాయ-నేయఁ-బొడువన్, గళ-మేస్తక-రవత్స-మర్మముల్**
**తునియవె-నుగ్గుగావె-యెదఁదూఱవె-నాటవె-వైరివీరులన్. 5**

**అర్థములు:-** అనిమొనన్= యుద్ధభూమిలో; మురారి = శ్రీకృష్ణుడు; బకారి = భీముడు; నరుండు = అర్జునుడు; మాద్రిజుండు=నకులసహదేవులు (కవలలు); తోమరము = గద; శరాసనము = ధనుస్సు; కుంతము = బల్లెము; మస్తకము = తల; వత్సము = వక్షస్థలము (రొమ్ము); మర్మములు = ఆయువుపట్లు; వైరివీరులు = శత్రువీరులు.

**ఉ. భోజుఁడు మంకు, ధర్మజుఁడు బొంకు, శచీపతి రంకు, కల్పపూ**
**రాజు కళంకు, దైవతధరాజము డొంకు, వయోధి యింకు, నం**
**భోజరవుండు పంకు, వణిభూషణదేవుఁడు సంకు, పద్మినీ**
**రాజిహితుండు క్రుంకు, సరిరారు గుణంబుల నీకు ధారుణిన్. 6**

(మంకు= మొండివాడు, జడుడు; దైవత ధరాజము= దేవతల చెట్టు= కల్పవృక్షము; డొంకు=వంకర; అంభోజభవుండ=బ్రహ్మ; పంకు=మూర్ఖుడు – వరినొననట ఏమిప్రాయాలో తెలియనివాడు; ఫణిభూషణదేవుఁడు= పాములను అలంకారముగా కలిగిన శివుడు; సంకు= అనుమానము అనగా అతడు పురుషుడా? లేక స్త్రీయా? అని అనుమానము (అర్ధనారీశ్వరుడు కాబట్టి అనుమానము); పద్మినీ రాజిహితుడు= పద్మసమూహమునకు మిత్రుడైన సూర్యుడు; క్రుంకు = పడమటి సముద్రములో మునిగిపోతాడు. కాబట్టి వీరెవ్వరును ఈ భూమిలో మంచిగుణములలో నీకు సరిరారు?

కళింగగంగునాస్థానమునకు భీమకవి యరుగఁగా నాతఁడనాదరమున నిది సమయముకాదు పొమ్మనెనట. దానిపై బీమన కోపించి శాపమిట్లొసఁగెను...

**ఉ. వేములవాడ భీమకవి వేగమె చూచి, కళింగగంగు తా**
**సామము మాని, కోపమున, సందడి దీఱిన రమ్ము, పొ మ్మనెన్,**
**మోమును జూడ దోస మిఁక ముప్పది రెండు దినంబులావలన్,**
**జామున కర్థమం, దతనిసంపద శత్రులపాలు గావుతన్ 7**

శాపము ఫలించెను. రాజకళింగగంగు గర్భదరిద్రుఁడై పరుల కెఱుక పడకుండఁ బ్రచ్ఛన్నవేషము దాల్చి తిరిపమెత్తుచుఁ బొట్టగడపుకొనుచుండెను. భీమకవి యొకనాఁడు రాత్రి పల్లకి నెక్కి దివటీలతో నెక్కడకో పోవుచుండఁగా నాతఁడు త్రోవ నేఁగుచుఁ జీకటిలో నొక గోతఁ గూలి 'అయ్యో! కావలిదివటీయైన లే దయ్యెఁగదా' యనుకొని చింతిలెనట! అది భీమకవి విని, నీ వెవ్వఁడవని యడుగ, 'భీమకవిగారిచే జోగిచేయఁబడిన వాఁడ' ననెనట! భీమకవి 'రాజకళింగ గంగవా' యనఁగా, నాతఁడు కేల్మోడ్చి రక్షింపుఁ డనెనట! అంతట-

**ఉ. "వేయు గజంబులుండఁ, బదివేలు తురంగములుండ, నాజిలో**
**రాయల గెల్చి, సజ్జనగరంబునఁ బట్టము గట్టుకో వడిన్,**
**రాయకళింగగంగు కవిరాజ భయంకరమూర్తిఁజూడఁగాఁ**
**బోయెను, మీనమాసమునఁ బున్నమ వోయిన షష్ఠినాఁటికిన్." 8**

అని యాశీర్వచించి తిరిగి లబ్ధరాజ్యునిఁ జేసెనట!

**ఉ. రాము నమోఘబాణమును, రాజశిఖామణి కంటిమంటయున్,**
**భీము గదావిజృంభణ, ముపేంద్రుని వజ్రము, చక్రిచక్రమున్**
**దామర చూలివ్రాఁతయును, దారకవిద్విషు ఘోరశక్తియున్,**
**లేములవాడ భీమకవి లేశము తిట్టిన రిత్తవోవునే! 9**

### 1.2 మైలమ భీమన (ఏఱువ భీమ)

"ఈతని పేరఁగల్గు పద్యములు ("గరళపుముద్ద" ఏఱువభీమ-) వే(లే)ములవాడ భీమకవి కృతములుగా లక్షణగ్రంథములం దుదాహరింపఁబడినవి. ఈక్రింద

నుదాహరింపఁబడుపద్యము లెల్ల నొక్కవరుసలోనివే యగుటచే నొక్కరిచేతనే (భీమకవిచేత) రచియింపఁబడిన వనుకొనెదను. భీమకవిపద్యములు నల్లసిద్ధి, సాహిణి మారన, చాళుక్యచొక్కభూపతి, కళింగగంగు (చోడగంగఁడు) తెలుంగాధీశుఁడు, మైలమభీముఁడు ననువారికిఁ బ్రసక్తించినవి యగుటచేత - నాయందఱు సమకాలమువారు కాఁదగుదురు. భీమకవినిగూర్చి "ప్రబంధరత్నావళి" పీఠికలోఁ గొంత విస్తరించి చర్చించియున్నాను. విజయ నగరసంస్థానపుఁ బ్రభువులగు పూసపాటివారీ మైలమ భీమన సంబంధులఁట! ఈతఁడు ఏలేరు, కసిమి, వేంగి, కళింగలను జయించినట్టు పద్యములందున్నది. ఏఱువభీమ-మైలమభీమ పదము లొక్కని పేళ్ళే. ఏఱువవంశమున నల్లభీముఁడని ఎఱ్ఱభీముఁడని యిద్దఱు భీములున్నారు. అందొకఁడు మైలమభీముఁడు గాఁబోలును."

(-వేటూరి ప్రభాకరశాస్త్రిగారు)

**మైలమ భీమునిపై వేములవాడ భీమకవి చెప్పిన చాటువులు:**

**ఉ. ఏఱువభీమ! నీ పగతుఱెక్కని కొండలు, చంచలాత్ములై**
**దూఱనియట్టి ఘోరవనదుర్గములున్, వనితావియోగులై**
**పాఱని త్రోవలుం, దినని పండ్లును, నాఁకటఁగూర లుప్పగా**
**నేఱని కఱ్ఱలుంగలవె యీ లవణాంబుధివేష్టితావనిన్? 1**

**చ. అహితులఁ దాఁకి పోరునెడ, నంబుధి కట్టిననాఁటి రాము, గో**
**గ్రహణమునాఁటి పార్థు, గదఁ గౌరవు నేసిననాఁటి భీము, నా**
**గ్రహ మెసఁగం బురత్రయముఁ గాల్చిననాఁటి లలాటలోచనున్,**
**మహి నుపమింపఁగాఁ దగునె మైలమ భీముని భీమవిక్రమున్? 2**

**ఉ. పన్ని తురంగమంబునకుఁ బక్కెర వెట్టినవార్త హేరిచే**
**విన్న, భయంబునం గలఁగి, వీసరనాడును-చక్రగోట్టమున్**
**-మన్నియపట్టణంబులును-మక్కెన-వేంగి-కళింగ లాదిగా**
**నిన్నియు నొక్క పెట్టెగసె, నేఱువభీమ నృపాలుధాటికిన్. 3**

(పక్కెర = గుఱ్ఱముపై వేయు అంగీ; హేరి=గూఢచారి)

క. ఆరివరు లేఱువభీమని
పొరువున మనలేరు, చిచ్చుపొంతను వెన్నె,
తెరువునఁ బెసరై, జూదరి
సిరియై, రేన్చెట్టుక్రింద జిల్లెడుచెట్టై ! 4

ఉ. ఆలములో నరాతులకు హమ్మని మార్కొనవచ్చునే మహా
కాళికి, శూలికిన్, బ్రళయకాలపుగాలికి, రాఘవేంద్రుబా
ణాళికిఁ, బక్షినాయకునభాళికి, మత్తగజేంద్ర వైరిదం
ష్ట్రాళికి, దావపావక శిఖాళికి, మైలమ భీమువాలికిన్. 5

(వాలు = ఖడ్గము)

మ. తెరలంబాఱి నభంబు దాఁకినఁ, బయోధిం జొచ్చినన్, శైలగ
హ్వరముల్ దూఱినఁ, జిక్కభీముఁడు నృపవ్రాతంబుఁ బోనిచ్చునే?
గరుడండై చని పట్టు మింటితుద, నుగ్రగ్రాహమై చొచ్చి సా
గరమధ్యంబున మ్రింగుఁ, బట్టుకొను సింగంబై గుహాంతంబునన్. 6

(చిక్క=బలమైన; చిక్క భీముఁడు = బలమైన భీముడు)

చ. విదిత గురుప్రతాపగుణవిశ్రుత! మైలమభీమభూప! నీ
పదిలపు ఖడ్గధారఁ దెగి పాఱినవీరుఁడు గోపురంబుపై
విదితసువర్ణ రత్నమయవేదికమీఁదను నిల్చి, కాంచు నౌఁ,
బదిపదు లగ్నిహోత్రులను, బన్నిరుసూర్యుల, నూఱుచంద్రులన్! 7

(ఔ = ఔరా! ప్రశంసను తెలుపుట)

చ. అసమునఁ గాశికానగరమం దసువుల్ త్యజియించినంతనే
యసదృశమైన కన్నుగల దచ్చట, మైలమభీమభూప! నీ
యసిఁ దెగిపడ్డవైరులకు నంబకముల్ పదినూఱు లయ్యె, నీ
యసికిని వారణాసికిని సంతర మెంత దలంచి చూచినన్!. 8

క. వసుమతిలోఁ జిరకాలము
మశకంబై మనుటకంటె, మదకరికుంభ
గ్రసనంబగు సింహంబై
మసలుట యొక గడియచాలు మైలమభీమా! 9

ఉ. యాచకఖేచరుండు సుగుణాంబుధి మైలమభీమఁ దీల్గినన్,
జూచి వరించె రంభ, యెదఁజొచ్చెఁ దిలోత్తమ, దారి నిద్దఱన్
ద్రోచె ఘృతాచి, ముగ్గుఱకు దొద్దడికయ్యము పుట్టె, నంతలో
నాఁచుకుపోయె ముక్తిసతి, నవ్విరి యద్దశఁ జూచి నిర్జరుల్,
నోఁచినవారి సొమ్ములవి నోమనివారికి వచ్చునే ధరన్! 10

(వేటూరి ప్రభాకరశాస్త్రిగారి "చాటుపద్యమణిమంజరి" ప్రథమ భాగము నుండి)



శ్లో॥ బ్రహ్మాయేన కులాల వన్నియమితో బ్రహ్మాణ్డ భాణ్డోదరే
విష్ణుర్యేన దశావతారగహనే క్షిప్తో మహాసఙ్కటే!
రుద్రోయేన కపాలపాణిపుటకే భిక్షాటనం సేవతే
సూర్యో భ్రామ్యతి నిత్యమేవ గగనే తస్మై నమః కర్మణే ॥

–భర్తృహరి సుభాషితము

చ॥ నలువ కులాలుభంగి నలినప్రభవాండమునందు దేనిచే
నిలిచె, దశావతార వన నిష్ఠితుఁడయ్యె మురారి దేని చేఁ,
బెలుచఁ గపాల హస్తుఁడయి భిక్షుకుఁడయ్యెఁ బురారి దేనిచే,
నల రవి దేనిచేఁ దిరుగు, నా ఘనకర్మము వంద్యమే కదా!

–ఏనుగు లక్ష్మణకవి అనువాదము

## అనుబంధం–2

# వీరాగ్రేసరుడు ఖడ్గతిక్కనగురించిన చాటువులు
## (క్రీ.శ.13వ శతాబ్ది)

"ఖడ్గతిక్కన" లేక "రణతిక్కన" లేక "కార్యతిక్కన" మహావీరుడు. నెల్లూరును పాలించిన నల్లసిద్ధిరాజు (క్రీ.శ. 1270–1283) గారి ఆస్థానంలో మహామంత్రి, మరియు దండనాథుడు. ఈ ఖడ్గతిక్కన, మన కవిత్రయ భారతంలో 15 పర్వాలు రచించిన తిక్కన సోమయాజిగారికి పెదతండ్రి కుమారుడు. కవితిక్కన, ఖడ్గతిక్కనల పితామహుడు మంత్రి భాస్కరుడు. ఈయనకు నలుగురు కొడుకులు: కేతన–మల్లన–సిద్ధన–కొమ్మన. వీరు ఆపస్తంబ సూత్రులు, గౌతమ గోత్రులు. ఆరువేల నియోగి బ్రాహ్మణులు. ఇంటిపేరు "కొట్టరువు" వారు. (ఈ "కొట్టరువు" వారే కాలక్రమంలో "పాటూరు" వారుగా మారారు. ఈ వంశంవారు నేటికిని నెల్లూరులో ఉన్నారు.) ఖడ్గతిక్కన తండ్రి సిద్ధనామాత్యుడును, కవితిక్కన తండ్రి కొమ్మనామాత్యుడును అన్నదమ్ములు. ఖడ్గతిక్కనతల్లి: ప్రోలమ్మ; భార్య: జానమ్మ. ప్రోలమ్మ– సిద్ధనామాత్య దంపతులకు ఏడుగురు కొడుకులు. వీరిలో పెద్దవాడు ఖడ్గతిక్కన. తరువాతివాడు సిద్ధయ భాస్కరుడు (బాచడు) కూడ మహావీరుడే! ఇతడు చోడ తిక్కరాజుకాలంలో నెల్లూరిపై దండెత్తి వచ్చిన సేనవణదేశాధీశ్వరుడైన సింఘణదేవుని సైన్యాన్ని ఓడించి పారద్రోలినట్లుగా ఒక చాటువువలన తెలుస్తోంది. సింఘనదేవుని పాలనాకాలం: క్రీ.శ. 1210–1247. ఇతని నెల్లూరు దండయాత్ర క్రీ.శ. 1215 ప్రాంతంలో జరిగినట్లుగా ఒక శాసనంవల్ల తెలుస్తోంది. కాబట్టి ఖడ్గతిక్కన కూడా ఆ ప్రాంతం వాడే అనడానికి సందేహం లేదని మల్లంపల్లివారు చెప్పారు. చరిత్రకారులు సిద్దన – కొమ్మన – ఖడ్గతిక్కన – కవి తిక్కనల కాలంలో నెల్లూరును పాలించిన తెలుగు చోడరాజుల కాలాలను ఈ క్రింది విధంగా ఇచ్చారు:–

చోడ తిక్క లేక మొదటి తిక్క (క్రీ.శ. 1209–1248) ("ముక్కంటి" బిరుదు)



మనుమసిద్ధి లేక రెండవ మనుమసిద్ధి (క్రీ.శ. 1248–1267)



నల్లసిద్ధి లేక మూడవ నల్లసిద్ధి (క్రీ.శ. 1270–1283)

(కొందరు చరిత్రకారులు "మనుమసిద్ధి"కే "నల్లసిద్ధి" అనే పేరుకూడా ఉన్నదంటున్నారు. ఏదీ స్పష్టంగా తెలియడంలేదు. కాటమరాజు కథలలో చాలా చోట్ల "నల్లసిద్ధిరాజు" అనే ఉంది. ఒకటి రెండు కథలలో మాత్రం "మనుమసిద్ధి" అని ఉంది.) సిద్ధనామాత్యుడు చోడ తిక్కరాజు దగ్గర మంత్రి - దండనాథుడు. కొమ్మనామాత్యుడు గుంటూరులో దండనాథుడుగా ఉన్నాడు. కవి తిక్కన మనుమసిద్ధికి మంత్రి. ఖడ్గతిక్కన నల్లసిద్ధికి మంత్రి - దండనాథుడు. ఖడ్గతిక్కన తమ్ముడు సిద్ధయభాస్కరునిపై (బాచనిపై) గల చాటుపద్యం:-

**చ॥ ఉరవడి నుగ్రసేవణ పయోనిధి బాడబవహ్ని చాడ్పునన్**
**దరికొని, కుంభజన్ముక్రియఁద్రాగి, రఘుక్షితినాథుమాడ్కి న**
**చ్చెరువుగ నింకఁజేసెనని చెప్పె జనప్రకరంబు విక్రమా**
**భరణుని, సిద్ధనార్యసుతు, బాచని, నన్నన గంధవారణున్. 1**

తాత్పర్యం:- సిద్ధనామాత్యుని కుమారుడును, "విక్రమాభరణ" - "నన్నన గంధవారణ" బిరుదులు కలవాడును అయిన బాచడు- భయంకరుడైన "సేవణుడు" అనే శత్రురాజుయొక్క మహాసైన్యమనే సముద్రాన్ని అతివేగంగా బడబాగ్నివలె కాల్చివేసి, అగస్త్యునివలె త్రాగివేసి, రఘురామునివలె ఇంకింపజేశాడని (నెల్లూరులోని) జనసమూహాలు చెప్పుకుంటున్నారు. ("నన్న" - "నన్ని"-"నన్నె" అనే రూపాలలో ఉన్న శబ్దం ద్రావిడ శబ్దం. దీనికి "స్నేహము" - "మంచితనము" అని అర్థాలు. ఇది తెలుగులోను-ముఖ్యంగా శాసనాలలో-కన్నడంలోను ప్రసిద్ధమైన శబ్దం. ఉదా: "నన్నయ" - "నన్నిచోడుడు" - "నన్నెచోడుడు". "నన్నియొళ్ ఇనతనయం" = "స్నేహంలో కర్ణుడు" గొప్పవాడు - అని పంపడు తన భారతంలో ప్రయోగించాడు.)

ఇప్పుడు పండిత ప్రకాండులు, ఉత్తమ పరిశోధకులు, గ్రంథపరిష్కర్త, అనువాదకులు అయిన వేటూరి ప్రభాకరశాస్త్రిగారు తమ చాటుపద్యమణిమంజరి-ద్వితీయ భాగములో ఖడ్గతిక్కనగురించి ఇచ్చిన చాటుపద్యాలను దిగువ ఇస్తున్నాను:-

కవిబ్రహ్మ తిక్కన శిష్యుడు కేతన "అభినవదండి" బిరుదాంకితుడు. ఇతడు దశకుమారచరిత్ర అనే కావ్యాన్ని వ్రాసి తన గురువైన ఉభయకవిమిత్రుడు తిక్కనకు అంకితం చేశాడు. ఆ కావ్యావతారికలో ఇతడు తిక్కన కుటుంబ వివరాలు చాలా ఇచ్చాడు. ఖడ్గతిక్కన వ్యక్తిత్వాన్ని, శౌర్యాన్ని ప్రశంసిస్తూ ఒక సీసపద్యం వ్రాశాడు:-

సీ॥ వేఁడిన నర్థార్థి వృథపుచ్చనేరని
దానంబు తనకు బాంధవుఁడు గాఁగ,
నెదిరిన జమునైన బ్రదికి పోవగనీని
శౌర్యంబు తన కిష్టసఖుఁడుగాఁగ,
శరణుజొచ్చిన శత్రువరునైన రక్షించు
కరుణయె తనకు సంగాతి గాఁగఁ,
బలికినఁ బాండవ ప్రభునైన మెచ్చని
సత్యంబు తనకు రక్షకుఁడుగాఁగ,
తే॥ జగతి నుతికెక్కె రాయవేశ్యాభుజంగ,
రాజరత్నాకరస్ఫూర్తి, రాజమూర్తి,
గంధవారణ బిరుద విఖ్యాతకీర్తి,
దినప తేజుండు, సిద్ధయ తిక్కశౌరి! 2

పై పద్యంలో కవి ఖడ్గతిక్కన దానగుణాన్ని, శౌర్యాన్ని, కరుణాగుణాన్ని సత్యవ్రతనిష్ఠను ప్రశంసిస్తున్నాడు. అడిగిన వారికి లేదనకుండా ఇచ్చే దానగుణమే ఖడ్గతిక్కన బంధువు. యముడు తనను ఎదిరించినా సరే బ్రతికిపోనివ్వని శౌర్యమే అతనికి ఇష్టసఖుడు. తనను శరణువేడిన శత్రువునైనా సరే రక్షించే కరుణాగుణమే అతనికి సంగాతకాడు (స్నేహితుడు). ధర్మరాజును కూడా మెచ్చని సత్యవ్రత నిష్ఠయే అతనికి రక్షకుడు. ఈ విధంగా లోకంలో ప్రసిద్ధికెక్కినవాడును, "రాయవేశ్యాభుజంగ" – "రాజరత్నాకర" – "రాజమూర్తి" – "గంధవారణ" – అను బిరుదులతో కీర్తిగడించినవాడును, సూర్యునివంటి తేజస్సుకలవాడును సిద్ధనామాత్యుని పుత్రుడును అయిన ఖడ్గతిక్కన! (దినపః=సూర్యుడు)

అలాగే ఇంకొక సీస పద్యంలో తిక్కనసేనాని గృహం ఎంత సందడిగా ఉండేదో అతి మనోహరంగా వర్ణించాడు:-

సీ॥ వీరనికాయంబు వేదనినాదంబుఁ
బాయక యే ప్రొద్దు మ్రోయుచుండు,
భూసుర ప్రకరంబు సేసలు చల్లంగఁ
బాయకెన్నియొ కుటుంబములు బ్రదుకు,

**బ్రాహ్మణావళికి ధారలు పోసిన జలంబు**
**సతతంబు ముంగిట జాలువాఱు,**
**రిపుల కొసఁగిన పత్రికల పుత్రికలను**
**బాయక కరణముల్ వ్రాయుచుంద్రు,**
**తే॥ మానఘనుఁడైన తిక్కనమంత్రి యింట,**
**మదనసముఁడైన తిక్కనమంత్రి యింట,**
**మహితయశుఁడైన తిక్కనమంత్రి యింట,**
**మంత్రిమణియైన తిక్కనమంత్రి యింట!** **3**

తా॥ అభిమానధనుడును, మన్మథుని వంటి అందగాడును, గొప్ప కీర్తిగలవాడును, మంత్రులలో శ్రేష్ఠుడును అయిన ఖడ్గతిక్కన గృహం ఈ క్రింది విధంగా మిక్కిలి సందడిగా ఉంటుంది:–

వీరుల సమూహముల సింహగర్జనము, వేదపఠన నినాదము విడవకుండా ప్రతినిత్యము ప్రతిధ్వనిస్తూ ఉంటుంది. ఎన్నియో బ్రాహ్మణకుటుంబాలకు అతడు సహాయంచేస్తూ ఉంటే, వారు అతనిని ఆశీర్వదిస్తూ అతనిపై సేసలు చల్లుతూ ఉంటారు. అతని యింటి ముందు బ్రాహ్మణ సమూహాలకు అతడు ధారపోసిన దానజలం ప్రవహిస్తూ ఉంటుంది. అతని యింటిలో కరణాలు ఎల్లప్పుడూ శత్రువులకు పంపిన పత్రికలకు (లేఖలకు) పుత్రికలు (కాపీలు) వ్రాస్తూ ఉంటారు.

కాటమరాజు అనే యాదవరాజు నల్లసిద్ధిరాజుకు సమకాలికుడు. ఇతడు కనిగిరిసీమలో పంచలింగాలకొండ దగ్గరనున్న ఎఱ్ఱగడ్డపాడుకు పాలకుడు. ఇతనికి లక్షలాది గోగణం ఉండేది. ఇతడు మొదట ఉత్తరదిశలోనున్న శ్రీశైలం అడవులలో తన అపారగోగణాన్ని మేపుతూ ఉండేవాడు. అక్కడ వానలు సరిగా కురవక పచ్చికకు కరవు ఏర్పడింది. అందువల్ల దక్షిణాదినున్న నెల్లూరుకు వచ్చి, నల్లసిద్ధిరాజుతో పుల్లరి ఒప్పందం చేసికొని, నెల్లూరు సీమలోని పచ్చికబీళ్ళలో తన ఆలమందల్ని మేపుకుంటున్నాడు. అక్కడ తాను ఆవుల్ని మేపుకుంటున్నంత కాలమూ తన మందలలో పుట్టిన కోడెదూడల్ని నల్లసిద్ధిరాజుకు ఇవ్వాలి. – ఇదీ పుల్లరి ఒప్పందము – రెండేళ్ళ ఒప్పందం. $1\frac{1}{2}$ సంవత్సరం గడిచింది. నల్లసిద్ధిరాజు రెండవ భార్య కుందమాదేవి, యాదవులు తన పెంపుడు చిలుకను చంపారనే కోపంతో, కొందరు బోయవాళ్ళను పంపించి, కాటమరాజు ఆలమందలను పొడిపించింది. కాటమరాజు ఆగ్రహించి,

ఆ బోయలను చంపి, తాను నష్టపోయిన గోవులకును, తాను ఈయవలసిన పుల్లరికిని చెల్లు అని చెప్పి ఎఱ్ఱగడ్డపాటికి వెళ్ళిపోయాడు. తన భార్య యాదవుల ఆలమందల్ని పొడిపించిన విషయం నల్లసిద్ధికి తెలియదు. కాటమరాజు పుల్లరి ఎగ్గొట్టాడనే కోపంతో ఒక భట్టును రాయబారిగా పంపించాడు. కాటమరాజు ఆ రాయబారాన్ని తిరస్కరించాడు. ఫలితంగా ఇద్దరికీ యుద్ధం జరిగింది.

కాటమరాజు నల్లసిద్ధి సైన్యాలను ఎదిరించడానికి నెల్లూరునుండి ఎఱ్ఱగడ్డపాటివరకు కొన్ని ఠాణాలను ఏర్పరిచాడు. అందులో మొట్టమొదటి ఠాణా నెల్లూరుకు సమీపంలో "చాగలకొండ" దగ్గర ఉంది. దానికి కాటమరాజు పినతల్లి కొడుకైన చల్ల పిన్నమనీడు నాయకుడు. ఖడ్గతిక్కన కొంత సైన్యాన్ని సమకూర్చుకొని ఈ మొదటి ఠాణా మీదికి దండెత్తి వచ్చాడు. తీవ్రంగా యుద్ధంచేశాడు. కాని అతని సైన్యమంతా నశించిపోయింది. ఒంటరిగా మిగిలాడు. అప్పుడు చల్ల పిన్నమనీడు వచ్చి:

**ద్విపద: "పోరు నిల్పగ దోయి! భూసురోత్తముడ!**
**సరికాదు మాతోను సమరంబు సేయ**
**అగ్రజన్ములు మీరు, యాదవుల మేము,**
**ఉగ్రంబు మా మీద నుంచంగరాదు!"** 4

అని చెప్పి, "నీవు తిరిగి నెల్లూరుకు పోయి మీ రాజును పంపించు!" అని సలహా ఇచ్చాడు. దానిని పాటించి తిక్కన వెనుదిరిగి వచ్చాడు. యుద్ధభూమినుండి వెనుదిరిగి రావడం భారతీయ సంప్రదాయానికి విరుద్ధం. అందువల్ల, నెల్లూరి పురజనులు, అతని తల్లిదండ్రులు, భార్య ఖడ్గతిక్కనను ఎంతో అవమానించారు. ఈ సందర్భంగా కొన్ని మంచి చాటుపద్యాలున్నాయి:-

తండ్రి సిద్ధనామాత్యుడు:-

**ద్విపద: "పులికడుపున గొఱ్ఱెపుట్టు చందమున**
**కలిగితి నాయింతి గర్భంబునందు**
**మగతనంబున పుట్టి మగవాడననుచు**
**పగతుకు వెన్నిచ్చు ప్రాణంబదేల?**

అరులకు నోడి యీ యవని మనుకన్న
పరగ రణభూమిలో సమయుట మేలు!" 5

(జానపదకవి "గంగుల పినయెల్లయ" రచించిన "కాటమరాజు" వీరగాథనుండి)

నెల్లూరి ప్రజల అవహేళన:–

సీ॥ రణరంగమున మోహరంబులఁ బొడగని
ప్రాణంబు వాసిన పందగజమ!
విజయాధిపుని దాడి వెనుకొని తగులంగ
దెసదప్పి పాఱిన దిగ్గజంబ!
చేరఁజాలక తిర్గి చేమడ మళ్లించి
మంచాన కందని మదగజంబ!
బెనుతుల్లి చెఱువులోఁ బిరుదు లన్నియు రొంపిఁ
గ్రంగంగఁ ద్రొక్కిన కుంజరంబ!
ఆ.వె. నేఁడు మొదలుగాఁగ నెల్లూరివీథిలోఁ
బొగడుతనము సేయు మగలతలలు
పూరిగఱచి తిక్క! భూతమై సోఁకుము
యూరివారిసోఁకు గారుసేసి. 6

* పాఠాంతరము

ఆరువేల నియోగి బ్రాహ్మణుల అవహేళన!

* సీ॥విజయాధిపునిదాడి వెనువెంటఁ దగిలినఁ
బ్రాణముల్ దాచిన పందగజమ!
పెనుజల్లెపల్లెలో బిరుదు లన్నియు 'వైచి
పరుగెత్తి వచ్చిన పారుఁబోత!
దురములోఁ బాపక దొరలెల్ల హసియింప
మంచాన కొరిగిన కొంచెకాడ!

**చతురంగబలముతో సమరంబు సేయక**
**మానంబు విడచిన మందబుద్ధి!**
**గీ. యనుచు నార్వేలవారు ని న్నపహసింప**
**ధరణి నెల్లూరిలో నెట్లు తిరుగ గలవు?**
**వైరులను గెల్చి సత్కీర్తి వరలు మయ్య!**
**మంత్రికుల హేళి! తిక్కనామాత్యమౌళి!** 7

**భార్య జానమ్మ చేసిన అవమానం:-**

భార్య జానమ్మ భర్తకు వేణ్ణీళ్ళు కాచి, చన్నీళ్ళు కలిపి, పెరట్లో ఒక మూలగా పెట్టి (అక్కడ ఒక పెద్ద పసుపుముద్ద కూడా పెట్టి), దానికి ఒక నులకమంచం అడ్డుపెట్టి, "కూర్చొని స్నానం చేయండి!" అన్నది. ఇదేమిటి? అని భర్త అడిగితే ఇలా అన్నదట:-

**క॥ "పగఱకు వెన్నిచ్చినచో**
**నగరే నిను మగతనంపు నాయకులెందున్?**
**ముగురాడువారమైతిమి**
**వగపేటికి జలకమాడవచ్చిన చోటన్!"** 8

**తల్లి ప్రోలమ్మ చేసిన అవమానం:-**

తిక్కన స్నానంచేసి సంధ్యవార్చుకొని, భోజనశాలకు వెళ్ళాడు. అక్కడ తల్లి అతనికి అన్నము పప్పుకూరలు వడ్డించి, అవి తినిన తర్వాత పాయసం పోసింది. ఆ పాయసంలో పాలు విరిగిపోయి ఉన్నాయి. "ఇదేమిటి?" అని ప్రశ్నిస్తే, తల్లి ఇలా అన్నదట:-

**క॥ "అసదృశముగ నరివీరుల**
**మసిపుచ్చున్ విఱిగివచ్చు మగపందక్రియన్**
**గసవున్ మేయఁగఁ బోయిన**
**పసులున్ విఱిగినవి తిక్క! పాలున్ విఱిగెన్!"** 9

ఊరి ప్రజలు, బంధువులు, తల్లిదండ్రులు, భార్య చేసిన అవమాలన్నింటినీ ఎంతో ఓర్పుతో, ఎంతో ధైర్యంతో సహించిన ఖడ్గతిక్కన భోజనం చేసి, కర్పూర

తాంబూలం వేసికొని, సన్నజాజులు పరచిన శయ్యమీద పరుండి నిద్రపోయాడు. ఆ మహావీరుడు కలలో కూడా కత్తులతో యుద్ధంచేస్తూ, శత్రువులను కండ మొండెములుగా ఖండిస్తున్నాడట!

**కలలోన తిక్కన కత్తులతోను**
**కండమొండెములుగా దునుమాడి**
**తెల్లతెల్లనారంగ తిక్కన లేచి**
**సంధ్యాకృత్యముల్ సయ్యనదీర్చి**
**గంధంబు కస్తూరి కడువేడ్కనలది**
**నవరత్న భూషణంబులనెల్ల దొడిగి**
**వేవేగ భోంచేసి విడెమందుకొనియు,**
**ధాత్రినెన్నగ బుద్ధి తలచె వేగంబె**
**తన తండ్రి సిద్ధన తగ బిలిపించి**
**అతుల ప్రతాపుండు అప్పుడిట్లనియె:**

"ఓ తండ్రీ! నేను యాదవుల మీదికి యుద్ధానికి వెడుతున్నాను. వారిని చంపి వచ్చానంటే సరేసరి. లేక వారితో పోరాడి నేను చనిపోతే, నీవు ఆ యుద్ధభూమికి రా! పగవారు నా కండలు నరికివేసినా సరే, నా శరీరంలో ఎముకలు ఉంటే చాలు వారిని చంపివేస్తా! నేను రణరంగంలో వీరవిహారం చేస్తాను కాబట్టి, నా బొంది ఒక చోట పడి వుండదు. బొంది కనపడకపోయినా అక్కడ అంతటా తెగిపడిన నా కండలు ఉంటాయి. అయితే కదనరంగంలో ఎందరో వీరుల కండలు ఉంటాయి. ఆ కండలలో నా కండల్ని ఎలా గుర్తిస్తావంటే, ఏ కండలైతే నా శరీరంనుండి విడి నేలమీద పడిపోయినా సరే, పౌరుషంతో ఎగిరెగిరి పడుతూ ఉంటాయో, ఆ కండలు తిక్కన కండలని తెలుసుకో!" అన్నాడు ఖడ్గతిక్కన.

**"ఓ తండ్రి! వినవయ్య! ఒక విన్నపంబు**
**నాయొక్క కీర్తి ఆనందంబునొంద**
**యదుబలంబుల మీది కరుగుచున్నాడ**
**వారిని దునుమాడి వస్తినా మేలు**
**పోరాడి వారిచే పొలిసితినైన**

**నీవటకావార్త నిజమని తెలిసి**
**వేవేగ రణభూమి వెదకంగ రమ్ము**
**ఆముకొని పగవారి హతము సేయంగ**
**కవగొని పగరు నా కండలు నరుక**
**పరగ నెమ్ములెయున్న పగతుర ద్రుంతు**
**ఒకచోట నుండబో దొనరగా బొంది**
**కదనంబులో బొంది కానకుంటేను**
**అచ్చట నిచ్చట నా యుద్ధభూమి**
**పరగ కండలు ఎగిరి పడుచుండెనైన**
**తిక్కన కండలని తెలియంగు జూడు!"**

తరువాత తిక్కన తన తల్లిని భార్యను పిలుస్తాడు. వారితో: "పూర్వం ఒక భట్రాజువచ్చి, నన్ను గురించి ఒక సీస పద్యం చెపుతూ నాలుగు పాదాలే చెప్పాడు. ఎత్తుగీతి చెప్పలేదు. నేనతనికి ఎనిమిదివేల వరహాలిచ్చాను. అతడు మళ్ళీవచ్చి ఎత్తుగీతి చెపుతాడు. అతనికి మరో నాలుగువేల వరహాలు ఇవ్వండి!" అని చెప్పాడు.

(నేను ఒకసారి బెజవాడ (విజయవాడ)లో. రామమోహనరాయ్ గ్రంథాలయంలో తెలుగు వీరగాథలను గురించి ప్రసంగిస్తూ ఈ ఘట్టాన్ని చెప్పాను. సభానంతరం ఒక వృద్ధుడు ఉత్కంఠతో నా దగ్గరకు వచ్చి: ''నాయనా! నీ ఉపన్యాసం వింటూవుంటే నా రక్తం కుతకుత ఉడికిపోయింది!" అన్నారు. నేనులేచి ఆయనకు భక్తితో నమస్కరించి: "అయ్యా! మీరెవరు? మీ పేరేమిటి?" అని ప్రశ్నించాను. ''నా పేరు విశ్వనాథ రామమూర్తి; విశ్వనాథ సత్యనారాయణగారి చిన్నతమ్ముణ్ణి!" అన్నారు. నేను మిక్కిలి ఆశ్చర్యంతో బ్రహ్మానందభరితుడనైపోయాను. నా ఉపన్యాసం సార్థకమయిందని సంతోషించాను.)

ఖడ్గతిక్కన గొప్ప ధైర్యశాలి; ఎంతో గాంభీర్యం కలవాడు; సిరిసంపదలు పుష్కలంగా కలవాడు; మన్మథునివంటి సుందరుడు. ఈ నాలుగు లక్షణాలను దృష్టిలో పెట్టుకొని ఒకప్పుడు ఒక భట్రాజు తిక్కన కొలువులోనికి వచ్చి ఒక సీసపద్యంలో నాలుగు పాదాలు చెప్పాడు:-

ఖడ్గతిక్కనా! ధైర్యమంతా నీలోనే ఉంది; పర్వతంలో లేదు. అందుకనే మందర పర్వతం సముద్రమథన కాలంలో చలించింది! గాంభీర్యమంతా నీలోనే ఉంది;

సముద్రంలో లేదు. అందువల్లనే అది రామునిచేత కట్టుపడింది! (రాముడు లంకను చేరడానికి వారధికట్టాడు కదా!) లక్ష్మీదేవి నీ దగ్గరే ఉంది; విష్ణుమూర్తి దగ్గరలేదు. అందువల్లనే ఆయన బలిచక్రవర్తి దగ్గరకు వెళ్ళి దానమడుక్కున్నాడు! సౌందర్యమంతా నీలోనే ఉంది; మన్మథునిలో లేదు. అందువల్లనే అతడు శివని మూడవ కంటి మంటలో దగ్ధమయ్యాడు! అని ఈ విధమైన అర్థంతో సీసపద్యంలో నాలుగు పాదాలు మాత్రమే చెప్పి, ఆ కవి వెళ్ళిపోయాడు. ఎత్తుగీతి (ఆటవెలది కాని తేటగీతి కాని) చెప్పలేదు.

**సీ॥ ధైర్యంబు నీమేనఁ దగిలి యుండుటఁ జేసి**
**చలియించి మందరాచలము దిరిగె;**
**గాంభీర్యమెల్ల నీకడనె యుండుటఁ జేసి**
**కాకుత్స్థుచే వార్ధి గట్టువడియె;**
**అల లక్ష్మి నీయందు నలరియుండుటఁ జేసి**
**హరిపోయి బలి దానమడుగుకొనియె;**
**ఆకారమెల్ల నీయందు నుండుటఁ జేసి**
**మరుఁడు ధూర్జటికంటి మంటఁ గ్రాఁగె;**

– ఈ విధంగా తల్లికి భార్యకు చెప్పి, తండ్రికి దండంబెట్టి, సరస్వతీ దేవిని పూజించి, అశ్వాన్ని అధిరోహించి, కొంతదళాన్ని సమకూర్చుకొని, ఉరవడితో అతని గుఱ్ఱం ఉరుకుతూ ఉంటే రణరంగానికి వెళ్ళాడు.

రెండవసారి వచ్చిన ఖడ్గతిక్కనను చూచి చల్లపిన్నమనీడు నవ్వుతూ: "ఈ బ్రాహ్మణునికి మంత్రివర్గము, బంధుజనులు రోషం పుట్టించి మళ్ళీ పంపించారు. ఇతడు యుద్ధంలో చనిపోతే మనకు బ్రహ్మహత్యాపాపం చుట్టుకుంటుంది. ఉపేక్షిస్తే ఇతడు మనల్ని చంపివేస్తాడు. "చంపకుండగ రాదు, చావగారాదు/ ఇందుకు గతియేమి యెరిగింపుము" అని తన మంత్రియైన శివబ్రాహ్మణుడు "బ్రహ్మరుద్రయ్య"ను అడిగాడు. అతడు "బ్రాహ్మడాతడు – శివబ్రాహ్మణనేను. నీ బదులుగా నేను యుద్ధం చేస్తాను. చింతించవద్దు!" అని ధైర్యం చెప్పి, యాదవసైన్యానికి నాయకత్వం వహించి ఎద్దును ఎక్కి ఖడ్గతిక్కన సైన్యాన్ని ఎదుర్కొన్నాడు.

**వేవేగ రుద్రుండు వృషభంబు నెక్కె**
**సరితిక్కడంత నశ్వంబు దూకించె**

మరి బ్రహ్మరుద్రుండు మార్కొని నిలిచె
తీవ్రించి తిక్కన త్రిప్పె ఖడ్గంబు
కరవాలు ఝళిపించె ఘనుడు రుద్రయ్య
తిక్కన అశ్వంబు తిమురుగా నడచి
త్రొక్కెను జెట్లను త్రొక్కింపుకొనుచు (జెట్లు=శూరులు)
తరిమి తిక్కన రుద్రుదళముల నరికె
సరగ తన తేజిని చబుకున కొట్టి
మొత్తమై మూకల మొత్తి నరుకంగ
బసవేశ్వరుని తాను బ్రహ్మరుద్రయ్య
తురగంబునకు మించి దూకించె నపుడు
బారుల తెగటార్చి బాపురే! యనుచు
బంటుబంటు కదిసి బహుయుద్ధమాయె
వాటంబుగా జూచి వడినరుకువారు
ఉత్తమాశ్వంబును నురికింప తిక్క(డు)
ఎద్దును దూకించె నెలమి రుద్రయ్య
పృథివిపై నెగసెను పెంధూళి యపుడు
కదనాన నిర్వురు కానరాకుండ
ధరణి ధూమము గప్పె తరచుగా నపుడు
ఎక్కడి యాదవు లెడలేక కదసి
ఎక్కడెక్కడ రుద్రుడెదిరించినట్లు
అక్కడ జూచిన నాజిలో నపుడు
తిక్కన జగదాన తిరితీపులాడి (తిరితీపులాడు=పెనఁగులాడు)
అంకించి ఖడ్గంబు నందుకొని యపుడు
వైరుల నొక్కొక్క వాటున ద్రుంచె
అప్పుడు రణములో నట్టచట్టలుగ
తలలును బాహులు తరచు మొండెములు

కుప్పలై కండలు గుండెలు రాలె
తప్పక తిక్కన్న దళమెల్ల నొరగె
అప్పుడు తిక్కన కాయె గాయాలు
చూచిరి యాదవుల్ చోద్యమందుచును
"తిక్కన్న ఒక్కడై దిగువారినాడు
పెక్కు రొక్కని తోడ పెనగాడ రాదు"
అని బ్రహ్మరుద్రు డల్లంతట నిలిచె
నిలిచినచో తోడ్తోన నీతిజ్ఞులగుచు
నిలిచిరి అనిమాని నెరజోదులెల్ల.

ఈ రెండవసారి యుద్ధంలో కూడా తిక్కన సైన్యమంతా నశించిపోయింది. అతడొక్కడే మిగిలిపోయాడు. ఒంటరిగా మిగిలిన ఒక్కనితో పెక్కురు కలిసి యుద్ధం చేయకూడదు అనే నీతిని పాటించి బ్రహ్మరుద్రయ్య జగడాన్ని నిలిపివేశాడు. కాని తిక్కన మాత్రం ఇంటి దగ్గర తండ్రికి ప్రతిజ్ఞ చేసినాడు కాబట్టి యుద్ధాన్ని నిలుపలేదు. కత్తిదూసి బ్రహ్మరుద్రయ్యమీదికి దూకాడు. అతడు కూడా ద్వంద్వయుద్ధానికి సిద్ధపడ్డాడు. (పదిమంది కలిసి ఒక్కడితో యుద్ధం చేయకూడదు కాని, ఒక్కడు మరొక్కనితో తలపడవచ్చును. దానిని "ద్వంద్వయుద్ధము" లేక "ఎక్కటికయ్యము" అంటారు.) ఇద్దరు బ్రాహ్మణవీరుడైన ఖడ్గతిక్కన – బ్రహ్మరుద్రయ్యలు చేసిన ఘోరమైన ద్వంద్వయుద్ధాన్ని ఈ "కాటమరాజుకథ" రచించిన జానపదకవి గంగుల పినయెల్లయ "నభూతో నభవిష్యతి"గా వర్ణించాడు. చూడండి:–

అప్పుడు తిక్కన్న అగ్ని చందమున
కదిసెను కోపాగ్ని కన్నుల నురల
అదలించి రుద్రుని అడ్డానవైచె
వడి రుద్రుడంతట నావాటు తప్పుకొనె
కరవాలు గైకొని కదిసె రుద్రుండు
విడబడి రిద్దరు వీరయుద్ధమున
దరణిపై నొండొరు తప్పించు కొనుచు

**లంఘించి వెనకకు రాగడిల్లుచును**
**ప్రాకుచు దూకుచు పైకి రేగుచును**
**తాటించి నరుకుచు తాకి పొడ్చుచును**
**ఉరవడితో వచ్చి పరువడి సేసి**
**కటపెట ఖంఖంగు ఘల్లు ఘల్లనుచు**
**మెరవులవలె మీరి మెరయుచు, పిడుగు**
**చరపులవలె గొప్ప సడిని వ్రేయుచును**
**నిర్వారు పోరిరి దుర్వారు లగుచు**
**తిక్కడు ద్రిక్కుడై తెగవ్రేయ, రుద్రు**
**డక్కడ చెక్కలై అవనిపై బడియె**
**పడుచునే రుద్రుడాపక ఖడ్గధార**
**తడయక ఆ మంత్రితల ద్రుంచివైచె!**

ఈ ఘోరమైన, అతిభయంకరమైన ద్వంద్వయుద్ధాన్ని తిక్కన శౌర్యాన్ని శిష్టకవులు కూడా చాటు పద్యాలరూపంలో వర్ణించారు.

**చ॥ పదటున వాజి రాహుతులపై దుమికించుచుఁ దిక్కఁడార్చినన్**
**బెదరి పరిభ్రమించు కడుఁ బిమ్మట వీరులు భీతచిత్తులై**
**యదె యదె వాలు వాల్మెఱుఁగు లల్లవె, యల్లదె యాతఁడంచనన్**
**గొదుకక యాజిఁ జేసె రిపుకోటుల కందఱ కన్నిరూపులై!**

ఈ విధంగా ఖడ్గతిక్కన వీరస్వర్గమలంకరించగా, చావగా మిగిలిన అతనిని చిల్లర సైన్యం నెల్లూరు చేరి, తిక్కన తండ్రి సిద్ధనామాత్యునితో తిక్కన శౌర్యప్రతాపాలను కీర్తిస్తూ ఇలా అన్నారు:-

**“అనిలోన తెగటార్చి యాదవబలము**
**కొదమసింగము లేళ్ళగుమి కూల్చినట్లు**
**కణుకులు కణుకులుగా సేన నరికె!**
**కసి మసంగుచు నుప్పుకల్లుగా చిదిమె**

**బ్రహ్మరుద్రునితోడ ప్రతినిల్చి పోరె**
**పిండీరులను వారు ఖండించుకొనిరి**
**ధీర విహారులై తెగిరి యిద్దరును**
**తిక్కన్న రుద్రయ్య దివికేగినారు"**

ఆ మాటలు విని సిద్ధనామాత్యుడు రణభూమికి వచ్చి, కొడుకు చేసిన గొప్ప యుద్ధాన్ని చూచి ఆశ్చర్యపోతూ ఇలా అన్నాడు:-

**"కొడుక! నీ రణము భద్గుండెంచవలెను**
**నరులకు నెంచగా న్యాయంబుగాదు**
**ఇనకులాధీశ్వరుం డీ సిద్ధిరాజు**
**ఋణము దీర్చుటకుగా నేతెంచినావు**
**ఫణిరాజు కొనియాడ పగద్రుంచినావు**
**పేరుగల ఆ పుణ్యపెన్న సాక్షిగను**
**కలువలరాజు భాస్కరుడు సాక్షిగను**
**నిలిపితి నీ కీర్తి నిఖిలంబునందు!"**

అని కొడుకు బొందెకోసం యుద్ధభూమిలో వెదికాడు. అది ఎక్కడా కనిపించలేదు. తిక్కన చెప్పినట్లుగానే కొన్ని మాంసపు కండలు పౌరుషంతో ఎగిరెగిరి పడుతున్నాను. ఏడుస్తూ వాటిని ఏరుకొని, తన కావిధోవతిలో మూటగా కట్టుకొని, నెల్లూరుకు తెచ్చాడు సిద్ధనామాత్యుడు:-

**జలధిలో మీనముల్ చలియించునట్లు**
**నెత్తుటి వర్రులో తుత్తునియలుగ**
**తిక్కన్న కండలు తేలాడుచుండె!**
**ఎగిసెగిసి పడుచుండె నీవలావలకు**
**కనుగొని అవిచూచి కన్నీరుకార్చి**
**కావిధోవతిని ఆ కండలు పొదివి**
**ఆతడు నెల్లూరి కప్పుదేతేర-**

తిక్కన భార్యయైన జానమ్మ మామగారి అనుమతిని పొంది, ఆ కండలతో కలిసి సహగమనం చేసింది. ఇంకొక జానపదకథ ప్రకారం – తిక్కన గుల్లం, యుద్ధభూమిలో

తెగిపడివున్న ఖడ్గతిక్కన తలను చూచి, దాని జుట్టును నోటితో కరుచుకొని, నెల్లూరిలోని తిక్కన యింటికి వచ్చి, ఆ తలను సిద్ధనామాత్యుని కిచ్చినదట! తిక్కన భార్య జానమ్మ ఆ తలను పల్లకిలో పెట్టి ఉరేగించి, దానితో సహగమనం చేసినదట!

ఈ సంఘటన జరిగిన కొన్నాళ్ళకు, ఖడ్గతిక్కనపై పూర్వం సీసపద్యంలోని నాలుగు పాదాలు చెప్పి, ఎత్తుగీతి చెప్పకుండా వెళ్ళిపోయిన భట్రాజు తిరిగి తిక్కన యింటికి వచ్చాడు. ప్రోలమ్మ-సిద్ధన్నల ఎదుట ఎత్తుగీతిని (ఆటవెలదిని) చెప్పాడు:-

"ఓ తిక్కదండనాథుడా! నీవు దేవేంద్రలోకం వెళ్ళిపోయిన సంగతి తెలిసికొని, తమకు మించినవాడు ఇక లేడని, తమకు ఇంక పోటీలేదని ధైర్యంగా మందరపర్వతం తిరగడం మానివేసింది; సముద్రానికి కట్టిన వారధి తెగిపోయింది; విష్ణుమూర్తి అవసరం తీరిపోయింది; మన్మథుడు మళ్ళీ పుట్టాడయ్యా. ఓ మగలరాజా! (మగలు=శూరులు)

**ఆ.వె. తిక్కదండనాథ! దేవేంద్రపురము నీ**
**వరుగుటెఱిఁగి - నగము తిరుగుటుడిగె-**
**అబ్ధికట్టు వాసె - అచ్యుతక్కఱ తీఱె**
**మరుఁడు మరలఁ బుట్టె మగలరాజ!**

తిక్కన తల్లిదండ్రులు ఆ భట్రాజును నాలుగువేల వరహాలతో ఘనంగా సన్మానించి పంపించారు. తిక్కన మొదటిసారి యుద్ధములో ఓడిపోయి వచ్చినప్పుడు చప్పట్లు కొట్టి అవహేళన చేసిన నెల్లూరి ప్రజలు, తిక్కన వీరమరణవార్త విని ఎంతో బాధపడ్డారు; ఎంతో దుఃఖించారు. తిక్కనలేని నెల్లూరు పట్టణం శోభాహీనంగా ఎలా ఉందో ఒక కవి ఇలా వర్ణించి చెప్పాడు:-

**ఉ॥ వెన్నెలలేని రాత్రియు, రవిప్రభలేని దినంబు, నీరులే**
**కున్న సరోవరంబు, కడు నొప్పగు దీపములేని యిల్లునై,**
**విన్నదనంబు నొందె మన విక్రమసింహపురంబుఁ జూడఁగాఁ**
**బున్నమచంద్రుఁబోలు మన ప్రోలమ తిక్కన లేమినక్కటా!**

***సీ॥ ధైర్యంబు నీమేనఁ దగిలి యుండుటఁ జేసి**
**చలియించి మందరాచలము తిరిగె;**

---

* 221వ పుటలోని సీసపద్యానికి పాఠాంతరము

గాంభీర్యమెల్ల నీకడన యుండుటఁ జేసి
కాకుత్థ్సుచే వార్ధి కట్టుపడియె;
జయలక్ష్మి నీయురస్థ్సలిన యుండుటఁజేసి
హరి పోయి బలి దానమడుగుకొనియె;
ఆకారమెల్ల నీయంద యుండుటఁజేసి
మరుఁడు చిచ్చునఁ బడి మడిసి చనియె;
గీ॥ తిక్కదండనాథ! దేవేంద్రపురికి నీ
వరుగు టెఱిఁగి, నగము తిరుగు టుడుగు!
నద్ది కట్టు విడుచు! నచ్యుతు కొదమాను!
మరుఁడు మరలఁ గలుగు మగలరాజ!

సీ॥ నందిని బుత్తెంచె నిందుశేఖరుఁడు నీ
వన్న! యేతెమ్ము తారాద్రికడకు;
గరుడినిఁ బుత్తెంచె నరహరి రావయ్య!
వడి సిద్ధతిక్క! కైవల్యమునకు;
హంసను బుత్తెంచె నజుఁడు నీకడకు ను
భయకులమిత్ర! రా బ్రహ్మసభకు;
ఐరావతముఁ బంపె నమరేంద్రుఁ డిప్పుడు
దివమున కే తెమ్ము తిక్కయోధ!
తే.గీ. యనును వేఱువేఱ నర్థితోఁ బిలువంగ
వారువీరుఁ గూడ వచ్చివచ్చి
దివ్యయోగియైన తిక్కనామాత్యుండు
సూర్యమండలంబు సొచ్చి చనియె.

ఉ॥ చిక్కక మన్మసిద్ధివిభుచే మునుగొన్న ఋణంబు దీర్చె మా
తిక్క నమంత్రి, సోమశిలదేవర సాక్షిగఁ, బెన్నసాక్షిగా,
నెక్కిన వాజి సాక్షిగ, మహిన్నుతికెక్కిన కీర్తిసాక్షిగా,
స్రుక్కక మారుకొన్నరణశూరులు సాక్షిగఁ, గొండ సాక్షిగన్!

ఖడ్గతిక్కన వీరస్వర్గం అలంకరించిన తర్వాత వేములవాడ భీమకవి, తిక్కన యింటికి వెళ్ళి అతని భార్య జానమ్మను "దీర్ఘసుమంగళీభవ!" అని ఆశీర్వదించాడట! ఆమె తన భర్త మరణించినట్లు చెప్పి శోకింపగా, భీమకవి –

**క॥ "గుణముల నిధానమగు మన**
**రణతిక్కన తాఁ గళేబరంబును శిరమున్**
**గణఁక మెయిఁ గలయ బ్రదుకును**
**బ్రణతాఖిలవైరిమకుటభాసితపదుఁడై!"**

– అని పద్యం చెప్పి రణతిక్కనను జీవింపజేసెనని చెప్పుదురు. వేటూరి ప్రభాకర శాస్త్రిగారు దీనిని కట్టుకథగా కొట్టిపారవేశారు. ఇక్కడ తిక్కనను గురించిన మరో రెండు చాటువులు ఇచ్చారు:–

**ఉ॥ ఏమి తపంబుచేసి పరమేశ్వరు నేమిటఁ బూజచేసిరో**
**రాముని తల్లియుం, బరశురాముని తల్లియు, భీము తల్లియున్,**
**గాముని కన్నతల్లియును, గంజదళాక్షు ననుంగుఁ దల్లియున్,**
**శ్రీమహితప్రతాపుఁడగు సిద్ధయ తిక్కన కన్నతల్లియున్!**

**ఉ॥ శ్రీలలరార శత్రువులఁ జెందితి, వార్యులు మంత్రివర్యులా**
**ర్వేలఘనుల్ నుతించి, రలవేల్పుదొరల్ ముదమంది మెచ్చి, రో**
**లాలిత శౌర్య ధైర్య! జయలక్ష్మి ప్రియంబున నిన్వరించె, నీ**
**లీలలు హెచ్చెఁ, దిక్కని కళేబరమా! యిఁక నిల్చియాడుమా!**

నెల్లూరు ప్రాంతంలో ఉన్న "పట్టపురాయి" గ్రామానికి తూర్పుభాగంలో, పినాకినీ నదీతీరంలో "తిక్కనపాడు" అనే స్థలం ఉంది. ఆ స్థలంలో గుబ్బంమీదనున్న ఒక రౌతును చెక్కిన శిల ఒకటి నేటికిని ఉన్నది. అది తిక్కన ప్రతిమ అని స్థలజ్ఞులు చెపుతున్నారు. (ఈ విషయం మద్రాసు ప్రభుత్వ పాచ్యలిఖిత పుస్తక భాండాగారంలో ఉన్న స్థానిక చరిత్రల సంపుటాలలో "పట్టపురాయి కైఫీయతు"లో ఉన్నది.)

(ఈ వ్యాసములోని చాటుపద్యములు వేటూరి ప్రభాకరశాస్త్రిగారి "చాటుపద్యమణిమంజరి" ద్వితీయ భాగమునుండి గ్రహింపబడినవి–తంగిరాల)



## అనుబంధం-3

# మహాదాత రాయన భాస్కరమంత్రిని గురించిన - చాటువులు

## (క్రీ.శ.14వ శతాబ్ది)

తెలుగవారి చరిత్రలో మహామంత్రులు 32 మంది ఉన్నట్లుగా చాటుకవులు భట్రాజులు చెప్పిన సీసమాలికలనుబట్టి తెలుస్తోంది. వీరిలో మొట్టమొదట చెప్పబడిన వ్యక్తి మహాదాతయైన రాయన భాస్కరమంత్రి. కాని "భాస్కరుడు" అనే పేరుతో మంత్రులుగా నున్న ప్రఖ్యాత పురుషులు అనేకులు చరిత్రలో నున్నారు. కవితిక్కన - ఖడ్గతిక్కనల పితామహుడు "మంత్రి భాస్కరుడు" కాకుండా ఎందరో ఉన్నారు. రాజమంత్రులును, దాతృత్వంలో ప్రఖ్యాతులును, నందవరీక బ్రాహ్మణులును అయిన భాస్కరులు నలుగురైదుగురు కనబడుతున్నారని వేటూరి ప్రభాకరశాస్త్రిగారు చెపుతున్నారు. "రామయ భాస్కరులు" ఇద్దరున్నారు. వీరిలో రావిపాటి త్రిపురాంతకుడు (క్రీ.శ. 14వ శతాబ్ది) ప్రశంసించిన "రామయామాత్య భాస్కరుడు" ఒకడు. అచ్యుత దేవరాయల కాలమునాటి (క్రీ.శ.16వ శతాబ్ది) "రామయ భాస్కరుడు" రెండవ వాడు. కాటమవేముని కాలమునాటి (క్రీ.శ. 1400) "రాయనప్రభుని బాచడు" ఒకడున్నాడు. క్రీ.శ. 1500 తరువాత వినుకొండలో ఒక రాయన భాస్కరుడున్నట్లుగా ఒక శాసనశ్లోకం తెలియజేస్తోంది. ఈ "భాస్కర" నామధేయదాతలపై ఎన్నో చాటుపద్యాలున్నాయి. వీరిలో అందరికన్నా ప్రసిద్ధికెక్కినవాడు వినుకొండను పాలించిన "రాయన(ని) భాస్కరమంత్రి". వేటూరి ప్రభాకరశాస్త్రిగారు భాస్కర మంత్రులపై సేకరించిన చాటుపద్యాలలో 95% పద్యాలు ఈ రాయని భాస్కరుని మహాదాతృత్వాన్ని ప్రశంసించే పద్యాలే! ఈ విషయాన్ని శాస్త్రిగారే ధ్రువీకరిస్తున్నారు. ఈ రాయని భాస్కరుడు అందరి భాస్కరులకన్న ప్రాచీనుడని కూడా చెపుతున్నారు:-

"ముప్పది యిద్దఱు మంత్రుల సీసమాలికలోఁ బేర్కొనఁ బడిన రాయని భాస్కరుఁడు ప్రాచీనుఁడుగా నూహింపఁదగియున్నాడు. అతఁడు మహాదాత. ఆ రాయని భాస్కరునిగూర్చి చెప్పఁబడిన చాటుపద్యము లనేకములు గలవు." (-చాటుపద్యమణి మంజరి, ద్వితీయభాగము, పుట-257)

మా అన్నయగారు భాస్కరుని గురించిన చాటువులలో మూడు పద్యాలు మాత్రమే సేకరించగలిగినారు. ప్రభాకరశాస్త్రిగారి సేకరణలో మొత్తం-46 చాటుపద్యాలున్నాయి. వాటిలో కొన్ని ముఖ్యమైనవి దిగువ ఇస్తున్నాను.

-తంగిరాల వెంకట సుబ్బారావు (సంపాదకుడు)

**చ॥ కలయఁ బసిండిగంటమునఁ గాటయవేమ సమక్షమందు స**
**త్ఫలముగ రాయనప్రభుని బాచఁడు వ్రాసిన వ్రాలవ్రోఁతలున్**
**గలుగలు గల్లుగల్లు రనఁ గంటకమంత్రుల గుండెలన్నియున్**
**జలుజలు జల్లుజల్లురనె సత్కవివర్యులు మేలుమేలనన్. 1**

**క॥ పన్నిద్దఱు భాస్కరులని**
**యెన్నిక సేయుటదికల్ల, యిద్దఱుగాదా?**
**మిన్నున నొక భాస్కరుఁడును,**
**బన్నుగ వినుకొండనున్న భాస్కరుఁ డొకఁడున్. 2**

**క॥ పసముత్య మొకటి చాలును,**
**గసపూడ్చిన చింపిరాలు గంపెండేలా?**
**రసికుం డొక్కఁడె చాలును,**
**రసహీనులు పదువురేల రాయని బాచా! 3**

**ఉ॥ ఏమి నిలింపశాఖి? పనియేమి సురేశ్వర? యీవి నిన్నుఁ జిం**
**తామణి మీఱినాఁడట కదా మన రాయనబాచ కోవిద**
**గ్రామణి? యౌన, యింతటనె కాదుచుమీ! విభవంబునందు ని**
**న్నో, మతియందు నీ గురువునో, సుకుమారత నీ కుమారునో! 4**

**ఉ॥ అన్నరొ! కొండపల్లి సచివాగ్రణి రాయనమంత్రిపట్టి బా**
**చన్న జలాన్న సత్ర మెడపైన పథంబునఁ బెట్టు, నెయ్యి-రా**
**జాన్నము-లొల్పుఁబప్పు-పదియాఱు తెఱంగుల కూరగాయలున్**
**వెన్నెలగుజ్జుఁబోలు దధి-వేసవికాల మవారితంబుగన్. 5**

(ఒల్పుబప్పు = ఒలిచిన పప్పు = పొట్టుతీసిన కందిపప్పు; అవారితంబుగన్ = అపరిమితముగా)

కII ముసలాపె వ్రేలుఁజన్నుల
పసవంటిది లోభివాని బ్రదుకు ధరిత్రిన్
బసిబాల వయసువంటిది
రసికుని జీవనము మంత్రి రాయని బాచా! 6

సీII ఫణిరాజు తనశిరోమణు లర్థికిచ్చునో
యనుచు విష్ణువుక్రింద నణఁగియుండె;
కైలాసకుధర మెక్కడ నిచ్చునో యని
యుగ్రుఁ డక్కడఁ గావలుండఁ బూనె;
తనయందు మణుల నేతతి నిచ్చునో యని
వనధి సంతతమును వణఁకుచుండె;
సురధరాధరము నెవ్వరి కిచ్చునో యని
తరణి యగ్గిరిచుట్టుఁ దిరుగుచుండె;
గీII ఔర! నీ దానవిఖ్యాతి యఖిలదిశల
మింటవర్తించె నీకీర్తి నెంచఁదరమె?
గాఢదారిద్ర్యయామినీకాంతిచంద్ర!
భాగ్యదేవేంద్ర! రాయన భాస్కరేంద్ర! 7

సీII సంగీత సాహిత్య సరసవిద్యల కిచ్చు,
బహురూపులకు నిచ్చు బట్టుకిచ్చు;
పెండ్లిపేదల కిచ్చుఁ, బేదవిప్రుల కిచ్చు,
బీదసాదులకెల్లఁ బిలిచి యిచ్చు;
తిట్టవచ్చిన నిచ్చు దీవించఁగా నిచ్చుఁ,
గొట్టవచ్చిన నిచ్చుఁ, గొంటె కిచ్చు;
బాచన్న! యన నిచ్చు, భాస్కరా! యన నిచ్చుఁ,
దేర బాచాయన్నఁ దిరిగి యిచ్చు;

గీ॥ మెచ్చి తగనిచ్చు, మెచ్చులుమెచ్చి యిచ్చు,
వీఁడువాఁ డనకయె సొమ్మువేఁడ నిచ్చు;
మంత్రిరాయని భాస్కరామాత్యుఁబోలఁ
గలరె దాతలు మూఁడులోకములయందు? 8

సీ॥ అతిథికోట్లకు నిల నమృతాన్నసత్రంబు,
నంబలిసత్రంబు నాతురులకు;
ఆచార్యులిండ్ల రామానుజసత్రంబు,
నూనెసత్రము శిరస్స్నానమునకు;
బాలకులకును నేర్పడఁ బాలసత్రము,
కామసత్రము విటగ్రామణులకు;
జలకమాడుట కింట జలసృష్టి సత్రంబు,
తాంబూలసత్రంబు ధన్యులకును;
గీ॥ కట్టడలుచేసె వినుకొండ పట్టణమున
సర్వకాలము సత్కారపూర్వకముగ;
మంత్రి రాయన భాస్కరామాత్యుఁ బోల
గలరె దాతలు మూడులోకములయందు? 9

సీ॥ నిత్యసత్యత్యాగనీతిలో శిబిఁ జెప్పి,
నినుఁ జెప్పి, మఱియును నిన్నుఁ జెప్పి;
బహువరాక్రమమునఁ బరశురామునిఁ జెప్పి,
నినుఁ జెప్పి, మఱియును నిన్నుఁ జెప్పిఁ;
రఘుకులోత్తముఁ డైన రామచంద్రునిఁ జెప్పి,
నినుఁ జెప్పి, మఱియును నిన్నుఁ జెప్పి;
సుకుమారతను సరి సురరాజసుతుఁ జెప్పి,
నినుఁ జెప్పి, మఱియును నిన్నుఁ జెప్పి;

గీ॥ చెప్పఁదగుఁగాక, యితరులఁ జెప్పఁదగునె?
కలియుగంబున నీవంటిఘనుఁడు కలఁడె?
అమితగుణసాంద్ర! మానినీకుముదచంద్ర!
భాగ్యదేవేంద్ర! రాయని భాస్కరేంధ్ర! 10

సీ॥ ఏవేళఁ జూచిన నిందిరానందమై
యందమై చెలఁగు నీమందిరంబు !
ఏపాళఁ జూచిన గోపాలసత్కథా
ళిందమై చెలఁగు నీమందిరంబు!
ఏజాముఁ జూచిన నిష్టాన్న భోజనా
ళిందమై చెలఁగు నీమందిరంబు!
ఏ ప్రక్కఁ జూచిన సుప్రజానాయకా
ళిందమై చెలఁగు నీమందిరంబు!
గీ॥ గాక తక్కిన మంత్రివర్గముల యిండ్లు
మేక మెడచండ్లు, గిజిగాండ్ల మెఱుగుగూండ్లు,
పూవుఁబోఁడులు నిర్మించు బొమ్మరిండ్లు;
భవ్యవిభవేంద్ర! రాయని భాస్కరేంద్ర! 11

సీ॥ శ్రీగిరి ప్రాగ్దిశ శ్రీలకావాలమై
విలసిల్లు విరిదండ విన్నకొండ;
విబుధాధి రాణ్మౌళి విశ్వంభరాప్రజ
విజయధాటికి జెండ విన్నకొండ;
వేదవేదాంతాది విద్యావిచక్షణ
విద్వజ్జనుల కండ విన్నకొండ;
రాయని భాస్కర ప్రాంచత్ప్రధానుండు
విత్తములిడు కొండ విన్నకొండ;

గీ॥ కొండవీడాది పెనుగొండ గోలకొండ
కొండపలిసీమ మేలైన కొండవీడు;
దుర్గములకెల్ల బలుదొడ్డ దొడ్డకొండ
భాస్కరునికొండఁ వినుకొండఁ బ్రబలుచుండ! 12

క॥ ఏ కొండయు వినుకొండకు
రాఁగోరదు సాటి పోటి రానేరదుగా
చేకొని రాయని భాస్కరు
డేకోన్నతవృద్ధి మీఱ నేలుటచేతన్. 13

సీ॥ చూచిన నీవంటి సుందరాకారుని
సొంపుగాఁ గన్నులఁ జూడవలయు;
నడిగిన నీవంటి యధిక సంపన్నుని
నరలేక యాచకుఁ డడుగవలయు!
నెన్నిన నీవంటి హితసుగుణాఢ్యుని
నెందఱిలోనైన నెన్నవలయుఁ;
బొగడిన నీవంటి పుణ్యమూర్తిని రాజ
పుంగవ సభలలోఁ బొగడవలయు;

గీ॥ వన్నె మీఱఁగ నినువంటివానిఁ గన్న
తల్లిదండ్రులభాగ్య మెంతని నుతింతు?
నమితగుణసాంద్ర ! మానినీకుముదచంద్ర !
భాగ్యదేవేంద్ర ! రాయనిభాస్క రేంద్రం! 14

క॥ నియ్యోగిలేని చావడి,
దయ్యాలకె యిరవుగాక దాతలకిరవా?
యొయ్యారి గుబ్బచంటికిఁ
బయ్యెద లేనట్టు; మంత్రి భాస్కరరాయా! 15

క॥ వగమాన్పి యర్థికీయని
మొగముండల కేల మొలిచె మూతిని మీసల్ ?
తెగగొఱుగcడాయె మంగలి
రగడొందcగc గీర్తికాంత; రాయని బాచా! **16**

ఉ॥ ఆకుల వ్రాలు వ్రాయ సచివాగ్రణి బాచనకే ఘటిల్లుc, బ
ల్లాకి కుమంత్రి నందనులు గంటముముట్టి లిఖించినట్టి వ్రా
లాకులు రాటపాకులు, చెవాకులు, బ్రాహ్మణవీథిలోని పు
ల్లాకులు, లంజెలిండ్ల వలుగాకులు గాక, నిజానకాకులే? **17**

ఉ॥ వ్రాయుc బసింది గంటమున రాజహితైక రహస్యకార్యముల్,
వ్రాయు ధనార్జికోటి నిటలంబున శోభనభాగ్యసంపదల్,
వ్రాయుc జకోరలోచనల వక్షువచస్సుల మన్మథాంకముల్,
రాయని మంత్రిభాస్కరుcడు వ్రాసిన వ్రాcత లసంఖ్యముల్గదా! **18**

ఈక్రింది పద్య మాభాస్కరుని నిర్యాణమునుగూర్చి చెప్పcబడినది:-

చ॥ సహజకళంకమూర్తులు, కుజాతులు, గూఢతరోదయ ప్రభా
మహితులు, గోత్రవిద్విషదమాత్యులు, రాత్రిచరానుకూలధీ
సహితులు, మందవర్తనులు, సర్పసమానులు రాజసేవక
గ్రహములు, కాననయ్యె నల రాయని భాస్కరుc డస్తమించినన్. **19**

(వేటూరి ప్రభాకరశాస్త్రిగారి "చాటుపద్యమణిమంజరి"
ద్వితీయభాగమునుండి)



## అనుబంధం-4

# కవిసార్వభౌమ శ్రీనాథుని చాటువులు

**సేకరణ-వివరణ: డా॥ కోడూరు ప్రభాకరరెడ్డిగారు**

(నా మిత్రులు, "కోమల సాహితీ వల్లభ" బిరుదాంకితులు అయిన డా॥ కోడూరు ప్రభాకర రెడ్డిగారు అనేక ఉత్తమ గ్రంథాలను రచించి ప్రచురించారు. "రాగవిపంచి-పల్నాటి భారతం-ద్రౌపది - హృదయరాగం - శ్రీనాథుని చాటువులు - దువ్వూరి రామిరెడ్డి కవిత్వం: వ్యక్తిత్వం-శ్రీనాథవిజయం- పానశాల - దేవర - శృంగార తిలకం- అశ్రుగీతి - మీరా గీతామృతధార - రేనాటి పలుకుబడులు - గాథాసప్తశతి - సాహితీ రసాయనం - కీట్స్ కవితా వైభవం-షేక్స్పియర్ సానెట్స్ - శ్రీనాథుని చాటువుల్లో నానావర్ణ వనితా వర్ణనం- కడప రెడ్డెమ్మ - తుషార ప్రతిమ - దువ్వూరి రామిరెడ్డి కావ్యవిశ్లేషణ - ఓహెన్రీ కథ" మొదలైనవి వీరి గొప్ప రచనలు. పూర్వం 19వ శతాబ్దంలో సి.పి.బ్రౌన్‌దొరగారు "జూలూరి అప్పయ్యపంతులు" అనే పండితుడిచేత మనుచరిత్రకు టీక వ్రాయించారు. దానిని ఇటీవల డా॥ ప్రభాకరరెడ్డిగారు తిరిగి ప్రచురిస్తూ, ప్రతిపద్యానికి తాను తాత్పర్యం వ్రాశారు. ఇది చాలా గొప్ప సాహిత్యసేవ. వీరి పెద్దన్నగారు డా॥ కోడూరు పుల్లారెడ్డిగారు కూడా వృత్తిరీత్యా ఇంజినీరు అయినా, ప్రవృత్తిరీత్యా ఘనసాహితీవేత్త; బహుగ్రంథకర్త. ఈ సోదరులిద్దరూ చతుర్భాషాకోవిదులు. తెలుగు - సంస్కృతం- ఇంగ్లీషు-హిందీ భాషలలో నిష్ణాతులు. ఈ సోదరద్వయం సంస్కృతం - హిందీ - ఇంగ్లీషు భాషలనుండి అనేక అత్యుత్తమ కావ్యాలను తెలుగులోకి అనువదించి, ఎంతో సాహిత్యసేవ చేశారు; ఇంకా చేస్తున్నారు.

డా॥ కోడూరి ప్రభాకరరెడ్డిగారి "చాటుకవి సార్వభౌమ శ్రీనాథుని చాటువులు" అనే గ్రంథం ప్రథమ సంకలనం 2001లోను, ద్వితీయ సంకలనం 2005లోను వచ్చాయి. రెండవ సంకలనంలో అకారాది క్రమంలో 210 చాటువులు వివరణ సహితంగా ఉన్నాయి. వీటిలో నుండి 86 చాటువులను ఎన్నికచేసి దిగువ ఇస్తున్నాను. ఈ పనికి నాకు అనుమతి నిచ్చిన డా॥ రెడ్డిగారికి మిక్కిలి కృతజ్ఞుడను - తంగిరాల)

ఉ॥ అంగడి వీథిఁ బల్లవుల కాసగ మామిడిపండు లమ్ముచున్
జంగమువారి చిన్నది పిసాళితనంబునఁ జూచెఁబో! నిశా
తాంగజబాణకైరవ సితాంబుజ మత్తచకోర బాలసా
రంగతటిన్నికాయముల రంతులు సేసెడు వాడిచూపులన్! 1

పల్లవులు = జారులు, విటులు; కైరవము = తెల్లకలువ; సితాంబుజము = తెల్లపద్మము; పిసాళితనంబున = ప్రకాశముతో; బాలసారంగము = లేడిపిల్ల; రంతులుచేసెడి = రచ్చచేసెడి, మిడిసిపాటుతో కూడిన.

కః అంసాలంబిత కచభర,
హంసాలస మందగమన, హరిణాంక కళో
త్తంసాలంబిత కుచభర,
కంసాలి వధూటి యెదుటఁ గానంబడియెన్! 2

కః అగసాలిది కాఁబోలును
సొగసైన మిటారి యోరచూపులతోడన్
జగమెల్లను వలపించుచు
మగటిమితో వచ్చెఁ బురము మార్గము వెంటన్! 3

కః అగిసాకు బొట్టుఁ బెట్టుక
మొగసాలన కడవ యెత్తి మురియుచు రాఁగా
తెగసాగి నడవదెన్నడు
నెగసక్కెపు (కాఁపు) కూఁతు రేమన వచ్చున్! 4

కః అద్దిర కులుకుల బెళుకులు,
నిద్దంపు మెఱుంగుఁదొడల నీటులు గంటే?
దిద్దుకొని యేల వచ్చును
ముద్దియ యీ నంబిపడుచు ముచ్చటదీఅన్? 5

**మ॥ "అరవిందానన! యెందుఁ బోయెదవు?"-"మత్ప్రాణేశు ప్రాసాద మం**
**దిర దేశంబున కో లతాంగి!"-"బహుళాంధీభూత మార్గంబునన్**
**దిరుగ న్నీకిటు లొంటి గాదె?"-"శుకవాణీ! మాటలింకేటికిన్,**
**మరుఁడాకర్ణధనుర్గుణాకలితుఁడై మా వెంటరా నొంటియే?" 6**

ఈ చాటువులోని చమత్కారం గమనించవలసిందే! ఒక పడుచు మరొక పడుచు పిల్లను "ఎక్కడికి పోతున్నావు?" అని ప్రశ్నించింది. "నా ప్రియతముని సౌధ ప్రాంతాలకు పోతున్నాను" అని ఆ పడుచు జవాబిచ్చింది. "ఇంత చీకటిలో ఒంటరిగా పోతున్నావు, నీకు భయం లేదా?" అని మళ్ళీ ప్రశ్నించింది. దానికా మాటకారి ఏమని జవాబిచ్చిందో చూడండి. "ఒంటరిగానా? ఏంమాటలవి? ఆకర్ణాంతం సంధించిన వింటితో మన్మథుడు నా వెన్వెంటే నడచివస్తుండగా నేను ఒంటరి నెలా అవుతాను." అంటే మన్మథ తాపానికి తాళలేకనే నా ప్రియుని కలియడానికి వెళ్తున్నాను - అని నర్మగర్భంగా చెబుతున్నది జాణ. సంవాద చాటువుకు ముచ్చటైన ఉదాహరణం పై పద్యం.

**క॥ ఆ కదురునఁ బికరవమున్,**
**ఆ కదురున భృంగరవము, నాత్మరవంబున్**
**ఏకీకృతంబుగ నేకుల**
**నేకులు విన వడికె, ముదిర యేకులముదిరా? 7**

**ఆ॥ ఊరు వ్యాఘ్రనగర, మురగంబు కరణంబు,**
**కాఁపు కపివరుండు, కసవు నేఁడు**
**గుంపుగాఁగ నిచట గురిజాలసీమలో**
**నోగులెల్లఁగూడి రొక్కచోట! 8**

**సీ॥ ఏకసక్కెముగ నాడు నేదైన నొకమాట,**
**పాడు నొయ్యన పాట పాట పాట,**
**యలఁతి యద్దపు బిళ్ల యలవోక వీక్షించుఁ,**
**గొనగోరఁ బదనిచ్చి కురులు దీర్చుఁ**

బయ్యెద దిగజార్చి పాలిండ్లు పచరించు,
దిస్సువాఱగ నవ్వుఁదీఁగ నవ్వు,
ధవళతాళపలాశ తాటంకములు త్రిప్పు,
కలికి చూపులఁజూపు గర్వరేఖ,
తే॥ కటకుటీద్వార వేణుకాకాష్ఠపీఠ
మధ్యభాగ నిషణ్ణయై మదము మిగిలి
వీటి పామరవిటుల తంగేటిజున్ను
కామబరిగోల మేదరకరణవేశ్య! (క్రీడాభిరామము: ప.68) 9

నగరం వెలుపల ఉన్న గూడెం చివర వెదురుకర్రల పీటమీద కూర్చొని ఉన్న ఒక మేదరికరణవేశ్య విలాసాన్ని వర్ణించే పద్యమిది.

పచరించు=చక్కబెట్టు; దిస్సువారగన్= దిస్సను సన్నని ధ్వని వచ్చునట్లు, వేణుకాకాష్ఠ పీఠము=వెదురు పీట; తంగేటి జున్ను = తంగేడుచెట్టులోని తేనెపట్టు (సులభముగా దొరుకునది అనే అర్థంలో); బరిగోల=వెదురుకోల, నిషణ్ణయై= కూర్చున్నదై.

సీ॥ ఒక చెంప కోరగా నొనగూర్చి దిద్దిన
తురుమునసుండి క్రొవ్విరులు రాల,
రాతిరి నిదురఁ గూరమిఁజేసి ముడివడు
బడలిక నడుగులు తడఁబడంగ,
వింతవారలఁజూచి వెస నవ్వునెడఁగప్పు
గల దంతముల కాంతి వెలికిఁ బాఱ,
జిడిముడి నడచుటఁ జెలరేగి గుబ్బల
పైఁదాకి యొక్కింత పైఁట జాఱ,
తే॥ చెమటచేఁ దిరునామంబు చెమ్మగిల్ల
హోళి దాచేత విడియంబు గీలుకొలిపి
రంగపురి రాజవీధి గానంగనయ్యె
నాదుమది కోర్కెలూర వైష్ణవవధూటి! 10

శ్రీరంగ క్షేత్రం దర్శించినప్పుడు అక్కడి ఒక వైష్ణవ విలాసినిని చూచి చెప్పినది పై పద్యం. వర్ణనలో ఈ శృంగారచాటువు అసామాన్యమైనది.

తుఱుము = కొప్పు; హోళి = ఆసక్తి, ఉత్సాహము

**ఉ॥ కందుక కేళి సల్పెడు ప్రకారమునం, బురషాయిత' క్రియా**
**తాండవ కేళి సల్పెడు విధంబునఁ బామరభామ లేత నీ**
**రెండ ప్రభాతవేళ రచియించెను గుబ్బలమీది హారముల్**
**కుండలముల్ కురుల్ కదల గోమయపిండము లింటిముందటన్!11**

ప్రాతఃకాలాన్నే ఇంటి ముంగిట గొబ్బెమ్మలను అమర్చే (పిడకలను చేసే) ముద్దుగుమ్మను వర్ణిస్తున్నాడు ఈ చాటువులో శ్రీనాథకవిసార్వభౌముడు. ఈ పద్యమే కొద్దిపాటి మార్పులతో క్రీడాభిరామంలో ఈ క్రింది విధంగా చెప్పబడింది:-

**ఉ॥ కందుకకేళి సల్పెడు ప్రకారమునం, బురుషాయితక్రియా**
**తాండవరేఖ చూపెడు విధంబునఁ, బామరభామ లేఁత యీ**
**రెండ ప్రభాతవేళ రచియించె, నితంబభరంబుఁ జన్నులున్,**
**గుండలముల్, కురుల్ కదల గోమయపిండము లింటిముంగటన్**

(– క్రీడాభిరామము; ప.82)

**ఉ॥ కప్పురభోగి వంటకము, కమ్మని గోధుమపిండివంటయున్,**
**గుప్పెఁడు పంచదారయును గ్రొత్తగఁ గాఁచిన యాలనేే, పెస**
**ర్పప్పును, గొమ్ము నల్లనఁటిపండ్లును, నాలుగువైదు నంజులున్,**
**లప్పలతోడఁ గ్రొంబెరుగు, లక్ష్మణవజ్ఝుల యింట రూకకున్! 12**

(క్రీడాభిరామము: ప.166)

**చ॥ కలసి పెనంగు కాలమున గాజుల చప్పుడుగాదు, కంటికిం**
**పలరగ చుంబన క్రియకు నడ్డముగా మెడతాడు గీడులే,**
**దలుగుల బారుచుండు కుసుమాస్త్ర గృహంబున వారిపూరముల్,**
**వలపుల పుట్టినిల్లు, విధవం జెడదిట్టిన నోరుపుచ్చదే! 13**

(అలుఁగు = చెఱువుతూము)

మ॥ కవితల్ సెప్పినc బాడనేర్చిన వృథాకష్టంబె, యీ బోగపుం,
జవరాండ్రే కద భాగ్యశాలినులు! పుంస్త్వంబేల శష్పానకా?[1]
సవరంగా సొగసిచ్చి, మేల్ యువతివేషంబిచ్చి పుట్టింతువే,
నెవరున్ మెచ్చి ధనంబు లిచ్చెదరుగాదే పాపపుం దైవమా! 14

క॥ కుంకుమ లేదో? మృగమద
పంకము లేదో? పటీరపాంసువు లేదో?
సంకుమదము లేదో? అశు
భంకరమగు భస్మమేల బాలా! నీకున్? 15

(మృగమదము = కస్తూరి; పంకము=బురద; పటీరపాంసువు= చందనపు పొడి (పాంసువు = ధూళి, దుమ్ము).

ఉ॥ కుమ్మరవారి బాలిక, చకోర విలోచన, ముద్దుగుమ్మ, యా
వమ్మొదరిన్ రసామలిన వస్త్రము చుంగులుజాఱcగట్టి, తాc
గమ్మని మ్రోతతోc గరనఖమ్ముల భాండము లంగజాస్త్ర పా
తమ్మన బ్రోవుదీసె, విటతండము గుండియ లారవిచ్చగన్! 16

మ॥ కులుకున్ సిబ్బెపు గబ్బిగుబ్బగవతోc, గొప్పైన కీల్కొప్పుతో,
గిలుకున్ మట్టెలతో, వయారినడతోc, గ్రేగంటి వాల్చూపుతో,
నెలనేలంగల ముద్దునెమ్మొగముతో, నీలాటి రేవద్ధికిన్
కలకంఠీమణి వచ్చె జూడు మిదిగో కంసాల బాలామణిన్! 17

శా॥ కుల్లాయుంచితిc, గోcకసుట్టితి, మహాకూర్పాసముం దొడ్గితిన్,
వెల్లుల్లిన్ దిలపిష్టమున్ మెసవితిన్ విశ్వస్త వడ్డింపcగాc
జల్లాయంబలిcద్రావితిన్, రుచులు దోసంబంచుc బోనాడితిన్,
దల్లీ! కన్నడరాజ్యలక్ష్మి! దయలేదా? నేను శ్రీనాథుcడన్! 18

1. పో పోచకా?

మ॥ కుసుమంబద్దిన చీరకొంగు వొలయం, గ్రొవ్వారు పాలిండ్లపై
త్రిసరంబుల్ పొలుపార, వేణి యవటూద్దేశంబుపై రాయఁగా,
బస నెవ్వాఁడొ యెకండు రాత్రి రతులన్ బల్గాసి గావింపగా
వసివాళ్వాడుచు వచ్చుచున్నయది కర్ణాటాంగనన్ గంటిరే? 19

(త్రిసరములు=మూడు వరుసల హారములు; అవటూద్దేశంబు= వీపు (వెన్ను)

సీ॥ కూడు తలఁప జోళ్ళు, కూర కారామళ్ళు,
చెవులంత వ్రేలాళ్ళు, చేలు మళ్ళు;
దుత్తెడే నాగళ్లు, దున్నపోతుల యేళ్ళు,
కలవు మాపటివేళ గంజినీళ్ళు;
మాట మాటకు ముళ్ళు, మఱి దొంగ దేవళ్ళు
చేఁదైన పచ్చళ్లు, చెఱకు నీళ్ళు;
వంట పిడ్కల దాళ్ళు, వాడ నూతుల నీళ్ళు
విన విరుద్ధపు బేళ్ళు, వెడద నోళ్లు;
సఖుల చన్నుల బైళ్ళు. చల్లని మామిళ్ళు,
పరువైన వావిళ్ళు, పచ్చపళ్ళు;
తే॥ దళమయినయట్టి కంబళ్ళు, తలలు బోళ్ళు,
పయిడికిని జూడ బయిదెత్తు ప్రత్తివిళ్ళు
చలముకొని వెదకిన లేవు చల్లనీళ్ళు,
చూడవలసెను ద్రావిళ్ళ కీడు మేళ్ళు! 20

సీ॥ కొదమ తుమ్మెద గేరు కొమరైన జడతీరు
నటులుగాఁ గటిమీద నాట్యమాడ,
జులుపాలతో గూడి చెలువంపు గుమ్మటల్
చెక్కుటద్దములపై జీరులాడ,

ధగధగయను దీప్తిఁ దనరు కెంపులనత్తు
చిగురాకు మోవిపైఁ జిందులాడ,
రంగైన కుత్తిసీ అవిక మేలెదలించి
చంగున బాలిండ్లు చవుకలింప
తే॥ ముదిత జలతారు కొంగున ముసుగుఁదిగిచి
వెండి బిందెయు జేబూని వేడ్కలలర
హంసనడకల దావచ్చె నతివ, ముద్దు
బావినీళ్ళకు గుజరాతిభామ (యొకతె)! 21

సీ॥ ఖండేందుమౌళిపై, గలహంసపాళిపై,
గర్పూరధూళిపైఁ గాలుదువ్వ;
మిన్నేటి తెఱలపై, మించు తామరలపై,
మహిమంచు నురులపై మల్లరించు;
జంభారి గజముపై, జంద్రికారజముపై,
జందనధ్వజముపైఁ జౌకళించు;
ముత్యాలసరులపై, మొల్లక్రొవ్విరులపై,
ముదికల్పతరువుపై మోహరించు;
తే॥ వెండిమల యెక్కి, శేషాహి వెన్నుదన్ని,
తొడరి దుగ్ధాబ్ధి తరగలతోడ నడరి,
నెఱతనంబాడి నీ కీర్తి నిండె నహహ!
విజయరఘురామ! యల్లాడవిభుని వేమ! 22

క॥ గరళము మ్రింగితి ననుచున్
బురహర! గర్వింపఁబోకు, పోపోపో ! నీ
బిరుదింకఁ గానవచ్చెడి
మెఱసెడి రేనాటి జొన్నమెతుకులు తినుమీ! 23

కII గిటగిటనగు నెన్నడుములు,
పుటపుటనగు చన్నుఁగవలు, పున్నమనెలతో
జిటపాటలాడెడు మొగములు,
కటితటముల కొమరు, శబరకాంతల కమరున్! **24**

కII గుడిమీఁది క్రోఁతితోడను
గుడిలోపలి నంబివారి కోడలితోడన్
నడివీథి లంజతోడను
నడిగొప్పుల హెూరుగాలి నడిగితి ననుమీ! **25**

ఉII గుబ్బల గుమ్మ, లేఁజిగురుఁగొమ్మ, సువర్ణపుఁగీలుబొమ్మ, బల్
గబ్బి మిటారి చూపులది, కాఁపుది, దానికినేల యొక్కనిన్
బెబ్బులి నంటగట్టితివి? పెద్దవు నిన్ననరాదు రోరి, దా
నబ్బ పయోజగర్భ! మగనాలికి నింత విలాసమేటికిన్? **26**

ఉII గొంగడి, మేలు పచ్చడము, కుంపటి, నల్లులు, కుక్కిమంచమున్
జెంగట వాయుతైలము, లజీర్ణపు మందులు, నుల్లిపాయలున్,
ముంగిట వంటకట్టియల మోపులు, దోమలు, చీఱపోతులున్
రంగ! వివేకి కీ మసరరాజ్యము కాఁపుర మెంత రోఁతరా! **27**

మసరరాజ్య ప్రజల దీన దైనందిన జీవనచిత్రణం కన్నులకు నీరు చిప్పిల జేస్తుందీ చాటువులో. మసర రాజ్యానికే 'మొరస' రాజ్యమని కూడా పేరుంది. మొరసరాళ్ళు ఎక్కువగా ఉండడంవల్ల ఆ ప్రాంతానికి ఆ పేరు వచ్చిందని ప్రతీతి. నేటి కర్నూలు మండలమే మొసర రాజ్యమని కొందరు, కోలారు ప్రాంతమని మరి కొందరు అంటారు.

ఉII గ్రామము చేతనుండి, పరికల్పితధాన్యము నింటనుండి, శ్రీ
రామ కటాక్ష వీక్షణ పరంపరచే గడతేఱెఁగాక, మా
రామయమంత్రి భోజనపరాక్రమ మేమని చెప్పవచ్చు? నా
స్వామి యెఱుంగుఁ దత్కబళచాతురి తాళఫలప్రమాణమున్! **28**

సీ॥ చక్కని నీ ముఖచంద్రబింబమునకు
గల్యాణమస్తు బంగారుబొమ్మ!
నిద్దంపు నీ చెక్కుటద్దంపు రేకకు
నైశ్వర్యమస్తు నెయ్యంపుదీవి!
మీటినఁ బగులు నీ మెఱుఁగుఁ బాలిండ్లకు
సౌభాగ్యమస్తు భద్రేభయాన!
వలపులు గులుకు నీ వాలుఁ గన్నులకు న
త్యధికభోగోస్తు పద్మాయతాక్షి!

తే॥ మధురిమము లొల్కు నీ ముద్దు మాటలకును
వైభవోన్నతిరస్తు లావణ్యసీమ!
వన్నెచిన్నెలుగల్గు నీమన్ననలకు
శాశ్వతస్థితిరస్తు యోషాలలామ! 29

ఆ.వె. చిన్న చిన్న రాళ్ళు, చిల్లర దేవుళ్ళు,
నాగులేటి నీళ్ళు, నాఁపరాళ్ళు,
సజ్జజొన్నకూళ్ళు, సర్పంబులును, దేళ్ళు,
పల్లెనాటిసీమ పల్లెటూళ్లు! 30

ఉ॥ చీరయు, ముక్కుముంగఱయుఁ, జెంపలగంధముఁ జుక్కబొట్టు, మం
జీర ఝణంఝణారవముఁ, జేతులఁ గంకణనిక్వణంబు, నొ
య్యారము, జాఱుకొప్పును, గయాళితనంబునుగాని, లోన శృం
గార మొకింత లేదనుటఁ గంటిని యీపురి వారకాంతలన్. 31

క॥ చెవులవి నీలపురాలా?
యువిదరొ! నిను రతులఁ దనుప నొకని తరాలా?
యివి రుద్రాక్షసరాలా?
జవరాల! మహాత్మురాల! జంగమురాలా! 32

ఆ.వె. జనని సంస్కృతంబు సకలభాషలకును
దేశభాషలందుఁ దెలుగు లెస్స!
జగతిఁ దల్లికంటె సౌభాగ్యసంపద
మెచ్చుటాఁడుబిడ్డ మేలుగాదె! 33

(క్రీడాభిరామము: ప. 37)

సీ॥ జిలుఁగైన చెంగావి జిగిమీఱు కుచ్చెళ్ళు
చిన్నిమెట్టెలమీఁదఁ జిందులాడ,
నీటైన రత్నాల తాటంకముల కాంతి
కుల్కుగుబ్బలమీఁద గునిసియాడ,
గుఱుతైన యపరంజి గొప్ప ముత్తెపునత్తు
మోవిపై నొక వింత ముద్దుగుల్క,
తీరైన ముత్యాల హారముల్ మేలిమై
మెఱుఁగుఁజెక్కులతోడ మేలమాడ,

తే॥ గంధ కస్తురి వాసనల్ గమ్మనంగ,
నలరు విలుకాని చేతి పూవమ్మనంగ,
కాళ్ళనందెలు గలుగల్లు గల్లనంగ,
సొగసు గుల్కంగ వేపారిసుదతి వచ్చె! 34

క॥ జొన్నకలి, జొన్నయంబలి,
జొన్నన్నము, జొన్నపిసరు, జొన్నలె తప్పన్
సన్నన్నము సున్నసుమీ!
పన్నుగఁ బల్నాటిసీమ ప్రజలందఱకున్! 35

ఉ॥ తల్లియుఁ గొండపల్లి నొక తామరగండికి నీళ్లకేఁగగాఁ
దెల్లని చీరకొంగు నెగదీసుక నవ్వుచు నీళ్ళ ముంచగా
గొల్లల లింగకాయ చనుగుబ్బలసందున నాట్యమాడగాఁ
జల్లని మాటలాడు నగసాలె శిరోమణిఁ జూచితే సఖా! 36

సీ॥ తళుకుతళుకను కాంతి బెళ్ళుకెంపుల ముంగ
రందమై కెమ్మోవియందుఁ గుల్క,
ధగధగద్ధగలచేఁ దనరారు బంగారు
గొలుసు లింగపుకాయ కొమరు మిగుల,
నిగనిగన్నిగలచే నెగడు చెల్వపు గుబ్బ
దోయి యొండొంటితో రాయిడింప,[1]
రాజహంస విలాస రాజితంబగు యాన
మందు మెట్టెలు రెండు సందడింప,
తే॥ సరసదృక్కుల విటులను గరఁగఁ జూచి,
పొందికైనట్టి మోమున భూతిరేఖ,
రాజకళ లొప్ప నద్దంకి రాజవీథి
బొలిచె నొక కొమ్మ గాజుల ముద్దుగుమ్మ! 37

సీ॥ తాటంకయుగ ధగద్ధగిత కాంతిచ్ఛటల్
చెక్కుటద్దములపై జీరువార,
నిటలేందు హరినీల కుటిలకుంతలములు
చిన్నారి మోముపైఁ జిందులాడ[2]
బంధుర మౌక్తిక ప్రకట హారావళుల్
గుబ్బ పాలిండ్లపై గునిసియాడ[3]
గరకంకణ క్వణక్వణ నిక్వణంబులు
పలుమాఱు ఆతిపైఁ బరిఢవిల్ల,
తే॥ నోరచూపుల విటచిత్త మూఁగులాడ,
బాహుకుశలతఁ జక్కని మోహనాంగి
పాటఁ బాడుచుఁ గూర్చుండి రోటిమీదఁ
బిండి రుబ్బంగఁ గన్నులపండువయ్యె! 38

1. "చెల్వగు గబ్బిగుబ్బలురంబున నిబ్బరింప" - పాఠాంతరము
2. "చిన్నారి మోమునఁ జిందు ద్రొక్క" - పాఠాంతరం
3. "గుబ్బచన్నులమీఁద గునిసియాడఁ" - పాఠాంతరం

క॥ తేలాకాయెను బోనము
పాలాయెను మంచినీళ్ళు, పడియుండుటకున్
నేలా కఱవాయె నిసీ!
కాలిన గురిజాల నిష్టకామేశ! శివా! 39

వ్యాఖ్య: గురిజాలలో శ్రీనాథుని కొకనాటి రాత్రి తిండి దొరకలేదు. తేలుకుట్టెను. మంచినీళ్ళును కఱవయ్యెను. నిద్రించుటకు తిన్నని చోటయినను కుదురలేదు. తేలుకుట్టిన బాధ తీఱుటకై నమిలిమ్రింగిన మందాకే ఆహారమయ్యెను. ఎవరో కవితాభిమానులగు కాపులు తెచ్చియిచ్చిన పాలే మంచినీళ్ళయ్యెను. (-వేటూరి ప్రభాకరశాస్త్రి, క్రీడాభిరామము, పుట-41)

శా॥ దస్త్రాలున్, మసిబుఱ్ఱలున్, కలములున్, తాఱొన్న చింతంబఱుల్,
పుస్తుల్కారెడు దుస్తులున్, చెమటకంపుం గొట్టు నీర్కావులున్,
అస్తవ్యస్తపు కన్నడంబును, భయంబై తోఁచు గడ్డంబులున్,
'వస్తూచాస్తిమి రోస్తిమిన్', పడమటన్ వ్యాపారులన్, క్రూరులన్! 40

వివరణ: "పడమటి వ్యాపారులు" = తెలంగాణలోని గోల్కొండ వ్యాపారులు (కరణాలు)

శా॥ దాయాదుల్వలె గుబ్బచన్ను లొఱయన్, ధావళ్య నేత్రాంబుజ
చ్ఛాయల్ తాండవమాడఁ, గేరి పురుషస్వాంతమ్మునన్ మన్మథుం
దేయం, జంగమువారి చంద్రముఖి, విశ్వేశార్చనావేళలన్
వాయించెం గిరిగిండ్లు బహుకుశల వ్యాపార పారీణతన్. 41

గిరిగిండ్లు = ఆడునప్పుడు వాయించే కంచుతాళము (గిరిగిటలు, గిర్గిటలు)

ఉ॥ దోసెఁడు కొంపలోఁ బసుల త్రొక్కిడి, మంచము, దూడరేణమున్,
పాసిన వంటకంబు, పసిబాలుర శౌచము, విస్తరాకులున్,
మాసిన గుడ్డలున్, తలకుమాసిన ముండలు, వంటకుండలున్,
రాసెఁడు కట్టెలుం, దలఁపరాదు పురోహితునింటికృత్యముల్! 42

**శా॥ ధాటీ ఘోటక రత్న ఘట్టన మిళిద్రాఘిష్ఠ కల్యాణ ఘం**
**టా టంకార విలుంఠ లుంఠిత మహోన్మత్తాహిత క్షోణిభృ**
**త్కోటీరాంకిత కుంభినీధర సముత్కూటాటవీఝాట క**
**ర్ణాటాంధ్రాధిప! సాంపరాయని తెలుంగా! నీకు బ్రహ్మాయువౌ 43**

పై చాటువు తెలుగురాయడు అశ్వారూఢుడై దండయాత్ర సాగించేటప్పుడు ఆశీఃపూర్వకంగా చెప్పినదిగా తోస్తుంది. శ్రీనాథుడు తెలుగురాయని ఈ విధంగా ఆశీర్వదించాడు. "తెలుగురాయని జాత్యశ్వాలు శత్రుసైన్యపు అశ్వాలపై దూకినప్పుడు జీనులు ఒకదానితో ఒకటి రాసుకొని వాటి ఘంటాటంకారాలు శబ్దం చేస్తుండగా, అరివర్గం, తలలు తెగిపోగా, వారి కిరీటాలు పర్వతశిఖరాలపైన, అరణ్యప్రాంతాల్లో దొర్లుతున్నాయి. ఇటువంటి శౌర్యపరాక్రమాలు గల ఓ కర్ణాటాధిపా! తెలుగురాయా! నీకు దీర్ఘాయువు కలుగుగాక!"

**క॥ నడినూక లేని యన్నము,**
**వడఁబోసిన నెయ్యి, బుడమవరుగున్, బెరుగున్**
**గడుఁబేర్మి మాకు నొసఁగిన**
**అడిమాచల నంబిచేడె నడిగితి ననుమీ![1] 44**

**సీ॥ నడివీథిలో రాళ్ళు, నాగులే దేవళ్ళు,**
**పరగట సావిళ్ళు, పాడుగుళ్ళు,**
**ఐదు వన్నెల కూళ్ళు, నంబటి కావిళ్ళు,**
**నూరూర జిళ్ళేళ్ళు, నూటనీళ్ళు,**
**నడుముకు వడదోళ్ళు, నడువీథికల్ రోళ్ళు,**
**కరణాల వడిసెళ్ళు, కాపు ముళ్ళు,**
**. . . . . . . . . . . . . . . . . . . .**
**. . . . . . . . . . . . . . . .**

---

1. నడిగూడెపు నంబిపడుచు నడిగితి ననుమీ! – పాఠాంతరం

తే॥ . . . . . . . . . . . . . . . . . . . .
. . . . . . . . . . . . . . . . . . . .
. . . . . . . . . . . . నేరెళ్ళవాగు నీళ్ళ,
సిరులఁజెలువొందు మారెళ్ళసీమయందు! 45

క॥ నిబ్బరపుఁ గలికిచూపులు,
జబ్బించుక లేని పిఱుఁదు, సన్నపు నడుమున్
మబ్బుకురు, లబ్బుకుచములు
బిబ్బీలకుఁగాక కలవె పృథివీస్థలిపై. 46

క॥ నెమలిపురి యమపురముగా,
యముఁడాయెను బసివిరెడ్డి, యంతకు మిగులన్
యమదూతలైరి కాఁపులు,
క్రమమెఱుగని దున్నలైరి కరణాలెల్లన్ ! 47

సీ॥ పంపావిరూపాక్ష బహుజటాజూటికా
రగ్వధప్రసవ సౌరభ్యములకు,
తుంగభద్రాసముత్తుంగవీచీఘటా
గంభీర ఘుమఘుమారంభములకు,
కళసాపురప్రాంత కదళీవనాంతర
ద్రాక్షాలతాఫల స్తబకములకు,
కర్ణాటకామినీ కర్ణహాటక రత్న
తాటంకయుగ ధాళధళ్యములకు,
తే॥ నిర్నిబంధ నిబంధమై నెనయు కవిత
తెలుఁగునను సంస్కృతంబునఁ బలుకనేర్తు
ప్రౌఢదేవేంద్రరాయ భూపాలవరుని
సమ్ముఖంబున దయఁజూడు ముమ్మసుకవి! 48

కర్ణాటాధీశ్వరుడైన ప్రౌడదేవరాయలను దర్శించడానికై కొండవీడునుండి శ్రీనాథుడు విద్యానగరం వెళ్ళాడు. రాజదర్శనానికి ముందు ఆ యాస్థాన విద్వాంసులను దర్శించి వారి ప్రాపుతో రాజదర్శనం చేసుకోవడం అప్పటి ఆనవాయితీ. అంటే ఇప్పటి 'రెకమండేషన్' అన్నమాట! ప్రౌఢదేవరాయల ఆస్థానంలో నున్న ముమ్మకవి శ్రీనాథునికి చిరపరిచితుడైన వినుకొండ వల్లభరాయని స్నేహితుడు. అతనిని దర్శించి శ్రీనాథుడు ఇలా చెప్పాడు. "పంపాతీర్థంలో ప్రతిష్ఠించబడిన విరూపాక్షుని జటాజూటంలో అలంకరింపబడిన రేలపూల సువాసనలకు, తుంగభద్ర అలల ఘుమ ఘుమ ధ్వనులకు, కళసాపుర ప్రాంతంలోని అరటితోటలలో నున్న ద్రాక్షలతల పండ్లగుత్తులకు, కర్ణాటస్త్రీల చెవికమ్మల బంగారు రత్నకాంతులకు సాటియైన కవిత్వాన్ని తెలుగులోనూ, సంస్కృతంలోనూ నిరాఘటంగా చెబుతాను. అందువల్ల ప్రౌఢదేవరాయల ఆస్థానానికి తీసుకొనిపోయి నన్ను పరిచయం చేయండి ముమ్మకవి గారూ!" ఈ విధంగా కర్ణాటదేశ విభవాన్నంతా పై నాల్గు సీసపాదాల్లో కనిపింపజేస్తూ, వివిధభావభంగీ సమన్వితమైన సంస్కృతాంధ్రభాషా కవిత్వాన్ని నిర్నిరోధంగా చేయజాలిన తన్ను ప్రౌఢవరాయల సన్నిధికి కొనిపొమ్మని ముమ్మకవిని అర్థించాడంటే ఆ కాలంలో రాయల ఆస్థానంలో డిండిముని ప్రాభవం ఎంతటిదో తెలియవస్తుంది.

ఈ చాటువులో శ్రీనాథుడు స్వీయ కవితాగుణాలనూ ఉగ్గడించాడు. ఈ పద్యం శ్రీనాథుని సంస్కృతాంధ్ర విదగ్ధతను చాటి చెబుతూంది. అంటే ఈ ప్రసవ సౌరభ్యాలు, తరంగ ఘుమఘుమమారంభాలు, ద్రాక్షాఫల మాధుర్యాలు, రత్న తాటంక ధాళధళ్యాలు శ్రీనాథుని సంస్కృతాంధ్రమయ శబ్దబ్రహ్మంనుండి నిర్నిబంధంగా విరజిమ్ముకొని వచ్చాయన్నమాట.

**శా॥ పచ్చల్ దాపిన తారహారములతోఁ బాలిండ్లు గాన్పించి, నే**
**మెచ్చన్ బైపడి కౌగిలియ్య విదియేమే? మేటి పంతంబుతో**
**వచ్చెం జూడవె పచ్చవిల్దొర యదే, ప్రాణంబు రక్షింపవే!**
**కుచ్చెళ్ళొప్పుగ నూడదియ్యనియవే! కొమ్మా! జగన్మోహినీ! 49**

**సీ॥ పడుగేరుచోఁ జూచుఁ గుడియెడమలయందు**
**సంచరించెడి విటసముదయములఁ,**
**బోగులు కట్టుచోఁ బొరుగిండ్ల చిన్నప్రా**
**యపుటింతులకు నుపాయములు గఱపుఁ,**

గండెలు చుట్టుచోఁ గన్బొమసైఁగతో
సొగసు కాంద్రకుఁ డెంకిచోటుఁ జూపు,
నచ్చువే యదుకుచో హాస్యరసంబునఁ
జెలికత్తెలను మాఱు పలుకరించు,

తే॥ నావలీవలి సతులతో హాస్యమాడు,
మోకు బిగియించుచోఁ బతిమోసపుచ్చుఁ,
గుంచెపిడివట్టి యాడ్చుచుఁ గొమరు మిగులుఁ
బద్మసాలెది వగఁదేఱి బలుమిటారి! 50

(టెంకి=గృహము, స్థానము, ఉనికిపట్టు; కొమరు = సౌందర్యము, మనోజ్ఞత; వగఁదేరి = విలాసము అతిశయించి; మిటారి = విలాసవతి, మదముకలది; నిక్కుకలది.)

సీ॥ పరరాజ పరదుర్గ పరవైభవ శ్రీలఁ
గొనకొని విడనాడు కొండవీడు!
పరిపంథి రాజన్యబలముల బంధించు
కొమరు మించిన జోడు[1] కొండవీడు!
ముగురు రాజులకును మోహంబు పుట్టించు
గుఱుతైన యుతిత్రాడు కొండవీడు!
చటులవిక్రమకళా సాహసంబొనరించు
కుటిలాత్ములకుఁ గాడు కొండవీడు!

తే॥ జనన ఘోటక సామంత సరస వీర
భట నటానేక హాటక ప్రకట గంధ
సింధురారవ మోహనశ్రీలఁ దనరు
కూర్మి నమరావతికి జోడు కొండవీడు! 51

కర్ణాటక రాజాస్థానంలో ప్రౌఢరాయలు శ్రీనాథుని 'నీ నివాసమేది?' అని ప్రశ్నించినప్పుడు చెప్పిన పద్యమిది. ఈ చాటువులో కొండవీటి ప్రాభవ వైభవాలను

1.జోడు=కవచము; దీనికి పాఠాంతరము "బోదు"= కొంచెము ఎత్తైన ప్రదేశము.

బ్రహ్మాండంగా వర్ణించి చెప్పాడు కవిరాజు. ఈ పద్యాన్ని కొద్దిపాటి మార్పులతో శ్రీ అక్కిరాజు ఉమాకాంతం పండితులు పల్నాటి వీరచరిత్రకు ముందుమాటలో ఈ క్రింది విధంగా పొందు పరిచారు.

**పరరాజ పరదుర్గ పరవైభవశ్రీల**
**గొనకొని చెడనాడు కొండవీడు!**
**పరిపంథి రాజన్య బలముల బంధించి**
**కొమరు మించిన జోదు కొండవీడు!**
**ముగురు రాజులకును మోహంబు పుట్టించు**
**గుఱుతైన యుతిత్రాడు కొండవీడు!**

మిగతా పాదాలు మొదటి పద్యంలో వలెనే ఉన్నాయి.

శ్రీ ముద్దులపల్లి గురుబ్రహ్మశర్మ తన 'కొండవీటి సామ్రాజ్యము' అనే గ్రంథంలో ఈ పద్యాన్నే మరో విధంగా ఉదాహరించారు.

**పరరాయ పరదుర్గ పరవైభవశ్రీలఁ**
**గొనకొని విడనాడు కొండవీడు!**

తర్వాత రెండు చరణాలు మొదటి పద్యంలాగానే ఉన్నాయి. నాలుగో చరణం, ఎత్తుగీతి ఈ క్రింది విధంగా ఉన్నాయి.

**చటుల విక్రమకళా సాహసం బొనరించు**
**కుటిలాత్ములకు సూడు కొండవీడు**
**సాధు సౌంధవ భామినీ సరస వీర**
**భట పటానేక హాటక ప్రకట గంధ**
**సింధురాద్భుత మోహన శ్రీలఁ దనరు**
**కూర్మి సమరావతికి జోదు కొండవీడు'!**

జాతి గుర్రాలతో, గంధసింధురాలతో, సామంతరాజులతో, భటనటాదుల సమ్మర్దంతో మహేంద్రవైభవం చాటే ఆనాటి కొండవీటి పట్టణ శోభకు శబ్దరూపమైన చక్కని చిత్రరాజమే పై పద్యం. ఈ పద్యంలోని విశేషమేమంటే– ఏ పాదాని కాపాదమే కాకుండా, పాదార్థానికీ, ప్రతిగణానికి కూడా విరుగుతూ శ్రవణ

శుభగమైన అంత్యానుప్రాసలతో సీసపద్యానికి ప్రజాహృదయ రంజకమైన నూతన నేపథ్యాన్ని సంతరించడం. కొండవీడు మీద శ్రీనాథుడు చెప్పిన ఈ పద్యం ఆ తర్వాత అలాంటి ఎన్నో పద్యాలకు మార్గదర్శకమైంది. "శ్రీనాథుని ఈ పద్యం చెవిని బడగానే మనసును పులకింపజేసి ముఖాన్ని వికసింపజేసేది అతని శయ్యా సౌభాగ్యం. అనర్గళధారతో, ఉదాత్తగమనంతో, రొమ్మువిరుచుకొని నడిచే ఆ పోకడ అనన్య కింకరం. అది ఆ మహాకవి కావ్యాలనిండా రాజవీథీవిహారాలు చేస్తుంటుంది. ఆయన తపఃప్రభావంలో సీసం కరిగి బంగారై, ఉద్ధతగమనంతో, పరిమళించి పారాడుతుంది" అంటారు గడియారం వేంకట శేషశాస్త్రిగారు.

**తే॥ పలికినప్పుడు తేనియ లొలికిపడెడు**
**జళుకుఁ జూపులఁ గ్రొమ్మించు లులికిపడెడు**
**ములికినాటిది కాఁబోలుఁ జెలి కిరాట**
**కలికి, చిలుకల కొలికి, యా తెలికిజోటి! 52**

(క్రీడాభిరామము: ప. 102)

జళుకు = తళుకు; జోటి = ఆడుది, భార్య.

**చ॥ పసగల ముద్దుమోవి, బిగివ్రటువగుబ్బలు, మందహాసమున్,**
**నొసట విభూతి రేఖయుఁ, బునుంగున తావి, మిటారిచూపులున్,**
**రసికులు మేలు!మేలు! భళిరా! యని మెచ్చఁగ, రాచవీటిలోఁ**
**బసిడి సలాకవంటి యొక బల్జవధూటిని గంటి వేడుకన్. 53**

**ఉ॥ పువ్వులు కొప్పునం దురిమి, ముందుగఁ గౌనసియాడుచుండఁగా**
**జెవ్వన జంగసాఁచి, యొకచేతను రోఁకలిఁ బూని యొయ్యనన్**
**నవ్వుముఖంబుతోడఁ దననందనుఁ బాడుచు, నాథుఁ జూచుచున్;**
**'సువ్వియ సువ్వి' యంచు నొక సుందరి బియ్యము దంచె ముంగిటన్!**
**54**

(జెవ్వన = జెప్పున=త్వరగా; జంగ=అంగ=కాలుచాచి పెట్టిన అడుగు)

కII పూజారివారి కోడలు
తా జాఱఁగ, బిందె జాతి దబ్బునఁ బడియెన్,
మైజాఱు కొంగు తడిసిన,
బాజారే తిరిగి చూచి పక్కున నవ్వెన్! 55

ఆ.వె. పూర్వమందు విషము పుచ్చుకొన్నానని
గర్వపడెదవేల కాలకంఠ?
కొండవీటిసీమ బందు జొన్నలకూడుఁ
దిన్న నీదు బైసి తేటపడును! 56

(బైసి = గౌరవమము, కీర్తి)

శాII పొచ్చెంబింతయు లేక, హంసనడతోఁ, బొల్పొందు లేనవ్వుతోఁ,
బచ్చల్ దాపిన కుల్కు ముంగఱ రుచిన్ బాగైన కెమ్మోవితో,
నచ్చంబైన ముసుంగువెట్టి, చెలితో నా మాటలే చెప్పుచున్,
వచ్చెం బో కుచకుంభముల్గదలఁగా వామాక్షి దా నీళ్ళకున్! 57

(పొచ్చెము = కపటము, మోసము; పొలుపొందు=ఒప్పు; ముంగఱ= ముక్కఱ; రుచి = కాంతి; కెమ్మోవి = ఎఱ్ఱని పెదవి; కుచకుంభములు= కుండల వంటి చన్నులు; వామాక్షి= చక్కని కన్నులుగల ఆడుది.)

ఉII బంగరు లింగమూర్తి చనుబంతుల మధ్య నటింపుచుండగాఁ,
జెంగులు జాఱ, మేల్వలువ చీరయు వీడ, మదీప్సితంబు లు
ప్పొంగగ, వామహస్తమునఁ బొల్పగు నీవిని బట్టి, వేడ్కతో
జంగున గోడదాటు నగసాలె శిరోమణిఁ జూచితే సఖా? 58

కII బంగారువంటి మేనును,
శృంగారములొల్కు కుల్కు, చిక్కని చన్నుల్,
బంగారపు నెఱచీరలు,
చెంగటి చూపులు, నియోగిచేడెల కొప్పున్! 59

ఉ॥ బానెడు జొన్నవంటకము, పంటెడు పాలును, మేటి చారు, యెం
తేనియు బుల్లగూర, కడుఁదేరిన మజ్జిగ పెద్దచెంబెఁడున్
బూనిచి, కమ్మచౌదరులు బొట్టలు పెంచుక కొండవీటిలో
గానరు కుంభకర్ణ, గజకర్ల, హిడింబ, బకాసురాదులన్! 60

సీ॥ బాలేందు రేఖ సంపద మించి విలసిల్లు
నొసటి తళ్కుల నీటు నూఱుసేయు,
భ్రమరికా హరినీల చమర వాలములఁ బోల్
వేణీభరముచాయ వేయుసేయు,
దర్పణద్విజరాజ ధాళధళ్యప్రభ
లపనబింబస్ఫూర్తి లక్షసేయుఁ,
గోకహాటకశైల కుంభికుంభారాతి
కుచకుంభ యుగళంబు కోటిసేయు
తే॥ జఘనసీమకు విలువ లెంచంగ వశమె?
దీని సౌందర్య మహిమంబు దేవుఁడెఱుఁగు!
నహహ! యెబ్బంగి సాటిసేయంగవచ్చు?
భావజుని కొల్వు జంగముభామ చెల్వు! 61

ఉ॥ బూడిద బుంగవై, యొడలు పోడిమిఁదక్కి, మొగంబు వెల్లనై,
వాడల వాడలం దిరిగి, వారును వీరును జొచ్చొచో యనన్,
గోడల గొందులందొదిగి కూయుచు నుండెదు కొండవీటిలో
గాడిద! నీవునుం గవివి కావుగదా! యనుమాన మయ్యెడిన్! 62

మ॥ బిగువై, పట్రువలై, విరాజితములై, బింకంబులై, యుబ్బలై,
నగసాదృశ్యములై, మనోహరములై, నాగేంద్ర కుంభంబులై,
సొగసై, బంగరు కుండలై, నునుపులై, సూనాస్త్రు చేబంతులై,
బిగి చేబట్టు కుచద్వయంబులకు నాశీర్వాద మబ్జాననా! 63

సీ॥ బొమవింటఁ దొడిగిన పూవింటిదొర ముల్కి
పోల్కిఁ గస్తురి సోఁగబొట్టు దీర్చి,
చకచకలీను తారకల తళ్కులు వోలెఁ
గొలుకులు వెడలఁ గజ్జలము దీర్చి,
పొదుపు గుబ్బలి మీఁదఁ బొడము నీరెండనా
రంగు చందురుకావి రైక దొడిగి,
పిఱుఁదు పొక్కిలి యను మెరక పల్లము గప్పఁ
బాలవెల్లువ వంటి చేలఁగట్టి,

తే॥ యంచకొదమలగమి బెదరించు పోల్కి
నందెచప్పుళ్ళు ఘల్లుఘల్లనుచు మొఱయ,
నడుము జవజవలాడఁ గీల్జడ ఘటించి,
వచ్చె ముక్కంటిసేవకు మచ్చెకంటి! 64

ఆ.వె. మందరాద్రిసములు మానవులందఱు
చందమామకూన లిందుముఖులు,
కందులేని మౌక్తికంబులు జొన్నలు,
కుందనంపుబెద్ద కుందుగడ్డ! 65

సీ॥ మకరధ్వజుని కొంప నొకచెంపఁ గనుపింపఁ
జీరఁగట్టినదయా చిగురుఁబోఁడి,
ఉభయకక్షములందు నురుదీర్ఘతరములౌ
నెఱులు పెంచినదయా నీలవేణి,
పసపువాసన గ్రమ్మఁ బైఁట చేలము లెస్స
ముసుకు పెట్టినదయా ముద్దుగుమ్మ,
పూర్ణచంద్రునిబోలి పొసఁగ సిందూరంపు
బొట్టు పెట్టినదయా పొలఁతి నుదుట,

తే॥ ఎమ్మెమీఱంగ నిత్తడి సొమ్ము లలర,
నోరచూపులు గుల్క, సింగారమొల్క,
కల్కి యేతెంచె మరుని రాచిల్క యనఁగ,
వలపులకు పేటి, యొక యెద్దెకుల వధూటి! 66

(మకరధ్వజుఁడు = మొసలితనజెండాపై కలవాడు - మన్మథుఁడు; కక్షలు= ప్రక్కలు; వధూటి=ఆఁడుది)

ఉ॥ మిద్దెలు మిద్దెలన్న మన మేడలకంటెను సొంపు మించి బల్
నిద్దపు సౌధజాలములలీల వెలుంగు నటంచు నెంచి నే
నద్దిర! మోసపోతి! సకలాభరణమ్ము లమర్చి, కస్తురిన్
దిద్ది, కచంబు గోసిన సతిం బురుడించును మిద్దె లిచ్చటన్! 67

సీ॥ మీఁగాళ్ళ 'జీరాడు మేలైన కుచ్చెళ్ళ
తీరున మడిచీర తీర్చికట్టి,
బిగువు గుబ్బల మీద నిగనిగల్ దళుకొత్తు
నోర పయ్యెదకొంగు జాఱవైచి,
వలపుల కొక వింత గలుగఁగా గొప్పలౌ
కురులు నున్నగ దువ్వి కొప్పువెట్టి,
నెలవంక నామంబు సలలితంబుగ నుంచి
తిరుచూర్ణ మామీఁదఁ దీర్పుచేసి,
తే॥ యోరచూపుల విటులఁ దా నూరడించి,
గిల్కు మెట్టెల రవరవల్ గుల్కరింపఁ,
జికిలిచేసిన తామ్రంపుఁజెంబు పూని
వీథి నేతెంచె సాతాని వేడ్కలాఁడి! 68

ఉ॥ మీనవిలోచనంబులును, మీటిన ఖంగను గుబ్బచన్ను, లిం
పైన వచోమృతంబు, సొగసైన మదాలస మందయానముం
గా నొనరించి, దీని గణికామణిఁ జేయక నిర్దయాత్ముఁ డై
గానులదానిఁ జేసిన వికారవిధిం దలఁగొట్టగావలెన్! 69

క॥ ముడివిటులు, విధవలంజెలు,
పదకవితలు, మాఱుబాస బాపనవారల్,
చరువని పండితవర్యులు,
కదనాస్థిర వీరనరులు కడిదిపురమునన్ 70

(క్రీడాభిరామము)

క॥ రంభాస్తంభము లూరువు.
లంభోరుహ నిభము లక్షు, లతను శరంబుల్,
జంభాసురారి మదగజ
కుంభము లీ నంబివారికోడలి కుచముల్! 71

క॥ రసికుఁడు పోవఁడు పల్నా,
డెసఁగంగా రంభయైన నేకులె వడుకున్,
వసుధేశుఁడైన దున్నును,
కుసుమాస్త్రుండైన జొన్నకూడే కుడుచున్! 72

చ॥ వడిసెల చేతబూని, బిగివట్రువ గుబ్బలఁ బైఁట జాఱఁగా,
నడుము వడంకగాఁ, బిఱుఁదు నాట్యముసేయఁగఁ గొప్పు వీడగా,
దుడదుడ మంచెయెక్కె నొక దొడ్డమిటారపుఁ గమ్మకూఁతురున్,
దొడదొడ మంచమెక్కె నొక దొడ్డమిటారపు రెడ్డికూఁతురున్! 73

ఉ॥ వాలగు కన్నుదోయి, బిగి వట్రువ గుబ్బలు, కాఱుచీఁకటిం
జాల హసించు కొప్పుజిగి, సారసమున్నగు మోముగల్గు నా
బాలికఁ గూలికమ్ముకొన బట్టలు నేసెడివాని కిచ్చె, హా!
సాలెత గాదురా! కుసుమసాయకు పట్టపుదంతి యింతియే? 74

ఉ॥ వాసన గల్గు మేను, నిడువాలు గనుంగవ, గబ్బిగుబ్బలున్,
గేసరిమధ్యమున్, మదనకేళికి నింపగు బాహుమూల వి
న్యాసము గల్గినట్టి యెలనాగను, బోగముదానిఁ జేయ కా
దాసరిదానిఁ జేసిన విధాతను నేమనవచ్చు నీశ్వరా! 75

సీ॥ విడిన కొప్పున జాజివిరులొప్పఁగా రాలఁ,
జిట్టికుంకుమచుక్కబొట్టు చెదర;
చక్కఁగా బటువారు సందెఁడు కుచ్చెళ్ళు
చెలఁగు మెట్టియలపైఁ జిందులాడ;
కొదమగుబ్బలఁ బైఁటకొంగు సయ్యన జాఱ,
ముక్కునత్తొక వింతముద్దు గుల్క;
మొలగఁట లిమ్మగు మ్రోఁతతో రంజిల్లఁ,
గనకంపు లందియల్ ఘల్లురనఁగఁ;
తే॥ బొసఁగఁ గర్పూర వీడ్యముల్ పొందుపఱిచి,
అనుఁగుఁ జేడెలతో ముచ్చట లాడికొనుచు,
నలరు సింహాద్రి పైకెక్కి హర్షముననుఁ
వచ్చెఁ గలకంఠి వేపారిమచ్చెకంటి! 76

(బటువారు = అధికమైన; కలకంఠి = అవ్యక్తమధురమైన ధ్వనిగలస్త్రీ; మచ్చెకంటి = చేపలవంటి కన్నులుకలది.)

తే॥ వీనులకు విందులై తేనేసోన లెనయ
ముందు రాగంబునను జగన్మోహనముగ
పాడె నొక జాలరి మిటారి, యీడులేని
కాకలీనాదమున నోడగడపుపాట! 77

ఉ॥ వీరులు దివ్యలింగములు, విష్ణువు చెన్నుఁడు, కల్లిపోతురా
జారయఁ గాలభైరవుడు, నంకమశక్తియ యన్నపూర్ణయున్,
గేరెడి గంగధారమడుగే మణికర్ణికగాఁ జెలంగు నీ
కారెమపూఁడి పట్టణము కాశిగదా పలినాటివారికిన్! 78

తెలుగు సాహిత్యచరిత్రలో ఆంధ్రస్త్రీల అద్భుత సౌందర్యాన్ని వర్ణించిన మొట్టమొదటికవి, చిట్టచివరికవి కూడా శ్రీనాథకవిసార్వభౌముడు మాత్రమే! ఆంధ్రదేశమంతటా పర్యటించి, అష్టాదశవర్ణాల స్త్రీలను వర్ణించాడు. బ్రాహ్మణులతో ఇంచుమించు అన్ని శాఖల అతివలనూ వర్ణించాడు. వివిధ కులముల తెలుగు యువతుల అందచందములనేకాదు, ఆనాటి స్త్రీలలోఉండే దుర్భర దారిద్ర్యాన్ని కూడా వర్ణించిన మహాకవి శ్రీనాథుడు – అనడానికి ఈ క్రింది పద్యం సాక్ష్యం! (–తంగిరాల)

**ఉ॥ వీసపు ముక్కునత్తు, నరవీసపు మంగళసూత్ర, మమ్మినన్**
**గాసుకురాని కమ్మ, లరకాసును గానివి పచ్చపూసలున్,**
**మాసినచీర కట్టి, యవమాన మెసంగఁగ నేఁడు రాఁగ, నా**
**కాసలనాటివారి కనకాంగిని జూచితి నీళ్లరేవునన్! 79**

**క॥ వ్రాలని నీ చన్నులతో**
**వ్రాలెడి జక్కవలు సరియె? వలలంబెట్టం**
**జాలెదు నీ కన్నులతో**
**బాలకి! సదృశములె వలలఁబడు మత్స్యంబుల్? 80**

(క్రీడాభిరామము : ప. 91)

**ఉ॥ సన్నపు చీరఁగట్టి, దిగజాఱిన చీరచెరంగు నొక్క చేఁ**
**జన్నులపైనిఁ జేర్చుకొని, చన్నులు ప్రోడతనంబు మీఱ, నా**
**సన్నజనంబు గ్రోల, సరసంపు మృదూక్తులు తేనెలూర, వా**
**ల్గన్నులు భీతిఁదీరఁ, దెలగాణ్యపుసుందరి వచ్చె నీళ్లకున్. 81**

**క॥ సర్వజ్ఞ నామధేయము,**
**శర్వునకే, రావుసింగజనపాలునకే**
**యుర్విం జెల్లును, దక్కొరు**
**సర్వజ్ఞుండనుట కుక్క సామజమనుటే! 82**

రాజాధిరాజైన ప్రౌఢరాయల ముత్యాలశాలలో కనకాభిషేకం చేయించుకో గలిగాడు శ్రీనాథుడు. తదుపరి సాహితీరంగంలో సర్వజ్ఞుడైన సింగభూపాలుని

పరమేశ్వరునంతటివాడు అని ధ్వనించేలా పొగిడి రాచకొండ ప్రభువుచే మహా గౌరవాలను పొంది నీచస్థానంలో ఉంచిన పెదకోమటి వేమన బొమ్మను తీయించాడు. "నందికంత పోతరాజు" అనే కఠారిని తిరిగి కొండవీటికి తెచ్చాడు.

పై చాటువును గురించి ఒక కథ ప్రచారంలో ఉంది. శ్రీనాథుడు సర్వజ్ఞ సింగభూపాలుని ఆస్థానంనుండి రెడ్ల ఆస్థానికి తిరిగి రాగా, రెడ్డిరాజులు అతనిని 'ఇచ్చకాలమారి' అని ఆక్షేపించారట. తమకు గర్భశత్రువైన సింగభూపతిని సర్వజ్ఞుడని పొగడడం వారికి నచ్చలేదు. అప్పుడు శ్రీనాథుడు వారికిలా బదులిచ్చాడు. 'ఆ పద్యానికి అంతరార్థమున్నది. గూఢంగా సింగభూపతిని వెక్కిరించినాను' – "సర్వజ్ఞ నామధేయము శర్వునకే! రావు సింగజనపాలున కేయుర్విం జెల్లును? తక్కొరు (ఈశ్వరుని కాక) సర్వజ్ఞుండనుట కుక్క సామజమనుటే!" అని చెప్పి వారిని సమాధానపఱచినాడట.

**సీ॥ సొగసు కీల్జడదాన! సోగకన్నులదాన!**
**వజ్రాలవంటి పల్వరుసదాన!**
**బంగారు జిగిదాన! పటువు గుబ్బలదాన!**
**నయమైన యొయ్యారి నడలదాన!**
**తోరంపుఁగటిదాన! తొడల నిగ్గులదాన!**
**పిడికిట నడఁగు నెన్నడుముదాన!**
**తళుకుఁజెక్కులదాన! బెళుకు ముక్కరదాన!**
**సింగాణి కనుబొమ చెలువుదాన!**
**తే॥ మేలిమి పసిండి రవకడియాలదాన!**
**మించిపోనేల రత్నాలమించుదాన!**
**తిరిగిచూడవె ముత్యాలసరులదాన!**
**చేరి మాటాడు చెంగావిచీరదాన!** 83

**సీ॥ హరినీలముల కప్పు లణగించు నునుకొప్పు**
**విడఁ బువ్వుదండ దా వీడఁ బాఱఁ,**
**గోటిచందురుడాలు గోటుసేయగఁజాలు**
**మొగము కుంకుమచుక్క సొగసు గులుక,**

నల జక్కవల టెక్కు లణఁగఁద్రొక్కఁగ నిక్కు
పాలిండ్లపై నాఁచు పైఁట జాఱ,
నిసుకతిన్నెలమెట్టు పసిఁడి చెంపలఁగొట్టు
పిఱుఁదుపై మొలనూలు బెళుకుఁదేర,
తే॥ జిగురు కెమ్మోవి పగడంపు బిగియు మెఱయ,
మాటలాడఁగఁ గనుదోయి తేటలమరఁ,
జెమట లూరంగ సింహాద్రి చేరవచ్చె
భోగగుణధామ! యాంధ్ర నియోగిభామ! 84

సీ॥ హరినీలముల కప్పు లదలించు నునుకొప్పు
చెంగావి ముసుకులోఁ జిందులాడ,
చక్రవాకముల మెచ్చని బలు సిబ్బెపు
బిగువు చందోయి పింపిళ్ళుకూయ,
ధవళాబ్జ రుచులునాఁ దళుకు లీనెడు నవ్వు
వెన్నెలనిగ్గుతో వియ్యమంద,
గొంతుకూర్చొని రసికుల దర్శనస్పర్శ
నంబుల మోహద్రవంబు జాఱ,
తే॥ నెడమ కుడి హస్తముల సన్నలెసఁగ, విటుల
రమ్ము రమ్మని పిలుచు గారవము దోప,
నుర్వి మెఱయించు కార్పాస పర్వతంబు
చేరి మర్దించె నొక్క పింజారి తరుణి! 85

పింపిళ్ళుకూయు = నర్తించు, చిందులు త్రొక్కు, ఎగిరిపడు; కార్పాసము = ప్రత్తి.

ఉ॥ హా జలజాక్షి! హా కిసలయాధర! హా హరిమధ్య! హా శర
ద్రాజనిభాస్య! హా సురతతంత్రకళానిధి! యెందుఁబోయితే!
రాజమహేంద్రవీథిఁ గవిరాజు ననుం గికురించి, భర్గ కం
ఠాజిత కాలకూట ఘటికాంచితమైన యమాసచీఁకటిన్! 86

**శా॥ బ్రాహ్మీదత్త వరప్రసాదుఁడ, వురుప్రజ్ఞావిశేషోదయా**
**జిహ్మస్వాంతుఁడ, వీశ్వరార్చనకళాశీలుండ, వభ్యర్హిత**
**బ్రహ్మాండాది మహాపురాణచయ తాత్పర్యార్థ నిర్ధారిత**
**బ్రహ్మజ్ఞాన కళానిధానమవు, నీ భాగ్యంబు సామాన్యమే!**

తా॥ ఓ శ్రీనాథ పండితుడా! నీవు సరస్వతివలన కోరిన వరము పొందినవాడవు. గొప్పదయిన ప్రతిభాశయముయొక్క పుట్టుకచేత సరళమయిన చిత్తము కలవాడవు (గొప్ప ప్రతిభావంతుడవు). ఎల్లప్పుడును ఈశ్వరుని పూజించే శీలము కలవాడవు. సకల పురాణరహస్యమయిన బ్రహ్మజ్ఞానమువలన బ్రహ్మానందమనుభవించుచున్న వాడవు. నీ భాగ్యము సామాన్యమైనదికాదు. (నీ అదృష్టము ఇతరులకు లేదు.)

(-వేదం వేంకటరామశాస్త్రిగారి వ్యాఖ్య)

**సూక్తి ముక్తావళి**

**శ్లో॥ పండితే వాపి మూర్ఖే వా - దరిద్రే వా శ్రియాన్వితే ।**
**దుర్వృత్తే వా సువృత్తే వా- మృత్యోః సర్వత్ర తుల్యతా ॥**

చదువుకొనినవాడు - మూర్ఖుడు, దరిద్రుడు - ధనికుడు, సద్వర్తనుడు - దుర్వర్తనుడు అందరూ మృత్యువునకు సమానమే!

(నారదీయపురాణం, 1-7-59).

**శ్లో॥ యత్ ప్రాతః సంస్కృతం చాన్నం - సాయం తచ్చ వినశ్యతి ।**
**తదీయ రస సంపుష్టి - కాయే కా నామ నిత్యతా? ॥**

ప్రొద్దున వండిన అన్నం-సాయంకాలమయేసరికి పాసిపోతుంది. అన్నరసంతో పెరిగిన శరీరం నిత్యమా? (భాగవత మాహాత్మ్యం, 5-61)

**శ్లో॥ శ్వాస ఏవ చపలః క్షణ మధ్యే యో గతాగత శతాని విధత్తే ।**
**జీవితేఽపి తదధీన చేతసా కః సమాచరతి ధర్మవిలంబమ్ ॥**

ఊపిరే అస్థిరమైనది. అది ఒక్క క్షణంలో వందసార్లు వస్తూ పోతూ ఉంటుంది. ప్రాణం ఊపిరిలో ఉన్నది. ఈ సంగతి గమనించిన వాడెవడైనా ధర్మకార్యాలు చేయటం ఆలస్యం చేస్తాడా? (పద్మపురాణం, 4-95-49)

**- ఆకాశవాణి సూక్తిముక్తావళి,**

ఏలూరిపాటి అనంతరామయ్య, పుటలు 111-113

## అనుబంధం-5

# భృంగపంచకము

ఇది శ్రీనాథకృతి యందురు.

సౌందర్యశాలినియగు నొక నరపాలునిదేవేరి యమాత్యునకుఁ జనపుపడి యుండెను. ఒకప్పు డాభూపతి కార్యవశమున స్థలాంతరమున కరుగుడు, నామంత్రి యంతిపురమునఁ జేరుకొని, రాజమహిషితోఁ గేరింతలాడుచుండెను. పుడమితేఁడును నాఁటి రేయికే మరలఁ దిరిగి వచ్చుటయుఁ, గోటలోనికి వచ్చిన తోడన కవాటము లెల్ల బంధింపఁబడుటయు నెఱిఁగి, దూతికయొకర్తె ఈ వృత్తాంతము అమాత్యునకుఁ దెలిపి, దాఁకొనుటకు భృంగాపదేశమునఁ జెప్పినది.

**ఉ॥ మాయురె! భృంగమా! వికచమల్లికలన్ విడనాడి, తమ్మిలో**
**నీయెడఁ బూవుఁదేనియల నింపుజనింపఁగఁ గ్రోలి, సొక్కియున్,**
**బోయెద నన్న భ్రాంతి నినుఁ బొందదు, రా జుదయించె, నిప్పుడీ**
**తోయజపత్రముల్ వరుసతో ముకుళించెఁ, జలింపకుండుమా! 1**

పుడమితేఁడు శయనాగారమున కరిగినపిదపఁ, గొంతదడవునకు మంత్రి యిఱుకటమున దాఁగియుండఁజాలక, యిటునటుఁ గదలఁగాఁ, జప్పుడగుట విని, మఱల నాదూతి చెప్పునది.

**చ॥ అళికులవర్య! పద్మముకుళాంతరమందు వసింపనేరమిన్**
**జలనము సెందెదేమి, నవసారసమిత్రుఁడు రాకయుండునా?**
**తొలఁగక యందె యుండు, మిఁకఁ దోయజవైరి తిరంబె, రాత్రి,యీ**
**కలవరమేల? తమ్మితుద గానక తూఱక యూరకుండుమా! 2**

సాధ్వీమణియగు నామంత్రి భార్య, తేఁ దంతిపురమునఁ జేరుటవిని, రేయి రెండుజాములు కడచనినను దనభర్త యిలుసేరమిచే దిగుల్పడి, యేమికీడు వాటిల్లెనో యని కనుఁగొనరాఁగా, నామెనుగూర్చి దూతి చెప్పునది.

**మ॥ అలినీ! తత్తఱ మేలె? నేఁడు నిదె నీయాత్మేశుఁడౌ భృంగమున్**
**జలజాసక్తమరందపానవశతన్ సానందుఁడై యున్నవాఁ**
**డులుకింతేనియు లేక, నీ వరుగుమా! యొప్పార నిప్పాట నీ**
**చెలువుందుం బఱతెంచుఁ దేకువను రాజీవంబు పుష్పించినన్. 3**

తామింక వెలుపలకు దయచేయుండని మంత్రికిని బోధించుచుఁ జెప్పునది.

**మ॥ పతినిద్రించినవేళ రాఁదగున యోపద్మారి యాకేళికా**
**యతనంబందు రతిశ్రమన్ విభుఁడు నిద్రాసక్తుఁడై యుండె, నీ**
**శతపత్రేక్షణ మోమువాంచినది, నీసామర్థ్యమున్ జూపఁబో**
**కతివేగంబున నేఁగుమా! తొలఁగి మాయాత్మల్ సుఖంబందఁగన్. 4**

రేయి రాజమహిషి తనకంఠహారమును మంత్రికంఠమున వైచెను. అతఁడు నదిమఱచి మఱునాఁడు దానిఁదాల్చియే రాజసభ కరుదెంచెను. అది గాంచి, రాజు గుఱుతించునేమోయని భీతిలి నిపుణయగు నాదూతి రాయబారివంటివేషమున నరుగుదెంచి, యీ క్రిందిపద్యమును జదువ, నందలి "మానపరిపాల" యను విశేషణముఁ బట్టి మంత్రి తెలిసికొని, తన కంఠమందలి హారమును బైపచ్చడమునఁ జుట్టి పారితోషికముగా నొసంగెను.

**చ॥ అతుల సభాంతరస్థిత బుధావళికెల్ల జొహారు, వీరరా**
**హుతులకు మేల్జొహారు, సతతోజ్జ్వలవిక్రమ సార్వభౌమసం**
**తతికి జొహారు, వైభవ వితాన పురందరుఁడైనయట్టి భూ**
**పతికి జొహారు, మానపరిపాల! జొహారు ప్రధానశేఖరా! 5**

(వేటూరి ప్రభాకరశాస్త్రిగారి "చాటుపద్యమణిమంజరి" ప్రథమభాగము నుండి...)



అనుబంధం - 6

# బమ్మెర పోతన

ఈతఁడు క్రీ.శ. 1400, ప్రాంతముల నున్నవాఁడు. శ్రీనాథునకు బావమఱఁది యందురు. శ్రీ భాగవతము, భోగినిదండకము, వీరభద్రవిజయము నీతని కృతులు. కొందఱు, భోగినీదండక వీరభద్ర విజయములకుఁ బోతనకర్తృత్వ మునెడ సంశయపడెదరు. ఈపవిత్రకవి వైషయికేచ్ఛావైముఖ్యమును బ్రశం సించు కట్టుకతలు కొన్ని కలవు. వానిని విడచి, యాప్రసక్తిలోని పద్యము లుదా హరించెదను.

**ఉ॥ కాటుక కంటినీరు చనుకట్టుపయింబడ నేల యేడ్చెదో**
**కైటభదైత్యమర్దనుని గాదిలి కోడల! యోమదంబ! యో**
**హాటకగర్భురాణి! నిను నాఁకటికై కొనిపోయి, యల్ల క**
**ర్ణాటకిరాటకీచకుల కమ్మఁ, द्रిశుద్ధిగ నమ్ము భారతీ!** 1

శ్రీనాథకవీశ్వరుఁడు, పోతనామాత్యునితో నిట్లనియె నట!

**క॥ కమ్మని గ్రంథం బొక్కటి!**
**యిమ్ముగ నేనృపతికైనఁ గృతియిచ్చినఁ గై**
**కొమ్మని యీయరె యర్థం?**
**బిమ్మహి దున్నంగనేల యిట్టిమహాత్ముల్?** 2

దీనికి సమాధానంగా పోతన ఈ క్రింది విధంగా అన్నాడని ఒక కట్టుకథ:-

**ఉ॥ బాలరసాలసాల నవపల్లవ కోమల కావ్యకన్యకన్**
**కూళలకిచ్చి, అప్పడుపుకూడు భుజించుటకంటె, సత్కవుల్**
**హాలికులైననేమి? గహనాంతర సీమల కందమూల గౌ**
**ద్దాలికులైననేమి? నిజదార సుతోదర పోషణార్థమై!** 3

కాని పై పద్యం పోతనగారిది కాదు; మంచన "కేయూరబాహుచరిత్ర"లోనిది.



## అనుబంధం - 7

# "పెమ్మయ సింగధీమణీ!"

## (పెమ్మయ సింగరాజు శతకం)

## (క్రీ.శ. 15వ శతాబ్ది)

"పెమ్మయ సింగధీమణీ!" అనే మకుటంతో ఈనాడు మనకు కొద్ది పద్యాలు మాత్రమే లభిస్తున్నాయి. కాని యిది పూర్తిశతకమనీ, దీని రచయిత పేరు "పెమ్మరాజు సింగరాజు" అనీ, ఇతడు విజయనగర ప్రభువైన ప్రౌఢదేవరాయల కాలమువాడనీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు నిరూపించారు. మా అన్నయ్యగారు "పెమ్మయ సింగధీమణీ!" అనే మకుటంతో ఉన్న పద్యాలు నాల్గింటిని సేకరించారు. వీటిలో "మిరియములేని కూరయును...." అనే పద్యాన్ని చమత్కార పద్యాలలో 9వ పద్యంగా ఇచ్చారు. "వాసనలేని పువ్వు..." అనే పద్యాన్నీ, "గారెలు లేని విందు..." అనే పద్యాన్నీ, "వద్దన పద్యమేల?..." అనే పద్యాన్ని హాస్యపద్యాలలో 8,9, 34 సంఖ్యలుగల పద్యాలుగా ఇచ్చారు. కాని వేటూరి ప్రభాకరశాస్త్రిగారు "చాటుపద్యమణిమంజరి" – ద్వితీయభాగంలో "పెమ్మయ సింగధీమణీ!" మకుటంలో 14 పద్యాలు ఉన్నాయి. వీటిలో "మిరియములేని కూరయును..." అనే పద్యం, "వాసనలేని పువ్వు..." అనే పద్యం, "పద్దెము లోభికేల?" అనే పద్యం ఉన్నాయి. కాని, "గారెలులేని విందు..." అనే పద్యం మాత్రం లేదు. ఈ పద్యాన్ని మా అన్నయ్యగారు ఎక్కడ సేకరించారో నాకు తెలియదు. (వేమన పద్యాలకు వేలకొలదీ అనుకరణ పద్యాలు పుట్టినట్లుగా ఇది అనుకరణ పద్యమేమో తెలియదు.) ఇప్పుడు ప్రభాకరశాస్త్రిగారు ఇచ్చిన 14 పద్యాలనూ వరుసగా దిగువ ఇస్తున్నాను. తరువాత మా అన్నయగారు సేకరించిన "గారెలు లేని విందు...." అనే పద్యాన్ని కూడా చివర 15వ పద్యంగా ఇస్తున్నాను. అన్నీ ఒకచోట ఉంటాయి. – తంగిరాల వెంకట సుబ్బారావు (సంపాదకుడు)

**చ॥ మిరియము లేని కూరయును, మెచ్చునెఱుంగనివారి యీవియున్,**
**గరగరగాని భోజనము, కన్నుల పండువుగాని రూపమున్,**
**మురిపములేని యౌవనము, మోహములేని లతాంగి కూటమున్,**
**సరసుల కింపుగావు సుగుణాకర! పెమ్మయ సింగధీమణీ ! 1**

పోర్చికీసువారు (బుడతకీచులు) మనదేశమునకు రాక పూర్వ మిక్కడ మిర్యపుగాయలు (మిరపకాయలు) లేవు, కారమునకు మిరియములే యుపయోగించెడి వారు. ఆ దేశమునుండి పోర్చికీసువారే తొలుత వీనిని మనదేశమునకుఁ దెచ్చిరి. కావుననే నేఁటికిని గొందఱు. వైదికకృత్యములందుఁ గారమునకుఁ మిర్యములనే యుపయోగింతురు. మిరియములకు బదులుగా నేర్పడినవిగాన వీనిన్ని మనవారు మిర్యపుఁగాయ (మిరపకాయ) లనిరి.

**ఉ॥ మచ్చిక లేని చోట, ననుమానము వచ్చిన చోట, మెండుగాఁ**
**గుచ్చితులున్నచోట, గుణకోవిదు లుండని చోట, విద్యకున్**
**మెచ్చని చోట, రాజుకరుణించని చోట, వివేకులుండిరే**
**నచ్చట మోసమంద్రు సుగుణాకర! పెమ్మయ సింగధీమణీ! 2**

**ఉ॥ వాసనలేని పువ్వు, బుధవర్గములేని పురంబు, నిత్యవి**
**శ్వాసములేని భార్య, గుణవంతుఁడుగాని కుమారుఁడున్, సద**
**భ్యాసములేని విద్య, పరిహాసప్రసంగములేని వాక్యమున్,**
**గ్రాసములేని కొల్వు, కొఱగానివి పెమ్మయ సింగధీమణీ! 3**

**ఉ॥ ఆడిక కోడఁడేని, యుచితానుచితంబు లెఱుంగఁడేని, ము**
**న్నాడినమాట తాఁ దిరుగ నాడక యుండఁడ యేని, ప్రల్లదం**
**బాడెన యేని, సిగ్గు వినయంబు నయంబును వీడెనేని, వాఁ**
**డేడ నియోగియయ్యెడు మహీస్థలిఁ, బెమ్మయ సింగధీమణీ! 4**

**ఉ॥ మాడలమీఁద నాసగల మానిసి కెక్కడి కీర్తి, కీర్తిపై**
**వేడుకగల్గునాతనికి విత్తముమీఁద మతెక్క డాస, యీ**
**రేడు జగంబులందు వెలహెచ్చిన కీర్తి ధనంబు గాంచి,**
**ప్రౌఢయశంబుఁ జేకొనియెఁ బెమ్మయ సింగఁడు దానకర్ణుఁడై. 5**

ఉ॥ పెట్టక కీర్తిరాదు, వలపింపక యింతికి నింపులేదు, తాఁ
దిట్టక వాదులేదు, కడు ధీరత వైరుల సంగరంబులోఁ
గొట్టక వాఁడిలేదు, కొడుకొక్కడు పుట్టక ముక్తి రాదయా,
పట్టపురాజుకైన, నిది పద్ధతి, పెమ్మయ సింగధీమణీ! 6

(వాఁడి = శౌర్యము)

ఉ॥ ఇప్పటి దాతలర్థులకు నియ్యఁగఁజాలక, రాగిబిందెలన్
ద్రుప్పులు పట్టఁ, బాఁతులిడి దూఁకొని యుండఁగ, బండికండ్లతో
గుప్పున ఔమ్ముగ్రుద్ది, దివెకోలలు పుచ్చుక మోము గాల్పఁగా,
నప్పుడుగాని యియ్యరు, గుణాకర! పెమ్మయ సింగధీమణీ! 7

(బండికల్లు = రథచక్రము)

ఉ॥ ఎవ్వరిసొమ్ము నెంత దిన నెవ్వరికున్నదొ; ప్రాప్తిగల్గినన్
దవ్వులనున్నఁ బిల్చి తముఁదార యొసంగుదు రంతయంత; పై
నవ్వల నెంత వేడినను, నా ప్రభు వెంత యొసంగఁ జూచినన్,
గవ్వయు నివ్వనీదు తన కర్మము, పెమ్మయ సింగధీమణీ! 8

ఉ॥ అక్కజమైన దుర్జనుని కారయ బుద్ధు లవెన్ని నేర్చినన్
జక్కటి కేలవచ్చు; విను సాదృశ మొక్కటి-వేఁపవిత్తుకున్
జక్కెర పాదిచేసి, యనిశంబును బాలునుపోసి పెంచినన్,
దక్కునె దానిచేదు వసుధాస్థలిఁ, బెమ్మయ సింగధీమణీ! 9

ఉ॥ మానమె భూషణంబు, చనుమానమె సౌఖ్యకరంబు, నిర్మల
జ్ఞానమె ము క్తికాస్పదము, గానమె విద్యలకెల్ల రాజు, సం
తానమె పో ఫలంబు, మహి ధర్మమె తోడు తలంపఁగా, నుదా
సీనమె వీడుకోలు, గుణశేఖర! పెమ్మయ సింగధీమణీ! 10

(చనుమానము = చనువు, స్నేహము)

ఉ॥ సత్యము లేని చోటఁ, దను సమ్మతి చెందని చోట, సాధుసాం
గత్యము లేని చోట, ధనకాంక్ష మునింగిన చోట, శత్రురా
హిత్యము లేని చోట, ఋణమీయని చోటను, గాపురంబుఁ దా
నిత్యముఁ జేయరాదు సుమి; నిక్కము పెమ్మయ సింగధీమణీ! 11

చ॥ బూరుగుమ్రాని యున్నతియుఁ బూవులుఁ బిందెలుఁ జూచి, యాసతో
గీరము లాఱునెల్లు తమకించుచునుండి, ఫలాభిలాషితన్
జేరి, రసంబుగ్రోలుటకుఁ జించిన, దూదియు రేఁగునట్టు, లా
కూరిమిలేని రాజులను గొల్చుట; పెమ్మయ సింగధీమణీ! 12

చ॥ మనవికి నొక్కయేడు; ననుమానపుమాటకు నాఱునెల్లు; నే
డనిపెదనన్న మాసమవు; నన్నెద పొమ్మనఁ బక్షమౌను; తత్
క్షణ మిదె యంపితన్న మఱి నంతయు వచ్చును; మోక్షమింక నా
మనవికి నెన్నఁడో? సుజనమాన్యుఁడ! పెమ్మయ సింగధీమణీ! 13

ఉ॥ పద్దెము లోభికేల? మఱి పందికి జాఫరుగంధమేల? దు
క్కెద్దుకు పంచదారటుకులేల? నపుంసకుఁడైనవానికిన్
ముద్దులగుమ్మ యేల? నెఱముక్కఱ యేల వితంతురాలికిన్?
గద్దకు స్నానమేమిటికిఁగావలెఁ? బెమ్మయ సింగధీమణీ! 14

(వేటూరి ప్రభాకరశాస్త్రిగారి "చాటుపద్యమణిమంజరి" ద్వితీయ భాగమునుండి...)

మా అన్నయ్యగారు సేకరించిన అదనపు పద్యం:-

ఉ॥ గారెలులేని విందు- సహకారములేని వనంబు - తొల్త నోం
కారములేని మంత్ర - మధికారములేని ప్రతిజ్ఞ - వాక్చమ
త్కారములేని తెల్వి - గుణకారము లేనటువంటి లెక్క-సా
కారముగాని పూజ-కొఱగానివి పెమ్మయ సింగధీమణీ! 15



**అనుబంధం - 8**

# తెనాలి రామకృష్ణుని చాటువులు

## (క్రీ.శ. 16వ శతాబ్ది)

**సేకరణ-వివరణ: డా॥ వి.వై.వి. సోమయాజిగారు**

**1. సమస్యను పూరించిన కథ:**

రామలింగకవి భువనవిజయసభలో చమత్కారమైన పద్యాలు చెప్పి, రాయల వారినుండి బహుమానాలు తరచుగా అందుకోవడం సాటికవులకు అసూయా కారణమైంది. ఎలాగైనా రాయలవారి దగ్గర అవమానించాలని నిశ్చయించుకొని, ఒక ద్వారపాలకునిచేత ఒక సమస్యను అడిగించారు. ఆ సమస్య ఇది -

**'కుంజరయూథంబు దోమకుత్తుకఁ జొచ్చెన్".**

ద్వారపాలకుడీ సమస్యను అడిగే సరికి, సూక్ష్మగ్రాహియైన రామలింగనికి విషయమర్థమై క్రింది విధంగా పూరించాడు.

**క॥ "గంజాయి త్రాగి తురకల**
**సంజాతముతోడ కల్లు చవిగొన్నావా?**
**లంజల కొడకా! ఎక్కడ**
**కుంజరయూథంబు దోమకుత్తుక జొచ్చెన్?"**

ద్వారపాలకునిద్వారా పూరణాన్ని విన్న సాటికవులు రామలింగడు 'బలే దొరికాడు' అని అదే సమస్యను రాయలవారికి చెప్పి రామలింగడు రాగానే పూరించమని అడిగించారు. పై విధంగానే రామలింగడు పద్యాన్ని పూరించి, రాయల ఆగ్రహానికి పాత్రుడు కావాలని వారి కోరిక. ఎదుటివారి ఊహలకు అందితే తెనాలికవి గొప్పతనమేముంది? రాయలవారికి ఈ విధంగా పూరించి చెప్పాడు -

**క॥ "రంజన చెడి పాండవు లరి**
**భంజనులై విరటుఁ గొల్వ పాల్పడి రకటా!**
**సంజయ! విధినేమందును**
**కుంజరయూథంబు దోమకుత్తుకఁ జొచ్చెన్!"**

రామకృష్ణుని సమయస్ఫూర్తికి, ప్రతిభకు సంతోషించి రాయలు సత్కరించారు.

ఈ కథలో తెనాలికవి తన ప్రత్యర్థుల వ్యూహాన్ని క్షణాలపై కనిపెట్టి, సమయ స్ఫూర్తితో తిప్పికొట్టడం, పైగా రాయల అభిమానానికి పాత్రుడు కావడం కనిపిస్తుంది. ప్రతిభావంతుడు ప్రతికూలవాతావరణాన్ని కూడ తనకు అనుకూలంగా ఎలా మలుచుకోగలడో అవగతమౌతుంది.

**2. "సహస్రఘంటకవి"ని ఓడించిన కథ :**

ప్రగడరాజు నరసన్న అనే ఒక గొప్పకవి రాయలసభకు వచ్చి, తనతో పోటీ పడవలసిందిగా భువనవిజయకవులపై సవాలు విసిరాడు. అతడికి "సహస్రఘంటకవి" అని బిరుదు కూడా ఉంది. అతని పాండిత్యాన్నిగూర్చి విన్న రాయలకు మళ్లీ దిగులు ప్రారంభమైంది. పెద్దనాదుల సలహాపై రామలింగకవిని సభాగౌరవం కాపాడవలసినదిగా కోరారు. రామలింగకవి అంగీకరించి మరునాడు సభను ఏర్పాటుచేయమన్నాడు.

ముందుగా సహస్రఘంటకవి ప్రవేశించగా యథోచిత సత్కారాలు చేస్తున్నారు. ఇంతలో ప్రతీహారి "లక్షఘంటకవి" రాకనుగూర్చి రాయలకు నివేదించాడు. ఇద్దరు మహాకవుల రాక తన అదృష్టంగా భావిస్తున్నానని రాయలు అతణ్ణి కూడ ఆహ్వానించి, గౌరవించాడు. ఇరువురు కవులను పరస్పరం పరిచయం చేశాడు. లక్షఘంటకవి సహస్రఘంటకవితో "అయ్యా! నాకింతవరకు, నేను చెప్పిన దానిని తప్పులు లేకుండా వ్రాయగలవాడు, నేను చెప్పినపద్యంలో తప్పులు పట్టగలవాడు కనిపించలేదు. ఆపనులు తమరు చెయ్యగలరా?" అన్నాడు. 'ఈ చిన్న విషయానికే తనను ప్రశ్నిస్తాడా?' అనే అహంభావపు దృష్టితో చూస్తూ సరేనన్నాడు. రామలింగడు ఈ క్రింది పద్యాన్ని చదివి వ్రాయమన్నాడు–

**కII "తృవ్వట బాబా, తలపై**
**పువ్వట జాబిల్లి, వల్వ బూదట, చేదే**
**బువ్వట, చూడగను హుళ**
**క్కవ్వట, అరయంగ నట్టి హరునకు జేజే"**

ఇందులో "తృవ్వట" అనే చోట వ్రాయడం కష్టమయే ఉచ్చారణతో చదివాడు. ప్రగడరాజు నరసన్న మొదటిపాదంలోని మొదటిపదంలోనే వ్రాయడమెలాగో తెలియక ఆగిపోయాడు. "చెప్పినదే వ్రాయలేనివారు ఇక చెప్పబోయే పద్యంలో తప్పులెలా

పడతారు?" అంటూ మరో పద్యాన్ని లక్షఘంటకవి ఇలా చదివాడు –

**మ॥ "గన నీహారగు పద్మపత్ర ధళరంగత్కీర్తి చాణూర మ**
**ర్ధన శుక్రాక్షి కళేభరాణ్మృగపతీ త్రైలోక్య ధామోదరా**
**యనగాఁ శంకర పాదపద్మయుగ దివ్యాస్తోక పాణీ జనా**
**ర్ధనవాహప్రద వైరి నిగ్రహ ముకుందా మిత్రవిందాధిపా!"**

పై పద్యంలో వినగానే దుష్టపదాలుగా కనిపిస్తున్న "చాణూరమర్ధన– కళేభర – ధామోదర – జనార్ధన" శబ్దాలు తప్పులని చూపించాడు సహస్రఘంటకవి. కాని అవి అతనిని తప్పుదారి పట్టించడానికి చెప్పిన పదాలు కాబట్టి లక్షఘంటకవి వేషంలోని రామలింగడు ఆ పద్యానికి సరైన అర్థం చెప్పి సహస్రఘంటకవి ఓటమిని అంగీకరించేలా చేశాడు.
**ప్రతిపదార్థములు:–** పద్మపత్ర = తామరాకుల మీద; గన = అధికమైన; నీహారగు = చంద్రకిరణములవలె; ధళరంగత్ = తళతళ ప్రకాశించుచున్న; కీర్తి= కీర్తిగలవాడా; చాణూరమత్ = చాణూరుడనెడివానిని; హన = మర్దించినవాడా; శుక్రాక్షికళ = తెల్లనైన కన్నులుగల కాళిందుడు అను; ఇభరాట్ = ఏనుగుల రాజునకు; మృగపతీ = సింహమువంటివాడా; త్రైలోక్య = మూడు లోకములకు; ధామ = ఉనికిపట్టైన; ఉదర = ఉదరముగలవాడా; శంకర = శివుని; పాదపద్మయుగ = పద్మములవంటి పాదద్వయమును; దివ్యాస్తోకపాణీ = భజించుటలో గొప్పవైన చేతులుగలవాడా; జన = జనులయొక్క; అర్థ =కోర్కెలను; నవాహ = క్రొత్తవైనటువంటి విషయమున; ప్రద = ఇచ్చువాడా; వైరి = విరోధులను; నిగ్రహ = జయించినను; ముకుంద = విడిచిపెట్టువాడా; అధిప = ఓ రాజా; మిత్ = మృత్యుదేవతను; రవింద = ఆజ్ఞాపించువాడా!

తరువాత ఇంతమంచి అర్థంగల పద్యంలో మీకు తప్పులు కనబడ్డాయా? దీనినిబట్టి మీ పాండిత్యమేపాటిదో అర్థమౌతోంది. అని క్రింది పద్యాన్ని చదివాడు:–

**చ॥ "తెలియని వన్ని తప్పులని దిట్టతనాన సభాంతరమ్మునన్**
**బలుకగరాదు రోరి! పలుమాఱుఁ, బిశాచపుఁ బాడిగట్ట! నీ**
**పలికిన నోట దుమ్ముపడ! భావ్యమెఱుంగక పెద్దలైనవా**
**రల నిరసింతురా? ప్రెగడరాణ్ణరసా! విరసా! తుసా! బుసా!"**

అని అంతటితో ఆగక –

**చ॥ "ఒకని కవిత్వమం దెనయు నొప్పులు తప్పులు, నా కవిత్వమం**
**దొకనికిఁ దప్పుపట్టఁ బనియుండదు, కాదని తప్పుపట్టినన్,**
**మొకమటు క్రిందుగాఁ దివిచి, ముక్కలు వోవ, నినుంపకత్తితో**
**సిక మొదలంటఁగోయుదును, జెప్పునఁగొట్టుదు, మోముఁదన్నుదున్"**

అని రామలింగడు గర్జిస్తూ చదివిన పద్యాలు విని సహస్రఘంటకవి మారుమాటాడ లేక సిగ్గుతో ఉండగా, రాయలవారు అలా నిందించుకోవడం మంచిది కాదని, ఇద్దరూ గొప్ప పండితులేనని సర్దిచెప్పి, ఇద్దరికీ మంచి బహుమానాల నిచ్చారు. సహస్ర ఘంటకవి తన పాండిత్యంతో ఇతరుల నానందింపచేయాలిగాని, ఇలా సవాళ్లు విసరి ఎవరినీ బాధపెట్టకూడదని గ్రహించుకొని, తన కాలికున్న గండపెండేరాన్ని తీసి రామలింగనికి బహూకరించి, వెళ్ళిపోయాడు. తన సభాగౌరవం కాపాడి నందుకు రాయలు రామలింగని మెచ్చుకున్నారు.

పై కథలో పాండిత్యం సరిపోని పరిస్థితిలో యుక్తిని ఉపయోగించైనా గర్వాంధుడైన వాణ్ణి ఓడించి, కనువిప్పు కలిగించాలనే సత్యాన్ని రామలింగని ప్రవర్తన నిరూపిస్తోంది.

**3. పెద్దనకవిత్వాన్ని పరిహసించిన కథ:**

ఒకనాడు సభలో రాయలు ఏ విషయం ప్రస్తావిస్తే బాగుంటుంది అని ఆలోచిస్తూ ఉండగా, రామలింగడు లేచి 'ప్రభూ! భక్తికవిత్వాన్ని నాతో సమానంగా ఆశువుగా ఎవరూ చెప్పలేరని అనుకుంటున్నాను' అన్నాడు. అప్పుడు రాయలు 'అదేమిటి? నీవు కొన్ని పద్యాలు చెప్తే కదా! పోటీపెట్టి మరొకరు చెప్పగలిగేది లేనిది నిర్ణయించడం' అంటూ కొన్ని పద్యాలు చెప్పమన్నారు. రామకృష్ణుడీ పద్యాలు చెప్పాడు–

**ఆ॥ "లచ్చిమగడ! నీకు లక్ష నమస్కృతుల్**
**సీతమగడ! నీకు సేవజేతు**
**సత్యభామమగడ! సన్నుతించెద నిన్ను**
**మిత్రవిందమగడ! మేలొసంగు!"**

**ఆ॥ "లక్షణకు మగడ! లాలింపరా నన్ను**
**నీలమగడ! నాకు నీవె దిక్కు**
**జాంబవతికి మగడ! జాలంబుసేయక**
**ఎల్లిమగడ! నన్ను నేలుకొనర!"**

అప్పుడు రాయలు 'రామలింగకవీ! నీ పద్యాలు మహాభక్తిరసపూరితాలుగా ఉన్నాయే!' అని హేళనచేశారు. అప్పుడు రామలింగడు "అయ్యా! మీరు నన్ను పరిహాసము చేస్తున్నారు. పెద్దనగారు ఇదే పద్ధతిలో ఏలినవారిమీద పద్యం చెప్పినప్పుడు వారిని సన్మానించారు. ప్రపంచంలో పురుషునికి ప్రియురాలికంటె గొప్పది లేదు కదా! ఆ విషయం గమనించి నేను ఇలా చెప్పాను. గతంలోని పెద్దనగారి పద్యం గుర్తుచేస్తాను, గమనించండి" అని క్రింది పద్యం చదివాడు-

**క॥ శ్రీవేంకటగిరివల్లభ**
**సేవాపరతంత్రహృదయ! చిన్నమదేవీ**
**జీవితనాయక! కవితా**
**ప్రావీణ్యఫణీశ! కృష్ణరాయమహీశా!**

'చిన్నమదేవీ జీవితనాయక' అని తమను సంబోధించినపుడు తాము సంతోషాతిశయంతో పరవశులైనప్పుడు ''లచ్చిమగడ'' అని పిలిస్తే విష్ణువు సంతోషించడా? అలాగే "ఎల్లి మగడ" అన్నప్పుడు నేను, "మిత్రవింద మగడ" అన్నప్పుడు కృష్ణుడు సంతోషిస్తాం కదా! ఏలినవారేమంటారిప్పుడు?" - అనగానే సున్నితమైన ఆతని విమర్శకు అందరూ ఆనందించారు.

రామలింగకవి మంచికవిత్వం ఎలా చెప్పగలడో విమర్శకూడ అలా చేయగలడు. అయితే అతని వికటప్రజ్ఞ దాని మోతాదును కొంచెం మించేటట్లు చేస్తుందంతే. పెద్దనగారు చెప్పిన పద్యంలోని "చిన్నమదేవీ జీవితనాయక" అన్నదాన్ని ఆధారం చేసుకొని, "లచ్చిమగడ" అనే పద్యాలు చెప్పి, పెద్దనమీద చిన్న విసురు విసిరాడు. పెద్దనగారు వ్రాసిన దాంట్లో దోషమేమీ లేదు. బహుశా ఆయన కొంచెం గర్వం ప్రదర్శించిన సమయంలో దానికి ప్రతిగా రామలింగడు చేసిన విమర్శగా మనం భావించవచ్చు.

### 4. కుంకుమభొట్లు కథ:

ఒకనాడు చోళదేశంనుండి కుంకుమభొట్లు అనే ప్రసిద్ధ పండితుడు రాయల దర్శనానికి వచ్చి భువనవిజయకవులతో పోటీపడి విజయపత్రాన్ని పొందాలని వచ్చినట్లు చెప్పాడు. మర్నాడు సభ ఏర్పాటు చేస్తామన్నారు రాయలు.

కుంకుమభొట్ల పాండిత్యాన్నిగురించి విన్న విజయనగరకవులకు భయం పట్టుకొంది. సభాగౌరవం కాపాడమని రామలింగని కోరారు. అందులకంగీకరించిన

తెనాలికవి ఆ రాత్రి మారువేషంలో కుంకుమభొట్లు మకాం చేసిన ఇంటిముందు అరుగుమీద కూర్చున్నాడు. ఏదో పనిమీద బయటకు వచ్చి పచార్లు చేస్తూ, అరుగు మీదున్న వ్యక్తిని చూశాడు భట్టు. మారువేషంలో ఉన్న రామలింగడు ఈ పద్యం చదివాడు.

**శా॥ సమ్మర్దక్షయ దీనబంధన విధా సంక్రందనాచార్య సూ**
**రమ్మన్యాచల వజ్రపాత జగతీరక్షాంబుజాక్షా శర**
**ద్యమ్మార్గస్థ దశాస్య రాజ్య సమసహ్యాత్పోద్భవాతీర భా**
**గుమ్మత్తూరి శివం సముద్రపురవత్ ప్రోన్మూలనాదంబరా!!**

(పై పద్యాన్ని నేను నలుగురు పండితుమిత్రులకు చూపించాను. వారు: "ఈ పద్యంలో అన్వయం సరిగా లేదు. దీనికి తాత్పర్యం చెప్పడం సాధ్యంకాదు!" అని చేతులెత్తేశారు. కాబట్టి ఆనాటి కుంకుమభొట్లే కాదు, ఈనాటి పండితులు కూడా దీనికి తాత్పర్యం చెప్పలేరు.)

ఆ పద్యాన్ని కుంకుమభొట్లు విని, సేవకునిలా ఉన్న వ్యక్తి ఇంత చక్కని పద్యం చదివాడేమిటా అని అనుకుంటూ, 'ఎవరివయ్యా నీవు?' అని అడిగారు. "రామలింగయ్యగారి సేవకుడ"నని సమాధానం చెప్పాడు. 'ఆయన అష్టదిగ్గజకవులలో ఒకరు కదా!' అని అడిగి తెలుసుకున్నాడు. 'ఈ పద్యం నీవే చెప్పావా? మరొకటి చెప్పగలవా?' అని భొట్లు ప్రశ్నించగా, తానాయన దగ్గర కవిత్వం నేర్చుకొంటున్నానని చెప్పి మరొక పద్యం చదివాడు. ఆ పద్యం ఇది –

**క॥ నరసింహకృష్ణరాయని**
**కరమరుదగు కీర్తి యొప్పెఁ గరిభిద్గిరిభి**
**త్కరికరిభిద్గిరిగిరిభిత్**
**కరిభిద్గిరిభిత్తురంగ కమనీయంబై**

అపుడు కుంకుమభొట్లు దాని కర్థం చెప్పమని అడిగాడు. మారువేషంలో ఉన్న తెనాలికవి చక్కగా అర్థం తడుముకోకుండా చెప్పేసరికి కుంకుమభొట్లు ఆశ్చర్యపడి రామలింగనిసేవకుడే ఇంతటి పాండిత్యము, కవితాశక్తి కలిగి ఉంటే, ఇక రామలింగడు, అతనికంటె పెద్దలైన పెద్దనాదులు ఇంకెంత పాండిత్యం కలిగి ఉంటారో గదా అని భయపడి, రాత్రికి రాత్రి ఊరినుండి ఉడాయించాడు.

మర్నాడు కుంకుమభొట్లు సభకు రాకపోయేసరికి రాయల వారాశ్చర్యపడుతుంటే జరిగిన కథంతా రామలింగడు వివరించాడు. సభాగౌరవాన్ని నిలిపినందుకు రాయలవారు అతణ్ణి సన్మానించారు.

ఈ కథలో కూడ అహంకారంగల కవికి యుక్తిగా బుద్ధిచెప్పడం కనిపిస్తోంది. ఇందులో "నరసింహ కృష్ణరాయని" అనే పద్యం రాయల ఆస్థానప్రవేశసమయంలో చెప్పబడినదిగా కొన్ని కథల్లో కనిపిస్తోంది. దీని ప్రతిపదార్థం ఈ క్రింది విధంగా ఉన్నది:-

నరసానాయకుని కుమారుడైన శ్రీకృష్ణదేవరాయలవారి కీర్తి-కరిభిత్= గజాసురుని చంపిన శివునివలె; గిరిభిత్కరి = పర్వతాలను పిండిచేసిన ఇంద్రుని ఐరావతమువలె; కరిభిత్గిరి = శివుని వెండికొండవలె; గిరిభిత్-కరిభిత్-తురంగ = ఇంద్రునియొక్కయు, ఈశ్వరునియొక్కయు వాహనములైన ఉచ్చైశ్రవము, వృషభములవలె తెల్లనైనది.

**5. పెద్దన కవిత్వాన్ని ఆక్షేపించిన కథ:**

పెద్దనగారొకనాడు సందర్భవశాత్తు సభలో ఈ క్రింది పద్యాన్ని చదివారు -

**క॥ కలనాఁటి ధనము లక్కఱ**
**గలనాఁటికి దాఁచ కమలగర్భుని వశమా?**
**నెలనడిమినాఁటి వెన్నెల**
**యలవడునే గాదెఁబోయ నమవసనిసికిన్**

ఆ పద్యంలో ఉన్న "అమవసనిసి" అనే పదబంధంలో శబ్దసౌష్ఠవం లేదని రామలింగడు గ్రహించి ఆక్షేపించడానికి తగిన సమయమని భావించి, వెంటనే ఆశువుగా ఒక పద్యాన్ని ఇలా చెప్పాడు -

**క॥ ఎమి తిని సెపితివి కపితము?**
**బ్రమపడి వెఱిపుచ్చకాయ వడిఁదిని సెపితో?**
**ఉమెతఃకయ తిని సెపితివొ**
**"అమవసనిసి" యనెడి మాట అలసని పెదనా!**

ఈ పద్యం విని సభ్యులంతా గొల్లున నవ్వారు. తన పద్యంలో అలా వంక పెట్టేందు కవకాశము ఉన్నందున పెద్దన మాటలాడలేదు. పెద్దనగారి మనుచరిత్రలో

కొన్ని అక్షరాలు సందిగ్ధంగా ఉన్నాయని రామలింగడు హేళనచేస్తే, దానికి పెద్దన అంగీకరించాడని ప్రతీతి.

**6. అల్లసాని పెద్దనగారిపై అమితమైన గౌరవం:-**

తెనాలి రామకృష్ణుడు ఒక్కొక్కప్పుడు అల్లసాని పెద్దనగారిని ఆక్షేపించినా, ఆయనపై అమితమైన గౌరవం కలవాడు. తిక్కన, పెద్దన, తాను గొప్ప కవులమని, తక్కినవారు నీటికాకులవంటివారని ఒక కంద పద్యం చెప్పాడు:-

**క॥ కవి యల్లసాని పెద్దన,**
**కవి తిక్కన సోమయాజి గణుతింపంగా,**
**కవి నేను రామకృష్ణుడ,**
**'కవి' యను నామంబు నీరుకాకికి లేదే!**

**7. "రవి గాననిచో కవిగాంచునే కదా!":-**

నంది తిమ్మన ఒకనాడు తన యింట ఉయ్యాలలో ఊగుచు కవిత్వము రచించుకొనుచుండగా కొంటెకోణంగి రామకృష్ణుడు అక్కడికి వెళ్ళి "తాతా! ఊతునా?" అని అడిగెనట. తిమ్మన "సరే" అన్నాడు. వెంటనే రామకృష్ణుడు తిమ్మన మొగముపై తుపుక్కున ఉమ్మి వేశాడట! దానికి కోపించిన తిమ్మన తన ఎడమకాలితో రామకృష్ణుని మూతిపై తన్నాడు. ఆ దెబ్బతో అతనికి ఒక పన్ను ఊడిపోయింది. వెంటనే ఇంటికి వెళ్ళి, దుప్పికొమ్మును పన్నుగా పెట్టుకొని మర్నాడు రాయల ఆస్థానానికి వెళ్ళాడు. ఈ సంఘటన తెలిసిన రాయలవారు "రవిగాననిచోఁ గవి కాంచునే కదా!" అనే సమస్య నిచ్చారు. వెంటనే భట్టుమూర్తి ఈ క్రింది విధంగా పూరించాడు.

**ఉ॥ ఆరవి వీరభద్రుని పదాహతి డుల్లిన బోసినోటికిన్**
**నేరఁడు, రామకృష్ణకవి నేరిచెఁబో, మన ముక్కుతిమ్మరాట్**
**క్రూర పదాహతిందెగిన కొక్కిరిపంటికి దుప్పికొమ్ము ప**
**ల్గారచియించె నౌర! రవిగాననిచోఁ గవి కాంచునే కదా!**

(కీ.శే. డా॥ వి.వై.వి.సోమయాజిగారి సిద్ధాంతగ్రంథం:
"తెనాలి రామలింగని కథలు- సవిమర్శక పరిశీలన" నుండి)



## అనుబంధం - 9

# వేమన హాస్యపద్యములు

యోగివేమన క్రీ.శ. 17వ శతాబ్దానికి చెందినవాడని చెప్పవచ్చును. ఈతని కాలాన్ని గురించి స్వస్థలాన్ని గురించి ఎన్నో వాదోపవాదాలున్నాయి. పరిశోధకులు వేమన కాలాన్ని గురించి క్రీ.శ. 1472 నుండి క్రీ.శ. 1672 వరకు ఒక్కొక్కరు ఒక్కొక్క విధంగా నిర్ణయించారు. ప్రభుత్వంవారు పండితులందరినీ సంప్రదించి, వేమన కాలాన్ని క్రీ.శ. 1672గా నిర్ణయించి ముద్రవేశారు. తన స్వస్థలాన్ని గురింట, తన కులాన్ని గురించి వేమన ఒక పద్యంలో చెప్పుకున్నాడు:-

**ఆ॥ ఊరు కొండవీడు - ఉనికి పశ్చిమవీధి**
**మూగచింతపల్లె మొదటి యిల్లు**
**ఎడ్డిరెడ్డికులమదేమని చెప్పుదు**
**విశ్వదాభిరామ వినురవేమ!**

ఇతడు కొన్ని వేల పద్యాలు ఆశువుగా చెప్పాడు. శిష్యులు వాటిని లిఖితం చేశారు. ఈ వేలపద్యాలలో అన్ని వేమనవి కావు; కొన్ని ఎవరో అనుసరించి వ్రాసి వేమనపేరు పెట్టారు. అచ్చమైన అసలు వేమన పద్యాలు 2000 కన్న ఎక్కువ ఉండవు. వీటిని ప్రధానంగా (1) నీతిబోధ, (2) మతాచార విమర్శ, (3) సాంఘిక విమర్శ, (4) వేదాంతబోధ అని నాలుగు వర్గాలుగా విభజించ వచ్చును. ఈ నాల్గింటిలోనూ అందర్గతంగా తిట్లు, హాస్యం ఉండనే ఉంటాయి. ప్రాచీనాంధ్ర కవులలో వేమన్నను మించిన హేతువాది, సంఘసంస్కర్త, అభ్యుదయ కాముకుడు మరొక్కడు లేడు. సమాజాన్ని ఎంతో తీవ్రంగా విమర్శిస్తాడు. ఆ విమర్శలోనే హాస్యాన్ని కూడా మిళితం చేస్తాడు. ప్రముఖ విమర్శకులు రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మగారు చెప్పినట్లుగా! వేమన "తన తీవ్రమైన విమర్శతో గాయం చేస్తాడు. ఆ గాయం మానడానికి తగిన మందును ఆ కత్తికే పూస్తాడు. ఆ మందే హాస్యం!"

వేమన పద్యాలలో హాస్యరసంతో కూడిన పద్యాలు సుమారు 20 గుర్తించాను. వీటిలో రెండు పద్యాలను **("పాలసాగరమున పవ్వళించిన స్వామి..."; "కనక మృగము భువిని కద్దు లేదనకను....")** మా అన్నయ్యగారు ఇచ్చారు. తక్కిన హాస్య పద్యాలను దిగువ ఇస్తున్నాను:-

ఆ॥ సకల తీర్థములందు, సకల యజ్ఞంబులఁ
దలలు గొరుగకన్న ఫలము లేదు;
మంత్రజలముకన్న మంగలిజలమెచ్చు!
విశ్వదాభిరామ వినురవేమ!! 1

ఆ॥ గొడ్డుటావుఁబిదుక కుండగొంపోయిన
పండ్లరాలఁదన్ను, పాలనీదు;
లోభివాని నడుగ లాభంబు లేదయా!
విశ్వదాభిరామ వినురవేమ! 2

ఆ॥ గుహలలోనఁ జొచ్చి గురువుల వెదుకంగఁ
గ్రూరమృగ మొకండు తారసిలిన,
ముక్తిమార్గమదియె ముందుగాఁ జూపురా!
విశ్వదాభిరామ వినురవేమ! 3

ఆ॥ లోభివానిఁజంప లోకంబులోపల
మందువలదు, వేరుమతము గలదు,
పైకమడిగినంత భగ్గున పడిచచ్చు!
విశ్వదాభిరామ వినురవేమ! 4

ఆ॥ పిసినివాని యింట పీనుఁగు వెడలిన
కట్టెకోలలకును కాసులిచ్చి,
వెచ్చమాయెననుచు వెక్కివెక్కేడ్చురా!
విశ్వదాభిరామ వినురవేమ! 5

ఆ॥ మేకకుతుకఁ బట్టి మెడచన్నుఁ గుడువగా
నాకలేలమాను ఆశగాక!
లోభివాని నడుగ లాభంబు కల్గునా?
విశ్వదాభిరామ వినురవేమ! 6

ఆ॥ కులము గలుగువారు, గోత్రంబు గలవారు,
విద్యచేత విఱ్ఱవీగువారు,
పసిడి కలుగువాని బానిసకొడుకులు!
విశ్వదాభిరామ వినురవేమ! 7

ఆ॥ చాకి కోకలుదిగి చీకాకు పడఁజేసి
మైలతీసి లెస్స మడచినట్లు
బుద్ధి చెప్పువాడు గ్రుద్దితేనేమయా?
విశ్వదాభిరామ వినురవేమ! 8

ఆ॥ పసలతొనలకన్న, పంచదారలకన్న
జుంటితేనెకన్న, జున్నుకన్న,
చెఱుకురసముకన్న, చెలిమాట తీపిరా!
విశ్వదాభిరామ వినురవేమ! 9

ఆ॥ పడఁతి మోసె నొకఁడు పడఁతి మేసె నొకండు,
పడఁతి నురముఁ జేర్చి బ్రదికె నొకఁడు,
పడఁతి కొఱకె పెక్కుపాట్లను పడిరయా!
విశ్వదాభిరామ వినురవేమ! 10

ఆ॥ బోటి యొకతె బ్రహ్మనోటిమీఁదనె తన్నె,
కొమ్మ యొకతె విష్ణు ఱొమ్ముఁదన్నె,
సకియ యొకతె శివుని సికమీఁదఁ దన్నెరా!
విశ్వదాభిరామ వినురవేమ! 11

ఆ॥ ఉదధిలోని నీళ్లు ఉప్పులుగాఁ జేసె,
పసిఁడిఁ గలుగువాని పిసినిఁ జేసె,
బ్రహ్మచేతలెల్ల పాడైన చేతలు!
విశ్వదాభిరామ వినురవేమ! 12

ఆ॥ అన్ని మతములందు అధికమైన మతము
లింగమతము కన్న లేదు జగతి
లింగధార్ల కన్న దొంగలు లేరయా!
విశ్వదాభిరామ వినురవేమ! 13

ఆ॥ విష్ణుభక్తులెల్ల వెలిబూది పాలైరి,
వాదమేల? మత విభేదమేల?
తెలియ లింగధరులు తిరుమన్ను పాలైరి!
విశ్వదాభిరామ వినురవేమ! 14

ఆ॥ భూతి దేహమెల్ల పూసితే నాయనా
నిష్ఠ శివునయందు నిలుపలేక,
కాటి బూడిదందు గాడిద పొర్లదా!
విశ్వదాభిరామ వినురవేమ! 15

ఆ॥ ఆలివంకవారు ఆత్మబంధువులైరి,
తల్లివంకవారు తగినపాటి,
తండ్రివంకవారు దాయాది పగవారు!
విశ్వదాభిరామ వినురవేమ! 16

ఆ॥ చదివినతనికన్న చాకలియే మేలు,
కులమువేల్పుకన్న కుక్కమేలు,
ధరణిసురునికన్న దాసరిమేలురా!
విశ్వదాభిరామ వినురవేమ! 17

ఆ॥ ఓగువాని నోగు నొనరంగ మెచ్చును,
మెచ్చబోడు సుజను మేలిగుణము,
పంది బురదమెచ్చు, పన్నీరు మెచ్చునా?
విశ్వదాభిరామ వినురవేమ! 18

ఆ॥ అల్పబుద్ధివాని కధికారమిచ్చిన
దొడ్డవారినెల్ల తొలగగొట్టు,
చెప్పుతినెడి కుక్క చెఱకుతీపెఱుగుఁనా?
విశ్వదాభిరామ వినురవేమ! 19

మతములు వేరైనా దైవం ఒక్కడే!:

ఆ॥ పసులవన్నె వేఱు, పాలన్ని యొక్కటే!
పుష్పజాతి వేఱు, పూజ యొకటె!
దర్శనములు వేఱు, దైవంబదొక్కటే!
విశ్వదాభిరామ వినురవేమ! 20

వసుధైక కుటుంబ భావన:

ఆ॥ ఉర్వివారికెల్ల నొక్క కంచము పెట్టి,
పొత్తు కలిపి, కులము పొలియఁజేసి,
తలను చేయిపెట్టి, తగనమ్మఁ జెప్పరా!
విశ్వదాభిరామ వినురవేమ! 21



# అనుబంధం-10:

## కాళిదాసుని చాటువులు

### (భోజ-కాళిదాస కథలు)

### సేకరణ - వివరణ: శ్రీ మల్లాది హనుమంతరావుగారు

క్రీ.శ. 16వ శతాబ్దానికి చెందిన "బల్లాల దేవుడు" లేక "బల్లాల సేనుడు" - "భోజచరిత్రమ్" లేక "భోజప్రబంధం" అనే చంపూగ్రంథాన్ని రచించాడు. దీనిలో భోజ-కాళిదాసులకు సంబంధించిన ఎన్నో కథలు, చమత్కారశ్లోకాలు, నీతిశ్లోకాలు ఉన్నాయి. ఈ గ్రంథాన్ని ఆధారంగా చేసికొని, మిత్రులు శ్రీ మల్లాది హనుమంతరావుగారు "చమత్కార-శ్లోకమంజరి" (భోజకాళిదాస కథలు) రచించారు. దీని పీఠిక ("పాఠకులకు మనవి") లో శ్రీ హనుమంతరావుగారు కాళిదాసును గురించిన కొన్ని ముఖ్యవిషయాలు ఈ క్రిందివిధంగా తెలియజేశారు:-

"చారిత్రకంగా కాళిదాసు క్రీ.పూ. ఒకటో శతాబ్దం నాటివాడనీ, ఉజ్జయిని రాజధానిగా పాలించిన విక్రమాదిత్యుడి ఆస్థానంలో ఉండి ఉన్నవాడనీ, పరిశోధకులు అభిప్రాయపడుతున్నారు. భోజరాజు క్రీ.శ. పదకొండో శతాబ్దంవాడు. అంటే కాళిదాసుకు వెయ్యి సంవత్సరాల తరువాతవాడు. క్రీ.శ. 1005-1054 మధ్యకాలంలో ధారానగరం రాజధానిగా మాళవదేశాన్ని పాలించాడు. ఈ ప్రాంతం ఈనాటి మధ్యప్రదేశ్‌రాష్ట్రంలో ఇండోర్ సమీపంలో ఉంది. ఈ భోజరాజు తండ్రి సింధులుడు; పినతండ్రి ముంజరాజు. ఈ భోజుడు కవి. కవి కంటే కూడా ఎక్కువగా ప్రసిద్ధిపొందింది - "శృంగార ప్రకాశం"-"సరస్వతీ కంఠాభరణం" అనే ప్రామాణికమయిన అలంకారశాస్త్ర బృహద్గ్రంథాల రచయితగా. ఇవి కాక యోగశాస్త్ర, ధర్మశాస్త్ర, అశ్వశాస్త్ర, నీతిశాస్త్ర, వాస్తు-జ్యోతిష శాస్త్ర విషయాలపై ఎనభయ్యయిదు గ్రంథాలు రాశాడని చెప్పుకుంటారు. "చంపూ రామాయణం"అనే కావ్యం కూడా ఈయన రచనే!

"భోజరాజు చాలా ఉదారస్వభావం, దానశీలం, కవి పండిత ప్రీతి కలిగిన రాజు అయి ఉండటం వల్ల కావచ్చు, ఆయన గురించి ఎన్నో కథలు తరతరాలుగా వస్తున్నాయి. వీటిలో భోజ-కాళిదాసుల అనుబంధం గురించిన కథలు ఎక్కువ. ఈ కథల్లో చారిత్రక సత్యం లేకపోయినా, ఆసక్తి కలిగించే సంఘటనలూ, చమత్కార

శ్లోకాలు పుష్కలంగా కనిపిస్తాయి. సర్వకాలీనమయిన, నిత్యసత్యమయిన నీతులు ఎన్నో వినిపిస్తాయి." (-చమత్కార శ్లోకమంజరి, పుట-7)

**1. కాళిదాసురాక:**

మొదటిసారి కాళిదాసు భోజాస్థానంలోకి ప్రవేశించినపుడు, రాజు కొలువులో లేడు. మిగతా కవులూ, పండితులూ కూర్చొని ఉన్నారు.

కాళిదాసు రాజసభలో ప్రవేశించాడు. ధగధగలాడే మణికుండలాలు ధరించి ఉన్నాడు. తళతళ మెరిసే దివ్యవస్త్రాలతో రాజపుత్రుడిలా ఉన్నాడు. కస్తూరి సువాసనలు విరజిమ్ముతున్నాడు. పూలమాలలు ఆభరణాలుగా ధరించి ఉన్నాడు. మూర్తీభవించిన కవిత్వంలాగా ఉన్నాడు. శృంగారరస ప్రవాహంలా ఉన్నాడు. దివినుంచి భువికి దిగిన దేవేంద్రుడిలా ఉన్నాడు.

ఆయన తేజస్సుని చూసి అచ్చెరువొందిన సభికులాయనకు నమస్కరించారు- ఆయనెవరో తెలియకుండానే. ఆయన ప్రతినమస్కారంచేసి ఆసీనుడయ్యాడు. గజేంద్రాల సమూహంలో సింహేద్రంలా ప్రకాశించాడు.

ఇంతలో రాజు వచ్చాడు.

'తమ పేరేమిటి, కవీశ్వరా?' అని అడిగాడు. కాళిదాసు ఆయన చేతిని తన చేతిలో తీసుకొని ఆయన అరచేతిమీద 'కాళిదాసు' అని వ్రాశాడు. రాజు అది చదివి, ఆయన కాళ్ళమీద పడిపోయాడు; ఘనంగా సత్కరించాడు.

'కవీశ్వరా, సాయంకాలం అయింది. సంధ్యావర్ణనం వినిపించండి!' అని కోరాడు. కాళిదాసు ఓ ముచ్చటయిన శ్లోకం చెప్పాడు, నాలుగు చక్కటి ఉపమలతో.

**1.1 శ్లో॥ వ్యసనిన ఇవ విద్యా క్షీయతే పంకజ శ్రీః**
**గుణిన ఇవ విదేశే దైన్యమాయాంతి భృంగాః ।**
**కునృపతి రివ లోకం పీడయత్యంధకారో**
**ధనమివ కృపణస్య వ్యర్థతామేతి చక్షుః ॥**

వ్యసనపరుడి (వ్యసనినః) విద్యలాగా, తామరల కాంతి దిగజారిపోతున్నది (క్షీయతే). తుమ్మెదలు, పరదేశము చేరిన గుణవంతుడిలాగా దైన్యాన్ని పొందుతున్నాయి (దైన్యం ఆయాంతి). చీకటి, దుర్మార్గుడైన రాజులాగా లోకాలను బాధిస్తున్నది. పిసినారివాడి ధనంలాగా కంటిచూపు నిష్ప్రయోజననువుతున్నది.

**1.2 ఆ తర్వాత భోజరాజు కీర్తిని ఈ క్రింది శ్లోకాలలో స్తుతించాడు:**

**శ్లో॥ 'మహారాజ! శ్రీమన్! జగతి యశసా తే ధవళితే,**
**పయః పారావారం పరమపురుషోయం మృగయతే ।**
**కపర్దీ కైలాసం, కరివర మభౌమం కులిశ భృత్**
**కళానాథం రాహుః కమలభవనో హంస మధునా ॥**

ఓ రాజా! శ్రీమాన్! ఈ జగత్తంతా నీ కీర్తిచేత తెల్లనయిపోగా, ఈ పరమపురుషుడు (నారాయణుడు) పాలసముద్రం (పయఃపారావారం) వెతుక్కొంటున్నాడు. కపర్ది (శివుడు) కైలాసం ఎక్కడా అని వెతుకుతున్నాడు. వజ్రాయుధుడు (కులిశభృత్-ఇంద్రుడు) తన అలౌకికమయిన ఐరావతంకోసం వెతుకుతున్నాడు. రాహువు కళానాథుడైన చంద్రుడినీ, కమలభవనుడైన బ్రహ్మ తన హంసనూ వెతుకుతున్నారు. పాలసముద్రమూ, కైలాసపర్వతమూ, ఐరావత గజం, చంద్రుడూ, హంసా తెల్లటివి గాబట్టి విశ్వమంతా వ్యాపించిన నీ కీర్తి తెలుపులో కలిసిపోయి కనబడటం లేదు. (ఈ శ్లోకమును మా అన్నయ్య తన గ్రంథములో నిచ్చినాడు.)

**1.3 మరో చమత్కార శ్లోకం చెప్పాడు కాళిదాసు:**

**శ్లో॥ నీర క్షీరే గృహీత్వా నిఖిల ఖగతతీ ర్యాతి నాళీకజన్మా;**
**తక్రం ధృత్వా తు సర్వా నటతి జలనిధీంశ్చక్రపాణి ర్ముకుందః ।**
**సర్వానుత్తుంగ శైలాన్ దహతి పశుపతిః ఫాలనేత్రేణ పశ్యన్;**
**వ్యాప్తా త్వత్కీర్తికాంతా త్రిజగతి నృపతే! భోజరాజ క్షితీంద్ర!**

నాళీకజన్మా = తామరపూవులో పుట్టిన బ్రహ్మ; నీర క్షీరే గృహీత్వా=పాలూ, నీళ్లు తీసుకొని; నిఖిల ఖగతతీః యాతి=అన్ని పక్షుల దగ్గరకు వెళుతున్నాడు; ఏ పక్షి నీరక్షీరాలను వేరుచేయగలదో అదే తన వాహనమయిన హంస అని గుర్తించేందుకు. హంసను మరే విధంగానూ గుర్తించలేకపోతున్నాడు......

చక్రపాణిః ముకుందః = చక్రం చేతిలో ధరించిన నారాయణుడు; తక్రం ధృత్వా = మజ్జిగ తీసుకొని; సర్వాన్ జలనిధీన్ చ అటతి = సముద్రాలన్నీ తిరుగుతున్నాడు. ఈ మజ్జిగ చుక్కలతో తోడుకొని ఏ సముద్రం పెరుగవుతుందో అదే తన నివాసమయిన పాలసముద్రం. దాన్ని గుర్తించేందుకు మరే విధంగానూ వీలుకావటం లేదు.

పశుపతిః ఫాలనేత్రేణ పశ్యన్ = శివుడు తన మూడోకంటితో చూస్తూ; సర్వాన్ ఉత్తుంగ శైలాన్ దహతి = అన్ని ఎత్తైన కొండలనూ దహించేస్తున్నాడు. వాటిలో తన నివాసమయిన వెండికొండ వుంటే, అది వేడికి కరుగుతుంది కాబట్టి దాన్ని గుర్తించవచ్చని.

త్రిమూర్తులు ముగ్గురి సమస్యా ఏమిటంటే, ఓ భోజరాజ క్షితీంద్రా! నీ కీర్తికాంత త్రిజగత్తులు వ్యాపించి (వాటిని ఒకే తెల్లటి రంగులో కప్పేసి) ఉంది.

**1.4 అంతకంటే ఇంకా చమత్కారంగా ఈ క్రింది శ్లోకం చెప్పాడు:**

**శ్లో॥ విద్వద్రాజ శిఖామణీ! తులయితుం ధాతా త్వదీయం యశః**
**కైలాసం చ నిరీక్ష్య, తత్ర లఘుతాం నిక్షిప్తవాన్ పూర్తయే ।**
**ఉక్షాణం, తదుపర్యుమా సహచరం, తన్మూర్ధ్ని గంగాజలం,**
**తస్యాగ్రే ఫణిపుంగవం, తదుపరి స్ఫారం సుధాదీధితీమ్ ॥**

ఓ విద్వత్-రాజ శిఖామణీ! ఆ బ్రహ్మదేవుడు కైలాసపర్వతాన్ని నీ కీర్తితో సమానం చేసేందుకు, ఆ వెండికొండ మీద తెల్లని నందీశ్వరుడినీ (ఉక్షాణం= ఎద్దును), దానిపైన తెల్లని ఉమాపతి శివుడినీ (ఉమాసహచరం), ఆయన శిరసు (తత్-మూర్ధ్ని) మీద గంగానదినీ, దానిమీద తెల్లని సర్పరాజునూ, దానిపైన స్వచ్ఛమైన వెన్నెలరేడునూ ఉంచాడు. (దీనిని మా అన్నయ్య తన సంకలనంలో నిచ్చినాడు)

**1.5 ఇంతకంటే చమత్కారంగా మరో శ్లోకం చెప్పాడు. ఇది ప్రశ్నోత్తరమాలిక రూపంగా ఉంది :**

**శ్లో॥ 'స్వర్గాద్గోపాల కుత్ర వ్రజసి?'-'సురమునే, భూతలే కామధేనోః**
**వత్సస్యానేతు కామఃతృణచయం!'-'అధునా, ముగ్ధ, దుగ్ధం న తస్యాః?'-**
**'శ్రుత్వా శ్రీ భోజరాజ ప్రచుర వితరణం వ్రీడ శుష్కస్తనీ సా!'-**
**'వ్యర్థో హి స్యాత్ ప్రయాసః తదపి, తదరిభిః చర్వితం సర్వముర్వ్యాం' ॥**

స్వర్గలోకంలో కామధేనువును చూసుకొనే పశువులకాపరికీ నారదుడికీ సంభాషణ:

నారదుడు : ఓ గోపాలకా, స్వర్గంనుంచీ, ఎక్కడికి వెళుతున్నావు?

గోపాలకుడు : సురమునీ, భూలోకం వెళ్ళి మా కామధేనువు దూడకోసం ఓ గడ్డిమోపు (తృణచయం) తేవాలనే కోరికతో (ఆనేతు కామః) వెళుతున్నాను.

నారదుడు : ఓరి అమాయకుడా (ముగ్ధ), ఇప్పుడు, కామధేనువు దగ్గర పాలు లేవా (అధునా, దుగ్ధం న తస్యాః)?

గోపాలకుడు : శ్రీ భోజరాజుగారి మహత్తరమైన వితరణగురించి విని, సిగ్గుపడిన ఆ కామధేనువు ఎండిపోయి (శుష్కస్తనిగా) ఉంది.

నారదుడు : అయితే ఈ ప్రయాస గూడా వ్యర్థమే కాబోతున్నది. భూమ్మీది ఆ గడ్డి అంతా ఆయన శత్రువులచేత (తత్–అరిభిః) తినివేయబడింది (చర్వితం).

భోజుడి దానగుణం చూసి, అన్ని కోరికలు తీర్చే కామధేనువు కూడా సిగ్గుతో శుష్కించింది. ఆయన పరాక్రమంవల్ల ఆయన శత్రువులందరూ గడ్డి కరిచారు, అని భగ్యంతరంగా చెప్పాడు.

**2. "టంటంట టంటంట టటంట టంటం":**

ఒకసారి భోజుడు తన ఆస్థానంలో ఉన్న కవులకు పై సమస్య నిచ్చి, 'మరి కవులు గదా, ఈ సమస్య పూర్తిచేసి మీ ప్రతిభ చూపండి!' అన్నాడు.

'రాజా! మరొక్కసారి సమస్య వినిపించండి!' అన్నాడు కాళిదాసు.

'ఒకసారి కాదు. కావాలంటే పదిసార్లు వినిపిస్తాను. వినండి. 'టంటంట, టంటంట టటంట టంటం', కుమారసంభవకావ్యం ప్రారంభంలో మీరు రాసిన 'అస్త్యుత్తరస్యాం–దిశి దేవతాత్మా' అన్నట్లు ఇంద్రవజ్ర వృత్తంలో పాదం ఇది. 'ఈ వృత్తం మీకు కొట్టిన పిండి కదా మహాకవీ!' అన్నాడు రాజు కవ్వింపుగా.

'అర్థమైంది, మహారాజా! మరి శ్లోకం వినండి' అని కాళిదాసు అయిదు క్షణాలు కళ్ళు మూసుకొని తెరిచి, గుక్క తిప్పుకోకుండా ఈ క్రింది శ్లోకం చెప్పాడు:

**శ్లో॥ 'రాజాభిషేకే మద విహ్వలాయాః**
**హస్తాత్ చ్యుతః హేమ ఘటః యువత్యాః ।**
**సోపాన మార్గేషు కరోతి శబ్దం**
**టంటంట టంటంట టటంట టంటమ్॥'**

రాజు ఆశ్చర్యంతో రెప్ప కూడా వేయకుండా కాళిదాసువైపే చూస్తున్నాడు.

"అలా చూస్తున్నారేం, మహారాజా, అర్థం సులభమే కదా! అయినా సభకు అర్థం వివరించటం నా ధర్మం. వినండి. రాజుగారికి పరిచారికలు స్నానం చేయిస్తున్నారు. వారిలో ఒక పరిచారిక రాజుగారి సౌందర్యం చూసి మన్మథ మదంలో ఒళ్లు మరిచిపోయింది. ఆమె చేతిలోనించీ బంగారు గిన్నె జారిపడి పోయింది. ఆ గిన్నె స్నానఘట్టం మెట్ల మీదిగా దొర్లుతూ, రాజుగారు చెప్పినట్టు, 'టంటంట, టంటంట, టటంట, టంటమ్' అని మోత చేసింది" అని ముగించాడు కాళిదాసు.

**3. భవభూతితో పోలిక:**

ఒకసారి కాళిదాసు తన్ను భవభూతితో పోల్చుకుంటూ ఒక శ్లోకాన్ని ఇలా చెప్పాడు:

**శ్లో॥ 'నాటకేషు చ కావ్యేషు-వయం వా వయమేవ వా ।**
**ఉత్తరే రామచరితే - భవభూతిః విశిష్యతే ॥**

(నాటక రచనలో, కావ్య రచనలో మాకు మేమే సాటి. ఉత్తర రామచరితలో మాత్రం భవభూతి మమ్మల్ని మించిపోయాడు.) అని చెప్పక తప్పదు' అన్నాడు కాళిదాసు.

భవభూతి మహాకవి నిజానికి క్రీ.శ. ఏడో శతాబ్దంవాడు. ఈయన కవిగానే గాక గొప్ప దార్శనికుడుగా కూడా ప్రసిద్ధి పొందినవాడంటారు. కన్యాకుబ్జం రాజు యశోవర్మ ఆస్థానకవిగా ఉండేవాడు. ఈయన విదర్భదేశం వాడని కొందరూ, గ్వాలియర్ ప్రాంతం వాడని కొందరూ, ఆంధ్రుడని కొందరూ వాదించారు. భవభూతి రచనలు, మూడు. మూడూ నాటకాలే. ఉత్తర రామచరిత్రమ్, మాలతీమాధవమ్, మహావీర చరిత్రమ్. భవభూతి కరుణరసాన్ని ఎక్కువ అభిమానించాడు.

**4. గుళు గుగ్గుళు గుగ్గుళు:**

కాళిదాసుకూ, భోజరాజుకూ చిరకాలం నడిచిన సన్నిహిత సంబంధం వల్ల, సమస్యా పూరణలు చేసేటప్పుడు కాలిదాను, రాజు మనసులో ఉన్న భావం కూడా గ్రహించి కవిత్వం చెప్పగలిగేవాడు.

ఒక ఉదాహరణ:

ఒకనాడు భోజరాజు వేటకు వెళ్ళాడు. చాలాసేపు వేటాడి బాగా అలిసిపోయాడు. ఒక చెరువుగట్టున పెద్ద నేరేడుచెట్టు కనిపించింది. ఆ చెట్టుకింద దట్టంగా నీడ ఉంది చల్లగా ఉంది.

భోజరాజు ఆ చెట్టు మొదట్లో కూర్చొని ఆ చల్లటి నీడలో విశ్రాంతి తీసుకొంటున్నాడు. ఆ చెట్టు మీద చాలా కోతులున్నాయి. అవి చెట్టు మీద ఆటలాడుకొంటూ చెట్టుకొమ్మలు కదిలించినప్పుడల్లా నేరేడు పళ్ళు రాలి చెరువులో పడుతున్నాయి. పడ్డప్పుడల్లా. నీళ్లలో 'గుళుగుగ్గుళు గుగ్గుళు' అని మోత వస్తున్నది.

రాజు కొంతసేపు విశ్రమించి ఈ వినోదం తిలకించాడు. తర్వాత అక్కడినించి లేచి, తన గుర్రమెక్కి రాజభవనానికి వచ్చేశాడు.

ప్రయాణం చేసినంతసేపూ ఆ 'గుళు గుగ్గుళు గుగ్గుళు' అన్న శబ్దం రాజు మనసులో మెదులుతూ ఉంది. అదే మాట మనసులో మననం చేసుకొంటూ ఇల్లు చేరాడు.

మర్నాడు సభలో కాళిదాసాదులను చూసినప్పుడు ఆయనకు మళ్ళీ అదే శబ్దం 'గుళు గుగ్గుళు గుగ్గుళు' అని గుర్తుకు వచ్చింది. తమాషాగా ఆ శబ్దం అనుష్టుభ్ ఛందస్సులో సరిగా ఒకపాదం పూర్తి చేస్తున్నది.

భోజరాజు ఆ పదాన్ని సమస్యగా తీసుకొని ఓ శ్లోకం చెప్పమని తన సభలో పండితులకు ఒక సవాలు విసిరాడు.

కవికుల గురువుకు శ్లోకం చెప్పటానికి ఒక నిముషం కూడా పట్టలేదు.

**శ్లో॥ జంబూఫలాని పక్వాని - పతంతి విమలేజలే ।**
**కపికంపిత శాఖాభ్యః - గుళు గుగ్గుళు గుగ్గుళు ॥**

అని శ్లోకం చెప్పాడు. కోతులు కదిలించిన కొమ్మలనుండీ (కపి–కంపిత శాఖాభ్యః) పండిన నేరేడు పళ్ళు, నిర్మలమయిన నీటిలో పడుతూ ఉంటే 'గుళు గుగ్గుళు గుగ్గుళు' (అని శబ్దం వచ్చింది).

తనకు ముందురోజు కలిగిన అనుభవాన్ని, అంత సరిగ్గా కాళిదాసు ఎలా ఊహించి చెప్పగలిగాడో రాజుకు అర్థం కాక ఆశ్చర్యపోయాడు. 'రవి గాంచనిచోన్ కవి గాంచునే గదా' అంటే ఇదేనా? లేక ఏళ్ళ తరబడి సన్నిహిత స్నేహంవల్ల రాజు మనసులో విషయం ఆయన అభిమానకవి ఇట్టే గ్రహించగలిగాడా?

ఈ ప్రశ్నకు కాళిదాస మహాకవి కూడా సమాధానం చెప్పలేదు!

### 5. అంభోధీ, జలధీ, పయోధీ:

ఒకసారి భోజరాజు కాళిదాసుకు ఒక చిత్రమైన సమస్య ఇచ్చాడు. సముద్రాన్ని అంభోధి అంటారు. దాన్నే జలధీ, పయోధీ, ఉదధీ అంటారు. వారాంనిధీ, వారిధీ అన్నా సముద్రమనే అర్థం.

'అంభోధిః - జలధిః - పయోధిః - ఉదధిః - వారాంనిధిః - వారిధిః' అని ఈ ఆరు సమానార్థక పదాలూ ఆఖరిపాదంగా యిచ్చి శ్లోకాన్ని పూరించమన్నాడు. ఇదెలా పూరించటం? 'సముద్రానికే ఆరు పర్యాయపదాలున్నాయి' అంటూ మూడు పాదాలు సాగదీసి, నాలుగో పాదంలో ఈ ఆరు పదాలు చెప్పేస్తే ఓ రకంగా శ్లోకం పూర్తవుతుంది. కానీ ఏ చమత్కారం లేని అలాంటి చప్పటి పద్యం చెప్తే ఆయన కాళిదాసెందుకు అవుతాడు?

ఒక చక్కటి కథ ఊహించాడు.

పార్వతికి కోపం వచ్చింది. ఎందుకు? తన భర్త తనకో సవతిని తీసుకురావటమే గాక, ఆమెని నెత్తిన కూడా పెట్టుకొని కూర్చొంటే కోపం రాదా! కుమారుడయిన కుమారస్వామికి తన కష్టం చెప్పుకొంది. కుమారుడికీ కోపం వచ్చింది. నేరుగా తండ్రి పరమశివుడి ముందుకు వెళ్ళాడు. 'నాన్నా, మా అమ్మకు కోపం వస్తున్నది. నువ్వు నెత్తిన పెట్టుకొన్న ఈ గంగమ్మను విడిచిపెట్టు' అన్నాడు.

'కుమారా షణ్ముఖా! నేను వదిలేస్తే, చిరకాలంగా నా దగ్గరే ఉంటున్న ఈ గంగగతి ఏమవుతుంది. చెప్పు?" అన్నాడు మహాదేవుడు.

సవతితల్లిని తండ్రి వెనకేసుకు రావటం షణ్ముఖుడికి బొత్తిగా నచ్చలేదు. ఏమవుతుంది, ఎక్కడికెళుతుంది అంటే తనేం చెప్తాడు? 'బంగాళాఖాతంలో కలవమను. నాకేమిటి?" అన్నాడు. ఆరుముఖాలవాడు కాబట్టి, ఆ మాటే ఆరు ముఖాలతో ఆరుసార్లు చెప్పాడు. 'ఆమె గతి ఏమిటంటే నేనేం చెప్పేది 'అంభోధి, జలధి, పయోధి, ఉదధి, వారాంనిధి, వారిధి' అని.

నిజానికి గంగానది, నది కాబట్టి, నదికి సాగరమే గదా గతి? ఇంత చక్కటి చమత్కారంతో శ్లోకం ఇలా పూరించాడు కాళిదాసు:

**శ్లో॥ 'అంబా కుప్యతి, తాత! మూర్ధ్ని విలసత్ గంగేయం-ఉత్సృజ్యతామ్!'**
**'విద్వన్ షణ్ముఖ! కా గతిః మయి చిరాత్-అస్యాః స్థితాయాః వద?'**
**కోపావేశవశాత్-అశేష వదనైః ప్రత్యుత్తరం దత్తవాన్ః**
**'అంభోధిః! జలధిః! పయోధి! రుదధిః-! వారాంనిధిః-! వారిధిః'**

అంబాకుప్యతి = అమ్మ కోపిస్తున్నది; మూర్ధ్ని విలసత్ గంగా ఇయం ఉత్సృజ్యతామ్ = శిరసుమీద ప్రకాశిస్తున్న ఈ గంగ పరిత్యజించబడుగాక!; విద్వన్

షణ్ముఖ = సర్వం తెలిసిన షణ్ముఖుడా!; మయి–చిరాత్–స్థితాయాః–అస్యాః–కా గతిః – వద = నాలోనే – చిరకాలంగా – ఉన్న – ఈమెకు – గతి ఏమిటి – చెప్పు?; కోప–ఆవేశవశాత్ అశేష–వదనైః–ప్రత్యుత్తరం–దత్తవాన్ = కోపావేశాలతో అనేక ముఖాలచేత–జవాబు–ఇవ్వబడింది:– జలధి–అంభోధి–పయోధి– ఉదధి–వారాంనిధి–వారిధి!

**6. భ్రష్టుడు:**

కాళిదాసుకు భోజరాజుతో ఎన్నో సంవత్సరాల సన్నిహిత సంబంధం. అంత సుదీర్ఘకాలంలో, కొన్నిసార్లు చిన్నా, పెద్దా అభిప్రాయ భేదాలు రావటంలో విశేషమేముంది, కలుగుతూనే ఉండేవి. రాజు ఎంతయిన రాజసం కలవాడు కనక ఆయన ఆగ్రహానుగ్రహాలు అప్పుడప్పుడు కట్టలు తెంచుకొనేవి. ఈ కథలలో, వాళ్ళిద్దరూ గట్టిగా మాటా మాటా అనుకొని దూరమైపోయిన ఘట్టాలు అప్పుడప్పుడు వస్తూనే ఉంటాయి.

అలాంటి ఒక సందర్భంలో కాళిదాసు దేశం వదిలి వెళ్ళిపోయాడు. కొన్నాళ్ళు పొరుగు రాజ్యంలో అనామకుడుగా కాలం గడిపాడు.

భోజుడికి, కాళిదాసు లేకుండా కాలం గడవదు, గిలగిలలాడిపోతాడు. నిద్రాహారాలుండవు. మనశ్శాంతి అసలే ఉండదు. కాళిదాసు వెళ్ళిపోయిన కొద్దిరోజులకే గూఢాచారులని అన్ని దిక్కులకు పంపాడు. వాళ్ళు కాళిదాసు ఫలానా పొరుగుదేశంలో ఒక సన్యాసి వేషంలో తిరుగుతున్నాడన్న సమాచారం సంపాదించారు. కానీ తనను అవమానించిన రాజు స్వయంగా వచ్చి ఆహ్వానిస్తే తప్ప, కాళిదాసు ధారానగరానికి తిరిగి వస్తాడా?

అందుచేత, భోజరాజే మారువేషం వేసుకొని, ఆ పొరుగుదేశంలో ప్రవేశించాడు. కాళిదాసును ఆ దేశంలో తనే వెతకసాగాడు. ఒకరోజు, ఒక గ్రామంలో ఆయనకు ఒక సన్యాసి కనిపించాడు. రూపురేఖలు కాళిదాసువి లాగే ఉన్నాయి. రాజు ఆ సన్యాసిని రహస్యంగా వెంబడించాడు.

ఆశ్చర్యం! ఆ సన్యాసి ఓ కసాయి దుకాణానికి వెళ్ళి మాంసం బేరం చేయసాగాడు. మారువేషంలో ఉన్న భోజుడికీ, మారువేషంలో ఉన్న కాళిదాసుకూ ఇలా సంభాషణ సాగింది:

భోజుడు : భిక్షో! మాంస నిషేవణం కిం ఉచితం? = సన్యాసీ, మాంసభక్షణం నీకు తగునా?

కాళిదాసు : కిం తేన, మద్యం వినా? = నిజమే, మద్యం లేకుండా మాంసంతో ఏం లాభం?

భోజుడు : మద్యం చ అపి తవ ప్రియమ్? = నీకు మద్యం కూడా ఇష్టమా?

కాళిదాసు : ప్రియం, అహో, వారాంగనాభిః = సహవేశ్యలతో ఉన్నప్పుడైతేనే

భోజుడు : వారస్త్రీ రతయే కుతః తవ ధనమ్? = వేశ్యలను కలవటానికి నీకు డబ్బెలా వస్తుంది?

కాళిదాసు : ద్యూతేన, చౌర్యేణ వా = జూదంవలనో, దొంగతనంవలనో,

భోజుడు : చౌర్య ద్యూత పరిశ్రమా అపి భవతామ్?=తమకు చౌర్యం, ద్యూతం లాంటి కార్యకలాపాలు కూడానా?

కాళిదాసు : భ్రష్టస్య కా వా గతిః? = భ్రష్టుడికి వేరే గతి ఏముంది? దాంతో శ్లోకం గూడా పూర్తయింది.

**శ్లో॥ 'భిక్షో! మాంస నిషేవణం కిముచితమ్?'-'కిం తేన మద్యం వినా.'-**
**'మద్యం చాపి తవ ప్రియమ్?'-'ప్రియమహో వారాంగనాభిస్సహ!'-**
**'వారస్త్రీ రతయే కుతః తవ ధనమ్?'-'ద్యూతేన, చౌర్యేణ వా!'-**
**'చౌర్య, ద్యూత పరిశ్రమాపి భవతామ్?'-'భ్రష్టస్య కావా గతిః?'**

భోజుడు, కాళిదాసును గుర్తు పట్టేశాడు.

మారువేషం వదిలేసి, కాళిదాసును బతిమాలి బతిమాలి, తిరిగి ధారా నగరానికి తీసుకెళ్లాడు.

### 7. చంద్రుడిలో మచ్చ ఎందుకు?

ఆనాడు కార్తీక పూర్ణిమ.

భోజరాజు రాత్రి భోజనం చేసి తన క్రీడావనానికి వాహ్యాళికి వెళ్ళాడు. ఒక అరుగు మీద కూర్చొన్నాడు. పుచ్చపువ్వులా వెన్నెల కాస్తున్నది. ఆ వెన్నెలలో ఆ ఉద్యానవనం అద్భుతంగా, మనోహరంగా కనిపించింది. నిండు పున్నమి చంద్రుడు దేదీప్యమానంగా వెలిగిపోతున్నాడు.

ప్రకృతి సౌందర్యాన్ని తనివితీరా ఆస్వాదిస్తూ, రాజు నెలరాజు వైపు తదేకంగా చూస్తున్నాడు. చంద్రుడిలో మచ్చ ఆయన దృష్టిని ప్రత్యేకంగా ఆకర్షించింది. దాన్ని చూడగా ఆయనకు కలిగిన భావాలు శ్లోకరూపంలో చెప్పాలనిపించింది.

ఆశువుగా ఇలా అన్నాడు:

**శ్లో॥ 'అంకం కేపి శశంకిరే, జలనిధేః పంకం పరే రే మేనిరే;**
**సారంగం కతిచిత్ చ సంజగదిరే, భూచ్ఛాయమైచ్ఛన్ పరే।'**

కొందరు దానిని మచ్చగా భావించారు. కొందరు దానిని చంద్రుడు పాలసముద్రంలోనిండి పుట్టినప్పుడు ఆయన ఒంటికి అంటిన బురదగా భావించారు. మరికొందరు అది లేడిరూపం అన్నారు. ఇంకొందరు చంద్రుడి మీద పడుతున్న భూమి నీడ అని సంభావించారు. అంకం–కే–అపి శశంకిరేః = మచ్చగా–కొందరు – భావించారు; జలనిధేః–పంకం–పరే మేనిరే = సముద్ర సంబంధమైన బురదగా ఇతరులు అనుకొన్నారు. సారంగం–కతిచిత్–చ–సంజగదిరే = లేడి అని మరి కొందరు చెప్పారు; భూచ్ఛాయం–ఐచ్ఛన్–పరే = భూమినీడ అనటం ఇష్టపడ్డారు మరికొందరు.

దాంతో శ్లోకం మొదటి భాగం పూర్తయింది.

ఇంతవరకూ రాసిన తర్వాత, రాజు తన సేవకుణ్ణి కాళిదాసు ఇంటికి పంపాడు. ఆయన్ని వీలయినంత త్వరగా ఉద్యానవనానికి తీసుకురమ్మని.

మహాకవి వచ్చాడు. భోజరాజు 'కవీంద్రా, ఇంత మనోజ్ఞమయిన వెన్నెలలు చల్లుతున్న ఆ పూర్ణచంద్రుడిని చూస్తే ఒక శ్లోకం చెప్పాలనిపించింది. కానీ శ్లోకంలో సగమే పూర్తయింది. ఎంత ఆలోచించినా, మిగతా రెండు పాదాలూ కుదరటం లేదు. మీరైతే దీన్ని సునాయాసంగా, రసవంతంగా పూర్తిచేయగలరని మిమ్మని పిలిపించాను' అన్నాడు.

మహాప్రసాదం మహారాజా! ఇదిగో వినండి శ్లోకం :

**శ్లో॥ అంకం కేపి శశంకిరే, జలనిధేః పంకం పరే మేనిరే;**
**సారంగం కతిచిత్–చ సంజగదిరే, భూచ్ఛాయమైచ్ఛన్ పరే ।'**
**ఇందౌ–యత్–దళితేంద్ర నీల శకల శ్యామం దరీదృశ్యతే**
**తత్–సాంద్రం నిశి పీత మంధతమసం కుక్షిస్థ మాచక్ష్మహే ॥**

పగిలిపోయిన ఇంద్రనీల వజ్రంముక్కలాగా చంద్రుడిలో నల్లగా కనిపిస్తున్న మచ్చ, రాత్రివేళ చిమ్మచీకటిని తాగివేయగా ఆయన పొట్టలో దట్టంగా పేరుకుపోయిన నల్లదనం అని మేమంటున్నాం. దళిత-ఇంద్రనీలా-శకలశ్యామం-ఇందౌ-యత్ దరీదృశ్యతే-తత్ = పగిలిన - ఇంద్రనీలమణి-ముక్కలాగా-నల్లగా -చంద్రుడిలో - ఏదయితే కనిపిస్తున్నదో-అది; నిశి-పీతం-సాంద్రం-కుక్షిస్థం-అంధ-తమసం-ఆచక్ష్మహే = రాత్రివేళ - త్రాగబడి-దట్టంగా చంద్రుడి పొట్టలో పేరుకొన్న - చిమ్మ-చీకటిగా - అంటున్నాము.

'ఎంత బాగా చెప్పావయ్యా, కవిరాజా!' అని రాజు కాళిదాసుని కౌగిలించు కొన్నాడు. అక్షర లక్షలు బహుమతి యిచ్చాడు.

అయినా రాజుకు తనివి తీరలేదు.

'మహాకవీ! మచ్చలేని చంద్రుడిని వర్ణిస్తూ మరో చక్కని శ్లోకం వినిపించండి?' అన్నాడు.

అద్భుతమైన ఉపమానాలతో, లలితమధురమైన శ్లోకాలు చెప్పటం కాళిదానుకు వెన్నతో పెట్టిన విద్య కదా! ఆయన చెప్పిన శ్లోకం ఇలా ఉంది :

**శ్లో॥ లక్ష్మీ క్రీడా తటాకో, ధవళ రుచి గృహం, దర్పణం దిగ్వధూనాం,**
**పుష్పం శ్యామా లతాయాః - త్రిభువన జయినో మన్మథస్యాతపత్రం।**
**పిండీభూతం హరస్య స్మిత, మమరధునీ పుండరీకం, మృగాంకః**
**జ్యోత్స్నా పీయూష వాపీం, జనయతి నికరః - తారకా గోళకానామ్॥**

ఆకాశంలో కనిపించే తారకలూ గ్రహాలలాంటి గోళాలలో శ్రేష్ఠుడు చంద్రుడు. (తారకా-గోళకానాం-నికరః-మృగాంకః). ఆయన లక్ష్మీదేవికి ఆటలకొలను, లీలాసరస్సు, (లక్ష్మీ-క్రీడా-తటాకః). తెల్లని కాంతులకు నెలవు (ధవళ-రుచి-గృహం). దిక్కులు అనే స్త్రీలకు అద్దం (దిక్-వధూనాం-దర్పణం). రాత్రి అనే లతకు పూచిన పుష్పం (శ్యామా-లతాయాః-పుష్పం). ముల్లోకాలూ జయించిన మన్మథుడికి గొడుగు (త్రిభువన జయినః-మన్మథస్య-ఆతపత్రం). ముద్దగా చేసిన- శివుని-తెల్లని చిరునవ్వు (పిండీభూతం-హరస్య-స్మితం). ఆకాశంగంగలో విరిసిన తెల్లతామరపూవు (అమర ధునీ-పుండరీకం). అలాంటి చంద్రుడు, వెన్నెలలు అమృతపు బావిని పుట్టిస్తున్నారు. (జ్యోత్స్నా పీయూష-వాపీం-జనయతి).

రాజు, కాళిదాసుకు మళ్ళీ అక్షరలక్షలు బహూకరించాడు!

(కాళిదాసు ఆశువుగా చెప్పిన చాటువులలో ఇది మహాద్భుతమైనదని నా అభిప్రాయం – తంగిరాల)

**8. కర్మఫలం:**

ఒకసారి కొందరు జాలరులు నర్మదానదిలో చేపలు పట్టేందుకు వెళ్ళారు.

చేపలు పడుతుండగా వాళ్ళ వలలో ఓ రాతి ముక్క పడింది. దానిని తీసేసి మళ్ళీ నదిలో పారేయబోతుంటే, ఒక జాలరి ఆ రాతిముక్క మీద ఏదో సంస్కృతం అక్షరాలున్నాయని గమనించాడు.

వాళ్ళ రాజు భోజరాజుకు సంస్కృత శ్లోకాలంటే కవిత్వమంటే వెర్రి అభిమానమని ఆ దేశంలో అందరూ ఎరిగిన విషయమే. ఆ జాలరులకు కూడా అది తెలుసు.

ఈ రాతిముక్క రాజుకు అందజేస్తే రాజు సంతోషిస్తాడని వాళ్ళు దాన్ని రాజమందిరానికి తెచ్చి యిచ్చారు. అది భోజరాజు దగ్గరికి చేరింది. నిపుణుల చేత పరీక్షచేయించగా, దానిమీద రామాయణకథకు సంబంధించిన శ్లోకం చెక్కబడిందనీ, అయితే అక్షరాలు స్పష్టంగా తెలియటం లేదనీ వాళ్ళు చెప్పారు. తెలిసినంతవరకూ ఆ అక్షరాలు పేర్చగా ఓ శ్లోకపాదం తయారయింది ఇలా :

**'అయిఖలు! విషమః పురాకృతానాం**
**భవతి హి జంతుషు కర్మణాం విపాకః'**

అయ్యయ్యో! పూర్వకర్మల ఫలితం (కర్మణాం విపాకః) ప్రాణులకి చాలా కఠినమే (విషమః) అవుతుంది.

'ఇకనేం శ్లోకంలో ఒక సగం దొరికింది గదా చాలు' అని భోజుడు దాన్ని తన ఆస్థాన కవులకు సమస్యగా ఇచ్చి పూరించమన్నాడు.

భవభూతి ఇలా చెప్పాడు – శ్లోకంలో మొదటి సగం :

**'క్వ ను కులమకలంకం–ఆయతాక్ష్యాః**
**క్వచ రజనీచర సంగమ అపవాదః?'**

(విశాలాక్షి సీతయొక్క అకళంకమైన కులమెక్కడ? రాక్షసునితో సంబంధం కలిపే అపనింద యెక్కడ?)

భోజరాజు ఇది విన్నారు. బాగానే ఉంది గానీ, ఇదే భావం ఇంకా లలితంగా చెప్తే బాగుండేదేమో అనిపించింది ఆయనకు.

**'క్వ జనక తనయా? క్వ రామజాయా?**
**క్వ చ దశకంధర మందిరే నివాసః'**

(ఎక్కడి జనకతనయా, రామపత్నీ? ఎక్కడ దశకంఠుడి ఇంటి నివాసం) అంటే బాగుండేది అనుకొన్నాడు. పైకి అనలేదు, భవభూతి మీద గౌరవం కొద్దీ.

'కాళిదాస మహాకవీ! మీరేమంటారు?' అన్నాడు.

కాళిదాసు శ్లోకం ప్రథమార్ధం ఇలా పూరించాడు.

**'శివశిరసి శిరాంసి యాని రేజుః,**
**శివ శివ!, తాని లుఠంతి గృధ్రపాదైః!**
**అయి ఖలు విషమః పురాకృతానాం**
**భవతి హి జంతుషు కర్మణాం విపాకః'**

ఏ తలలు శివుడి తలమీద (శివ-శిరసి) ప్రకాశించాయో (రేజుః) (రావణుడు పూర్వం తన తలలు కోసి శివుడికి అర్పించినపుడు), శివ శివా!, ఆ తలలే ఇప్పుడు గద్దల పాదాలచేత దొర్లించబడుతున్నాయి (తాని గృధ్ర పాదైః లుఠంతి). అయ్యో, పూర్వ కర్మఫలం పరిణామం ప్రాణులకి చాలా కఠినంగా ఉంటుంది సుమా!

**రోకలి బండ**

ఒక రోజు భోజరాజు మారువేషంలో తిరుగుతుంటే ఒక ఇల్లు కనిపించింది. ఆ ఇంట్లో ఒక అద్భుతమైన సౌందర్యవతిని చూశాడు. ఆ అందాలరాశి గృహకృత్యంగా రోకటితో వడ్లు దంచుతున్నది. రాజు ఆమె అందం చూసి ముగ్ధుడయ్యాడు. ఆయనకు ఒక ఊహ వచ్చింది. 'అంతటి అందాల పడుచుపిల్ల చెయ్యి తగిలినా, ఆ రోకలి, వెంటనే చిగురించకుండా, అలాగే మొండిబండగా ఉండిపోయింది. రోకలికి శృంగారమేం తెలుసు కనక!' అని ఆ మాటే పదిసార్లు అనుకొన్నాడు. ఆ భావం ఒక శ్లోకపాదంగా రూపుదాల్చింది.

**'ముసల ! కిసలయం తే తత్-క్షణాత్ యత్-న జాతమ్'**

'ఓ రోకలీ! నువ్వు ఉన్నపళాన చిగురించకపోవటానికి కారణం ఏమంటే...!'

మర్నాడు పొద్దున, తన సభలో అదే పాదాన్ని సమస్యగా కాళిదాసు ముందుంచి, దాన్ని పూర్తి చేయమన్నాడు. కాళిదాసు ఇలా పూర్తి చేశాడు.

**జగతి విదిత మేతత్ కాష్ఠం-ఏవ-అసి, నూనమ్**

(నువ్వు కేవలం కట్టెవి అని లోకమంతా తెలిసిన విషయమే, సందేహం లేదు.)

**తదపి చ కిల సత్యం కాననే వర్ధితః అసి**

(నువ్వు అడవిలో పెరిగిన అడవి సరుకువన్న మాట గూడా సత్యం.)

**నవకువలయనేత్రాపాణి సంగోత్సవే-అస్మిన్**

(అప్పుడే విరిసిన కలువలలాంటి కన్నులు గల దాని చేతులస్పర్శ కలిగిన ఈ సందర్భంలో కూడా.)

**ముసల! కిసలయం తే తత్-క్షణాత్ యత్ న జాతమ్!**

(ఓ రోకలీ! ఉన్న పళాన నీకు చిగుళ్ళు పుట్టుకు రాకపోవటం (ఏదయితే ఉందో,అది) అందువల్లనే.)

**శ్లో॥ 'జగతి విదిత మేతత్ - కాష్ఠమే వాసి నూనమ్,**
**తదపి చ కిల సత్యం కాననే వర్ధితోసి ।**
**నవ కువలయ నేత్రా పాణి సంగోత్సవేస్మిన్**
**ముసల! కిసలయం తే తత్-క్షణాత్ యన్న జాతమ్ ॥**

**10. వింతకోరిక:**

ఒకసారి భోజరాజుకు ఒక వింతకోరిక కలిగింది.

తను మరణిస్తే, తన ఆస్థానకవులు, ముఖ్యంగా కాళిదాసు, తనని గురించి ఏం చెపుతారో, ఎలా చెపుతారో తెలుసుకోవాలని.

కోరిక పట్టలేక, ఆయన కాళిదాసును ఒక రోజు అడిగాడు : 'కవీశ్వరా! నేను మరణించినట్టుగా భావించి, కీర్తిశేషుడయిన భోజరాజుగురించి నాలుగు శ్లోకాలు చెప్పండి. నేను బ్రతికి ఉండగానే అవి విని సంతోషిస్తాను. నేను నిజంగా చనిపోయిన తర్వాత నా గురించి మీరు ఎంత చక్కని శ్లోకాలు చెపుతారో వినే అవకాశం నాకు ఉండదు. గదా!' అన్నాడు.

రాజు కోరిక పిచ్చిగా, అమంగళకరంగా, జుగుప్సాకరంగా కనిపించింది కాళిదాసుకు. ఆ మాటే కుండబద్దలు కొట్టినట్టు చెప్పాడు. 'రాజా, మీ కోరిక చాలా విడ్డూరంగా, అసహజంగా, అమంగళకరంగా ఉంది. ఒక్కమాటలో చెప్పాలంటే, ఎవరో ఉన్మాదులు తప్పా, యిలాంటి కోరిక ఎవరూ కోరరు. ఇలాంటి శ్లోకాలు చెప్పమని మీరు అడగకూడదూ, నేను చెప్పకూడదు. క్షమించండి!' అన్నాడు.

రాజు క్షమించలేదు. కోపంతో ఊగిపోతూ, 'కవీంద్రా, ఇది నా ఆజ్ఞ. శ్లోకం చెప్పండి' అన్నాడు.

కాళిదాసు చలించలేదు. 'ఇదే మీ ఆజ్ఞ అయితే, నాకు దాన్ని ధిక్కరించటం తప్ప మరో మార్గం లేదు!' అన్నాడు.

'అయితే రాజాజ్ఞ ధిక్కరించిన వాళ్ళు భ్రష్టులవుతారు. వాళ్ళకు దేశబహిష్కారమే –శిక్ష అని మీరెరుగుదురు. కనుక, మీకు ఆ శిక్ష విధించటం తప్ప మరో మార్గం లేదు' అన్నాడు భోజుడు. ఆ బెదిరింపుతో మహాకవి వెనక్కు తగ్గి, శ్లోకం చెప్తాడని ఆయన ఆశ.

కాళిదాసు మాత్రం వెంటనే లేచి రాజసభలోంచి బయటికి వెళ్ళిపోయాడు. ఎందరు ఎంత వారించినా వినకుండా తన వేశ్య విలాసవతితో కలిసి దేశం వదిలివెళ్ళిపోయాడు. ఇలా జరుగుతుందని ఊహించని మహారాజు దిగులుపడిపోయాడు. కాళిదాసు కనిపించకపోతే ఆయనకు ఒకరోజు కూడా గడవదు.

ఎలాగో కొద్దిరోజులు గడిచాయి. ఇక ఉండబట్టలేక, రాజు కాళిదాసును వెతికి తిరిగి తెచ్చేందుకు బయలుదేరాడు. మారువేషంలో ఆయనను వెతుకుతూ తిరుగుతుండగా ఎవరో చెప్పారు. కాళిదాసు ఏకశిలానగరంలో ఉంటున్నాడని.

రాజు గడ్డాలూ, మీసాలూ పెంచి, ఓ సన్యాసి వేషం ధరించి, ఏకశిలా నగరానికి వెళ్లాడు. వెతకగా, వెతకగా ఒక వీధిలో కాళిదాను ఎదురుపడ్డాడు. కానీ కాళిదాసు మారువేషంలో ఉన్న భోజరాజును గుర్తుపట్టలేదు.

యోగివేషంలో ఉన్న రాజు, 'మహాకవీ, అభివాదాలు!' అంటూ సమస్కరించాడు. కాళిదాసు ప్రతినమస్కారం చేసి 'యోగీశ్వరా, తమది ఏ దేశం?' అని ప్రశ్నించాడు.

'నేను ధారానగరం వాడిని' అన్నాడు రాజు.

'అలాగా, భోజరాజు క్షేమంగా ఉన్నారా?' అన్నాడు కాళిదాసు ఆత్రంగా. యోగి విచారం నటించాడు : 'అయ్యో, అడగరాని ప్రశ్న అడిగి, మానిపోతున్న గాయాన్ని రేపుతున్నావు, కవీశ్వరా!' అన్నాడు.

'ఏమయింది, ఏమయింది? మా రాజుకేదయినా అపాయమా?' అన్నాడు కాళిదాసు కంగారుగా.

"ఏం చెప్పమంటావు కవీ! ఇంకెక్కడి రాజు! భోజుడు చనిపోయాడు. అప్పుడే ఒక నెల దాటిపోయింది. ఆయన స్వర్గస్థుడు కాకపోతే నేను మా నగరం వదిలేవాడినా? ఆయన లేని ధారానగరంలో బ్రతకలేక, నేను మాళవదేశమే వదిలేసి వచ్చాను' అన్నాడు. యోగివేషంలో ఉన్న భోజుడు.

అది వినగానే కాళిదాసు విద్యుదాఘాతం తగిలినవాడిలా మాన్పడిపోయాడు. వీధిలోనే, చెట్టుకింద కూలబడిపోయాడు.

'రాజా! నువ్వు వెళ్ళిపోయిన తరువాత, నేను ఎలా జీవించగలనో బోధపడటం. లేదు! ఇప్పటికిప్పుడే, నాక్కూడా మృత్యువు ప్రాప్తిస్తే ఎంత బాగుంటుంది, నీవెనకే నేనూ స్వర్గానికి వచ్చేస్తాను!' అంటూ దుఃఖించాడు.

ధారానగరంలో రాజసభలో రాజుతో తను గడిపిన కాలం, నాటి తియ్యటి జ్ఞాపకాలు ఆయన మనసులో మెదిలాయి. అప్రయత్నంగా,

**అద్యధారా నిరాధారా-నిరాలంబా సరస్వతీ ।**
**పండితాః ఖండితాః సర్వే-భోజరాజే దివంగతే ॥**

(ఈ రోజు ధారానగరం, నిరాధారనగరం అయిపోయింది. వాగ్దేవికి ఆలంబనం లేకుండా పోయింది. భోజరాజు దివంగతుడు కావటంతో పండితు లందరికీ చావుదెబ్బ తగిలింది.)

మారువేషంలో ఉన్న భోజరాజుకు, తన మరణవార్త విన్నప్పుడు కాళిదాసు చెప్పే శ్లోకం వినాలన్న కుతూహలం తీరింది.

కానీ, కాళిదాసు వాక్‌శుద్ధి ప్రభావమో ఏమో, కాళిదాసు 'భోజరాజే దివంగతే' అంటూ శ్లోకం పూర్తి చేయగానే, అకస్మాత్తుగా రాజు మొదలు నరికిన చెట్టులా కూలిపోయి, తత్‌క్షణమే ప్రాణాలు విడిచాడు.

నివ్వెరపోయిన కాళిదాసు, తన ముందు చచ్చిపడిపోయిన రాజు ముఖాన్ని పరిశీలనగా చూశాడు.

'రాజా! ఎంత పనిచేశావు! మారువేషంతో నన్ను మోసగించబోయి, ప్రాణమే కోల్పోయావా!' అంటూ కొంతసేపు రోదించాడు. అంతలో తన కర్తవ్యం స్ఫురించి, దుఃఖం దిగమ్రింగి, భువనేశ్వరీదేవిని ధ్యానించి, తన శ్లోకాన్ని మార్చి చదివాడు.

**అద్య ధారా సదాధారా, సదాలంబా సరస్వతీ ।**
**పండితాః మండితాః సర్వే, భోజరాజే భువం గతే ॥**

(ఈ రోజు ధారానగరానికి చక్కని ఆధారం (సత్-ఆధారా) దొరికింది. సరస్వతీ దేవికి చక్కని ఆలంబనం దొరికింది (సత్-ఆలంబా). పండితులు అందరూ చక్కగా సత్కరించబడ్డారు. భోజరాజు భూలోకంలో అవతరించగానే). శ్లోకం వినగానే భోజరాజు సజీవుడై లేచి కూర్చొన్నాడు!

రాజూ, కవిరాజు గాఢంగా కౌగిలించుకొన్నారు. ఆ మర్నాడే యిద్దరూ బయల్దేరి ధారానగరానికి తిరిగి వెళ్ళిపోయారు.



## అనుబంధం-11

# మరికొన్ని చమత్కార శ్లోకాలు - పద్యాలు

**సేకరణ-వివరణ: ఆచార్య తంగిరాల వెంకట సుబ్బారావు**

**1. ప్రార్థన శ్లోకము:**

యక్షగానాలు, వీధినాటకాలు, తోలుబొమ్మలాటలు ప్రదర్శించేటప్పుడూ; పల్నాటి వీరకథలు, జంగంకథలు, బుట్టకథలు మొదలైనవి పాటేటప్పుడూ జానపదులు ఈ క్రింది శ్లోకాన్ని పాడుతూ ఉంటారు. ఇది నందికేశుని అభినయ దర్పణములోనిది.

**శ్లో॥ సభాకల్పతరుం వందే - వేదశాఖోపజీవితమ్[1]**
**కలాశాస్త్ర[2] సుమాకీర్ణం[3] విద్వద్భ్రమర శోభితమ్[4]**

తా॥ వేదశాఖలతో జీవించుచున్నట్టియు, కళలు శాస్త్రములు అనెడి పూవులతో దట్టమైనదియు (క్రిక్కిరిసినదియు), పండితులనెడి తుమ్మెదలతో శోభిల్లుచున్నదియు నగు సభఅనెడి కల్పవృక్షమునకు నమస్కారము! (- డా॥ ఆర్.గణేష్‌గారు)

**2. రెండు సరసమైన శ్లోకాలు:-**

ఒక సరసమైన కథ, దానికి సంబంధించిన రెండు శ్లోకాలు మా అత్తగారు కీ.శే. భళ్ళమూడి లక్ష్మీకాంతమ్మగారు చెపుతూ ఉండేవారు. ఒక ఊళ్ళో ఒక బ్రాహ్మణ యువకుడుండేవాడు. అతడు చాలా అందగాడు. చక్కని శరీర సౌష్ఠవం కలిగినవాడు. అయితే అతనికి చదువు అంతగా అబ్బలేదు. అయినా అదృష్టవశాత్తు అతనికి రూపవతి, గుణవతి, గొప్ప సంస్కృత విద్యావతి అయిన భార్య లభించింది. ఇద్దరూ అన్యోన్యంగా కాపురం చేసుకుంటున్నారు. ఒక పండుగ సందర్భంలో అతడు భార్యను తీసికొని అత్తవారింటికి వెడుతున్నాడు. దారిలో అలసిపోయి ఇద్దరూ ఒక చెట్టుక్రింద విశ్రమించారు. భార్యకు నిద్రపట్టేసింది. భర్త మెలకువగా ఉన్నాడు. దగ్గరలో ఒక మోదుగు చెట్టు (పాలాశ వృక్షం లేక కింశుక వృక్షం) చక్కగా పూసి ఉంది. అగ్నిశిఖల్లా ఉన్నాయి ఎర్రటి మోదుగుపూలు (కింశుక పుష్పాలు). వాటిని చూచి అతడు చాలా ముచ్చట పడ్డాడు. దోసిటినిండా పూలు కోసి తెచ్చి, నిద్రిస్తున్న భార్యజడలో తురిమాడు.

---

1. జీవినమ్/ శోభితమ్, 2. నానాశాస్త్ర / శాస్త్రపుష్ప 3. సమాయుక్తం, 4 విద్వద్భ్రమర సేవితం/ రసికాళి మనోహరం/రసికాళి సమాకులం. పాఠాంతరాలు:

కొంతసేపటికి ఆమె లేచింది. తన జడలో ఉన్న మోదుగుపూలు చూచుకుంది. భర్తచేసిన అలంకరణకు సంతోషించింది. అయితే ఆ మోదుగుపూలు పైకి ఎర్రగా అందంగా ఉన్నా, వాటికి పరిమళం ఉండదు. అలాగే తన భర్త మంచి అందగాడు, బలమైనవాడు అయినా చదువులేదు. దీనిని మనసులో పెట్టుకొని, విదుషి అయిన ఆమె ఒక శ్లోకం చెప్పింది:

**శ్లో॥ రూపయౌవన సంపన్నా, విశాలనేత్ర వక్షస్థలా ।**
**విద్యాహీనా నశోభంతే, పాలాశకుసుమం యథా ॥**

తా॥ రూపయౌవన సంపన్నుడైనా, విశాలమైన నేత్రాలు విశాలమైన వక్షస్థలం కలిగి ఉన్నా, విద్య లేకపోతే, ఆ పురుషుడు వాసనలేని మోదుగుపూవులా ఏ మాత్రము శోభించదు. (పై శ్లోకంలో రెండవ పాదంలో "విశాలనేత్ర వక్షస్థలా"లో–ఒక అక్షరం ఎక్కువ అయింది. దీనిని "దీర్ఘనేత్ర పృథూరసః" అని మారిస్తే బాగుంటుందని ఆచార్య శలాక రఘునాథశర్మగారు సూచించారు. తరువాత దీనికి మూలమైన శ్లోకం హితోపదేశంలో నాకు లభించింది:–)

**శ్లో॥ రూపయౌవన సంపన్నాః, విశుద్ధకుల సంభవాః ।**
**విద్యాహీనా నశోభంతే, నిర్గంధా ఇవ కింశుకాః ॥**

ఈ శ్లోకం విన్న భర్త మనసులో చాలా బాధపడ్డాడు. పైకి ఏమీ అనలేదు. అత్తవారింటికి వెళ్ళి, పండుగ దినాలు గడిపి, ఒక రోజు ఎవరికీ చెప్పకుండా కాశీకి పారిపోయాడు. అక్కడ పండితుల్ని ఆశ్రయించి, చాలా ఏండ్లు పట్టుదలతో చదివి, గొప్ప విద్వాంసుడయ్యాడు. ఎన్ని సంవత్సరాలైనా అల్లుడు రాకపోవడంతో అందరూ అతని మీద ఆశ వదలుకున్నారు. చిన్నవయసులోఉన్న అతని భార్య పుట్టింట్లోనే ఉండిపోయింది.

కొన్ని ఏండ్లు గడిచాక, ఒక రోజు గడ్డాలూ మీసాలూ పెంచుకున్న ఒక పరదేశీ పండితుడు, ఆమె పుట్టింటికి వచ్చాడు. చాలా ఏండ్లు గడిచిపోవడం చేత ఎవరూ అతనిని గుర్తించలేదు. పరదేశ పండితుడికి భోజనం పెట్టింది ఆమె. అతడు సంతృప్తిగా భోజనం చేశాడు. "ఎలా ఉంది భోజనం?" అని అడిగింది ఆమె. దానికి సమాధానంగా అతడు ఈ క్రింది శ్లోకం చెప్పాడు:–

**శ్లో॥ చారు చారు సమాయుక్తం, ఇంగు జీర సమన్వితమ్ ।**
**కించిద్ లవణ హీనంచేత్, పాలాశ కుసుమం యథా ॥**

తా॥ చారు చాలా బాగా ఉన్నా, ఇంగువతోను జీలకర్రతోను కూడి ఉన్నా, కొంచెం ఉప్పు లేకపోతే, అది వాసన లేని మోదుగుపువ్వులా వ్యర్థమవుతుంది!

సమస్యాపూరణంలోని సమస్యలాంటి "పాలాశకుసుమం యథా!" అనే మాట వినగానే, ఆమె తన భర్తను గుర్తించింది. కాశీవెళ్ళి పండితుడై తిరిగి వచ్చిన భర్తను గౌరవించింది. ఇద్దరూ హాయిగా కాపురం చేసుకున్నారు.

### 3. త్రాగుబోతుల లక్షణాలు (హాస్య శ్లోకం):-

త్రాగుబోతులయొక్క భిన్న భిన్న లక్షణాలను తెలిపే ఒక హాస్య శ్లోకాన్ని "ఆశు కవి శేఖర" - "అవధాని చక్రవర్తి" కీ.శే. బులుసు వేంకట రామమూర్తిగారు చెపుతూ ఉండేవారు. దీనిని వారి ఏకైక పుత్రుడు శ్రీ బి.వి. శేషగిరిరావు చెపుతూ ఉంటే నేను సేకరించాను:-

**శ్లో॥ శుకం పికం ఒక చైవ - హనుమాన్ రావణస్తథా ।**
**కర్ణంచ కుంభకర్ణంచ - సప్తైతే 'డోసు' లక్షణమ్ ॥**

తా॥ ఈ శ్లోకంలో రకరకాలుగా ఉండే త్రాగుబోతుల లక్షణాలను ఏడింటిని వివరించాడు కవి. (1) బాగా తాగిన తరువాత కొందరు లొడలొడా వాగుతారు. ఇది శుక (చిలుక) లక్షణం. (2) కొందరు గొంతెత్తి పాటలు పాడుతారు - ఇది పిక (కోకిల) లక్షణం. (3) కొందరు ఏమి మాట్లాడకుండా కళ్ళుమూసుకొని జపం చేస్తున్నట్టుగా ఉండిపోతారు. ఇది బక (కొంగ) లక్షణం. (4) కొందరు విపరీతమైన బలాన్ని ప్రదర్శిస్తారు. తాము గొప్ప బలశాలురమని భావిస్తారు - ఇది హనుమంతుని లక్షణం. (5) కొందరు ఆ మత్తులో స్త్రీలను చెరపట్టాలని చూస్తారు - స్త్రీల గౌరవానికి భంగం కలిగించేలా ప్రవర్తిస్తారు - ఇది రావణ లక్షణం. (6) మరికొందరు, మామూలు సమయంలో మహా పిసినిగొట్టులైనా, త్రాగిన మైకంలో చేతిలో ఏది ఉంటే దానిని దానం చేసి వేస్తారు - ఇది కర్ణుని లక్షణం. (7) ఇంకా కొందరు త్రాగుబోతులు ఏమీ గొడవ చెయ్యకుండా గుర్రుపెట్టి నిద్రపోతారు- ఇది కుంభకర్ణుని లక్షణం. ఈ ఏడు లక్షణాలు. మద్యపానమత్తులైన వారి లక్షణాలు!

### 3.1 దురద లక్షణం (హాస్య శ్లోకం):

ఈ శ్లోకం కూడా కీ.శే. బులుసు వేంకట రామమూర్తిగారు చెప్పినదే. వారి కుమారుడు శ్రీ బి.వి. శేషగిరిరావునుండి సేకరించినదే. తెలుగుభాష + సంస్కృత భాష కలిపి చెప్పడంవల్ల, తెలుగు పదాలను సంస్కృత పద్ధతిలో చెప్పడంవల్ల, 'దురద'

అనే వస్తువువల్ల ఈ శ్లోకంలో హాస్యం ఉత్పన్నమయింది:-

**శ్లో॥ దురందంచ గోకడంచైవ - ప్రస్తుతం సుఖమేవచ ।**
**తర్వాత మంట మాప్నోతి - ఇత్యేవ దురద లక్షణమ్! ॥**

**4. అరసిక లక్షణం:-**

**శ్లో॥ అర్థాస్వాదన వేళాయాం - శబ్దోత్పత్తి విచారకాః ।**
**నీవీమోక్షణ వేళాయాం - వస్త్రమూల్య విచారకాః ॥**

తా॥ కావ్యంలోని అర్థాన్ని ఆస్వాదన చేస్తూ ఆనందించవలసిన సమయంలో (రసాస్వాదన చేయవలసిన సమయంలో), శబ్దోత్పత్తిని గురించి (వ్యాకరణ విశేషాలను గురించి) చర్చించడం అరసిక లక్షణం. ఇది ఎలాంటిదంటే, గర్భాధానం గదిలో ప్రవేశించి, వధువు కోకముడిని విప్పే సమయంలో "ఈ చీర ఖరీదెంత?" అని అడగడం లాంటిది!

**5. ఆరువేల నియ్యోగి కవి తెలివి:-**

కొండవీటి ప్రభువైన అనవేమారెడ్డి ఆస్థానానికి ఒక కవి వచ్చాడు. అతడు ఆరువేల నియ్యోగి బ్రాహ్మణుడు. మంచి తెలివైనవాడు. ప్రభువు మీద ఒక శ్లోకం ఇలా చెప్పాడు:-

**శ్లో॥ అనవేమ మహీపాల! స్వస్త్యస్తు తవ బాహవే ।**
**ఆహవే రిపుదోర్దండ చంద్రమండల రాహవే ॥**

తా॥ ఓ అనవేమ భూపాలా! యుద్ధములో శత్రువుల భుజాదండమను చంద్రమండలమునకు రాహువువంటి నీ మహాబల సంపన్నమైన బాహువులకు స్వస్తియగుగాక!

ఈ శ్లోకాన్ని విని రెడ్డిరాజు సంతోషించి ఆ కవికి రెండువేల వరహాలు ఇమ్మన్నాడు తన మంత్రితో. దానికి ఆ కవి నవ్వుతూ "అయ్యా! నేను తమకు నాలుగు 'వే'లిచ్చాను. మీరు నాకు రెండువేలే ఇవ్వడం ధర్మమా?" అన్నాడు. రెడ్డిరాజు మెచ్చుకొని, ఐదువేలివ్వబోయాడు. అప్పుడా కవి: "ప్రభూ! మేము ఆరువేల నియోగి బ్రాహ్మణులం కదా! మా గౌరవాన్ని మీరు నిలపాలి కదా!! అని మళ్ళీ చమత్కరించాడు. రాజుగారు ఆరువేల వరహాలు ఇవ్వబోయాడు. అప్పుడా కవి "మాది మాకిస్తున్నారా?" అన్నాడు. రాజుగారు ఏడువేలివ్వబోయాడు. "ఏడు రోదన సంఖ్య ప్రభూ!" అన్నాడు.

ఆ కవి క్షణక్షణ చాతుర్యానికి సంతోషించి, ఆ రెడ్డి ప్రభువు ఎనిమిది వేల బంగారు నాణేలతో అతనిని సత్కరించి పంపించాడు. ఇది జరిగిన కథ.

కానీ, హాస్యరసచక్రవర్తియైన 'పద్మశ్రీ' డా॥ గరికిపాటి నరసింహారావుగారు వీరి సంభాషణను ఇంకా చమత్కారంగా పొడిగించి చెప్పారు ఒక సభలో. ఆ రెడ్డిరాజు ఎనిమిదివేల వరహాలు ఇవ్వబోతూ, "స్వామీ! ఇదే పదివేలనుకో! ఇంక నన్ను వదిలేయ్" అన్నాడట. దానికి కవి వెంటనే "ప్రభువులు ఆ మాట మీద నిలబడాలి! పదివే లిప్పించండి!" అన్నాడట. ఆ కవి సభలో అడుగుపెట్టేటప్పుడే ఈ రాజు దగ్గర పదివేలు తీసుకోవాలని అని ఒక టార్గెట్ తన మనసులో పెట్టుకొని వచ్చాడని గరికిపాటివారు చమత్కరించారు.

## 6. అగ్ని లేకుండా శరీరాన్ని దహించేవి:-

"ఏఱిన ముత్యాలు" (2006) సంకలన గ్రంథంలో 127వ పుటలో 93వ శ్లోకమైన (ఈ పుస్తకంలో 133వ పుటలో 93వ శ్లోకమైన) "కుభోజనం క్రోధముఖీ చ భార్యా ...." అనే శ్లోకానికి పాఠాంతరంగా నీతిశాస్త్రంలో మరో శ్లోకం ఉంది:-

**శ్లో॥ భార్యా వియోగశ్చ, జనాపవాదః,**
**ఋణస్యశేషః, కుజనస్యసేవా ।**
**దారిద్ర్యకాలే ప్రియదర్శనం చ,**
**వినాగ్నినా పంచ దహంతి కాయమ్ ॥**

తా॥ భార్య చనిపోవడం, జనులలో నీలాపనింద వ్యాపించడం, అప్పు మిగిలిపోవడం, దుర్మార్గుణ్ణి సేవిస్తూ ఉండటం, మనం పేదరికంతో బాధపడు తున్నప్పుడు మనకు మిక్కిలి ప్రియమైన వ్యక్తులు రావడం - ఈ ఐదూ అగ్ని లేకుండానే మన శరీరాన్ని దహించి వేస్తాయి.

## 7. ఒక పాఠాంతరం:-

"ఏఱిన ముత్యాలు" సంకలన గ్రంథంలో 187వ పుటలో 12వ శ్లోకంలో రెండవ పాదంలో, (ఈ పుస్తకంలో 196వ పుటలో 12వ శ్లోకం) మొదటి సగానికి ఒక పాఠాంతరాన్ని సూచించారు మిత్రులు శ్రీ యఱ్ఱా విశ్వనాథంగారు (సోంపేట, శ్రీకాకుళం జిల్లా).

**శ్లో॥ కుంభకర్ణే భకారోస్తి - భకారోస్తి విభీషణే ।**
**రాక్షసానాం కులశ్రేష్ఠః - 'రాభణో' నతు 'రావణః' ॥**

ఈ శ్లోకంలో "రాక్షసానాం కులశ్రేష్ఠః" అనే పాదభాగానికి "అగ్రజశ్చ స్వయంరాజా' (ఈ పుస్తకంలో 74వ పుటలో 44వ పద్యం) అనే పాఠాంతరాన్ని సూచించారు విశ్వనాథంగారు. ఈ పాఠాంతరమే ఎక్కువ సమంజసంగా కనబడుతోంది.

**8. గంగిరెద్దులవారి పద్యం:-**

"ఏటిన ముత్యాలు" గ్రంథంలో 71వ పుటలో 43వ పద్యంలో (ఈ పుస్తకంలో 73-74 పుటలలో 44వ పద్యం) గంగిరెద్దును శివునితో పోలుస్తూ చెప్పిన ఒక సీస పద్యం ఉంది (**"ఆతఁడంబకు మగం డీతఁడమ్మకు మగండు" అనే పద్యం**). ఈ పద్యంలో మూడు పాదాలు మాత్రమే ఇచ్చారు మా అన్నగారు. నాల్గవ పాదం వారి ధారణలో లేదు. హాస్యరసచతురులైన డా॥ గరికిపాటి నరసింహారావుగారు తమ ప్రసంగాలలో ఈ పద్యాన్ని ఉదాహరిస్తూ, నాల్గవపాదాన్ని ఈ క్రింది విధంగా పూరించారు:-

**"అతఁడు దిగంబరుం డితఁడు పీతాంబరుం/డెలమి నాతనికన్న నితఁడె ఘనుఁడు"**

కాని, తరువాత నాకు అసలు పద్యం దొరికింది. పూర్వం రాయలవారిని శ్రీకృష్ణునితో పోలుస్తూ కుమ్మరి మొల్ల ఒక సీసపద్యం చెప్పింది. అందులో శ్రీకృష్ణుని కన్నా రాయలవారే గొప్పవారు అని నిరూపించింది. దానికి వ్యంగ్యానుకరణంగా (Parody గా) తెనాలి రామకృష్ణుడు గంగిరెద్దును శివునితో పోలుస్తూ ఒక సీసపద్యం చెప్పి, దానిలో శివునికన్నా గంగిరెద్దే గొప్పది అని నిరూపించాడు. దానిలో నాల్గవపాదం ఇలా ఉంది: **"అతని కంటను చిచ్చు, ఇతని కంటను బొచ్చు / నెలమి నాతనికన్న నితఁడె ఘనుఁడు"** తరువాతి ఎత్తు గీతి కూడా, మా అన్నయ్యగారిచ్చిన పద్యం కన్నా కొంచెం భిన్నంగా ఉంది:

**తే॥ దాత యాతండు, గోనెలమోత యితఁడు,**
**దక్షుదాతండు, ప్రజల సంరక్షుడితఁడు ।**
**దేవుడాతండు, కుడితికి దేవుఁడితఁడు**
**పశుపతి యతండు, శ్రీమహాపశువితండు! ॥**

దీనికన్నా మా అన్నయ్యగారి పద్యంలోనే హాస్యరసం ఎక్కువగా ఉంది.

**9. "మహాసహస్రావధాని" - "పద్మశ్రీ" - డా॥ గరికిపాటి నరసింహారావుగారు నాతో చెప్పిన ఒక శ్లోకం:-**

**శ్లో॥ శతం విహాయ భోక్తవ్యం - సహస్రం స్నానమాచరేత్ ।**
**లక్షం విహాయ దాతవ్యం - కోటిం త్యక్త్వా హరిం భజేత్ ॥**

తా॥ నూరు పనులు విడిచిపెట్టి భోజనం చేయాలి! వేయిపనులు విడిచిపెట్టి స్నానం చేయాలి! లక్షపనులు విడిచిపెట్టి దానం చేయాలి! కోటిపనులు విడిచిపెట్టి భగవంతుని పూజించాలి!!

**10. కొన్ని సంస్కృత సూక్తులు - వాటి అర్థములు:-**

(1) "నా నృషిః కురుతే కావ్యమ్"
(న+అనృషిః - కావ్యమ్ - న, కురుతే)
= ఋషి కానివాడు కవిత్వాన్ని వ్రాయలేడు.
ఈ క్రింది సూక్తులకు కూడా ఇలాగే అర్థం చెప్పుకోవాలి.

(2) "నా విష్ణుః పృథివీ పతిః"
(న+అవిష్ణుః) = విష్ణువుకానివాడు రాజు కాలేడు

(3) "నా గంధర్వః సురూపదృక్"
(న+అగంధర్వః) = గంధర్వుడు కానివాడు సుందరంగా ఉండడు.

(4) "నా దేవాంశో దదాత్యన్నమ్
(న+ అదేవాంశః) = దైవాంశలేనివాడు అన్నదానం చేయలేడు.

(5) "నా రుద్రో రుద్రమర్చయేత్"
(న+అరుద్రః) = శివాంశలేనివాడు శివుని పూజించలేడు.

**11. "మహాసహస్రావధాని" - "పద్మశ్రీ" డా॥ గరికిపాటి నరసింహారావుగారు చెప్పిన ఒక పేరడీ శ్లోకం:-**

పంచతంత్రంలో ఒక శ్లోకం ఉంది. ఉత్తమురాలైన ధర్మపత్ని ఎలా ఉండాలో ఈ శ్లోకంలో చెప్పబడింది:-

**శ్లో॥ కార్యేషు దాసీ - కరణేషు మంత్రీ**
**రూపేచ లక్ష్మీ - క్షమయా ధరిత్రీ ।**

**భోజ్యేషు (స్నేహేచ) మాతా - శయనేషు వేశ్యా**
**షట్కర్మయుక్తా - కులధర్మపత్నీ ॥**

తా॥ ఇంటిపనులలో దాసిగాను, కార్యాలోచనలో మంత్రిగాను, రూపసంపదలో లక్ష్మీదేవివలెను, ఓరిమియందు భూదేవివలెను, భోజనం పెట్టడంలో (లేదా, స్నేహంలో) తల్లివలెను, పడకగదిలో వేశ్యవలెను - ప్రవర్తిస్తూ, నేర్పరిగాఉన్న స్త్రీయే "కులపత్ని" అనదగును.

ఇటీవల ఒకసారి డా॥ గరికిపాటి నరసింహారావుగారు ఒక అష్టావధానం చేస్తూ ఉంటే, అప్రస్తుత ప్రసంగం చేసే వ్యక్తి పై శ్లోకాన్ని ఉదాహరించి, "ఈ శ్లోకంలో ఉన్న విషయాలు ఒక పురుషుడు తన భార్య ఎలా ఉండాలో కోరుకొనే విషయాలు; అలాకాకుండా, నేటి సమాజంలోని భార్యలు తమ భర్తలు ఎలా ఉండాలని కోరుకుంటున్నారో, ఈ శ్లోకానికి పేరడీ (Parody)గా మరొక శ్లోకం చెప్పండి" అని అడిగితే - డా॥ గరికిపాటివారు చెప్పిన శ్లోకం:-

**శ్లో॥ కార్యేషు మిక్సీ - శయనేషు సెక్సీ,**
**భరణే చ కూలీ - తరుణీషు శూలీ ।**
**రూపేచ హీరో - కోపే చ జీరో,**
**షట్కర్మ యుక్తా - కలికాల భర్తా ॥**

12. పోతన భాగవతంలోని "కమలాక్షునర్చించు కరములు కరములు, శ్రీనాథు వర్ణించు జిహ్వ జిహ్వ" అనే ప్రసిద్ధ సీసపద్యానికి డా॥ గరికిపాటి నరసింహారావుగారు చెప్పిన పేరడీ పద్యం:-

**సీ॥ కంప్యూటరును తాకు కరములు కరములు,**
**సెల్ఫోనులో వాగు జిహ్వాజిహ్వ ;**
**వాట్సాపు చూచెడి వాల్గంటి వాల్గంటి,**
**వెంటనే లైక్కొట్టు వేలు వేలు;**
**ట్విట్టరులోపెట్టి తిట్టు తిట్టే తిట్టు,**
**ఫేసు బుక్కైపోవు ఫేసు ఫేసు;**
**వీడియో చాటింగు విద్యార్థి విద్యార్థి,**
**స్మార్టు ఫోనును చెప్పు చదువు చదువు;**

**తే॥ ఆరు సిమ్ముల వాడెపో ఆధునికుడు,**
**అప్పు లెగ్గొట్టు వాడెపో గొప్పవాడు,**
**ఇవి యెరుంగని వాడెపో చవట యనగ,**
**నాగరికమున సర్వము నాశమగుటె!**

**13. విశ్వనాథవారిని ఆటపట్టించిన స్నేహితులు ("కవులలోపల బహ్మరాకాసి వీవు!"):-**

"కవిసమ్రాట్" విశ్వనాథ సత్యనారాయణగారి కాలంలో బెజవాడ (నేటి విజయవాడ)లో ఆయుర్వేదవైద్యుడైన గూడూరి వియ్యన్నగారు అనే సాహిత్య ప్రియుడు ఉండేవారు. ఆయన ఇల్లు ఒక సాహిత్య కేంద్రం. బెజవాడలోని సాహిత్యవేత్తలందరూ సాయంకాలం అయ్యేసరికి వియ్యన్నగారి యింటిలో సమావేశమయ్యేవారు. అటువంటి సమావేశాల్లో ఒకరోజు సాయంకాలం మాధవపెద్ది బుచ్చిసుందరరామశాస్త్రిగారు, వేదుల సత్యనారాయణశాస్త్రిగారు, కాటూరి వెంకటేశ్వరరావుగారు, దేవులపల్లి కృష్ణశాస్త్రిగారు, అప్పటికి బాగా యువకులైన రాచకొండ నరసింహమూర్తిగారు - వీరంతా వియ్యన్నగారి యింట్లో కూచుని పిచ్చాపాటీ మాట్లాడుకుంటున్నారు. ఇంతలో విశ్వనాథ సత్యనారాయణ గారు కూడా వచ్చి వారిలో చేరారు. అప్పుడు విశ్వనాథవారు అక్కడ సమావేశమైన సాహిత్యమిత్రులతో ఇలా అన్నారు:- "కవుల సాంగత్యంచేసి బాగుపడ్డవాడెవడూ నాకు కనిపించడం లేదు. మనల్ని దగ్గరకు చేర్చి దివాలా తీసినవాడేగాని బాగుపడినవాడు ఒకడూ లేదు. కావాలంటే నా విషయమే తీసుకోండి. నా పుస్తకాలు అంకితం పుచ్చుకున్న వాడెవడూ సవ్యంగా బ్రతికి బట్టకట్టలేదు" అంటూ ఎవరెవరికి ఎన్నెన్ని కష్టాలు వచ్చిందీ చెప్పడం ప్రారంభించారు. అదంతా సావధానంగా విని సహజగంభీరులైన కాటూరివారు సైతం నవ్వుకున్నారు. నవ్వులు ఆగీ ఆగకుండానే మాధవపెద్ది బుచ్చిసుందరరామశాస్త్రివగారు శంఖంవొత్తినట్లు తమకంఠం ఎత్తి విశ్వనాథపై ఒక సీసపద్యం అందుకున్నారు:-

**సీ॥ "పండువంటి గృహస్థు పైడిపాట్యగ్రహా**
**రికుడు నీ కృతిచే దరిద్రుడయ్యె!"**

ఈ పద్యాన్నిగురించి పూర్తిగా చెప్పేముందు, విశ్వనాథవారు ఎవరెవరికి ఏయే కావ్యాలు అంకితమిచ్చారు, తరువాత వాళ్ళగతి ఏమైనది - అనే విషయాలు ముందుగా తెలియజేయాలి. లేకపోతే పద్యంలోని స్వారస్యం పాఠకులకు అర్థంకాదు.

**(1) "వేనరాజు" (నాటకం):–** కృతిభర్త: "పైడిపాటి" అగ్రహారీకుడైన బెల్లంకొండ రాఘవరావుగారు. ఈ నాటకాన్ని అంకితం పుచ్చుకున్నాక ఆయన అగ్రహారం పోయి దరిద్రుడయ్యాడు!

**(2) "శృంగారవీథి" (కావ్యం):–** కృతిభర్త: నల్లాన్ చక్రవర్తుల రఘునాథా చార్యుల అయ్యవార్లు – ఈయన 'పెన్నాడ' అగ్రహారీకుడు. ఈయనను "పెన్నాడ అయ్యవార్లు" అని పిలిచేవారు. వీరు విశ్వనాథవారి "శృంగారవీథి" కావ్యాన్ని అంకితం పుచ్చుకున్నాక అగ్రహారం పోవడమే కాకుండా కనీసం ఉండటానికి ఇల్లు లేకుండా, చివరికి భోజనం కూడా లేకుండా పోయాడు!

**(3) "శ్రీమద్ రామాయణ కల్పవృక్షం" (మహాకావ్యం):–** దీనిని విశ్వనాథవారు స్వగ్రామంలో ''నందమూరు''లోని శివునకు అంకితమిచ్చారు. ముక్త్యాల జమీందారుగారు కేవలం శ్రోతమాత్రమే! అంతమాత్రానికే ఆయన జమీందారీ ఊడిపోయింది.

**(4) ''శశిదూతం'' (కావ్యం):–** దీనిని ప్రముఖ రంగస్థలనటుడు, శ్రీకృష్ణపాత్రధారి బందా కనకలింగేశ్వరరావుగారు, ఏలూరులో క్రొత్తగా ఇల్లుకట్టుకొని, గృహప్రవేశసమయంలో ఈ కావ్యాన్ని అంకితం పుచ్చుకున్నారు. అంతే! ఆయన భార్య చనిపోయింది!

**(5) "కడిమిచెట్టు" (నవల):–** దీనిని ప్రముఖ స్వాతంత్ర్య సమరయోధులు, "ఆంధ్రకేసరి" బిరుదాంకితులు, ఉమ్మడి మద్రాసు రాష్ట్రం ముఖ్యమంత్రి అయిన టంగుటూరి ప్రకాశంపంతులుగారికి అంకితమిచ్చారు. అంతే! ఆయన ముఖ్యమంత్రి పదవి ఊడిపోయింది!

**(6) "త్రిశూలం" (నాటకం):–** దీనిని "దేశోద్ధారక" – "విశ్వదాత" అయిన కాశీనాథుని నాగేశ్వరరావుపంతులుగారికి అంకితమిచ్చారు. ఇంతే సంగతులు – ఆయన స్వర్గస్థులయ్యారు!

పై సంఘటనలన్నీ పాఠకులు దృష్టిలో పెట్టుకుంటే, విశ్వనాథవారిని గురించి ఆయన మిత్రులు ఆశువుగా చెప్పిన సీసపద్యం బాగా అర్థమవుతుంది; కడుపుబ్బ నవ్వుకుంటారు!

ఇప్పుడు పద్యాన్ని గమనించండి. సీసపద్యంలో ఒక్కొక్క పాదాన్ని ఒక్కొక్క కవిమిత్రుడు చెప్పాడు:–

(1) మాధవపెద్ది బుచ్చిసుందరరామశాస్త్రిగారు:-

**"పండువంటి గృహస్థు పైడిపాట్యగ్రహా**
**రికుడు నీ కృతిచే దరిద్రుడయ్యె!"**

(2) తరువాతి పాదాన్ని వేదుల సత్యనారాయణశాస్త్రిగారు ఇలా పొడిగించారు:-

**"కోరి నీ కృతిని గైకొన్న పెన్నాడయ్య**
**వారి కయ్యెను స్థలభాండశుద్ధి!"**

(3) మూడోపాదం రాచకొండ నరసింహమూర్తి చెపుతాడని వేదులవారు ప్రకటించారు. నరసింహమూర్తిగారు ముందు కొంత భయపడినా, తరువాత విశ్వనాథవారు కూడా ఉత్సాహపరచడంతో -

**"కొన్నది లేదు, ఊకొన్న పాపానికే**
**ముక్త్యాలదొర రాజ్యమునకు బాసె"** అన్నారు.

(4) నాలుగోపాదం దేవులపల్లి కృష్ణశాస్త్రిగారి వంతు అయింది:-

**"శుభమంచు క్రొత్తింట జొచ్చుచు నీ కృతి**
**గొన్న లింగము కొంప కూలిపోయె!"** - అన్నారు.

("లింగము" అంటే "బందా కనకలింగేశ్వరరావుగారు". వారికి ప్రథమ భార్య గతించింది.)

ఇంక ఎత్తుగీతి మిగిలింది.

**తే॥గీ॥ "జారె నీ 'కడిమి'ని టంగుటూరి పదవి!"**

-అన్నారు కాటూరి వెంకటేశ్వరరావుగారు ("కడిమి" అంటే "కడిమిచెట్టు" నవల.) సీసపద్యాన్ని మొదలుపెట్టిన బుచ్చిసుందరరామశాస్త్రిగారు మళ్ళీ అందుకొని -

**"కూలె కాశినాథుడు నీ 'త్రిశూల' హతిని!"** అన్నారు.

ఇంతవరకూ అయ్యాక కాటూరి వెంకటేశ్వరరావుగారు సీసపద్యం అల్లుతున్న కవులందరినీ నిలబడమన్నారు. అందరూ నిలబడ్డారు. "మీరంతా రెండు చేతులూ జోడించి, విశ్వనాథవారి వైపు తిరిగి, నేను చెప్పినట్టు చెప్పండి!" అని ఎత్తుగీతిలోని మిగిలిన రెండు పాదాలూ ఈ క్రింది విధంగా పూరించారు:-

**"కవులలోపల బమ్మరాకాసి వీవు**
**దండముర బాబు! నీదు కైతలకు నీకు!"**

సీసపద్యం ఎత్తుగీతిలో సహా మొత్తం పూర్తి అయింది. అక్కడి వాతావరణమంతా నవ్వులతో నిండిపోయింది!

ఈ సంఘటనతో ప్రమేయం ఉన్న రాచకొండ నరసింహమూర్తిగారు ప్రముఖ హాస్యరచయిత "శ్రీ రమణ"గారితో చెపితే, ఆయన తన "హాస్యజ్యోతి" (2003)లో గ్రంథస్థం చేశారు. (చూ.పుటలు 134-136). "శ్రీరమణ"గారికి నా కృతజ్ఞతలు తెలియజేస్తున్నాను.

ఇప్పుడు సీసపద్యమంతా ఒక్కచోట ఇస్తున్నాను. (పైన ముక్కలు ముక్కలుగా వ్యాఖ్యానంతో చెప్పాను. అది పాఠకులకు అంతగా తృప్తినివ్వక పోవచ్చును.)

"కవులలోపల బమ్మరాకాసి" (ఇది పద్యశీర్షిక)

**సీ॥ "పండువంటి గృహస్థు పైడిపాట్యగ్రహా**
**రికుఁడు నీ కృతిచే దరిద్రుఁడయ్యె!**
**కోరి నీకృతిని గైకొన్న పెన్నాడయ్య**
**వారి కయ్యెను స్థలభాండశుద్ధి!**
**కొన్నదిలేదు, ఊకొన్న పాపానికే**
**ముక్త్యాలదొర రాజ్యమునకుఁ బాసె!**
**శుభమంచుఁ గ్రొత్తింటఁ జొచ్చుచు నీ కృతిఁ**
**గొన్న 'లింగము' కొంప కూలిపోయె!**

**తే.గీ. జారె నీ 'కడిమి'ని టంగుటూరి పదవి!**
**కూలె కాశినాథుఁడు నీ 'త్రిశూల' హతిని!**
**కవులలోపల బమ్మరాకాసి వీవు**
**దండముర బాబు! నీదు కైతలకు నీకు!!"**

**(ఆధారం : శ్రీరమణగారి 'హాస్యజ్యోతి')**

## 14. చరవాణి! నమోస్తుతే॥

రచన: డా॥ కొడిమడుగు నాగేశ్వరశాస్త్రిగారు

కాలక్షేప కథాహ్వానం
వ్యర్థ భాషణ పూర్వకమ్।
సంఖ్యయా గణనం యత్ర
మొబైల్ దేవో విశిష్యతే॥ 1

యది సంఖ్యాం నజానాతి
విస్మృతం చ భవేద్యది ।
అశాంతి రేవ తత్రాపి
కార్యనాశం భవిష్యతి ॥ 2

ప్రయాణే వాహనారూఢో
సెల్లాపేన స గచ్ఛతి ।
మృత్యునా క్రీడతే తథ్యం
కుటుంబం తస్య నశ్యతి ॥ 3

చరవాణీం సదా పశ్యన్
దీక్షయా తత్పరో భవేత్ ।
విద్యుత్ కాంత్యా దృష్టిలోపం
తథ్య మారోగ్య నాశనమ్॥ 4

చరవాణీ విహీనో సౌ
జనోభువి భవేద్యది ।
అంధోభవతి నేత్రాభ్యాం
వ్యర్థం స్యాత్ తస్య జీవితమ్॥ 5

ధనహీనో యాచకో వా
కృపణో వా కృషీవలః।
చరవాణీ నిత్యయుక్తః
పృథివ్యాం విజయీ భవేత్ ॥ 6

ప్రథమం భాషణం తేన
ద్వితీయం కాలదర్శనమ్ ।
తృతీయం రాజకీయం స్యాత్
చతుర్థం వైద్యభాషణమ్ ॥ 7

ఛాయాచిత్రం పంచమం చ
షష్ఠం చ క్రయ విక్రయమ్
సప్తమం వార్తా శ్రవణం
క్రీడా వీక్షణ మష్టమమ్ ॥ 8

విద్వత్ప్రసంగం నవమం
దశమం ముఖపుస్తకమ్ ।
ఏకాదశం వేద మంత్రం
చర్చా ద్వాదశ మేవ చ ॥ 9

విద్యా విషయ జిజ్ఞాసుః
యశ్చ కాలం వినేష్యతి ।
ధన్యో భవతి పుణ్యాత్మా
చరవాణ్యా సుసంగతః ॥ 10

ప్రయోజనం చ విజ్ఞేయం
చరవాణ్యా సునిశ్చితమ్ ।
విద్యావిషయ జిజ్ఞాసుః
మందోపి కుశలో భవేత్ ॥ 11





కీ.శే. టి.వి.కె. సోమయాజులుగారు
(తంగిరాల వేంకటకృష్ణ సోమయాజులుగారు)
1930–2021



తంగిరాల సోదరులు: సోమయాజులు - సుబ్బారావు - భాస్కరరావు - కృష్ణమూర్తి

